




దీపావళి, రంజాన్ శుభాకాంక్షలతో...

3rd Anniversary

వార్షికోత్సవ
ప్రత్యేక సంచిక

# ఆంధ్రజ్యోతి

31 అక్టోబరు 2005, గుంటూరు







# వైవిధ్యభరితం
# గుంటూరు జిల్లా



# బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ

## సేవా దృక్పథంతో నడుపబడుతున్న ఏకైక విద్యా సంస్థ

బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల భవనం

BAPATLA ENGINEERING COLLEGE

## సాంకేతిక విద్య ప్రపంచానికే సువర్ణ మణిహారం, చదువుల తల్లి నుదుటిపైన సిరులొలికే సింధూరం

★ భారత ప్రభుత్వ మానవ వనరులశాఖ వారి టెక్నికల్, క్వాలిటీ, ఇంప్రూమెంట్ ప్రోగ్రాం. క్రింద ప్రపంచ బ్యాంకు నిధులతో అంతర్జాతీయ ప్రమాణాలతో అధునాతన సౌకర్యాల కొరకు ప్రపంచ బ్యాంకు ఆర్థిక సహాయం అందజేస్తున్న ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేటు సెక్టారులోని ఏకైక విద్యాసంస్థ.

★ సబ్సిడీ విధానంతో కాలేజీ క్యాంటీన్, బస్సు సౌకర్యం కల్పిస్తున్న ఏకైక విద్యా సంస్థ.

★ కె.జి. నుండి పి.జి. వరకు విద్యాభ్యాసాన్ని ఒకేచోట అందిస్తూ తొమ్మిది వేలమంది విద్యార్థులతో అలరారుతున్న ఏకైక విద్యాసంస్థ.



శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
చైర్మన్, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటి

★ 4 లక్షల చదురపు అడుగుల భవనాలతో సువిశాలమైన ప్రాంగణం ఇంజనీరింగ్ కళాశాలకు ప్రత్యేకతను సంతరించుకుంది.

★ విద్యార్థులకు, అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బందికి ఉచితంగా మినరల్ వాటర్ అందించబడుతుంది

★ గ్రామీణ వాతావరణంలో 1962లో బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ప్రారంభించి గేట్ ర్యాంకులతోపాటు, విశ్వవిద్యాలయాల ర్యాంకులతో అసమాన్యమైన అభివృద్ధి శిఖరాలను అధిరోహిస్తున్న ఏకైక విద్యాసంస్థ.

★ గత 6 సంవత్సరాలలో సగటున పది మంది విద్యార్థులు అఖిల భారత స్థాయిలో 100లోపు ర్యాంకులు సాధించారు.

అద్వితీయరీతిలో గేట్ ర్యాంకులను సాధిస్తూ దేశ, విదేశాల్లో ఈ కళాశాలల విజయకేతనాన్ని ఎగురవేస్తున్న విద్యార్థినీ విద్యార్థులకు ఇవే మా శుభాకాంక్షలు.



ప్రారంభానికి సిద్ధంగా వున్న జనరల్ ఇంజనీరింగ్ బిల్డింగ్



ఇంజనీరింగ్ కళాశాల బాలికల హాస్టల్-1

### ☛ ఇంజనీరింగ్ కళాశాల ప్రగతి

★ బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల 1981లో స్థాపించబడింది ★ AICTE న్యూఢిల్లీ వారిచే ఆమోదించబడింది. ★ కాలేజీలోని 6 కోర్సులు ఎన్‌బిఎ గుర్తింపు స్థాయిని పొందాయి ★ AICTE, UGC వారి ద్వారా త్వరలో స్వయం ప్రతిపత్తి పొందబోతున్నది ★ 'గేట్1997'లో సివిల్ ఇంజనీరింగ్‌లో అఖిల భారతస్థాయిలో ప్రథమ స్థానం సాధించబడింది ★ గేట్ 2005లో అర్హత పొందిన 230 మందిలో 22 మంది విద్యార్థులు 99% పర్సన్‌టైల్ సాధించారు. ★ 1999, 2000, 2003, 2004 మరియు 2005 సంవత్సరాలలో విశ్వవిద్యాలయంలో ప్రథమ స్థానాన్ని ఈ కాలేజి విద్యార్థులు సాధించారు ★ 2000 నుండి 2003 సంవత్సరాలలో మాథ్స్ ఒలంపియాడ్‌లో ప్రథమ స్థానాన్ని సాధించారు ★ 600 మంది బాలికల సౌకర్యార్థం రెండు బాలికల వసతి గృహాలు అత్యాధునిక వసతులతో నిర్వహించబడుతున్నాయి ★ విద్యార్థులందరికి ఉచితంగా ఇంటర్నెట్ సదుపాయం (2 ఎం.బి.బి.ఎస్ లీజ్‌డ్ లైన్) కల్పించబడుతోంది ★ బాలికల వసతి గృహంలో ప్రత్యేకంగా ఇంటర్నెట్ సదుపాయంతో కంప్యూటర్ సెంటర్ ఏర్పాటు చేయబడింది ★ 42, 767 సంపుటాలతో 70 విదేశీ పత్రికలతో కలిసి 154 సాంకేతిక పత్రికలతో గ్రంథాలయం నిర్వహించబడుతోంది. ఇందులో విద్యార్థులకు 30 టెర్మినల్స్ ద్వారా 250 విదేశీ పత్రికలు చదువుకునే అవకాశం కల డిజిటల్ లైబ్రరీ సౌకర్యం కూడా కల్పించబడింది.

**కళాశాలలోని కోర్సులు :**
బిటెక్ : సిహెచ్.ఇ., సి.ఇ., సి.ఎస్.ఇ, ఇ.సి.ఇ, ఇ.ఇ.ఇ., ఇ.ఐ.ఇ., ఐ.టి., ఎం.ఇ., బయోటెక్నాలజీ
ఎంటెక్ : ఇ.సి.ఇ (ఎస్.పి. & సి. ఎస్), ఎం.ఇ (సి.ఎ.డి/సి.ఎ.ఎం) ఎం.సి.ఎతో సహా 6 కోర్సులు ఉన్నాయి.



సివిల్ మరియు మెకానికల్ బిల్డింగ్

### ★ ఫార్మసీ కళాశాలలో నిర్వహించే కోర్సులు

1. డిఫార్మసీ 2. బిఫార్మసీ 3. ఎమ్ ఫార్మసీ (ఫార్మస్యూటిక్స్)

### ★ పాలిటెక్నిక్ కాలేజీలో నిర్వహించే కోర్సులు

1. ఇసిఇ 2. ఇఇఇ 3. ఎమ్ఇ 4. ఇసిఇ 5. సిఎస్ఇ (3 సంవత్సరాలు) 6. డిప్లమో ఇన్ బయోటెక్నాలజీ (2 సంవత్సరాలు)



అడ్మినిస్ట్రేటివ్ బిల్డింగ్

### ★ ఆర్ట్స్ అండ్ సైన్సెస్ కళాశాలలోని కోర్సులు

ఇంటర్మీడియట్ : 1. ఎంపిసి (TM & EM) 2. బైపిసి (TM & EM) 3. హెచ్ఇసి (TM) 4. హెచ్‌టిసి (TM) 5. సిఇసి (TM)

బిఎ : 1. హిస్టరీ, పాలిటిక్స్, ఎకనామిక్స్ 2. హిస్టరీ, పాలిటిక్స్, ఇంగ్లీషు 3. హిస్టరీ, పాలిటిక్స్, తెలుగు

బిఎస్సీ : 1. మ్యాథ్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ(TM & EM) 2. బోటనీ, జూవాలజీ, కెమిస్ట్రీ(TM & EM) 3. మ్యాథ్స్, ఫిజిక్స్, కంప్యూటర్ సైన్స్ 4. మాథ్య, ఫిజిక్స్, ఎలక్ట్రానిక్స్ 5. మ్యాథ్స్, కంప్యూటర్ సైన్స్, ఎలక్ట్రానిక్స్ 6. మ్యాథ్స్, కంప్యూటర్ సైన్స్, స్టాటిస్టిక్స్ 7. బయోకెమిస్ట్రీ, మైక్రోబయాలజీ, కెమిస్ట్రీ 8. బయోటెక్నాలజీ, జువాలజీ, కెమిస్ట్రీ

బికాం : (TM & EM) బి.కాం. కంప్యూటర్ అప్లికేషన్స్ ★ ఈ కళాశాలలో ఎన్‌సిసి, ఎన్ఎస్ఎస్ మరియు స్పోర్ట్స్ విభాగాలలో విద్యార్థులు రాష్ట్ర, జాతీయ స్థాయిల్లో ఉన్నత పురస్కారాలు అందుకుంటున్నారు.



బిఫార్మసీ కళాశాల

### ★ బాపట్ల జూనియర్ కాలేజీలో కోర్సులు

ఎంపిసి మరియు బైపిసి (EM)

### ★ బాపట్ల పబ్లిక్ స్కూల్

LKG నుండి 10th వరకు (EM) తరగతులు నిర్వహిస్తున్నారు



ఆర్ట్స్ అండ్ సైన్సెస్ కళాశాల



ఆర్ట్స్ కళాశాల బాలికల హాస్టల్

ఆర్ట్స్ & సైన్సెస్ కళాశాల అండ్ టెక్నాలజీ బిల్డింగ్

పబ్లిక్ స్కూల్

# ఆంధ్రజ్యోతి

## 3వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

# భూమికి అందని ఆకాశం... ఇతరులకందని ఈ విజయం!

**అందుకే ఇప్పటికీ... ఎప్పటికీ... ఇంకెప్పటికీ శ్రీచైతన్యయే నెం.1**

## EAMCET - 2005
## TOP RANKERS IN MEDICAL

1 st Rank State (EAMCET - 2005)



A. Rajendra Prasad
H.T.No. 4610210

2 nd Rank State



S. Chaitanya
H.T.No. 4615295

3 rd Rank State



G. Dimpu Edwin
H.T.No. 4608869

4 th Rank State



Ch. Bharat Siddharth
H.T.No. 4603542

5 th Rank State



P. Harsha Teja
H.T.No. 4616020

6 th Rank State



S. Madhuri
H.T.No. 4611770

7 th Rank State



P. Archana
H.T.No. 4613075

8 th Rank State



Y.S. Siva Satish
H.T.No. 4608858

9 th Rank State



B. Neelohita
H.T.No. 3518266

10 th Rank State



T. Vijay Kumar
H.T.No. 4602003

## EAMCET - 2005
## TOP RANKERS IN ENGINEERING

1 st Rank State (EAMCET - 2005)



V. Naresh Reddy
H.T.No. 1536188

5 th Rank State



K. Naga Praveen
H.T.No. 2702086

6 th Rank State



K. Samish Chandra
H.T.No. 2602096

9 th Rank State



S. Naresh Kumar
H.T.No. 1410465

10 th Rank State



V. Divya
H.T.No. 1405242

### ర్యాంకుల విశ్లేషణ

| మెడికల్ | | ఇంజినీరింగ్ | |
|---|---|---|---|
| 100లోపు అత్యుత్తమ ర్యాంకులు | 82 | 10లోపు అత్యుత్తమ ర్యాంకులు | 5 |
| 500లోపు ర్యాంకులు | 363 | 100లోపు ర్యాంకులు | 38 |
| 1200లోపు ర్యాంకులు | 840 | 1000లోపు ర్యాంకులు | 361 |
| మొత్తం సీట్లు పొందగల ర్యాంకులు | 1441 | మొత్తం సీట్లు పొందగల ర్యాంకులు | 12116 |
| IIT(JEE)-2005 Total Ranks | 169 | AIEEE-2005 Total Ranks | 1724 |

# శ్రీచైతన్య

**కళాశాలలు & కోచింగ్ సెంటర్స్**

గుంటూరు

బాలుర మరియు బాలికల రెసిడెన్షియల్ & డేస్కాలర్స్

మెయిన్‌రోడ్, లక్ష్మీపురం, ఫోన్స్ : 2354364, 2255663, 2232621.

సెంట్రల్ ఆఫీస్ : పోరంకి, విజయవాడ (రూరల్), ఫోన్స్: 2582488, 2582688, 2583801-4.

• హైదరాబాద్ • విజయవాడ • విశాఖపట్నం • తిరుపతి • గుంటూరు • కాకినాడ • ఒంగోలు • నెల్లూరు • ఏలూరు • భీమవరం • రాజమండ్రి • మచిలీపట్నం • తెనాలి • శ్రీకాకుళం • అమలాపురం • చిత్తూరు • అనంతపురం • బళ్ళారి

EYE ADS

## పలనాటి ప్రజల కొంగుబంగారం

# మాచర్ల చెన్నకేశవుడు



మాచర్ల శ్రీ లక్ష్మీచెన్నకేశవ ఆలయం

(ఆన్‌లైన్, మాచర్ల)

పౌరుషం ఎగసిపడే పల్నాటి ప్రాంతంలో ప్రజలకు ఆధ్యాత్మిక చింతనను కలిగిస్తూ ప్రజల మనోభిష్టాన్ని నెరవేరుస్తూ పల్నాటి ప్రజల పాలిట మణిహారంగా వెలసిన శ్రీ లక్ష్మి చెన్నకేశవస్వామి ఆలయం చారిత్రకంగా ఎంతో ప్రసిద్ధికెక్కింది. త్రేతాయుగంలో ఈ ప్రాంతమంతా దండకారణ్యం. పూర్వకాలంలో కార్తవీర్యార్జుని వంశీకులు నిర్మించిన చెన్నకేశవ ఆలయాన్ని పల్నాటి బ్రహ్మనాయుడు 13వ శతాబ్దంలో పునర్నిర్మించినట్లు చారిత్రక గ్రంథాలు చెబుతున్నాయి. క్రీస్తుశకం 1397 వరకు మాచర్లను మహాదేవిచర్లగా పిలిచేవారని, నాటి ఆ పేరే మాచర్లగా మారిందని, రెండవ ప్రతాపరుద్ర మహాదేవ రాజు సామాంతరాజైన మాచాయనాయుడు పేరు మాచాయ శబ్దం కాలక్రమేణా మాచర్లగా మారి వుండవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ శాసనం తరువాత లభించిన అనేక ఆధారాల్లో మాచర్ల అని రాయబడి వుంది. అంతేకాక బ్రహ్మనాయుడు మజిలీ చేసిన తావు మాచర్ల అయిందని, తన స్వస్థలమైన మాచపురానికి బదులుగా బ్రహ్మనాయుడు మాచర్లను నిర్మించాడని పద్మనాయ చరిత్ర చెబుతోంది. మాచర్లకు విష్ణుపురి అనే మరొక పేరు వుంది. చంద్రవంక నది తీరంలో ప్రవహం తూర్పు-పశ్చిమ దిశల నుండి ఉత్తరం వైపునకు ప్రవహిస్తుంది. ఉత్తర వాహిణి స్థలం పరమ పవిత్రమైనదని భావిస్తూ వుంటారు. అలాంటి పవిత్రమైన ప్రదేశంలో శ్రీ చెన్నకేశవస్వామి వెలిశాడు. సర్వమానవ సమానత్వాన్ని సౌభ్రాతృత్వాన్ని 13వ శతాబ్దంలోనే చాటి చాపకూటి సిద్ధాంతంతో మానవులంతా ఒక్కటేనని నిరూపించిన బ్రహ్మనాయుడి పేరు వింటే ప్రతి ఒక్కరికి స్ఫూరించేది ఆయన పునర్నిర్మించిన మాచర్లలోని శ్రీ లక్ష్మి చెన్నకేశవస్వామి వారి దేవాలయమే పౌరుషాల పురిటిగడ్డగా, పంతాలకు పోతుగడ్డగా ప్రసిద్ధికెక్కిన పల్నాడులో 13వ శతాబ్దంలో మలిదేవరాజు ఆస్థాన మంత్రి బ్రహ్మనాయునిచే పునర్నిర్మించబడిన ఈ దేవాలయం సుప్రసిద్ధమైన పలనాటి పుణ్య క్షేత్రం. ఈ ఆలయంలోని శిల్ప కళా వైభవం నాటి కళాకారుల నైపుణ్యతను తెలియజేస్తాయి. అందానికి ప్రతిరూపమైన విష్ణువు చెన్నుని రూపంలో ఈ ఆలయంలో వెలిశాడని ప్రతీతి. స్వామి వారి విగ్రహం గర్భగుడిలో మూడు అడుగుల ఎత్తులో వుంది. అందులో భూదేవి, శ్రీదేవి సమేత చెన్నకేశవుడు యాగభేరాలు, తీర్థ, బకిబేరాలు, అళ్వారులు, రామానుజులు, వడయరాజులు, వెన్నముద్దల కృష్ణయ్య, ఉత్సవ మూర్తులు వున్నాయి. గర్భగుడికి ముందు రంగ మండపం వుంది. దీనిని పరిశీలిస్తే నాటి శిల్పకళా చాతుర్యం ఏ విధంగా వుందో విశిధమవుతోంది. ఈ మండపంలోని నాలుగు స్థంభాల పై ఈశాన్య దిశ వైపు వున్న స్తంభం పై భారత ఘట్టాలైన కర్ణార్జునుల యుద్ధం, పాచికలాట, అశ్వమేథయాగం, గథా యుద్ధం చెక్కబడినవి. ఆగ్నేయ స్తంభం పై రామాయణంలోని మాయలేడిని వేటాడడం, వాలి సుగ్రీవ యుద్ధం, కైలాస గిరిని ఎత్తడం, నైరుతి స్తంభం పై భాగవతంలోని వినాయక, గజాసుర‌ుని యుద్ధం, త్రిపుర సంహారం, సాగర మధనం, దేవతాకూటమి, ఏనుగుల అభిషేకం, అమృతం పంచటం వంటివి శిల్పాలలో మలచబడ్డాయి. ఇటువంటి ఎన్నో ఘట్టాలను మనోహరంగా శిల్పులు మలిచారు. కాలగమనంలో చెన్నకేశావాలయం ఎన్నోసార్లు పునరుద్ధరించినట్లు తెలుస్తోంది. ఈ ప్రాంతాన్ని శైవులు, కాకతీయులు ఏలినట్లు చరిత్ర చెబుతోంది. సూరపురాజు వంశీయుల సంతానమైన లక్ష్మీదేవమ్మ చెన్నునిలో ఐక్యమైనందున ఇదే ఆలయంలో లక్ష్మీదేవికి మరో ఆలయాన్ని నిర్మించారు. ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ పంచమి నాడు స్వామివారి కళ్యాణంతో ప్రారంభమై 16 రోజుల పాటు జరిగే ఉత్సవాలు రథోత్సవంతో ముగుస్తాయి. దుర్గి వాస్తవ్యులు కుంచనపల్లి నారాయణ పంతులు 1980, ఏప్రిల్ 29న స్వామివారి రథాన్ని తయారు చేయించారు. ఆనాడే మొదటి రథోత్సవం జరుపుకుంది.



లక్ష్మీదేవి అమ్మవారు

### చెన్నునికి ఎన్ని కష్టాలో...

ఎంతో ఆదాయం కలిగిన శ్రీ లక్ష్మి చెన్నకేశవ ఆలయ ఆస్తులు అన్యాక్రాంతమై నేడు పోషణే ప్రశ్నార్థకమైంది. ఒకప్పుడు రెండు వేల ఎకరాలకు పైగా వున్న దేవుని మాన్యం హారతి కర్పూరంలా కరిగిపోయింది. ఉన్న కొద్దిపాటి భూముల నుండి కూడా నామమాత్రపు ఆదాయమే వస్తోంది. ఆలయ కమిటి ఏర్పాటుచేసిన నిత్య కళ్యాణ వేడుకల ద్వారా ఈ స్వామికి కాసింత ప్రసాదం, తీర్థం లభ్యమవుతున్నాయి. భక్తులు ఇచ్చే కానుకల పైనే ఆలయ వేడుకలు ఆధారపడడం శోచనీయం. ఎన్నో విశిష్టతలున్న చెన్నుని దర్శనార్థం వచ్చే దూర ప్రాంతీయులకు బస చేసేందుకు ఏమాత్రం సౌకర్యాలు లేవు. యగ్న యాగాదులు నిర్వహించేందుకు ఏర్పాట్లు లేవు. ఉత్సవ వేళల్లో స్వామి వారిని ఊరేగించే ప్రత్యేక వాహనాలను భద్రపరచే వాహనశాల కూలిపోయింది. గర్భగుడిలోనే ఆ వాహనాలను వుంచడం వల్ల ఆ ప్రాంగణం ఇరుకైంది.



శ్రీ చెన్నకేశవస్వామి

# ఆంధ్రజ్యోతికి




# శుభాకాంక్షలు

అశేష ఆంధ్రుల అభిమాన ఆంధ్రజ్యోతి 3 వసంతాలు దిగ్విజయంగా పూర్తిచేసుకున్న సందర్భంగా యాజమాన్యానికి, సిబ్బందికి ఇవే మా హృదయపూర్వక శుభాకాంక్షలు ...




మా కస్టమర్లకు, శ్రేయోభిలాషులకు దీపావళి శుభాకాంక్షలు తెలియజేస్తూ ...
ఈ దీపావళి పర్వదినం మీ అందరి లోగిళ్ళలో సుఖసంతోషాలు నింపాలని ఆకాంక్షిస్తూ ...







# ITC LIMITED - ILTD DIVISION

**GRAND TRUNK ROAD, P.B.NO.317, GUNTUR - 522 004**

**Tel : 2354001 to 2354008 (8 Lines)**

**Fax : 0863 - 2354017 / 2235042, Telegram : INDLEAF**

## భక్తుల ఆరాధ్యదైవంగా పూజలందుకుంటున్న

# ఫిరోజి రుషీంద్రులు



(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

నిత్యజీవితంలో అనేక సమస్యలతో కొట్టుమిట్టాడు తున్న లక్షలాది మంది ప్రజానీకానికి ఆధ్యాత్మిక చింతనను బోధించటం ద్వారా వారి జీవితాలలో వెలుగు నింపిన మహానీయుడు సత్తెనపల్లికి చెందిన 'ఫిరోజి' అనే తత్వవేత్త. ఇప్పటికి శతాబ్దానికి పైగా సత్తెనపల్లి పరిసర ప్రాంతాలలో ఆ మహానుభావుడు ప్రజల ఆరాధ్యదైవంగా పూజలందుకుంటున్నారు. దైవశక్తి ప్రపూరితమైన అతీతమైన శక్తి ఆయనకు ఆయనకు పుట్టుకతో సంక్రమించగా అనేక సందర్భాల్లో ప్రజాహితంకోరి ఎన్నో మహిమలను ప్రదర్శించారు. వీరు తెలుగు, సంస్కృత భాషల్లో అనేక రచనలు గావించి ప్రజలను ప్రభావితం చేయటంతోపాటు తన సంగీత గానమృతంలో పండిత పామరులను రంజింపచేసి ఆధ్యాత్మిక శిఖరంగా నిలచారు. ఫిరోజి మహారాష్ట్రకు చెందిన క్షత్రియ వంశంలో శివాజీ మహారాజ్ రాచరికపు వెలుగు క్షీణించిన తర్వాత ఫిరోజి తాతగారైన పాపాజీ నరసరరావుపేట జమీందారు కొలువులో ప్రధాన సేనానిగా చేరారు. పాపాజి కుమారులయిన నర్సోజి సత్తెనపల్లి జమిందారుగారైన రాజామానూరు వెంకట గోపాలరాయని కొలువులో సబేదారుగా చేరారు. ఫిరోజి చిన్నవయస్సులోనే జరగబోయే విషయాలను ముందుగా చెప్పగలగడం, ఆ చెప్పినవన్నీ జరుగుతూ వుండటంతో వాక్సుద్ధి కలిగిన మహిమాన్వితునిగా ఆయనపట్ల ప్రజలకు విశ్వాసం కలిగింది.

చిదానందుడు అనే యోగి ప్రబోధించిన తారక మంత్రోపాసనతో ఆధ్యాత్మిక శోధనను ప్రారంభించిన ఫిరోజి పోతులూరి వీరబ్రహ్మం, యోగి వేమనలు అనుసరించిన అచల పరిపూర్ణ సిద్ధాంత మార్గంలో పయనించారు. ఫిరోజి రుషీంద్రులు సహజ పాండిత్య ప్రకర్షతో పండిత లోకాన్ని ఆశ్చర్యపరచారు. సంస్కృత, ఆంధ్ర భాషల్లో ఆయన అనేక రచించిన వేణుగోపాల శతకాన్ని తనకు అంకితం ఇవ్వవలసిందిగా సత్తెనపల్లి జమీందారు కోరగా తన రచనలు భగవంతుని కోసమేనంటూ అపరపోతనామాత్యునిలా తిరస్కరించారు.

ఆ కొలువులో వున్న అనేకమంది పండితులకు ఫిరోజి ఖ్యాతి అసూయ కలిగించింది. ఫిరోజిని ఎలాగైనా అపఖ్యాతిపాలు చేయాలని వారు ఎంతగానో యత్నించి చివరకు శ్రీహరి అనే దేవదాసిని ఆయనపై ఉసిగొల్పారు. ఫిరోజిని కవ్వించబోయిన శ్రీహరిలో ఆయన మాతృతత్వాన్ని వర్తింపజేశారు. దీనితో శ్రీహరి ఫిరోజికి పాదాలనో శ్రీఫిరోజి కాపాడారు. ఆయన భౌతిక కాయాన్ని వీడిన తర్వాత ఆయన ఆత్మ గుత్తికొండ బిలాలలో మరికొంతకాలం తపోనిష్ట ఆచరించవలసి వుందని అనేక దృష్టాంతరాలతో ఇప్పటికి ఈ ప్రాంతీయులు చెప్పుకోవటం ఫిరోజి విశేషం. ఫిరోజికి గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో అనేక చోట్ల ఆలయ నిర్మాణాలు జరిగాయి. ఆయన నిర్మాణాలు జరిగాయి. ఆయన ప్రధాన పీఠమైన సత్తెనపల్లిలోని సమాధిపై నెలకొల్పిన లింగ రూప దర్శనానిని వేల సంఖ్యలో భక్తులు వస్తుంటారు.

## సత్తెనపల్లికి గుర్తింపు తెచ్చిన

# వావిలాల గోపాలకృష్ణయ్య



(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

ఆజన్మ బ్రహ్మచారిగానే గాక ప్రముఖ రాజకీయ వేత్తగా గుర్తింపు పొందిన స్వాతంత్ర్య సమరయోధుడు వావిలాల గోపాలకృష్ణయ్య పుట్టిపెరిగి రాజకీయ వాదిగా గుర్తింపు పొందింది సత్తెనపల్లిలోనే. వావిలాల గోపాలకృష్ణయ్య ప్రజా జీవితంలో పునీతమైన మహావ్యక్తి. ఆయన జీవితమంతా ప్రజాసేవకే అంకితం చేశారు. సత్తెనపల్లి నియోజకవర్గం నుంచి నాలుగుసార్లు శాసనసభ్యునిగా ఎన్నికై ఆ శాసనసభలో అనేక అంశాలపై ప్రభుత్వానికి సూచనలు, సలహాలు అందించారు. రైతాంగం సమస్యల పట్ల, నీటి ప్రాజెక్టుల పట్ల మంచి అవగాహన ఉన్న మేధావి వావిలాల గోపాలకృష్ణయ్య. చదువు తక్కువైన నిరంతరం పుస్తక పఠనం గావించి ఎన్నో విషయాలను అవగాహన చేసుకొని ప్రజలకవసరమైన అనేక విషయాలను రచించిన మహావ్యక్తి గోపాలకృష్ణయ్య. సత్తెనపల్లిలో వావిలాల గోపాలకృష్ణయ్య జన్మించటం ఈ ప్రాంత ప్రజల అదృష్టం. నిరాడంబరంగా ఖద్దర్ దుస్తులనే ధరిస్తూ నిజమైన గాంధేయ వాదిగా తన జీవితాన్ని గడిపిన మహానుభావుడు వావిలాల. 1906 సెప్టెంబరు 17న సత్తెనపల్లిలో వావిలాల జన్మించారు. 1920లో పాఠశాల విద్యకు స్వస్తి చెప్పి జాతీయోద్యమంలో పాల్గొన్నారు. పల్నాడు పుల్లరి సత్యాగ్రహంలో ఆయన పాల్గొన్నారు. స్వాతంత్ర్య పోరాటంలోను, వివిధ సమస్యలపైన వావిలాల పోరాటాలు జరిపారు. తెలుగుజాతిని ఉవ్వెత్తున కదిలించిన సారా వ్యతిరేక ఉద్యమంలో వావిలాల క్రియాశీలక పాత్ర పోషించారు. మహాత్మగాంధీ పిలుపు మేరకు 1992లో స్వాతంత్ర్య ఉద్యమ నిర్మాణాత్మక కార్యక్రమంలో వావిలాల చురుకుగా పాల్గొన్నారు. 20 సంవత్సరాల వయస్సులోనే విద్యార్థి త్రైమాసిక పత్రికకు సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు. 1928లో సైమన్ కమీషనర్ పర్యటనలోను, విజయవాడలో జరిగిన ఇండిపెండెంట్స్ లీగ్ మహాసభలలోను ఆయన పాల్గొన్నారు. 1929-30లో ఆయన ఆంధ్రపత్రికలో ఉప సంపాదకత్వం నిర్వహించారు.

1930లో గాంధీ పిలుపు మేరకు దేశ వ్యాప్తంగా జరిగిన ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని 9నెలలు జైలు జీవితాన్ని అనుభవించారు. సమస్యలపై పోరాటాలు చేసి పలుమార్లు జైలు జీవితాన్ని వావిలాల గడిపారు. దళితుల దేవాలయ ప్రవేశం కొరకు వావిలాల కృషిచేశారు. 1933-34 సంవత్సరంలో జిల్లా గ్రామ పునరుద్ధరణ సంఘాన్ని, జిల్లా హరిజన సేవా సంఘాన్ని ఆయన ప్రారంభించారు. 1938లో జ్యోతి పక్షపత్రికకు సంపాదకత్వం వహించారు. 1943లో ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ సంయుక్త కార్యదర్శిగా బాధ్యతలు చేపట్టి విజయవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభల నిర్వహణలో ప్రముఖపాత్ర పోషించారు. 1942లో ఆయన కమ్యూనిస్టు పార్టీలో జేరి ఆరు నెలలు జైలు జీవితాన్న అనుభవించారు. 1947 సంవత్సరంలో కమ్యూనిస్టు పార్టీపై నిర్బందం అమలు కావటంతో అజ్ఞాన జీవితాన్ని గడిపారు. 1948 తరువాత ఆయన కమ్యూనిస్టు పార్టీ నుంచి బయటకు వచ్చి ఆంధ్రోద్యమంలో కీలకపాత్ర పోషించారు. 1961లో గోవా విమోచన ఉద్యమంలో రాష్ట్ర మంతటా పర్యటించారు. 1962,67లలో సత్తెనపల్లి నియోజకవర్గం నుండి స్వతంత్ర అభ్యర్థిగా శాసనసభకు ఎన్నికయ్యారు. 1981లో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర అవతరణ రజతోత్సవాల సందర్భంగా వావిలాల సంస్థను ప్రారంభించారు.

# ప్రకృతి అందాల దృశ్య కావ్యం

# ఎత్తిపోతల జలపాతం

(ఆన్‌లైన్, మాచర్ల, విజయపురిసౌత్)

సృష్టిలోని ప్రకృతి సోయగాలను ప్రతి అణువులోను నింపుకున్న ఎత్తిపోతల ఒక అపురూప దృశ్యకావ్యం. ప్రపంచ ఖ్యాతినార్జించిన నాగార్జునసాగర్‌కు కేవలం 13 కిలోమీటర్ల దూరంలో వుండి గుంటూరు జిల్లా మాచర్లకు చేరువలో వున్న ఈ ప్రాంతం ప్రకృతి ఆరాధికులకు ఓ వరం. నల్లమల అడవుల్లో నుంచి అంతర్వాహినిగా చంద్రవంక పడమర నుంచి ఉత్తరానికి ప్రవహిస్తూ మరో రెండు నదులను కలుపుకుంటూ అంతర్వాహినియై, 70 అడుగుల ఎత్తు నుండి ఈ జలపాతం లోయలోకి ఎగిసి దూకుతూ చూపరులకు కనువిందుజేస్తోంది. విశాలమైన లోయ గుండా రెండువైపులా నిలువెత్తు కొండలను, మొగిలిపొదలను పలకరించుకుంటూ ఉత్తర్వాహిణిగా ప్రవహిస్తూ 4కిలోమీటర్లు ప్రయాణం చేసి 'గంగ పాదాలు' అనే చోట కృష్ణానదిలో కలుస్తోంది. ఎత్తిపోతల జలపాతం వద్ద వన్యప్రాణి సంరక్షణలో భాగంగా అటవీశాఖ 1978 ప్రాంతంలో మొసళ్ళ కేంద్రంగా అభివృద్ధిచేయాలన్న తలంపుతో ఎనిమిది రకాల మొసళ్ళను ఇక్కడ వదలడం జరిగింది. ఇవి సంతానోత్పత్తి బాగా జరిగి ఇప్పుడు దాదాపు 100 నుండి 150 వరకు ఉండవచ్చునని అంచనా. ఈ ప్రాంతంలో జింకలు, వన్యప్రాణుల పార్క్‌లు ఏర్పాటు చేసి ఒక మ్యూజియంను నెలకొల్పితే బావుంటుందనే తలంపు ఇక్కడకు విచ్చేసే పర్యాటకులు వ్యక్తం చేస్తుంటారు. పూర్వకాలంలో యతులు(ఋషులు) తపస్సు ఆచరించిన ప్రాంతం కనుక నాటి యతి తపోతలనే నేటి 'ఎత్తిపోతల'గా మారింది. ఇక్కడికి విచ్చేసే ప్రకృతి ప్రియులకు అందచందాలతో పాటు ఆధ్యాత్మిక చింతన కూడా అలవడుతుంది. ఈ కొండల పై వెలసిన దత్తాత్రేయ స్వామివారి ఆలయం, ఇంకొంచెం దూరంలోని మధుమతి ఆలయాలు పర్యాటకులను, భక్తులను విశేషంగా ఆకర్షిస్తాయి. ప్రతి ఏటా తొలి ఏకాదశి నాడు ఈ ప్రాంతం నుండే కాక ఇతర జిల్లాల నుండి వేలాది మంది భక్తులు ఇక్కడకు చేరుకొని పూజలు నిర్వహిస్తారు. మధుమతి దేవి ఆలయం నుండి కొండ పైన వున్న దత్తాత్రేయ స్వామి ఆలయంలోకి గుహ ద్వారాలున్నాయి.


ఆలయ ముఖద్వారం

స్వతంత్ర్య పోరాట సమయంలో నాటి జాతి నాయకులు తలదాచుకోవడానికి ఈ ప్రాంతానికి విచ్చేయగా ఇక్కడి నాయకులు వారికి ఆహార పదార్థాలను సరఫరా చేశారని ఈ ప్రాంతంలో చెప్పుకుంటుంటారు. ప్రకృతి సౌందర్యాలు, ఆధ్యాత్మిక చింతనతో పాటు దేశ రక్షణకు ఈ ప్రాంతం ఉపయోగపడడం విశేషం. ఎత్తిపోతల అందాలను తెరకెక్కించాలనే ఉద్దేశ్యంతో ఇక్కడ ఎన్నో చలన చిత్రాలను నిర్మించారు. వివిధ పాటలు, సన్నివేశాలు అగ్రహీరోల పై సైతం ఇక్కడ చిత్రీకరించారు. ఎత్తిపోతలను పర్యాటకంగా అభివృద్ధి పరచాలనే ఉద్దేశ్యంతో టూరిజం శాఖ వినూత్నమైన రీతిలో వ్యవహరిస్తూ ప్రజలకు చేరువచేస్తోంది. ఇక్కడ పర్యాటకులకు సమావేశం హాల్,క్యాంటీన్‌ల ఆధునీకీకరుణతో పాటు రాత్రి వేళల్లో సైతం పర్యాటకులను ఆహ్లాదపరచాలనే ఉద్దేశ్యంతో మ్యూజికల్ లైటింగ్ సిస్టమ్‌ను కూడా ఏర్పాటు చేశారు. రాష్ట్ర రాజధాని హైదరాబాదు నుండి టూరిజం శాఖ ఏర్పాటు చేసిన ప్రత్యేక బస్సుల ద్వారా కూడా ఎత్తిపోతలను సందర్శించవచ్చు.


ఎత్తిపోతల జలపాతం


ఎత్తిపోతల దత్తాత్రేయుని ఆలయం

# విద్యుత్ ఉత్పత్తి ఖిల్లాగా సాగర్ కుడికాలువ

(ఆన్‌లైన్, నరసరావుపేట)

వ్యవసాయ ఉత్పత్తిలో అగ్రగామిగా నిలచిన సాగర్ కుడి కాలువ ప్రాంతం నేడు విద్యుత్ ఉత్పత్తి ఖిల్లాగా నిలిచింది. ప్రతిరోజు 40 మెగావాట్ల విద్యుత్ ఉత్పాదన కుడి కాలువల పై నిర్మించిన పవర్ ప్లాంట్ల ద్వారా జరుగుతుంది. రాష్ట్రంలో విద్యుత్ కొరతతో అనునిత్యం ఇబ్బందులు ఎదుర్కొంటున్న నేపథ్యంలో నాగార్జున సాగర్ కుడి కాలువలపై మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ప్రైవేటు సంస్థలు నిర్మించాయి. పంటలకు వినియోగించే నాగార్జున సాగర్ కాలువ నీటితో విద్యుత్ ఉత్పత్తి జరుగుతుంది. మొత్తం 24 మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులకు కుడి కాలువల పై నిర్మించబడి ప్రతి రోజూ విద్యుత్ ఉత్పత్తి చేస్తున్నాయి. గుంటూరు, ప్రకాశం జిల్లాల గుండా నాగార్జున సాగర్ కుడి కాలువ 216 కిలో మీటర్లు విస్తరించి ఉంది. కుడి కాలువ నుంచి చీలే గుంటూరు, అద్దంకి, బెల్లంకొండ, జూలకల్లు బ్రాంచ్ కెనాల్స్‌తో పాటు చిలకలూరిపేట మేజర్, పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్ పై విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది.

ఈ బ్రాంచ్ కెనాల్స్‌పై మూడు నుంచి పది అడుగుల ఎత్తులో వున్న డ్రాప్స్ నుంచి జలపాతం వలె కిందకు వేగంగా నీరు పడే ప్రదేశాల్లో మినీ హైడల్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. నిర్మాణం పూర్తయి విద్యుత్ ఉత్పత్తి జరుగుతున్న ప్రాజెక్టుల వివరాలు ఇలా ఉన్నాయి. గుంటూరు బ్రాంచ్ కెనాల్ పై దక్కన్ సిమెంట్ లిమిటెడ్, సాగర్ పవర్, కెసిపి లిమిటెడ్(ఐదు ప్లాంట్లు), రాయలసీమ పవర్ ప్రాజెక్టు, తిరుమల హైడల్ పవర్ ప్రాజెక్టు(మూడు ప్లాంట్లు), చిలకలూరిపేట మేజర్ పై అక్షయ్ ప్రొఫైల్స్ ప్రైవేట్ లిమిటెడ్(రెండు), పెదనందిపాడు బ్రాంచ్ కెనాల్ పై పిఎంసి పవర్ ప్రాజెక్టు లిమిటెడ్, బెల్లంకొండ బ్రాంచ్ కెనాల్ పై యస్వార్ లిమిటెడ్(రెండు), జూలకల్లు బ్రాంచ్ కెనాల్ పై శివాని పవర్ స్పిన్నర్, అద్దంకి బ్రాంచ్ కెనాల్ పై శ్రీ ధనలక్ష్మీ కాటన్(మూడు), ట్రైడెంట్ పవర్ సిస్టమ్ లిమిటెడ్(రెండు), శ్రీ జయలక్ష్మీ పవర్ కార్పోరేషన్ లిమిటెడ్(రెండు) సంస్థల ఆధ్వర్యంలో మినీ హైడల్ పవర్ ప్లాంట్లు నిర్వహించబడుతున్నాయి.

సాగర్ కాలువలకు నీరు సరఫరా అయ్యే రోజుల్లో మాత్రమే ఈ విద్యుత్ ప్రాజెక్టుల ద్వారా విద్యుత్ సరఫరా అవుతుంది. అతి తక్కువ వ్యయంతో విద్యుత్ ఉత్పాదన జరుగుతుంది. ఉత్పత్తి అయిన విద్యుత్‌ను రాష్ట్ర పవర్ గ్రిడ్‌కు సరఫరా చేస్తారు. జిల్లా చరిత్రలోనే మినీ హైడల్ విద్యుత్ ప్రాజెక్టులను ఒక మైలురాయిగా పేర్కొనవచ్చును. ఈ పవర్ ప్లాంట్ల ద్వారా దాదాపు 500 మందికి ఉపాధి అవకాశాలు లభించాయి.



జిబిసి పై నిర్మించిన పవర్ ప్లాంట్



పవర్ ప్లాంట్‌లో విద్యుత్ ఉత్పాదన చేసే యంత్రాలు

# కాసుల వర్షం కురిపిస్తున్న సాగర్ జలాలు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

సాగర్ జలాలు రాష్ట్ర ప్రభుత్వానికి కాసుల పంట పండిస్తున్నాయి. ప్రతి ఏడాది కోట్లాది రూపాయలు రాష్ట్ర ఖజానాకు సమకూరుస్తున్నాయి. ఒక్క టిఎంసి సాగర్ జలాలు వివిధ రూపాలలో సుమారు 17 కోట్ల రూపాయలు ప్రభుత్వానికి సమకూరుస్తోంది. కుడి కాలువల ద్వారా పూర్తి స్థాయిలో నీటి సరఫరా జరిగినట్లయితే ప్రభుత్వానికి ఒక ఏడాదికి రెండు వేల కోట్ల రూపాయలకు పైగా సమకూరినట్లే. శ్రీశైలం వద్ద వినియోగించిన ఒక్క టిఎంసి నీటి వలన సుమారు 5 కోట్ల రూపాయల విలువైన విద్యుత్ ఉత్పత్తి జరుగుతుంది. అదే టిఎంసి నీటిని సాగర్ కుడి కాలువల ద్వారా విడుదల చేస్తారు. డ్యామ్ వద్ద కుడి కాలువ పై నిర్మించిన విద్యుత్ ప్లాంట్‌కు నీటిని వినియోగించి సుమారు 5 కోట్ల రూపాయలు విలువైన విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తారు. అలాగే ఆ నీటిని పంట పొలాలకు విడుదల చేయడం వలన సుమారుగా 5 వేల ఎకరాల సాగు అవుతుంది. ఈ సాగు వలన సుమారు 5.25 కోట్లు రూపాయల విలువైన పంట ఉత్పత్తి అవుతున్నది. అలాగే కుడి కాలువల పై నిర్మించిన విద్యుత్ ప్లాంట్లు వలన ఇదే టిఎంసి నీటితో సుమారు రెండు కోట్ల రూపాయల విలువైన విద్యుత్ ఉత్పత్తి జరుగుతుంది. పైన తెలిపిన వివరాలు ఒక్క కుడికాలువకు సంబంధించినవి మాత్రమే. అయితే ఎడమ కాలువ, డ్యాం వద్ద పవర్ ప్లాంట్ నుంచి విడుదలయ్యి ప్రకాశం బ్యారేజ్‌కి చేరుతుంది. ఈ నీటి వలన కూడా పై లెక్కలను బట్టి ప్రభుత్వానికి సమకూరే ఆదాయాన్ని లెక్కించవచ్చు. ఒక విధంగా చెప్పాలంటే రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దుతుంది 50 శాతం సాగర్ జలాలే. ఒక వైపు సాగర్ జలాలు పంట పొలాలను సస్యశ్యామలం చేస్తూ మరో వైపు ప్రభుత్వ ఖజానాకు ఆర్థిక పరిపుష్టిని కలిగిస్తున్నాయి.

# చారిత్రాత్మకం బాపట్ల పురపాలక సంఘం

(ఆన్‌లైన్-బాపట్ల)

బాపట్ల సాహితీ సాంస్కృతిక, విద్య, రాజకీయ రంగాల్లో అగ్రగామిగా నిలిచింది. 1936లో తొలి జాతీయ కాంగ్రెస్ సమావేశం ఇక్కడే జరిగింది. పలువురు దేశభక్తులకు నిలయంగా స్వాతంత్ర్యోద్యమంలో బాపట్ల ప్రముఖ పాత్ర వహించింది. ప్రథమ ఆంధ్రమహాసభకు శ్రీకారం చుట్టింది బాపట్ల. స్వాతంత్రోద్యమంలో స్త్రీ హితేషిణి మండలి ద్వారా మహిళలను చైతన్యవంతం చేసింది బాపట్ల. "ఏ దేశమేగినా ఎందు కాలిడిన పొగడరా నీ తల్లి భూమి భారతిని" అని తన గేయా రచన ద్వారా జాతిని జాగృతం చేసిన రాయప్రోలు గడ్డ ఇది. మురళీ లేని మురళీ గాన రవళి, ఈలపాట రఘురామయ్యకు స్థాన మిచ్చింది బాపట్ల. 1927లోనే జిల్లాలో ప్రథమంగా ఇక్కడ హైస్కూలు భవనం ఏర్పాటు జరిగింది. 1945లో దక్షిణ భారతదేశంలోనే ప్రప్రథమంగా ఇక్కడ వ్యవసాయ కళాశాలను ఏర్పాటు చేశారు. 1917లో దిగ్గజులైన పండితులతో శంకర విద్యాలయం వేద పాఠశాల ఏర్పడి నేటికి కొనసాగుతోంది.చోళరాజుల కాలంలో 1400 సంవత్సరాల క్రితం భావన్నారాయణ స్వామి పేరుతో దేవస్థాన నిర్మాణం జరిగిన సమయంలో 'భావపురి'గా బాపట్ల ఏర్పడింది. బాపట్ల పంచాయతీగా జిల్లాలో ప్రముఖ పాత్ర వహించిన బాపట్లలో 1951లో ద్వితీయశ్రేణి పురపాలక సంఘంగా గుర్తింపు పొందింది. 1952 నుంచి ఇప్పటి వరకు ఏడుగురు మున్సిపల్ చైర్‌పర్సన్లు పదవులు నిర్వహించారు. 1955 నుంచి 1957వరకు వెలగపూడి సుబ్బారావు ప్రప్రథమంగా చైర్మన్ పదవిని నిర్వహించారు. ఈయన హాయాంలో పట్టణంలోని ఇసుక రోడ్లు కంకర రోడ్లుగా రూపాంతరం చెందాయి. కిరోసిన్ దీపాలకు బదులు పెట్రోమాక్స్ లైట్లు, వీధి దీపాలుగా మార్చారు. పంచాయతీ కార్యాలయంగా వున్న భవనాన్ని ట్రావెలర్స్ బంగళాగా అభివృద్ధి చేశారు. కమ్యూనిస్టుల సహాకారంతో ఇండిపెండెంట్ అభ్యర్థిగా గెలుపొందిన శీరం రాధాకృష్ణమూర్తి 1956 నుంచి 1960వరకు చైర్మన్ పదవిని అలంకరించారు. శీరం హాయాంలో మున్సిపల్ మార్కెట్ కాంప్లెక్స్ ఏర్పడింది. 1960 నుంచి 1961వరకు, 1969నుంచి 1970 కాంగ్రెస్‌పార్టీకి చెందిన కాకుమాను భావన్నారాయణ చైర్మన్‌గా పనిచేశారు. ఈయన హాయాంలో మున్సిపల్ పార్కులు, పలు పాఠశాలలకు పక్కా భవనాలు, షాపింగ్ కాంప్లెక్స్‌లు, రహదారుల నిర్మాణం జరిగింది. 1970నుంచి 1971వరకు యడవల్లి సూర్యనారాయణ చైర్మన్ పదవి నలంకరించారు. ఆయన కాలంలో పార్కుల అభివృద్ధి రక్షిత మంచినీటి పథకానికి శ్రీకారం చుట్టారు. 1982నుంచి 1987వరకు చైర్మన్‌గా పదవి నిర్వహించిన తాడి నరసింహారావు పట్టణాన్ని ఎంతగానో అభివృద్ధి చేశారు. మున్సిపల్ ఆదాయాన్ని పెంచారు. రక్షిత మంచినీటి పథకం రుణం 26లక్షల రూపాయలను ప్రత్యేక గ్రాంటుగా మార్పించారు. సూర్యలంకకు రక్షిత మంచినీటి సరఫరాను చేసి పురపాలక సంఘానికి ఏటా 12లక్షల రూపాయల ఆదాయం పెరిగేలా ఏర్పాటు చేశారు. షాపింగ్ కాంప్లెక్స్‌లను నిర్మించారు. 1988 నుంచి 1994 వరకు కాంగ్రెస్ పార్టీకి చెందిన నీలం సత్యనారాయణ చైర్మన్ పదవి నిర్వహించారు. ఈయన హాయాంలో మురికివాడల అభివృద్ధికి విశేష కృషి సల్పారు.1995 నుంచి 2000 వరకు పదవి నిర్వహించిన తెలుగుదేశం పార్టీకి చెందిన కొటికలపూడి వెంకటరాఘవరావు హాయాంలో పురపాలక సంఘంలో ఎనిమిది కోట్ల రూపాయలతో వివిధ అభివృద్ధి పనులు చేపట్టారు. 2001లో మొట్టమొదటి మహిళా చైర్మన్‌గా జిట్టా ప్రమీలారాణి ఎన్నికయ్యారు. 2005లో జరిగిన మున్సిపల్ ఎన్నికల్లో మొట్ట మొదటి సారి బాపట్ల మున్సిపాలిటీ ఎస్సీలకు రిజర్వు కావడంతో కాంగ్రెస్‌పార్టీకి చెందిన కూరపాటి మరియదాసు పరోక్ష పద్ధతిలో మున్సిపల్ చైర్మన్‌గా ఎన్నికయ్యారు. ప్రస్తుతం ఇప్పటి వరకు కాంగ్రెస్ హాయాంలో 10కోట్ల రూపాయల ప్రపంచ బ్యాంకు నిధులతో మురికివాడల అభివృద్ధి, మరో ఎనిమిది కోట్ల రూపాయలతో వివిధ అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడానికి ప్రణాళికలు సిద్ధం చేశారు. పట్టణ జనాభా సుమారు లక్షకు చేరుకోవడంతో 17.92 చదరపు మీటర్ల విస్తీర్ణం గల బాపట్ల పట్టణాన్ని 34వార్డులుగా విభజించారు.



బాపట్ల పురపాలక సంఘ కార్యాలయం



భావన్నారాయణస్వామి దేవాలయం

# బౌద్ధ చరిత్రకు సజీవ సాక్ష్యం - నాగార్జునకొండ మ్యూజియం

(ఆన్‌లైన్, మాచర్ల, విజయపురిసౌత్)

ప్రపంచంలోనే రెండవ ఐలండ్ మ్యూజియంగా ఖ్యాతినార్జించిన నాగార్జునకొండ మ్యూజియం బౌద్ధ నాగరికతకు సజీవ సాక్ష్యంగా నిలుస్తోంది. నిత్య నూతన సోయగాలను విరజిమ్మే కృష్ణమ్మ ఒడిలో పొదిగిన ఓ చిన్న పర్వతం పై ఈ మ్యూజియం నెలకొని వుంది. విజయపురిసౌత్‌కు 14 కిలోమీటర్ల దూరంలో వున్న ఈ మ్యూజియాన్ని దర్శించాలంటే లాంచిలో నదీజలాల మధ్య పయనించాల్సి వుంది. సుమారు 45 నిమిషాల పాటు సాగే ఈ పయనంలో ప్రకృతి అందాలను ఆస్వాదిస్తూ పులకరింతకు గురికావచ్చు. చిన్న చిన్న అలలు, పర్వతాలు, ఎగిసిపడే మత్స్యాల మధ్య ప్రయాణం ప్రతి పర్యాటకుడికి మరపురాని మధురానుభూతిగా మిగిలిపోతుందనడం అతిశయోక్తి కాదు. భారత ప్రభుత్వం కృష్ణానదికి అడ్డుగా ఆనకట్ట నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్న నేపథ్యంలో ఈ లోయలోని ప్రాచీన అవశేషాలను ముంపు నుండి రక్షించేందుకు పురావస్తు శాఖ ప్రత్యేక త్రవ్వకాలను ప్రారంభించింది. 1921-31, 1954-60ల మధ్యకాలంలో విస్తారంగా జరిగిన త్రవ్వకాల్లో వైదికమత నిర్మాణాలు, నివాస గృహాలు, అనేక అవశేషాలతో పాటు ప్రాచీన కాలం నాటి మనుష్యులు వాడే లోహపు పాత్రలు, మట్టిపాత్రలు బయల్పడ్డాయి. ఈ ప్రాంతమంతా నవశిలా యుగపు సంస్కృతితో నిండి వున్నట్లు త్రవ్వకాలు వెల్లడించాయి. తొలి, మధ్య, మలి శిలా యుగపు స్మృతులు క్రమానుగతంగా ఇక్కడా వర్ధిల్లినట్లు రుజువైంది. ఇక్కడ లభ్యమైన శాసనాలు, నాణెలను అనుసరించి మఠరి పుత్ర వీర పురుషదత్తుడు, వాశిష్ట పుత్ర వేహువుల చాంద మూలుడు, వాశిష్ట పుత్ర రుద్రపురుషదత్తుడు ఇక్ష్వాకుల వంశమున ఖ్యాతినార్జించినట్లు వెల్లడైంది.

కృష్ణానది లోయలో ఇక్ష్వాక వంశీకుల పరిపాలన వంద సంవత్సరాలకు పైగా సాగినట్లు తెలుస్తోంది. ఆనాటి చారిత్రక ఆధారాలనెన్నింటినో ఈ



నాగార్జున కొండ పై నిర్మించిన బౌద్ధ మ్యూజియం

వ ు్యూజియంలో భద్రపరిచారు. ప్రపంచంలో బౌద్ధ మతానికి జీవం పోసి, మహాయాన సిద్ధాంత ప్రవక్తగా కీర్తిగడించిన ఆచార్య నాగార్జునుడి పేరుతో వున్న ఈ మ్యూజియంను 1966, ఏప్రిల్ 23న అప్పటి భారత ప్రభుత్వ విద్యాశాఖ మంత్రి ఎం.జి.బగ్లా ప్రారంభించారు. ఈ బౌద్ధ మ్యూజియంలో ప్రదర్శించే వస్తువులను నాలుగు భాగాలుగా విభజించారు. మొదటి భాగంలో విశిష్ట వస్తువులు అంటే బంగారు ఆభరణాలు, నాణెలు, గాజులు, కరకండికలు, బుద్ధ దేవుని విగ్రహం, రాతి యుగంలో వాడిన సాధనాలు, మొగలాయి కాలం నాటి సమాధులు వుంటాయి. రెండవ భాగంలో పూర్వం స్థూపాలంకరణలో వినియోగించిన బుద్ధుని జీవిత సన్నివేశాలు, జాతక కథలు, చలువరాతి శిలాఫలకాలు, మృణ్మయ శిల్పాలు, పాత్రలు, రాతప్రతులను వుంచారు. మూడవ భాగంలో జలాంతర్గమైన లోయ, కుడ్య పేటికలతో సూక్ష్మంగా తయారుచేసిన ప్రతిరూపాలు వున్నాయి. నాలుగవ భాగంలో స్థూప, వాస్తు ఫలకాలు, అర్ధ గోత్ర ఫలకాలు, ఇక్ష్వాకుల కాలం నాటి స్తంభాలు, మధ్య యుగం నాటి శిల్పాలు వున్నాయి. సుమారు 23 చదరపు కిలోమీటర్ల వైశాల్యం వున్న కొండ పై నిర్మించిన ఈ మ్యూజియాన్ని బౌద్ధ మతానికి చెందిన బూటాన్, చైనా, జపాన్ తదితర విదేశీ యాత్రికులు తరచూ సందర్శిస్తుంటారు. ఆర్కియాలజి విద్యార్థులకు ఈ మ్యూజియం, బాగా తోడ్పడుతుంది.

# పుడమి పుత్రుల సేవలో తరిస్తున్న వ్యవసాయ కళాశాల

(ఆన్‌లైన్-బాపట్ల)

పుడమి పుత్రుల సేవలో 60వసంతాలు పూర్తి చేసుకొని వజ్రోత్సవాలు జరుపుకొంటున్న బాటప్ల వ్యవసాయ కళాశాల ఎందరో విద్యార్థులు, రైతులకు సేవలందించి అగ్రగామిగా నిలచింది. గుంటూరుజిల్లాలోని బాపట్ల వ్యవసాయ కళాశాల పలు పరిశోధనలు చేస్తూ అత్యున్నత ఫలితాలను సాధించి వ్యవసాయ శాస్త్రవేత్తలకు పుట్టినిల్లుగా అంతర్జాతీయ ఖ్యాతిని గడించింది. భారతదేశ స్వాతంత్ర్యానికి ముందు, బ్రిటిష్ పాలకుల హయాంలో ఆంధ్రరాష్ట్రాన్ని అన్నపూర్ణగా తీర్చిదిద్దే ప్రయత్నంగా దక్షిణాది రాష్ట్రాలలోని కోయంబత్తూరు తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమంగా ఈ కళాశాలను బాపట్లలో 70ఎకరాల విస్తీర్ణంలో 1945 జూలై 11న ప్రారంభించారు. అప్పటి తాలూకా బోర్డు అధ్యక్షుడు పాములపాటి వెంకట కృష్ణయ్యచౌదరి, వ్యవసాయ సంచాలకులు డాక్టర్ బి.వి.నాథ్, అప్పటి మద్రాసు గవర్నర్ సలహాదారుడైన సౌంఠి వెంకటరామ్మూర్తి ప్రారంభించారు. ఈ కళాశాలలో పట్టభద్రులైన విద్యార్థులు జాతీయ, అంతర్జాతీయ స్థాయిల్లో పలు రంగాల్లో ఉన్నత కీలక పదవులను నిర్వహిస్తున్నారు. ఐపిఎస్, ఐఎఎస్, ఐఆర్‌ఎస్, బ్యాంకింగ్ రంగాలతో పాటు రాజకీయ, పారిశ్రామిక వేత్తలుగా అత్యున్నత స్థానాల్లో పేరు ప్రఖ్యాతులు గడిస్తున్నారు.

అంతర్జాతీయ ఉష్ణమండల వ్యవసాయ పరిశోధన కేంద్రం నైజీరియా మాజీ డైరెక్టర్ డాక్టర్ ఎస్.వి.ఎస్.శాస్త్రి, ఎరిడ్ జాన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ సంచాలకులుగా పనిచేసిన డాక్టర్ జి.వెంకటేశ్వర్లు, కేంద్రీయ పరిశోధన సంస్థ డైరెక్టర్‌గా పనిచేసిన డాక్టర్ జి.వెంకటేశ్వర్లు, కేంద్రీయ వరి పరిశోధన సంస్థ డైరెక్టర్‌గా పనిచేసిన డాక్టర్ బతిన వెంకటేశ్వర్లు, ఆచార్య ఎన్.జి.రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా పనిచేసిన ఐ.వి.సుబ్బారావు, మాజీ కేంద్ర మంత్రి డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, హైదరాబాదు దూరదర్శిని కేంద్రం డిప్యూటీ కేంద్రం డిప్యూటీ డైరెక్టర్ ఆర్.ఆర్.మిశ్రా, డిఐజి మాలకొండయ్య తదితరులు ఈ కళాశాలలో విద్యనభ్యసించిన వారే. కాగా గతంలో ఆంధ్రవిశ్వవిద్యాలయం అనుబంధంగా వున్న ఈ కళాశాల 1964లో ఆంధ్రప్రదేశ్‌లో అగ్రికల్చర్ వర్సిటీ పరిధిలోకి చేర్చారు. ప్రస్తుతం ఆచార్య ఎన్.జి.రంగా అగ్రికల్చర్ వర్సిటీ పరిధిలో వుంది. 1970-71లో రజతోత్సవ వేడుకలు, 1994-95లో వ్యవసాయ కళాశాల స్వర్ణోత్సవ వేడుకలు, 2004-2005 వజ్రోత్సవ వేడుకలను నిర్వహించుకుంటుంది. రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ వై.ఎస్.రాజశేఖరరెడ్డి, వ్యవసాయశాఖ మంత్రి రఘువీరారెడ్డి వజ్రోత్సవ వేడుకలను ప్రారంభించారు. మానవ వనరుల పథకం కింద (ఎ హెచ్ ఆర్ డిపి) ప్రపంచ బ్యాంకు, ఎఫ్ ఎఓ సౌజన్యంతో వ్యవసాయ కళాశాల అధ్యాపకులు 11మంది సాంకేతిక విజ్ఞానం పెంపొందించుకోవడానికి విదేశాల్లో శిక్షణ పొందారు. అదే విధంగా అయిదు కోట్ల రూపాయల వ్యయంతో అత్యాధునిక వ్యవసాయ పరికరాలు, కొనుగోలు చేసి విద్యార్థులకు విద్యాభోధనను ఆడియో విజువల్స్ ద్వారా అందిస్తున్నారు.వ్యవసాయ పరంగా రైతన్నలకు వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని చేరువ చేసేందుకు ప్రతి మూడు సంవత్సరాలకు ఒక గ్రామాన్ని ఎంపిక చేసి వ్యవసాయ రంగంలో వ్యవసాయ ఉత్పత్తులు పెంచేందుకు వ్యవసాయ కళాశాల దత్తత గ్రామం పథకాన్ని అమలు చేస్తుంది. 1997-1998 నుంచి 2002-2003వ సంవత్సరంలోం బాపట్ల మండలం కొండుభొట్లపాలెం గ్రామాన్ని దత్తత తీసుకొని వ్యవసాయ పరంగా ఆ గ్రామంలోని రైతులను చైతన్య వంతుల్ని చేశారు. అలాగే 2003-2004వ సంవత్సరంలో పొన్నూరు మండలం వల్లభారావు పాలెం గ్రామాన్ని దత్తత తీసుకొని రైతులకు సాంకేతిక, సమాజపరంగా వ్యవసాయ కళాశాల వివిద విభాగాల శాస్త్రవేత్తలు విశేష సేవలందిస్తున్నారు. వ్యవసాయ కళాశాల ఆవరణలో డాక్టర్ డాక్టర్ బి.వి.ఆర్.నాథ్ ఆడిటోరియం, రైతుల అతిథి గృహం, బాలికల వసతి గృహాలతో పాటు పిజి హాస్టల్, పెవిలియన్, జిమ్‌కాంప్లెక్స్, ప్రాంతీయ గ్రంథాలయం, జెసిబోస్ బిల్డింగ్, విద్యార్థుల పరీక్షల కేంద్రాల భవన సముదాయాలు ఉన్నాయి. వీటితో పాటు విద్యార్థుల పరీక్షల కేంద్రాల భవన సముదాయలు ఉన్నాయి. వీటితో పాటు విద్యార్థుల మానసిక వ్యక్తిత్వ వికాసం కోసం ఆరోగ్య, వ్యాయామ శాలలు ఏర్పాటు చేశారు. ఎన్.ఎస్.ఎస్, ఎన్‌సిసి యూనిట్లు విభాగాలు ఉన్నాయి. విద్యార్థుల భవిష్యత్ కోసం స్టూడెంట్ కౌన్సెలింగ్, ప్లేస్‌మెంట్‌సెల్, అగ్రికల్చరల్ రీసెర్చి ఇన్ఫర్మేషన్ సెంటర్లు ఏర్పాటు చేశారు. ఇంతటి ప్రాముఖ్యత సంతరించుకొన్న కళాశాలకు బాపట్ల-గుంటూరు రోడ్డులో రైల్వే గేటు వద్ద 400ఎకరాల విస్తీర్ణం గల వ్యవసాయ క్షేత్రం వుంది. అత్యధిక ప్రాధాన్యత సంతరించుకొన్న బిపిటి వరి వంగడాన్ని తయారు చేసిన ఘనత బాపట్ల శాస్త్రవేత్తలదే.

# వాలీబాల్ పుట్టిల్లు గుంటూరు



వాలీబాల్ ఆడుతున్న క్రీడాకారులు

(గుంటూరు, ఆన్‌లైన్ క్రీడాప్రతినిధి)

వాలీబాల్ చరిత్ర పుటల్లో గుంటూరు జిల్లాకు ప్రముఖ స్థానం వుంది. ఆంధ్రప్రదేశ్‌లోనే వాలీబాల్ ఆటకు గుంటూరు పుట్టినిల్లు వంటిది. ఎంతోమంది ఆటగాళ్ళను ప్రసిద్ధ వాలీ బాల్ క్రీడాకారులుగా గుంటూరు జిల్లా తీర్చిదిద్దింది. ప్రముఖ క్రీడాకారులను భారతావనికి అందించిన ఘనత మొత్తంగా గుంటూరు జిల్లాకు దక్కుతుంది. కొంతమంది క్రీడాకారులను ప్రపంచ వ్యాప్తంగా కీర్తి శిఖరాలపై అధిష్ఠింపజేసిదంటే ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ఇటువంటి వారిలో స్వర్గీయ సిహెచ్ బుచ్చిరామయ్య అగ్రగణ్యులు. అలాగే జి.గోపీచంద్, కె.సూరారెడ్డి, ఎ.రమణారావు, యం.శ్యాంసుందర్, ఎస్.కోదండరామయ్యలు కోచ్‌లుగా వుండి ఎంతోమంది క్రీడాకారులను ప్రతిభావంతులుగా, సుశిక్షితులుగా తీర్చిదిద్దడానికి తోడ్పడ్డారు. 1935లో గుంటూరులో ఆనాటికి వాలీబాల్ అంటే ఎవరికీ తెలియదు. ఆ ఆటకు అంత ప్రాముఖ్యత వుండేదికాదు. ఆ రోజుల్లో తొమ్మిది మంది ఆటగాళ్ళు వుండి ఎగిరివచ్చే బంతిని రెండు చేతులు జోడించి ఎదుర్కొనేవారు. ఈ పద్ధతిలో ఆడే వారిలో రత్తయ్య, అబద్ధయ్యలకు మంచి పేరుండేది. ఇది అంతగా ప్రేక్షకులను ఆకర్షించలేకపోయింది. ఆ తర్వాత పుషింగ్, తేలికగా హిట్ చేయడం నేర్చుకున్నారు. 1938-39 నాటికి వాలీబాల్ ఆట ఆంధ్రరాష్ట్రంలో బాగా పుంజుకున్నది. అప్పటికి కూడా అంతర్జాతీయ నియమాలు పాటించడమంటే ఏమిటో తెలిసేదికాదు. 1939లో శ్యామ్‌రావ్ అనే ప్రముఖ సిలోన్ ఆటగాడు వాలీబాల్ పోటీలలో పాల్గొనేందుకై గుంటూరు రావటం సంభవించింది. అప్పటి ఆటగాళ్ళకు ఆయన ఆటలో ఆధునిక పద్ధతులను బోధించారు. ఆయన పుణ్యమా అని గుంటూరు క్రీడాకారులకు మంచి ప్రావీణ్యం వచ్చింది. శ్యామ్‌రావ్ వద్ద శిక్షణ పొందిన గౌస్ మహమ్మద్ వాలీబాల్ ఆటను శాస్త్రీయ పద్ధతిలో ప్రచారం కావించారు. వాలీబాల్ ఆటకు మంచి ప్రచారం గుర్తింపు రాసాగింది. అప్పటికి గుంటూరులో 20 మంది ఆటగాళ్ళు వుండేవారు. ఆంధ్ర ప్రాంతంలో ఎక్కడ పోటీలు జరిగినా గుంటూరు నుంచి రెండు జట్లు పాల్గొని ట్రోఫీలను సునాయాసంగా సాధించేవారు. ఆంధ్ర అమెచ్యూర్, స్పోర్ట్స్ యూనియన్‌ల పేరిట 1952లో రెండు మంచి వాలీబాల్ జట్లు గుంటూరులో ఏర్పడ్డాయి. రాష్ట్ర వాలీబాల్ అసోసియేషన్, అఖిల భారత వాలీబాల్ ఫెడరేషన్ ఏర్పడ్డాయి. గుంటూరు జిల్లా ఎన్నో క్రీడలలో రాష్ట్ర, జాతీయ స్థాయిలో అగ్రస్థానం వహిస్తున్నది. జాతీయ, అంతర్జాతీయ క్రీడాకారులకు ఆలవాలమైన గుంటూరు జిల్లా వాలీబాల్ క్రీడలో ముందంజలో వుంది. గుంటూరు జిల్లా నుంచి వాలీబాల్ క్రీడలో ఖ్యాతిపొందిన వారిలో మహ్మద్ గౌస్, చలమయ్య, బలరాం తదితర క్రీడాకారులను జిల్లా ప్రజలు ఎన్నటికి మరువలేరు.

## గుంటూరు జిల్లా

# నైసర్గిక స్వరూప వివరాలు

(ఆన్‌లైన్, గుంటూరు)

| | |
|---|---|
| జాగ్రఫికల ఏరియా (చ.కి.మీలలో) | 11,391 |
| రెవిన్యూ డివిజన్స్ | 3 |
| మండలాలు | 57 |
| రెవిన్యూ గ్రామాలు | 729 |
| నివాసయోగ్యమైన గ్రామాలు | 706 |
| గ్రామ పంచాయతీలు | 1024 |
| మున్సిపాలిటీలు | 9 |
| మున్సిపల్ కార్పొరేషన్స్ | 1 |
| మొత్తం జనాభా (2001 లెక్కల ప్రకారం) | 44,05,521 |
| మగవారు (2001 లెక్కల ప్రకారం) | 22,20,305 |
| మహిళలు (2001 లెక్కల ప్రకారం) | 21,85,216 |
| రూరల్ పాపులేషన్ (2001 లెక్కల ప్రకారం) | 31,74,288 |
| అర్బన్ పాపులేషన్ (2001 లెక్కల ప్రకారం) | 12,31,233 |
| లిటరేట్స్ (2001 లెక్కల ప్రకారం) | 24,46,904 |
| డిసెన్నియల్ గ్రోత్ రేట్ (జిలా)శాతం | 7.27 |
| (2001 లెక్కల ప్రకారం) | |
| లిటరసి రేట్ ఆఫ్ డిస్ట్రిక్ట్ (2001 లెక్కల ప్రకారం) | 7.27 |
| లిటరసి రేట్ ఆఫ్ డిస్ట్రిక్ట్ (2001 లెక్కల ప్రకారం) | 62.80 |
| లిటరసి రేట్ ఆఫ్ స్టేట్ (2001 లెక్కల ప్రకారం) | 61.11 |
| నంబర్ ఆఫ్ హౌస్ హోల్డ్స్ (1991 లెక్కల ప్రకారం) | 9,39,730 |
| రెసిడెన్షియల్ హౌసెస్ (1991 లెక్కల ప్రకారం) | 8,96,769 |
| అటవీ ప్రాంతం | 3,85,720 |
| మొత్తం వైశాల్యం | 15,04,784 |
| మొత్తం వ్యవసాయ క్షేత్రాలు | 7,91,794 |
| పోస్టాఫీసులు | 873 |
| యూనివర్శిటీ | 1 |
| వైద్య కళాశాలలు | 3 |
| ఇంజనీరింగ్ కళాశాలలు | 9 |
| వ్యవసాయ కళాశాలలు | 1 |
| పాలిటెక్నిక్ కళాశాలలు | 4 |
| జూనియర్ కళాశాలలు | 199 |
| డిగ్రీ కళాశాలలు | 46 |
| హాస్పిటల్స్ | 14 |
| ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | 65 |
| ఎస్‌సి బాలుర హాస్టల్స్ | 54 |
| ఎస్‌సి బాలికల హాస్టల్స్ | 36 |
| ఎస్‌టి బాలుర హాస్టల్స్ | 24 |
| ఎస్‌టి బాలికల హాస్టల్స్ | 8 |
| బిసి బాలుర హాస్టల్స్ | 51 |
| బిసి బాలికల హాస్టల్స్ | 11 |
| ఐసిడిఎస్ బ్లాక్స్ | 22 |
| అంగన్‌వాడీ కేంద్రాలు | 3656 |
| బాలాసదనం | 3 |
| కాలేజి ఎట్ హోమ్ | 1 |
| వాత్సల్య కుటీర్ | 1 |
| వర్కింగ్ ఉమెన్స్ హాస్టల్ | 1 |

### పాఠశాలలు

| | |
|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 2996 |
| ప్రాథమికోన్నత పాఠశాలలు | 402 |
| ఉన్నత పాఠశాలలు | 507 |
| విద్యార్థుల సంఖ్య (2003-04) | 1510593 |
| ఏడవ తరగతినందు ఉత్తీర్ణతా శాతం (2003 మార్చి) | 89.42 శాతం |
| పదవ తరగతినందు ఉత్తీర్ణతా శాతం (2003 మార్చి) | 73.18 శాతం |

### టీచర్ల వివరాలు

| | |
|---|---|
| ప్రధానోపాధ్యాయులు | 620 |
| స్కూలు అసిస్టెంట్లు | 1975 |
| సెకండరీ గ్రేడు | 10914 |
| తెలుగు పండిట్లు | 784 |
| హిందీ పండిట్లు | 575 |
| పియిటిలు | 354 |
| డ్రాయింగ్ | 105 |
| క్రాఫ్ట్, ఇతరములు | 131 |
| ఉర్దు | 15 |
| సంస్కృతము | 13 |

# వాణిజ్య పంటలకు కేంద్రం గుంటూరు జిల్లా

(ఆన్‌లైన్, గుంటూరు)

దేశంలోనే వాణిజ్య పంటలకు గుంటూరు జిల్లా కేంద్రమైంది. వర్జీనియా పొగాకు ఉత్పత్తికి ప్రపంచంలో గుంటూరుకు మొదటిస్థానం ఉంది. ఆసియా ఖండంలోనే గుంటూరు మిర్చి యార్డు పెద్దదిగా ఉంది. రాష్ట్రంలో పత్తి ఉత్పత్తిలో గుంటూరు మొదటిస్థానంలో ఉంది. నాలుగు, అయిదు దశాబ్దాల నుంచి వాణిజ్యపంటల ఉత్పత్తులకు గుంటూరు ప్రధానకేంద్రంగా ఉంది. దీనిని దృష్టిలో పెట్టుకొని గుంటూరులో వ్యవసాయ ఉత్పత్తుల ఎగుమతులకు సంబంధించిన అగ్రికల్చర్ ఎక్స్‌పోర్ట్స్ జోన్‌ను ఏర్పాటు చేయాలనే ప్రతిపాదన ఉంది. వాణిజ్య పంటలకు కేంద్రం కావటంతో వ్యవసాయ ఆధారిత పరిశ్రమలు కూడా ఇక్కడ ఎక్కువగా ఉన్నాయి. పొగాకు పంటకు సంబంధించి దేశం మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తున్న పొగాకుబోర్డు గుంటూరు కేంద్రంగా ఉంది. ప్రత్తి, మిర్చి పంటల ఆధారంగా ఏర్పాటుచేసిన జిన్నింగ్ మిల్లులు, కోల్డ్ స్టోరేజ్‌లు ఎక్కువగా ఉన్నాయి. అసియాఖండంలోనే పేరెన్నిక గల గుంటూరు మిర్చియార్డులో సంవత్సరానికి రూ.600 కోట్లనుంచి వెయ్యికోట్ల రూపాయల లావాదేవీలు జరుగుతుంటాయి. గుటూరు మిర్చియార్డు ద్వారా ఉద్యోగులు, కార్మికులు మొత్తం మూడు వేల నుంచి ఐదువేల మందికి ఉపాధి కలుగుతుంది. ప్రస్తుతం స్పేస్‌బోర్డు ప్రాంతీయ కార్యాలయం గుంటూరులో ఉంది. దీనిని జోనల్ ఆఫీసుగా మార్చు చేయాలని ప్రయత్నిస్తున్నారు. గుంటూరు, నర్సరావుపేట డివిజన్ లలో పత్తి, మిర్చి, పొగాకు తదితర వాణిజ్య పంటలు పండిస్తున్నారు. మూడు సంవత్సరాల నుంచి వర్షాలు లేకపోవటం, సాగర్‌కాల్వలో నీరు లేకపోవటం వలన రైతులు ఇబ్బంది పడుతున్నారు. గత సంవత్సరం మిర్చిరైతులు బాగా నష్టపోయారు. దీంతో ఎక్కువమంది రైతులు మిర్చికి బదులు పత్తిసాగు వేశారు. జిల్లాలో ఈ సంవత్సరం 1.75 లక్షల హెక్టార్ల లో పత్తిని వేశారు. పత్తి, మిర్చిపంటలు ఎక్కువ కావటంతో గుంటూరులో దేశం మొత్తంలో కంటే ఎక్కువ పురుగుమందులు, ఎరువులు వ్యాపారం జరుగుతుంది. దేశస్థాయిలో రైతునాయకులుగా ఎదిగిన ఆచార్య రంగా, వేత్త రఘురామయ్య, డాక్టర్ యలమంచిలి శివాజీ తదితరులు రైతులు సమస్యలను ఆధారం చేసుకొని రాజకీయ జీవితాన్ని ప్రారంభించారు. మిర్చి పండించటంలో కూడా గుంటూరు జిల్లా అగ్రస్థానంలో ఉంది. గుంటూరులో సుమారు 55 కోల్డ్‌సోరేజ్‌లు ఉన్నాయి. అంతర్జాతీయ మార్కెట్‌లో పొగాకు ఎగుమతులకు గుంటూరు ప్రధాన కేంద్రంగా ఉంది. జిల్లాలో సుమారు 9 లక్షల హెక్టార్లు వ్యవసాయ భూమి ఉండగా ఐదులక్షల హెక్టార్లలో వాణిజ్య పంటలు పండిస్తున్నారు. వర్షాలు లేకపోవటం, కాలువలకు నీరు రాకపోవటం వలన మాగాణి భూముల్లో కూడా రెండుమూడు సంవత్సరాల నుంచి మిర్చి, పత్తి సాగుచేస్తున్నారు. వాణిజ్యపంటులు కేంద్రంగా ఉండటం వలన లాంఫారం, బాపట్ల వ్యవసాయ కళాశాల, కావూరు కృషి విజ్ఞాన కేంద్రం తదితర కేంద్రాలలో వ్యవసాయ పరిశోధనలు నిత్యం జరుగుతున్నాయి. రాష్ట్రంలోని రాయలసీమ, తెలంగాణా జిల్లాల నుంచి కూడా రైతులు గుంటూరు మిర్చి యార్డుకు వస్తుంటారు. ఆరువందల కమిషన్ షాపులు, వందమంది మిర్చి ఎగుమతి దారులు ఇక్కడ పనిచేస్తుంటారు. వాణిజ్య పంటలు విరివిగా పండటం వలన రైతులలో చైతన్యం కూడా బాగా పెరిగింది.

ఇటీవల సరైన గిట్టుబాటు ధరలు లేక మిర్చి, పత్తిరైతులు నష్టపోతూ వచ్చారు. కౌలురైతులు ఎక్కువమంది నష్టపోయి ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. రానురాను వాణిజ్య పంటలు వ్యయం పెరిగి రైతులకు భారంగా ఉంది. మొదట్లో పత్తిపంటలు వేసి బాగా లబ్ధిపొందిన రైతులు ఖరీదైన మందులు ఉపయోగించి అధిక లాభాలకోసం ఖర్చులు పెంచుకొంటున్నారు. రానురాను పొగాకు పంట విస్తీర్ణం తగ్గి పత్తి, మిర్చి విస్తీర్ణం పెరుగుతూ వచ్చింది.

వాణిజ్యపంటలకు కేంద్రంగా ఉన్న గుంటూరులో దానిపైన ఆధారపడిన ఎరువులు, పురుగుమందుల వ్యాపారం కూడా రాష్ట్రంలోనే అధికంగా ఉంది. ఆధునిక వంగడాలను ఉపయోగించటంలో గుంటూరు ప్రసిద్ధిచెందింది. ఈ విధంగా గుంటూరుజిల్లా వాణిజ్యపంటలకు ప్రసిద్ధిగాంచింది.

# 'దక్షిణ కాశీ'గా పేరుగాంచిన గుత్తికొండబిలం

(ఆన్‌లైన్, పిడుగురాళ్ళ)

ప్రకృతి రమణీయమైన కొండల సముదాయాల మధ్య రమ్యమనోహరంగా వుండే గుత్తికొండ బిలాలు యాత్రికుల గుండెలను సున్నితంగా స్పృశిస్తాయి, కనువిందుచేస్తాయి. గుంటూరు జిల్లా పిడుగురాళ్ళ మండలం గుత్తికొండ గ్రామానికి 5కిలోమీటర్ల దూరంలోవున్న గుత్తికొండ బిలం చారిత్రాత్మక ప్రాశస్థ్యాన్ని కలిగివుంది. పల్నాడు ప్రాంతంలో గుంటూరుజిల్లా మాచర్ల వయా నర్సరావుపేట మార్గంలో గల గుత్తికొండ గ్రామసమీపంలో ఈబిలాలున్నాయి. దక్షణకాశీగా ప్రసిద్ధిచెందిన దైవక్షేత్రం ఈ గుత్తికొండ బిలం. అంతుపట్టని రహస్యాలకు కేంద్రబిందువుగా 13వ శతాబ్దం నాటి భారతీయ సంస్కృతికి చిహ్నంగా మిగిలిన 101 సొరంగాల మార్గములున్నట్లు పెద్దలు చెప్పుకునే ఈగుత్తికొండ బిలం శాలివాహన కాలంలో గృచ్ఛాది పట్టణంగా ప్రసిద్ధిచెంది గుత్తికొండ బిలంగా రూపొందటం జరిగింది. ముచికుందుడు అనే మహర్షి ఇక్కడ తపస్సుచేసి శ్రీమన్నారాయణుని వరంపొంది యోగనిద్రలోవున్నాడని కొన్ని సంవత్సరాల అనంతరం కాలయముడనే రాక్షసుని బారినుంచి తప్పించుకోవటానికి శ్రీకృష్ణుడు ఈ బిలంలో ప్రవేశించి యోగనిద్రలో వున్న మునీశ్వరునికి తన ఉత్తర్యాన్ని కప్పి, తాను లోపలకు వెళ్ళి బొరియలచాటున దాక్కున్నాడని, ఇంతలో రాక్షసుడు గృహలో ప్రవేశించి ముసుగులో వున్నది శ్రీకృష్ణుడేనని తలంచి ముట్టుకొనగా ఆ మునీశ్వరుని నేత్రాలనుంచి వెలువడిన అగ్ని ఆరాక్షసున్ని దహించివేసిందని స్థలపురాణం చెపుతోంది. ఈ ముచికంద మహర్షికి శ్రీకృష్ణుడు తన విశ్వరూపదర్శనంతో ప్రత్యక్షమయ్యాడని స్థానికులు చెపుతున్నారు. బిలాల లోపల కోనేరు ఏర్పడివుంది.ఆకోనేటిలోకి రూపాయి నాణెం పడవేసినా మరలా తీసుకొనగలిగినంత స్వచ్ఛంగా ఈనీళ్ళు వుంటాయి. ఈకోనేటిలోని నీటిలో స్నానాలుచేసి దగ్గరలో వున్న శివలింగాలను భక్తులు దర్శిస్తారు. కాశీనుంచి ఈబిలం వరకు మార్గంవుందని పూర్వీకులు అభివర్ణిస్తున్నారు. పల్నాడు వీరులు బ్రహ్మనాయుడు కూడా (మిగతా 15వ పేజీలో)



బిలం వద్ద వున్న శివుని విగ్రహం



బిలంలోని నాగేంద్రస్వామి విగ్రహం



గుత్తికొండ బిలం ముఖద్వారమిదే

(14వ పేజీ తరువాయి)

తపస్సు చేసాడని ప్రతీతి. ప్రకృతిర మణీయంగా వుండే ఈకొండపైభాగంలో బాలమల్లేశ్వర ఆలయం, కనక దుర్గ దేవాలయం , ఆంజనేయస్వామి దేవాలయాలు వున్నాయి. నిత్యం దీపారాధన భజనలు ఇక్కడ జరుగుతూ వుంటాయి. పల్నాటివీరులు బాలచంద్రుడే బాలమల్లేశ్వరాలయంలోని ఈశ్వరుడని ఇక్కడి ప్రజల నమ్మకం. ప్రతి సంవత్సరం తొలి ఏకాదశి, దసరా ఉత్సవాలు ఈబిలం వద్ద ఘనంగా జరుగుతూ వుంటాయి. ఈ ఉత్సవాలకు చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలేకాకుండా రాష్ట్రంలోని నలుమూలల నుంచి వేలాదిమంది భక్తులు వచ్చి బిలంలో గల కోనేటిలో స్నానమాడి 'చీకటిమల్లయ్య'ను, దర్శించుకుంటారు. బిలంలో 101 శిరస్సుల నాగేంద్రుడు, పుట్ట,అక్షయపాత్రతో గరళము చేయిస్తున్నట్లుగా అతిపెద్ద శివుని విగ్రహం, మరెన్నో రహస్యాలు దాగివున్నట్లు ఇక్కడి ప్రజల నమ్మకం. ఈబిలాలలో ముఖ్యంగా రేణుకాబిలం, కత్తుల బిలం, కృష్ణాబిలం, అహోబిలం ఈవిధంగా మొత్తం 101 సొరంగమార్గాలున్నట్లు స్థానిక పెద్దలు చెపుతున్నారు. పల్నాటి యుద్ధానంతరం బ్రహ్మానాయుడు ఈబిలంలో తపస్సుచేస్తూ శేష జీవితాన్ని గడిపినట్లు చరిత్రకారులు చెపుతున్నారు.

### అవధూత పేరమ్మ

1925వ సంవత్సర ప్రాంతంలో గుత్తికొండ బిలాలకు సమీపంలో వున్న జూలకల్లు గ్రామానికి చెందిన మర్రెడ్డి వారి ఆడపడచు పేరమ్మ అనే భక్తురాలు పశువులు కాచేందుకు ఈబిలాల సమీపంలోగల అటవీప్రాంతాలలోకి వస్తుండేది. బిలంవద్దకు చేరి అక్కడకు వచ్చే మహామునులను, సిద్ధపురుషులను తనబాహ్యజీవితం నుంచి విముక్తి కలిగించమని వేడుకుంటూ వుండేది. అందుకువారు వైవాహిక జీవితాన్ని అనుభవించమని వెనక్కుపంపించారు. అయితే పేరమ్మ జీవితంపై విరక్తిచెంది ఆధ్యాత్మిక చింతనలోకి వెళ్ళి పరమార్థాన్ని అన్వేషించే క్రమంలో ప్రతిరాత్రి అత్తగారి ఊరైన దాచేపల్లి నుంచి గుత్తికొండ బిలానికి చేరుకునేది. అక్కడ ఋషులకు సేవచేసి రాజేశ్వరిమాతకు అభిషేకం గావించి తెల్లవారి ఇంటికి వెళ్ళేది.

పేరమ్మ చేస్తున్న ఈదినచర్య కార్యక్రమాన్ని రహస్యంగా గమనించేందుకు అత్తంటివారు ప్రయత్నించారు. భక్తితో పూజలుగావించి పేరమ్మ బిలం వద్ద గల రాజేశ్వరీమాతకు భక్తితో ప్రసాదం పెడుతున్న సమయాన్ని వీక్షించి వారు అంధులైనట్లు పెద్దలు చెపుతున్నారు.

# కోటి వేల్పుల అండ కోటప్పకొండ



త్రిముఖ శివలింగం



కోటప్పకొండ శ్రీ త్రికోటేశ్వర స్వామి దేవాలయ ప్రాంగణం

**(ఆన్‌లైన్ - నరసరావుపేట)**

దక్షిణ భారతదేశంలోనే అత్యంత ప్రసిద్ధి గాంచిన శైవక్షేత్రం కోటప్పకొండ శ్రీత్రికోటేశ్వర స్వామి దేవస్థానం. నరసరావుపేట మండలంలోని కోటప్పకొండ పుణ్యక్షేత్రం గాను, పర్యాటక కేంద్రంగా అసాధారణ రీతిలో అభివృద్ధి చెందింది. భక్తుల కొంగు బంగారమైన శ్రీత్రికోటేశ్వర సన్నిధి యాత్రికులకు అత్యంత చేరువైంది. అభివృద్ధి కార్యక్రమాలు పూర్తయి భక్తులకు,పర్యాటకులకు అన్ని సౌకర్యాలు సమకూరాయి. దీంతో పుణ్యక్షేత్రానికి భక్తుల సంఖ్య రోజురోజుకు పెరుగుతున్నది. భక్తి,వినోదం మేళవించి కొండపై యాత్రికులకు ఆహ్లాదం కల్పిస్తున్నారు.

హరహర! చేదుకో కోటయ్య! చేదుకోవయ్య! అని భక్తి సమ్మేళత అర్తితో పిలవగానే కాలకూటం లాంటి పాపాలనెన్నింటినైనా హరించి భక్తులకు ఇహ, పర సౌఖ్యాలను ప్రసాదించే ప్రత్యక్ష దైవం శ్రీ త్రికోటేశ్వరస్వామి అని భక్తుల *(మిగతా 17వ పేజీలో)*


కోటప్పకొండ మహారాజగోపురం

(16వ పేజీ తరువాయి)

నమ్మకం. రాష్ట్ర నలుమూలలా ఉన్న భక్తులకు కోటయ్య స్వామి కొంగు బంగారం. ఎందరో మహా యోగులకు, దేవతా మూర్తులకు జ్ఞానోపదేశం చేసిన మహిమాన్విత క్షేత్రమే కోటప్పకొండ. యేటా లక్షలాది భక్తుల నీరాజనాలు అందుకుంటూ శివరాత్రినాడు ఇక్కడ సాగే తిరునాళ్ళ దేశ ప్రసిద్ధి.

దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసిన తర్వాత శివుడు శాంతించి పన్నెండేళ్ళ బాలుడిగా మారి బ్రహ్మచర్య దీక్షతో కైలాసంలో సమాధి నిష్టలో దక్షిణామూర్తిగా ఉన్నాడు. అప్పుడు బ్రహ్మ తదితర దేవతలు దక్షిణామూర్తి వద్దకు వెళ్ళి మొక్కి తమకు బ్రహ్మోపదేశం చేయాలని కోరారు. అందుకు అంగీకరించి దక్షిణామూర్తి త్రికూటాద్రికి వచ్చి(కోటప్పకొండ) బ్రహ్మోపదేశం చేశాడు. కనుకనే ఇది మహా పుణ్యక్షేత్రంగా విరాజిల్లుతోంది. ఆలయంలో నిత్యం పూజలు జరుగుతున్నాయి. ప్రతి రోజు అభిషేకం, అర్చన, అష్టోత్తరం, హోమాలు కూడా జరుగుతున్నాయి.

### కార్తీకమాస విశేష పూజలు

ఈశ్వరుడు అభిషేకంతో మానవుని యొక్క సకల ఈతిబాధలు తీర్చుతాడని వేదశాస్త్రంలో పేర్కొన్నారు. అందులోనూ కార్తీకమాసంలో శివారాధన చాలా విశిష్టం. శ్రీమేధాదక్షిణామూర్తి స్వరూప శ్రీత్రికోటేశ్వర స్వామి వారికి కార్తీకమాసంలో అభిషేకాలు, అర్చలను చేయటానికి ప్రత్యేక ఏర్పాటు చేస్తున్నారు. కార్తీక మాసంలో ప్రతి ఆదివారం, పౌర్ణమి, ప్రతి సోమవారం, రెండో ఏకాదశి రోజుల్లో ఉదయం 5.30 నుండి 8.30 గంటల వరకు మూల విరాట్‌కు అభిషేకాలు జరుపనున్నారు.

### పర్యాటక కేంద్రం

ఘాట్‌రోడ్డుకు ఇరు వైపులా దాదాపు 25 ఎకరాల స్థలంలో పర్యాటక కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. దీనిలో వివిధ పార్కులు రూపుదిద్దుకున్నాయి. పర్యాటకులను విశేషంగా ఇది ఆకర్షిస్తుంది. పర్యాకట కేంద్రంలో జింకల పార్కును ఏర్పాటు చేశారు. అలాగే వివిధ శాలకు సంబంధించిన పక్షులు పర్యాటకులకు కనువిందు చేస్తున్నాయి. సహజమైన రీతిలో అందమైన గార్డెన్ నిర్మాణం జరిగింది. సరస్సులో బోట్ షికార్ కల్పించారు. చిన్న పిల్లలు ఆడుకునేందుకు చిల్డ్రన్స్ పార్కు నిర్మాణం జరిగింది. టాయ్‌ట్రైన్‌ను ఏర్పాటు చేశారు. ఘాట్ రోడ్ మార్గంలో బ్రహ్మ, శేషశయనంపై విష్ణుమూర్తి, సరస్వతి, లక్ష్మి,పార్వతి, విఘ్నేశ్వరుడు, ధ్యాన ముద్రలో శివుడు, శివలింగం, భారీ విగ్రహాలను నిర్మించారు. అభివృద్ధికి కారకులైన రాష్ట్ర మాజీ మంత్రి డాక్టర్ కోడెల యాత్రికులనుంచి ప్రశంసలందుకుంటున్నారు.


శ్రీ త్రికోటేశ్వర స్వామి మూల విరాట్


విఘ్నేశ్వరుని విగ్రహం

# ప్రాచీన ఆలయాలకు నెలవు సత్తెనపల్లి

**(ఆన్‌లైన్, సత్తెనపల్లి)**

సత్తెనపల్లి ప్రాచీనకాలం నుంచి పాడి పంటలతో సుక్షేత్రమై విరాజిల్లుతోంది. అమరావతి కొండవీడు ఏలికల పాలనలో ప్రాపుగాంచినది. ఆయా రాజులు రాచరిక విధానాలు, వారి పాలనా పద్ధతులకనువుగా రూపు మార్చుకొనినది. ప్రత్యేకించి కోటలులేక పోయినా సత్తెనపల్లి చుట్టూగల గ్రామాల దేవాలయములను దర్శించి తరించిన రాజన్యులెందరోగలరు. వారిని గూర్చి గ్రామాలయందలి ప్రజల జీవన విధానాలను గూర్చి పూర్వము కొంత కొంత కటువుగానే వుండెడదని చరిత్ర పరిశీలించిన మనము గుర్తించవచ్చు. ఏమైనా చరిత్ర సిగలో విరబూసిన పువ్వు సత్తెనపల్లి సీమ అనవచ్చును. క్రీశ 1326 సం॥లో పాత సత్తెనపల్లి అనగా వడ్డవల్లి యందు ప్రోలయ వేమారెడ్డి కాలమునకు చెందిన మూల గురవమ్మ గుడి అత్యంత శిల్ప నైపుణ్యంతో నిర్మించబడినట్లు తెలియచున్నది. కాని ప్రస్తుతం అది సత్తెనపల్లి యందు కాన్పరాదు. ఒక మట్టిమిద్దె యందు గూరమ్మ, గూరయ్యల పేర్లుగల చావిడి కనిపించును. వడ్డెరలు బలవంతులైనందువలన, వారి జనాభా అధికమైనందు వలన ఆకాలంలో వారి పేరు మీదుగా వడ్డవల్లి అని పేరువచ్చినది. ఈ వడ్డెరల యందు సత్తెన్న అనునతడు బలవంతుడు, దళనాయకుడైనందున వడ్డవల్లి ఉత్తరంగా ఏర్పాటు చేయబడిన పల్లెకు సత్తెనపల్లి అనియు పేరువచ్చినది. ఇది క్రీశ 1779 ప్రాంతంలో ఏర్పడిన పల్లె. ఈ ప్రాంతము యొక్క రక్షణ బాధ్యతలు, కప్పం వసూలు అప్పచెప్పిన వారు చిలకలూరిపాడు జెమిందారగు రాజా మానూరి వెంకన్న వీరి సత్తెనపల్లి యందు శ్రీ వేణుగోపాల స్వామి గుడిని కోటను నిర్మించిరి. స్వామివారి భూమి మాన్యమును దానంచేసి వంశపారంపర్య ధర్మకర్తలుగా ఉంటిరి. అనగా సత్తెనపల్లి 1779 తర్వాతనే ఏర్పడగా వడ్డవల్లి ప్రాచీనమైనది. భృగుబండ గ్రామం నందు రాతి యుగమునకు చెందిన సమాధులు ఆనవాళ్ళు ఇప్పటికే దర్శనమిస్తాయి. క్రీపూ 2,3 శతాబ్దముల నుండియే ఇక్కడ జనవాసము కనిపిస్తుంది. పురాణపరంగా గమనిస్తే గర్వ చక్షువు కోల్పోయిన బృగుమహర్షి, శ్రీమహా విష్ణువును శరణుకోరి ఆపై భూలోకమునకు చేరి ఒకకొండపై తపస్సుచేసుకొనెను. అతడు తపమాచరించిన బండయే భృగుబండగా స్థిరపడినదని గ్రామీణుల నమ్మకం. ఒరిస్సా రాష్ట్రం పూరియందు తప్ప మరెక్కడ కానిరాని సుభద్ర, బలరామకృషుణల జగన్నాధస్వామి వారి ఆలయం నిత్య కళ్యాణ శోభతో ఏటేట ఉత్సవములతో అలలారుట ఇచ్చట గమనించవచ్చును. క్రీశ 1183లో అమరావతి పాలకుడగు కోట కేతరాజు తులా సంక్రాంతి పర్వదినమున శ్రీ స్వామివారి నిత్య దూపదీప నైవేద్యములకు సమర్పించిన దానములయందు మేడికొండూరు, డోకిపర్రు గ్రామాలు కలవు. క్రీశ 11వ శతాబ్దమున వీర శైవ, వీరవైష్ణవములు తీవ్రముగా ఉన్నవి. గుడిపూడి యందు శ్రీ చెన్నకేశవ ఆలయం, ఆలయమండపములు, ఉత్సవములు దూపదీప నైవేద్యములతో అలలారుచుండెను. శైవమతావలించికులైన జంగమదేవరులకు ఆలవాలమైన గుడిపూడి యందు చంద్ర ప్రతిష్టతమైన సోమేశ్వరాలయము ఉన్నప్పటికిని రాజ్యాధరణలేక ప్రబలేనిదాయెను. జంగమదేవరులు ఉదయంతో దేశయాటనకు వెళ్ళి లభ్యమైన భత్యములతో సంతృప్తి చెంది సాయం సమయమునకు సోమేశ్వరుని చెంతకు చేరి గుంపుగుంపులుగా కూర్చొని ఆలయ పునరుద్ధరణ గూర్చియు మండపము, ప్రాకారములు, గాలిగోపురములను గూర్చి ఒకరు ప్రతిపాదించుట, మరొకరు తిరస్కరించుట వంటి చర్యలతో ఎన్నో రాత్రులు, సంవత్సరములు గడిచినవేకాని ఖాళీ రూపందాల్చలేదాయనే. కారణం వారి పేదరికమే. అందుకే కాని వ్యవహారములపై చర్చలు గూర్చి "గుడిపూడి జంగాల్లా"గా గుంపులుగుంపులు అనే సామెత స్థిరపడింది. క్రీశ 1300 సం॥లో కాకతీయ ప్రతాపరుద్రుడు అమరావతి పోవుచు మార్గ మధ్యంలో ప్రసిద్ధిగాంచిన సోమేశ్వరునికి ఆలయం కట్టించి భూమి దానం చేసినట్లు శాసన స్తంభములనెత్తించినాడు. క్రీశ 1650 ప్రాంతంలో ఆంధ్రదేశమున వెలిసిన పేరంట్రాంధ్ర యందు ఒకరైన శ్రీశ్రీశ్రీ అచ్చమ్మ పేరంటాలు ఉత్సవములు గుడిపూడి యందు ఏటా నిర్వహించబడుచున్నవి. క్రీశ 1796 రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గుడిపూడి చెన్నకేశవ ఆలయమును జీర్ణోద్దరణగావించారు.

నందిగామ వివిధ రాజవంశములతో మమేకమైనది. క్రీశ 1138లో గణపతి మహేదేవ రాజువద్ద మంత్రిగానున్న గోపరాజు రామన్న నందిగామను హక్కు భుక్తంగా వ్రాయించుకొనిరి. క్రీశ 1415సం॥న నందిగామ ప్రోలయవేమారెడ్డి, అనుపోతారెడ్డి, అనువేమారెడ్డి, అతని కుమారుడు కుమారగిరిరెడ్డి పాలనలో ఉన్నట్లు తెలియుచున్నది. క్రీశ 1573 నుండి మొగలాయి పాదుషాలు క్రీశ 1687లో కొండవీటి జమిందారుల ప్రాపకముల యందును , క్రీశ 1712లో ముజారీజ్ ఖాన్ కొండవీటిని మూడు వంతులుగా విభజించగా, *(మిగతా 20 పేజీలో)*



సత్తెనపల్లి నడిబొడ్డున ఉన్న గడియార స్తంభం



రైతుసోదరుల సేవలో
30 సంవత్సరాల పైబడి

# నూజివీడు సీడ్స్ వారి లక్షలాది ప్రత్తి రైతుల నమ్మకం






## బోల్‌గార్డ్ "బన్ని" (NCS-145)

## బోల్ గార్డ్ "మల్లిక" (NCS-207)

## నూజివీడు సీడ్స్ వారి నాణ్యమైన, అవసరమైన పురుగు మందులు, జీవక్రిమి సంహారకాలు, శిలీంధ్రనాశినులు మరియు ఎరువులు



సుమిడా



ప్రైజ్



రాంబో



ఫోకస్



నూజి క్యూర్



ద్రవఖాద్



ద్రవపోషక్



టాంటో



ఇనాస్

## నూజివీడు సీడ్స్ లిమిటెడ్

సుబీజ్ హౌస్, 6/12 బ్రాడీపేట, గుంటూరు.
ఫోన్ : 2350779, 2350889

# ప్రాచీన ఆలయాలకు నెలవు సత్తెనపల్లి

(18వ పేజీ తరువాయి)

అందులో చిలకలూరిపాడు వంతును మానూరి వెంకన్నగారి వారసులైన మానూరి నరసన్నకు సత్తెనపల్లి వంతును వెంకటేశంకు అప్పగించారు. ఇది క్రీశ 1779న జరిగింది. నందిగామ యందలి సోమేశ్వరస్వామి ఆలయం మునగోటి బసవ బత్తుడను విశ్వ బ్రాహ్మణుడు కట్టించెను.

గొల్లెల మందలచే నింపబడుట వలన మామందల "మాదల"గా మార్పు చెందింది. క్రీశ 1212లో గణపతి దేవుని కుమార్తె యగు గణపాంగ మాదల యందలి సకలేశ్వరస్వామి వారిని సేవించినది. క్రీశ 1125 నందు మాదల సోమేశ్వరాలయమందు దుర్జయ వంశీయుడగు పిన్నమనాయుడు క్రీశ 1282లో దేవనాయని కుమారులను, క్రీశ 1256 సం॥లో బేత రాజులు, క్రీశ 1261లో గణపాంగ పేర మన్నబోయడు సకలైశ్వర స్వామి వారిని సేవించినట్లు శాసనముల ద్వారా తెలియుచున్నది. పణిదెం గ్రామం క్రీశ 1193 నందు గణపతి దేవుని వద్ద నుండి గోపరాజు రామన్న పంతులుగారు దీనినికూడా దానము పట్టినట్లు తెలియుచున్నది. క్రీశ 1375లో అనవేమా రెడ్డి సోమేశ్వరాలయమును కట్టించినట్లు తెలియుచున్నది. దీంతోపాటు శ్రీకళ్యాణ వేణుగోపాలస్వామి వారి ఆలయమును కట్టించిరి. క్రీశ 1500 సం॥ రాజ్యం కర్ణాటక ప్రభువుల వశమైనప్పుడు ఆలయ మర్యాదలు వారు పాటించిరి. క్రీశ 1517 సం॥ శ్రీకృష్ణ దేవరాయలు దండయాత్రలు చేయుచూ పణిదెం గ్రామము చేరుకున్నారు. పణిదెం నందలి వేణుగోపాలస్వామివారి గాలి గోపురం నిర్మించినట్లు తెలియుచున్నది. ఆకాలము నందు రాయలవారి భటులు మకాం చేసిన ప్రాంతం బాటులూరుగాను అదే కాలక్రమంలో భట్లూరు గ్రామంగా మార్పు చెందింది. క్రీశ 1670లో ఏర్పడిన క్షామమునందు పణిదెం జనావాసము లేక పతనమాయెను. ఇందలి ఆలయములు జీర్ణమైనవి. పిచ్చి దుబ్బులు పెరిగి 50 సంవత్సరాలు అడవిగా మారింది. ఆ తరువాత 1700లో నరసరావుపేట జమిందారుపై కోపంతో కొన్ని కుటుంబాల వారు చాగలమర్రి నుండి పణిదెంనకు వలస వచ్చారు. ఆవుగిట్టెల నుండి బయల్పడిన వేణుగోపాలును ప్రతిష్టించి పణిదెంను మరలా ఏర్పాటు చేసిరి. క్రీశ 1791లో రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు గారు కళ్యాణ వేణుగోపాల స్వామివారి ఆలయమును పునఃప్రతిష్టించిరి. క్రీశ 1905 స్వాతంత్ర్య పోరాట కాలములో పెట్టబడి-కొండ-కేసు పణిదెం ప్రజల స్వేచ్ఛాతత్వము బ్రిటీషు వారిపైగల కోపమును దేశ స్వాతంత్రేశ్చను తెలియజేయును. అబ్బూరు నందు ఉగ్రనరసింహాలయము ప్రహ్లాదుని కాలము నాటి దనియు, భూగర్భాలయములో సగం నీటిలో సగం పొడిగా యుండి దేవతల చేత మానవుల చేత పూజింపబడుచూ ప్రఖ్యాతిగాంచినది. చింతలపూడిగా క్రీశ 1407 నాటికే ప్రసిద్ది గాంచినది పెదమక్కెన గ్రామము. పెదకోమటి వేమారెడ్డి గారి వద్ద పనిచేయుచున్న శ్రీ క్రిష్ణపాటి లింగన దీనిని వడిసినట్లు శాసనములు కలవు. క్రీశ 1750 నాటికి రాజావాసిరెడ్డి వారి ఆధీనము నందున్నట్లు తెలియుచున్నది.


వేణుగోపాలస్వామి దేవస్థానం

క్రీ 1565లో ఇబ్రహీం పాదుషా గారు గోల్కొండ నవాబుగా యుండి ముర్తుజా భామన క్రీశ 1570లో కొండవీటి నుండి బెల్లంకొండ వరకు, బెల్లంకొండ నుండి కొండవీడు వరకు వచ్చిపోయే మార్గమధ్యలో నమాజు సమయమగు ప్రాంతమున మసీదు కట్టించెను. దీనిని కొమెరిఖాను అతనికి అప్పగించి కొమెరపూడి అను గ్రామమును ఏర్పాటు చేసినట్లు తెలియుచున్నది. నాటి మసీదు నేటికిని కలదు.

లక్కరాజు గార్లపాడు ప్రాచీన చరిత్రకు సాక్షీభూతం. క్రీశ 10వ శతాబ్దమునాటి వీరశైవ, వీరవైష్ణవ బౌద్ధ, జైన మతముల విద్వేషములకు గురైన గ్రామము. ఇందు ప్రాచీన దేవాలయములు ధ్వంసమై మూల విగ్రహములు, బావుల్లో, చెరువుల్లో దర్శనమిస్తాయి. జైన బసాదులను వేటాడి పొట్టలు చీల్చిన ఘటనలు కన్పిస్తాయి. గార్లపాటి లక్కరాజు గారిపేర లక్కరాజుగార్లపాడు పురు ప్రిసిద్ధమైనది. గార్లపాటి రామలింగయ్య తెనాలి మేనమామ చెంత జేరి తెనాలి రామకృష్ణునిగా మారినాడు. అతని పుట్టినిల్లుని ఇప్పటికిను చూపుచుందురు. రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుకుని ఇష్టులైన రాజోద్యోగులు గార్లపాటి యందుంట వలన పెండ్లి పబ్బాలకు వచ్చేవారట.

తెలుగువారి సాంస్కృతి చిహ్నములు, కట్టుబొట్టు వ్యవహారములు, పల్నాటి ముఖద్వారము గానున్న సత్తెనపల్లి పల్నాటి వారి పౌరుషములతో పాటు గుంటూరు సీమసొకు మార్యమును పొంది పుచ్చుకున్నది. కష్టించి పనిచేసే తత్వముతో పాటు స్వాతంత్ర్య సమరాన దూకిన యోధనాయోధులు జన్మించిన నేల సత్తెనపల్లి దివ్యసీమ.

# ఓటమి ఎరుగని నేత కొత్త రఘురామయ్య

(ఆన్‌లైన్-గుంటూరు)

పరాజయం ఎరుగని రాజకీయ జీవితం కొత్త రఘురామయ్యది. 1952లో రాజకీయ జీవితం ప్రారంభించడానికి మునుపు ఆయన హరిజన సేవక్ సమాజ్ కార్యదర్శిగా వుండేవారు. 1952లో తెనాలి పార్లమెంటరీ నియోజకవర్గం నుంచి ఆయన తొలిసారిగా ఎన్నికయ్యారు. అప్పట్లో కాంగ్రెస్ టిక్కెట్‌పై పోటీ చేసినవారంతా ఓడిపోగా రఘురామయ్య ఒక్కరే తెనాలి నుంచి గెలుపొందారు. ఎన్నో పదవులను అలంకరించి ఆయన వాటికి వన్నెతెచ్చారు. లోక్‌సభలో ఒకసారి తాను ప్రసంగిస్తానని పట్టుబట్టగా కొత్త కనుక అప్పుడే మాట్లాడటం ఏమిటని మాజీ ప్రధాని స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ అనుమతించలేదు. అయితే తనను మాట్లాడనీయకుండా రాజీనామా చేయడానికైనా అంగీకరించాలని రఘురామయ్య పట్టుబట్టడంతో నెహ్రూకు ఆయన మాట్లాడే అవకాశం ఇవ్వక తప్పింది కాదు. రఘురామయ్య పార్లమెంటులో చేసిన తొలి ప్రసంగమే ఆయన రాజకీయ భవిష్యత్తుకు చక్కని పునాది వేసింది. నెహ్రూనుంచి ప్రశంసలు పొందిన రఘురామయ్య తరువాత ఎన్నో పదవుల్లో కొనసాగారు. కేంద్రంలో పలు మంత్రిత్వశాఖలను సమర్థవంతంగా నిర్వహించారు. అన్నిటికంటే పార్లమెంటరీ వ్యవహారాల మంత్రిగా ఆయన ప్రతిభ అందరి ప్రశంసలు చూరగొంది. కాంగ్రెస్ చీలిక సమయంలో రఘురామయ్య గొప్ప పాత్ర నిర్వహించారు.

1952లో తెనాలి నుంచి, 1957,1962, 1967, 1977లలో గుంటూరు నుంచి వరుసగా ఐదు పర్యాయాలు లోక్‌సభకు ఎన్నికయ్యారు.


కొత్త రఘురామయ్య

ఉన్నత సాంప్రదాయం కలిగిన కుటుంబంలో 1912 ఆగస్టు 6న సంగంజాగర్లమూడిలో రఘురామయ్య జన్మించారు. ఆయన 1979 జూన్ 5వ తేదీన మృతిచెందారు. గుంటూరు పార్లమెంటు సభ్యునిగా, కేంద్ర వాణిజ్య మంత్రిత్వశాఖ మంత్రిగా పనిచేసిన రఘురామయ్య హయాంలోనే గుంటూరులో పొగాకు బోర్డును స్థాపించారు. పొగాకు రైతులకు ఆయన ఎంతో మేలు చేశారు. సుమారు మూడు దశాబ్దాలు కేంద్ర రాజకీయాల్లో కొత్త రఘురామయ్య కీలకపాత్ర వహించారు. అపజయం ఎరుగని రఘురామయ్య రాజకీయ జీవితం నేటి తరాలకు ఆదర్శనీయం. ఆయన హయాంలో గుంటూరులో పియఫ్ కార్యాలయాన్ని ఏర్పాటుచేశారు. గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి ఆయన ఎంతో ప్రాధాన్యత ఇచ్చారు. రైతు సమస్యలను పార్లమెంటులో ప్రస్తావించి రైతు పక్షపాతిగా పేరు తెచ్చుకున్నారు. పొగాకు రైతుల సమస్యలను, అంతర్జాతీయ స్థాయిలో పొగాకు రంగంలో వస్తున్న మార్పులకు అనుగుణంగా ఆ పరిశ్రమను దేశంలో అభివృద్ధి చేయడానికి రఘురామయ్య కృషి చేశారు.

# ఘనచరిత్ర కలిగిన జిల్లా వైద్యరంగం

(ఆన్‌లైన్, గుంటూరు)

వందేళ్లు పూర్తిచేసుకుని శతాబ్ది ఉత్సవాలుజరుపుకుంటున్న గుంటూరు జిల్లాకు ఘనమైన వైద్య చరిత్ర వుంది. వందేళ్లకు పైగా జిల్లా వాసులకు వైద్య సేవలందిస్తున్న వైద్యసేవలతోపాటు ప్రపంచ వ్యాప్తంగా పేరుగాంచిన గుంటూరు మెడికల్ కళాశాల జిల్లా వైద్య రంగానికే తలమానికంగా నిలుస్తుంది. ఒక్క గుంటూరు జిల్లా ప్రజలకే గాకుండా కోస్తా జిల్లాల ప్రజలకు చక్కటి వైద్యసేవలందిస్తున్న గుంటూరు ప్రభుత్వ సమగ్ర ఆస్పత్రి రోగుల సేవలో పునీతమవుతోంది. ప్రభుత్వ పరంగా గుంటూరు వైద్య బోధనా ఆస్పత్రితోపాటు వైద్య, ఆరోగ్య శాఖ పరిధిలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, నగర ఆరోగ్య కేంద్రాలు, ఎపి వైద్య విధాన పరిషత్ జిల్లా ఆస్పత్రులు, ఏరియా ఆస్పత్రులు పేద ప్రజలకు ఉచితంగా వైద్య సేవలు అందిస్తున్నాయి. వీటికి చేదోడు వాదోడుగా ఆయుర్వేదం, హోమియో, యునాని ఆస్పత్రులు ప్రజానీకానికి తమ వంతు వైద్య సేవలు అందిస్తున్నాయి. ప్రభుత్వ వైద్య రంగానికి ధీటుగా ప్రైవేటు వైద్యరంగం జిల్లాలో విస్తరించింది. జిల్లా కేంద్రం గుంటూరులో ఉన్నత ప్రమాణాలుపాటిస్తూ పలు కార్పొరేట్ ఆస్పత్రులు, వైద్య శాలలు ప్రజలకు చక్కటి వైద్య సేవలను అందిస్తూ జిల్లాను హెల్త్ క్యాపిటల్‌గా మార్చాయి. నిష్ణాతులైన అనేకమంది సూపర్ స్పెషాలిటీ వైద్యులు అత్యంత నైపుణ్యంతో వైద్యసేవలందిస్తూ ప్రజల ఆదరాభిమానాలను చూరగొంటున్నారు. వందేళ్ల క్రితమే గుంటూరు పట్టణంలో అన్నాసారా కుగ్లర్ ప్రజలకు వైద్య సేవలు అందించేందుకు కుగ్లర్ ఆస్పత్రిని ఏర్పాటుచేశారు. అనంతరం కొద్దికాలంలోనే క్రిస్టియన్ నన్స్ సెయింట్ జోసఫ్స్ జనరల్ ఆస్పత్రిని ప్రారంభించారు. అప్పటి నుంచి ఇవి గుంటూరు జిల్లా ప్రజలకు చక్కటి వైద్యసేవలను అందిస్తూ వచ్చాయి. కుగ్లర్ ఆస్పత్రి సేవలు ఇటీవల కొంత స్తంభించగా, సెయింట్ జోసఫ్స్ ఆస్పత్రి మాత్రం అవిశ్రాంతంగా ప్రజలకు వైద్య సేవలు అందిస్తూ పునీతమవుతోంది. గత ఏడాది ఈ ఆస్పత్రి శతాబ్ది వేడుకలు జరుపుకోవడం విశేషం.

స్వాతంత్ర్యానికి పూర్వమే ఏర్పాటుచేసిన గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి, వైద్య కళాశాలలు జిల్లాకే తలమానికంగా నిలుస్తున్నాయి. గుంటూరుప్రభుత్వ ఆస్పత్రి కోస్తాఆంధ్రా జిల్లాల ప్రజలకు పెద్ద దిక్కుగా ఆదుకొంటోంది. 1177 పడకలుగల ఈ ఆస్పత్రి ప్రతినిత్యం వేలాదిమంది రోగులకు వైద్య సేవలు అందిస్తూ పేద ప్రజల కార్పొరేట్ ఆస్పత్రిగా పేరుగాంచింది. ఎందరో నిష్ణాతులైన వైద్యులు ఈ ఆస్పత్రిలోపనిచేసి ప్రజల ఆదరాభిమానాలను పొందారు. యూరాలజీ, కార్డియాలజీ, ప్లాస్టిక్ సర్జరీ, న్యూరాలజీ, కార్డియో థొరాసిక్ సర్జరీ, న్యూరో సర్జరీ, పీడియాట్రిక్ సర్జరీ వంటి సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలతోపాటు అన్ని రకాల సాధారణ వైద్యసేవలు గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రిలోఅందుబాటులోవున్నాయి. జిల్లాలో జరిగే రోడ్డు ప్రమాదాలు, ఎం ఎల్ సి కేసులలో చికిత్సకు గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రే పెద్దదిక్కు. ఏటా ఆరు వేల మందికి పైగా ప్రసూతి వైద్య సేవలందించే గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి గైనకాలజీ విభాగం రాష్ట్రంలోనే **(మిగతా 22వ పేజీలో)**




గుంటూరు ప్రభుత్వసమగ్ర ఆస్పత్రి

(21వ పేజీ తరువాయి)

ప్రత్యేకతను సంతరించుకుంది. పలు జిల్లాల నుంచి క్లిష్టపరిస్థితుల్లో వున్నకేసులను ఈ విభాగానికి పంపడం, ఇక్కడి వైద్యులు అత్యంత నైపుణ్యంగా వైద్య సేవలందించి సుఖ ప్రసవం చేస్తున్నారు. కోస్తా ఆంధ్రాలో ఐదారు జిల్లాల నుంచి ప్రతినిత్యం హృద్రోగ రోగులు గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రికి రావడం సాధారణమైపోయింది. ఇక్కడి వైద్యులు వారికి తగిన చికిత్స అందించి మెరుగైన వైద్య సేవలకు నిమ్స్‌కు రిఫర్‌చేస్తున్నారు. పెద్దగా ప్రచారానికి నోచుకోకపోయినా రోగులకు అత్యంత నైపుణ్యంతో వైద్య సేవలు అందిస్తూవారి ప్రాణాలను రక్షిస్తున్న ఘనత ఆస్పత్రి న్యూరో సర్జరీ విభాగం వైద్యులకే దక్కుతుంది. కొట్లాటల్లో, ప్రమాదాల్లో తలకు తీవ్రగాయాలై ప్రాణాపాయస్థితిలో ఇక్కడికి వచ్చేరోగులకు న్యూరోసర్జన్లు శ్రమించి చక్కటి శస్త్ర చికిత్సలు చేసి రోగుల ప్రాణాలను కాపాడుతున్నారు. అదేవిధంగా యూరాలజీ, ప్లాస్టిక్‌సర్జరీ, కార్డియో థొరాసిక్ సర్జరీ వంటి సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలు కూడా ఇక్కడ అందుబాటులోవున్నాయి.

1960వ దశకంలో కోస్తా జిల్లాలలోనే ఆర్థోపెడిక్ రంగంలో అగ్రగామిగా పేరు పొందిన డాక్టర్ యతిరాజులు గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రి ఆర్థోపెడిక్ విభాగాధిపతిగా పనిచేసి గుంటూరు జిల్లాకే ప్రత్యేకతను సంతరించిపెట్టారు. సాంకేతిక పరిజ్ఞానం అంతగా అందుబాటులోలేని రోజుల్లోనే డాక్టర్ యతిరాజులు ఎన్నో క్లిష్టమైన ఆర్థోపెడిక్ శస్త్రచికిత్సలను విజయవంతంగాచేసి ప్రసిద్ధులయ్యారు. అనంతరం కార్డియాలజీ విభాగాన్ని మొట్టమొదటి సారిగా గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రిలో ప్రవేశపెట్టినఘనత మాజీ సూపరింటెండెంట్ డాక్టర్ కె.లక్ష్మణరావుకు దక్కుతుంది. అప్పట్లో ఆయన ప్రత్యేకంగా ఇంగ్లాండ్‌లోకార్డియాలజీ విభాగంలో ప్రత్యేక శిక్షణ పొంది ఇక్కడ కార్డియాలజీ విభాగాన్ని ప్రారంభించేందుకు ఆద్యులయ్యారు. జాతీయస్థాయిలో పేరు ప్రఖ్యాతులు పొందిన డాక్టర్‌నాయుడమ్మ పీడియాట్రిక్ సర్జరీ విభాగానికి నేతృత్వం వహిస్తూ ఎందరోశిశువులకు ప్రాణదానం చేస్తున్నారు. రాష్ట్రంలోనే శిశు శస్త్ర చికిత్సా విభాగంలో గుంటూరు ప్రభుత్వాస్పత్రి పీడియాట్రిక్ సర్జరీ విభాగం పేరు ప్రతిష్టలుపొందింది.


గుంటూరు మెడికల్ కళాశాల

వైద్య విద్య అభ్యసించే అభ్యర్థులు గుంటూరు మెడికల్‌కళాశాలలో చదవడం అదృష్టంగా భావిస్తారు. రాష్ట్రంలోనేగాక జాతీయ స్థాయిలో ఈ కళాశాలకు అద్భుత పేరు ప్రతిష్టలు వున్నాయి. ఎందరో నిష్ణాతులైన వైద్యులను తీర్చిదిద్దిన ఘనత ఈ కళాశాలకు దక్కుతుంది. ఈ కళాశాలలోవైద్య విద్యనభ్యసించి డాక్టర్లుగా స్థిరపడి అనంతరం రాజకీయ రంగంలో రాణించిన వారెందరో వున్నారు.

డాక్టర్ కోడెల శివప్రసాదరావు, డాక్టర్ మాకినేని పెదరత్తయ్య, డాక్టర్ అరుణ తదితరులు రాష్ట్ర క్యాబినెట్‌లో మంత్రులుగా పనిచేశారు. డాక్టర్ కొల్లి శారద గుంటూరు నగర ప్రథమమేయర్‌గా ఎన్నికయ్యారు. డాక్టర్ కె.అంజిరెడ్డి రాష్ట్రవైద్య ఆరోగ్య సేవల డైరెక్టర్ జనరల్‌గా పనిచేశారు. ఐ ఎ ఎస్ అధికారిగా పనిచేసి ప్రస్తుతం లోక్‌సత్తా జాతీయ సమన్వయకర్తగా వ్యవహరిస్తున్న డాక్టర్ జయప్రకాష్‌నారాయణ్ ఈ కళాశాల విద్యాకుసుమమే. కేంద్ర రైల్వేశాఖలో వైద్య, ఆరోగ్య సేవల డైరెక్టర్ జనరల్‌గా పనిచేసిన డాక్టర్ సురేష్ గుంటూరు మెడికల్ కళాశాల పూర్వవిద్యార్థే. వరుసగా ముగ్గురు అవిభక్త కవలలను శస్త్రచికిత్స ద్వారా విజయవంతంగా వేరుచేసి జాతీయస్థాయిలో తెలుగువారి కీర్తి ప్రతిష్టలను ఇనుమడింపజేసిన డాక్టర్ నాయుడమ్మ, పద్మశ్రీ అవార్డు గ్రహీత, ప్రముఖ వైద్యులు డాక్టర్ ప్రసాదరావులు ఈ కళాశాల విద్యార్థులే. ఆర్థోపెడిక్ రంగంలో అత్యంత అరుదైన, ప్రతిష్టాత్మకమైన డాక్టర్ వ్యాఘ్రేశ్వరరావు గోల్డ్‌మెడల్‌ను ఏకంగా ఐదుసార్లు కైవశం చేసుకున్న డాక్టర్ ఎస్ అమర్‌నాథ్ గుంటూరు మెడికల్ కళాశాలలోనే వైద్య విద్యనభ్యసించారు. హైదరాబాద్‌లోని పలుకార్పొరేట్ ఆస్పత్రులలోనిపుణులైన వైద్యులుగాపనిచేస్తున్న పలువురు డాక్టర్లు గుంటూరు మెడికల్ కళాశాలకు చెందిన వారు కావడం విశేషం. గుంటూరు వైద్య కళాశాలలోవైద్య విద్యనభ్యసించి ఉత్తర అమెరికాలో సుమారు రెండువేల మంది వైద్యులు ఎన్ ఆర్ ఐ లుగా స్థిరపడ్డారు. వీరు తమ మాతృ సంస్థకు సహాయ సహకారాలు అందజేస్తూజన్మభూమి రుణం తీర్చుకుంటున్నారు.

ప్రభుత్వ వైద్య రంగానికి ధీటుగా గుంటూరు నగరంలో ప్రైవేటు వైద్యసేవలు విస్తరించాయి. జిల్లా నుంచేగాక ఇతర జిల్లాల నుంచి కూడారోగులు గుంటూరు నగరానికి రావడం ఇక్కడి వైద్యుల నైపుణ్యాన్ని తెలియజేస్తుంది. కార్డియాలజీ, న్యూరాలజీ, న్యూరోసర్జరీ, ఆంకాలజీ తదితర సూపర్ స్పెషాలిటీ వైద్య సేవలకు గుంటూరునగరంలో పలు ప్రైవేటు వైద్య శాలలు పేరుగడించాయి.

ఇటీవల జాతీయరహదారిపై జరుగుతున్నప్రమాదాలను దృష్టిలోవుంచుకుని నగరంలో పలు ప్రైవేటుకార్పొరేట్ ఆస్పత్రులు 24 గంటలూ పనిచేసే ఎమర్జెన్సీ ట్రామా కేర్‌సెంటర్లను ప్రారంభించాయి. వీటిలో పాలి ట్రామా కేసులతో పాటు హ్యాంగింగ్‌కేసులు, పురుగుమందులు సేవించి ఆత్మహత్యాయత్నానికి పాల్పడేకేసులకు మెరుగైన వైద్యసేవలు అందిస్తూ రోగుల ప్రాణాలనురక్షిస్తున్నారు. పలుసూపర్ స్పెషాలిటీ వైద్య విభాగాలలో ప్రత్యేకంగా ఇంటెన్సివ్ కేర్ యూనిట్లు ఏర్పాటుచేయడం రోగులపాలిట వరంగా మారుతోంది.

గతంలో ఇటువంటి వైద్య సేవలు అందుబాటులో లేక పలువురు క్షతగాత్రులు మృతిచెందేవారు. అయితే ఆధునికంగా అందుబాటులోకి వచ్చిన అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని అత్యాధునిక వైద్య పరికరాలను సమకూర్చుకుని ప్రైవేటు వైద్య రంగం రోగుల సేవల్లో తనవంతు పాత్రను పోషిస్తోంది.

## విద్యాభివృద్ధికి కృషి చేస్తున్న

# 'లయోలా'

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

సత్తెనపల్లి పరిధిలో గ్రామీణ ప్రాంత విద్యార్థుల సాంకేతిక విద్యాభివృద్ధికి దూళ్ళిపాళ్ళ వద్ద ఉన్న లయోలా ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజి అండ్ మేనేజ్‌మెంట్ కళాశాల కృషిచేస్తోంది. కళాశాలలో ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్ ఇంజనీరింగ్ 120 సీట్లు, ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్ 90 సీట్లు, కంప్యూటర్ సైన్స్ అండ్ ఇంజనీరింగ్ 90 సీట్లు, ఇన్‌ఫర్‌మేషన్ టెక్నాలజి 60సీట్లు, మెకానికల్ ఇంజనీరింగ్‌లో 60 సీట్లు ఉన్నాయి. కళాశాలలో విద్యార్థులకు ఉత్తమమైన విద్యను అందించేందుకు సీనియర్ ప్రొఫెసర్స్‌ను నియమించారు. 2001లో ప్రారంభమైన ఈ కళాశాల దినాదినాభివృద్ధి చెందుతుంది. గ్రామీణ విద్యా వికాస లక్ష్యంతో కళాశాలను స్థాపించినట్లు నిర్వాహకులు తెలిపారు. క్రమశిక్షణాయుతమైన విద్యాబోధనతో అత్యుత్తమ ఫలితాలు సాధిస్తుంది. తల్లిదండ్రుల ఆశీస్సులు, ఉపాధ్యాయుల కృషి కారణంగానే తమ కళాశాల విద్యార్థులు ఉత్తమ ఫలితాలు సాధిస్తున్నారని కళాశాల నిర్వాహకులు తెలిపారు. చదువుతో పాటు సామాజిక అవగాహన కలిగించటంలో కూడా కళాశాల ముందుంది. కళాశాల విద్యార్థులు మూడు సంవత్సరాల నుంచి ఆటల పోటీలలో జె ఎన్‌టియుకు ఎంపికవుతూ వస్తున్నారు. కళాశాలలో డిజిటల్ లైబ్రరీని ఏర్పాటు చేస్తున్నారు.

# రెవెన్యూ డిపార్టుమెంట్ ఫోన్ నెంబర్ల వివరాలు

| హోదా | ఆఫీసు | రెసిడెన్స్ |
|---|---|---|
| కలెక్టర్ | 2234200 | 2234550 |
| జాయింట్ కలెక్టర్ | 2241475 | 2241797 |
| డిఆర్ఓ | 2234990 | 2234194 |
| ఆర్‌డిఓ(గుంటూరు) | 2240679 | -- |
| ఆర్‌డిఓ(తెనాలి) | 223800 | 224408 |
| ఆర్‌డిఓ (నరసరావుపేట) | 222039 | 222049 |
| జడ్‌పి ఛైర్మన్ | 2235831 | 242705 |
| జిల్లా ఫైర్ ఆఫీసు | 2234350 | -- |
| బిసి వెల్ఫేర్ ఆఫీసు | 2242512 | -- |
| సిపిఓ | 2241029 | 2354938 |
| డిఎస్ఓ | 2235477 | -- |
| డిఎఫ్ఓ (ఎస్ఎఫ్) | 2234519 | 2232447 |
| డిపిఓ | 2355817 | 2353158 |
| జిల్లా కోఆపరేటివ్ ఆఫీసర్ | 2234462 | 2326883 |
| డిఎం, హౌసింగ్ | 2241563 | 2355630 |
| డిప్యూటీ ట్రాన్స్‌పోర్టు కమిషనర్ | 2355194 | 2234623 |
| డిసి, ఎక్సైజ్ | 2233541 | -- |
| జిల్లా ట్రెజరీ ఆఫీసర్ | 2234257 | -- |
| జిల్లా విద్యాశాఖాధికారి | 2234793 | 2229882 |
| డిపిఆర్ఓ | 2231363 | -- |
| జిల్లా జడ్జి | 2234315 | -- |
| డిఎం అండ్ హెచ్ఓ | 2241518 | -- |
| డిసి, కమర్షియల్ ట్యాక్స్ | 2350966 | -- |
| ఎక్సైజ్ సూపరింటెండెంట్ | 2233576 | -- |
| గుంటూరు గవర్నమెంటు హాస్పటల్ | 2220035 | -- |
| జెడి, వ్యవసాయ శాఖ | 2234308 | 2350805 |
| పిడి, డిఆర్‌డిఎ | 2241754 | 2241800 |
| పిడి, వెలుగు | 2223358 | -- |
| పిడి, ఉమెన్ వెల్ఫేర్ | 2234159 | |
| ఆర్‌టిసి ఆర్ఎం | 2221525 | 2234853 |
| రిజిస్ట్రేషన్ | 2232591 | -- |
| ఎస్ఇ ఎలక్ట్రిసిటీ | 2241095 | -- |
| ఎస్ఇ, ఇరిగేషన్ | 2234554 | 2234553 |
| ఎస్ఇ, పబ్లిక్ హెల్త్ | 2320818 | 2230977 |

## జిల్లాలోని ఎంపిడిఓలు, ఎమ్మార్వోలు

| ఊరు | ఎంపిడిఓ ఆఫీసు | ఎమ్మార్వో ఆఫీసు |
|---|---|---|
| అమరావతి | 255275 | 255310 |
| అమృతలూరు | 255231 | 265237 |
| అచ్చంపేట | 246051 | 246021 |
| బాపట్ల | 224126 | 224087 |
| బెల్లంకొండ | 238732 | 238738 |
| భట్టిప్రోలు | 248291 | 248276 |
| బొల్లాపల్లి | 278155 | 278188 |
| చేబ్రోలు | 254270 | 254268 |
| చెరుకుపల్లి | 247277 | 247250 |
| చిలకలూరిపేట | 254704 | 254588 |
| దాచేపల్లి | 257725 | 257723 |
| దుగ్గిరాల | 277273 | 277227 |
| దుర్గి | 256837 | 278821 |
| యడ్లపాడు | 276667 | 276629 |
| గుంటూరు | 223458 | 2230653 |
| గురజాల | 248421 | 258436 |
| ఈపూరు | 258321 | 258324 |
| కాకుమాను | 279921 | 279924 |
| కారంపూడి | 272229 | 272262 |
| కర్లపాలెం | 272261 | 226270 |
| కొల్లిపర | 244277 | 264236 |
| కొల్లూరు | 243252 | 243221 |
| క్రోసూరు | 227140 | 227183 |
| మాచవరం | 242231 | 257252 |
| మాచర్ల | 222046 | 272040 |
| మంగళగిరి | 232258 | 232201 |
| మేడికొండూరు | 239235 | 239226 |
| ముప్పాళ్ళ | 242435 | 242429 |
| నాదెండ్ల | 274124 | 276642 |
| నగరం | 256740 | 276734 |
| నరసరావుపేట | 222052 | 222068 |
| నకరికల్లు | 241238 | 241232 |
| నిజాంపట్నం | 257642 | 257535 |
| నూజెండ్ల | 244115 | -- |
| పెదకాకాని | 2556130 | 2556169 |
| పెదకూరపాడు | 247532 | 247558 |
| పెదనందిపాడు | 247532 | 247558 |
| ఫిరంగిపురం | 257221 | 257241 |
| పిట్టలవానిపాలెం | 258742 | 258735 |
| పిడుగురాళ్ళ | 252038 | 252138 |
| పొన్నూరు | 242048 | 242090 |
| ప్రత్తిపాడు | 2280237 | 2280262 |
| రాజుపాలెం | 238725 | 238734 |
| రెంటచింతల | 258470 | 278436 |
| రేపల్లె | 222011 | 222097 |
| రొంపిచర్ల | 248247 | 268235 |
| సత్తెనపల్లి | 232176 | 232037 |
| శావల్యాపురం | 259028 | 259029 |
| తాడేపల్లి | 272842 | -- |
| తాడికొండ | 256228 | 256242 |
| తెనాలి | 228582 | 227712 |
| తుళ్ళూరు | 244440 | 244446 |
| చుండూరు | 276232 | 276236 |
| వట్టిచెరుకూరు | 2285245 | 2285243 |
| వెల్దుర్తి | 278620 | 278634 |
| వేమూరు | 246260 | 266249 |
| వినుకొండ | 272035 | 272044 |

## ఎమ్మెల్యేల ఫోన్ నెంబర్లు

| | |
|---|---|
| మోపిదేవి వెంకటరమణ | 257722 |
| దేవినేని మల్లిఖార్జునరావు | 2256869 |
| సతీష్‌పాల్‌రాజ్ | 3602432 |
| గుదిబండి వెంకటరెడ్డి | 244242 |
| నాదెండ్ల మనోహర్ | 9849000006 |
| ధూళిపాళ్ళ నరేంద్రకుమార్ | 242113 |
| గాదె వెంకటరెడ్డి | 23233913 |
| రావి వెంకటరమణ | 2210742 |
| షేక్ నంబూరు సుభాని | 2356170 |
| తాడిశెట్టి వెంకట్రావు | 2235520 |
| మురుగుడు హనుమంతరావు | 231234 |
| డొక్కా మాణిక్యవరప్రసాద్ | 27004821 |
| యర్రం వెంకటేశ్వరరెడ్డి | 23810312 |
| కన్నా లక్ష్మీనారాయణ | 2202784 |
| జంగా కృష్ణమూర్తి | 256000 |
| పిన్నెల్లి లక్ష్మారెడ్డి | 222205 |
| మక్కెన మల్లిఖార్జునరావు | 272364 |
| కాసు వెంకట కృష్ణారెడ్డి | 230014 |
| మర్రి రాజశేఖర్ | 254583 |

# కళామతల్లి సత్తెనపల్లి

(ఆన్‌లైన్, సత్తెనపల్లి)

సత్తెనపల్లికి ఆపేరు ఎలా వచ్చినది? ఇదిచాలా ఉత్సాహం కలిగించే విషయం. దీనికి సంబంధించి విభిన్న కథనాలు ప్రచారంలో ఉన్నాయి. సాతానుల నివాస కేంద్రం కనుక 'సాతానుపల్లి' పేరుతో రాను రాను సత్తెనపల్లిగా మారిందని కొందరంటారు. 'సత్తెన్న' అను వడియరాజు పరిపాలించిన ప్రాంతం కనుక 'సత్తెనపల్లి' రాను రాను సత్తెనపల్లిగా మారిందని అంటుంటారు. ముఖ్యంగా సత్తెనపల్లి పాత తాలూకా ఇటుకొండ వీడు, అటు అమరావతి ప్రాంతానికి పశ్చిమంగా అచ్చంపేట, క్రోసూరు కృష్ణా తీరం వెంట గ్రామాలు కూడా దీనిలో ఉండేవి. చరిత్రలో ప్రసిద్ధి చెందిన స్థలాలుగా కొండవీడు, అమరావతి ధరణికోట, బెల్లంకొండ, సత్తెనపల్లిగా చెప్పుకోవచ్చు. అమరలింగేశ్వరస్వామి దేవాలయం, బౌద్ధమత ప్రచార స్థూపాలు, నందులరేవు, శ్వాతశృంగాచలం, సత్తెమ్మతల్లి దేవాలయం, నీలకంఠేశ్వరస్వామి (నీలేశ్వర పాలెం), రామలింగేశ్వరస్వామి (వేల్పూరు), ఓర్వకల్లు (గంగమ్మ), చిగురుపాడు ఆంజనేయస్వామి దేవాలయాలు పురాతనమైనవిగా ప్రసిద్ధి చెందాయి. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన 'కోహినూర్' ఇక్కడికి సమీపంలోని కోళ్ళూరులో లభించిందని చెబుతుంటారు. నాగార్జునసాగర్ నీరు వినియోగంలోకి రాకముందు ఇది మెట్టప్రాంతం. అపరాలు పండించేవారు. జొన్న,మిర్చి, పొగాకు, శనగపంటలుండేవి. నీటి వసతి ఏర్పడ్డాక వరి, పత్తి, మిర్చి, పసుపు,అపరాలు వంటి వాణిజ్యపంటలు విస్తారంగా పండిస్తున్నారు. రాజకీయ పోరాటాలు సాగాయి. స్వాతంత్ర్య పోరాటంలో ఇక్కడి నుండి యోధులు పాల్గొన్నారు. సంస్కరణోద్యమకారులు న్నారు. సత్తెనపల్లి నియోజకవర్గంలోని ముప్పాళ్ళ గ్రామంలో జన్మించిన భవనం వెంకట్రామ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవి నిర్వహించారు. గోపాలకృష్ణయ్య, ఆమంచి నరసింహారావు లాంటి ప్రముఖులు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. వావిలాల గోపాలకృష్ణయ్య ఆజన్మ బ్రహ్మచారి గానే కాక ప్రముఖ రాజకీయ వేత్తగా కూడా గుర్తింపు పొందారు. వావిలాల గోపాలకృష్ణయ్య సత్తెనపల్లికి నాలుగుసార్లు శాసనసభ్యునిగా ఎన్నికయ్యారు. ఆయన మరణాంతరం ఆయన మృతికి గుర్తుగా పట్టణంలోని 3వవార్డులో వావిలాల ఘాట్‌ను ఏర్పాటు చేశారు. అక్కడ పార్కును ఏర్పాటు చేయాలని ప్రతిపాదనలు ఉన్నాయి. కట్టమూరి ఉదయలక్ష్మి భారీ విరాళంతో సత్తెనపల్లి బాలికోన్నత పాఠశాల ఏర్పడింది. నాగార్జునసాగర్‌ను నిర్మించాలని రైతు ఉద్యమాలు నడిచాయి. తెలంగాణా సాయుధ పోరాటయోధులు ఇక్కడ ప్రజా ఉద్యమాలు నిర్మించారు. ముఖ్యంగా వెంకటపతి రైతు, పేద ప్రజలకు అండగా నిలిచారు. విద్యా, పారిశ్రామిక రంగాలలో వెనుక బాటుతనానికి స్వస్తి చెప్పి అభివృద్ధి పథాన నడిచేందుకు ప్రస్తుతం కృషి జరుగుతున్నది. రెండు ఇంజనీరింగ్ కళశాలలు, మూడు డిగ్రీ కళాశాలలు రెండు జూనియర్ కళాశాలలు అంతు బాటులోకి వచ్చాయి. ఏటుకూరి వెంకటనరసయ్య (పెదకూరపాడు) రచించిన క్షేత్రలక్ష్మి, పలనాటి వీరచరిత్ర 'మగువమాంచాల' ప్రజాదరణ పొందాయి. మాటలు, కథా రచయిత కొండవీటి వెంకటకవి (విప్పర్ల) ఈ ప్రాంతం వారే. వాపస్ వంటి అద్భుత నాటకాలను రచించి దాదాపు వంద చిత్రాలకు కథ, మాటలు అందించిన డివి నరసరాజు కూడా సత్తెనపల్లి వారే. ఆధునిక నాటకరంగ వైతాళికంతో నాటక రచయితగా పేరొందిన గోళ్ళపాటి నాగేశ్వరరావు సత్తెనపల్లి వాడే. నటులుగా సినీ ప్రపంచంలో హాస్యబ్రహ్మగా పేరొందిన బ్రహ్మానందం సత్తెనపల్లి వాడే. అలాగే సినీ గేయాలాపనతో ఉర్రూతలూగించిన నాగూర్ బాబు (మనో) ఇక్కడి వాడే. సాంస్కృతిక పరంగా సత్తెనపల్లికి రాష్ట్ర స్థాయిలో గుర్తింపు తెచ్చినవారిలో ప్రత్తి జగన్నాథం ఒకరు. రాష్ట్ర స్థాయిలో 26 సంవత్సరాలుగా పరిషత్ పోటీలను నిర్వహిస్తున్న స్థానిక ప్రగతి కళామండలిని ప్రత్తి జగన్నాథరావు తదితరులు స్థాపించారు. చిత్రకళలో వర్ణచిత్రాలు, ప్రకృతి చిత్రాలు, దేవతమూర్తి చిత్రాల చిత్రకారుడు జింకారామారావు స్థానిక వాసి. పూర్వం నుంచి సత్తెనపల్లి ప్రాంతం లలితకళల పోషణకు ప్రసిద్ధిచెందింది. చదువులేని కారణంగా మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలను గుర్తించి వారికి చిన్నతనంలోనే బాలురుతో పాటు బాలికలకు కూడా విద్యను అందించాలని గుర్తించి అందుకోసం జీవితాంతం కృషిచేసిన వ్యక్తి త్రిపురనేని సాధువమ్మ. సత్తెనపల్లిలో జన్మించిన ఈమె ఆడపిల్లలకు చదువెందుకు అని ప్రశ్నించిన రోజులలోనే పల్లెపల్లెకు తిరిగి ఆడపిల్లలను విద్యావంతులను చేశారు. ఆడపిల్లల కోసం ప్రత్యేక స్కూల్‌ను, వసతి గృహాన్ని నిర్మించారు. మాదల వెంకట్రాయుడు భారతశాస్త్ర నిపుణుడుగా చరిత్రకెక్కారు. గుడిపూడి గ్రామంలో లలిత కళాసమితి నాటక, సంగీత రంగాల్లో కొంత మేర కృషిచేశాయి. ప్రస్తుతం పి ఎస్ ఎన్ కళావేదిక ప్రజలకు కళారూపాలు అందుబాటులోకి తెచ్చింది. ఇలా రాజకీయ, సాంస్కృతిక కళారంగాల్లో సత్తెనపల్లి ప్రాంతం జిల్లాలోను మకుటాయమానంగా వెలుగొందుతోంది.



వావిలాల గోపాలకృష్ణయ్య ఘాట్

# రైతు సేవలో గుంటూరు మార్కెట్ యార్డు



డా॥ వైఎస్ రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణాశాఖామంత్రివర్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి



శ్రీ బొత్స సత్యనారాయణ
రాష్ట్ర మార్కెటింగ్ శాఖా మంత్రి



శ్రీమతి జయలక్ష్మి I.A.S.
జిల్లా కలెక్టర్, గుంటూరు.

- ✶ ఆసియా ఖండములోనే పేరెన్నికగన్న గుంటూరు మార్కెట్ యార్డ్ రైతుల సంక్షేమానికి పెద్దపీట వేస్తుంది.
- ✶ రైతుబంధు పథకం అమలు చేస్తున్నాము.
- ✶ రైతులకు 5 నుంచి 10 శాతానికి తమ సరుకుకు రుణాలు ఇస్తున్నాము.
- ✶ ఒక్కొక్క రైతుకు కనీసం రూ.75000లోపు ఋణాలు అందచేస్తాము.
- ✶ ఆధునిక వ్యవసాయ పద్ధతులు తెలియజేయడం కోసం వ్యవసాయ శాస్త్రవేత్తల ద్వారా రైతులకు శిక్షణా తరగతులు నిర్వహిస్తున్నాము.
- ✶ ప్రోగ్రెసివ్ ఫార్మర్స్ ఫెడరేషన్ సంస్థ ఆధ్వర్యంలో పుల్లడిగుంట గ్రామాన్ని దత్తత తీసుకున్నాము.
- ✶ కోఆర్డినేటర్ ద్వారా వ్యవసాయ రంగంలో రైతులకు మెళకువలు తెలియజేయుచున్నాము.
- ✶ పుల్లడిగుంట గ్రామాన్ని మోడల్‌గా తీసికొని 150 మంది రైతులకు వారికి కావలసిన ఎరువులు, పురుగుమందులను లాభాపేక్షతో కాకుండా సరఫరా చేశాము.
- ✶ తరువాత దశలలో ఈ కార్యక్రమాలు అన్ని గ్రామాలకు విస్తరిస్తాతయి.
- ✶ ప్రత్తిపాడు, వట్టిచెరుకూరు, గుంటూరు రూరల్, పెదకాకాని మండలాల రైతులకు కావలసిన ఎరువులు, పురుగు మందులను సరఫరా చేస్తాము.
- ✶ రైతులు, రైతుబంధు పథకాన్ని ఉపయోగించుకోవడం కోసం అవగాహన కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తున్నాము.
- ✶ మార్కెట్ యార్డ్ ఆదాయాన్ని 9.00 నుండి గతంలో సుమారు 13.50 కోట్లు ఉండేది. ఇప్పుడు అది 15 కోట్లకు పెరిగేందుకు చర్యలు తీసుకొనబడుచున్నవి.
- ✶ రైతుల వద్ద వసూలు చేసే మార్కెట్ ఛార్జీలను నియంత్రించాము.
- ✶ గతంలో టిక్కీకి రూ.15 నుండి రూ.17 వరకు ఉన్న ఛార్జీలను రూ. 7.50 లకు తగ్గించాము.
- ✶ దీనిని నియంత్రించడానికి 24 గంటలు నిఘాను ఏర్పాటు చేశాము.
- ✶ దీని కోసం ఫిర్యాదు విభాగాన్ని కూడా ఏర్పాటు చేశాము.
- ✶ స్పైసెస్ బోర్డు ద్వారా సబ్సిడీపైన రైతులకు టార్పాలిన్ పట్టాలను సరఫరా చేస్తున్నాము.
- ✶ రైతుల సంక్షేమం కోసం వైద్య, ఆరోగ్య శిబిరాలను ఏర్పాటు చేస్తున్నాము.
- ✶ పశువుల వైద్య శిబిరాలను నిర్వహించి పాడి పరిశ్రమను పెంపొందించడానికి రైతులకు కావలసిన సహాయ సహకారాలను అందచేస్తున్నాము.
- ✶ కాటాలలో జరిగే మోసాలను నివారించడం కోసం ఈ సంవత్సరం యార్డు మొత్తంలో ఎలక్ట్రానిక్ కాటాలను ఏర్పాటు చేశాము.
- ✶ యార్డ్‌కు తెచ్చిన సరుకునకు ఉద్యోగులు, వ్యాపారుల సమక్షంలోనే రైతుల అంగీకారంతో ధరను నిర్ణయిస్తున్నాము.
- ✶ దిగుమతులు, ఎగుమతుల వివరాలను రైతులు తెలుసుకోవడం కోసం యార్డును కంప్యూటరైజేషన్ చేయబోవుచున్నాము.
- ✶ రైతుల సమక్షంలోనే కాటాలు వేస్తున్నాము.
- ✶ రైతు బంధు పథకాన్ని అమలు చేయడానికి నిధుల కొరత లేదు. రాబోయే సీజన్‌లో ఎక్కువ కోల్డ్ స్టోరేజీలు అద్దెకు తీసుకుని రైతుల సరుకులు నిల్వచేసుకొనే అవకాశాన్ని కల్పిస్తున్నాము.
- ✶ ఉద్యానవన శాఖ ద్వారా చిల్లీ డ్రైయర్స్‌ను అందిస్తున్నాము.
- ✶ రైతులు మిర్చిని ఆరబెట్టుకోవటం కోసం ప్లాట్‌ఫారాలు నిర్మించుకోవడానికి సబ్సిడీలు అందచేస్తున్నాము.
- ✶ రైతులు పండించే మిర్చి ఎగుమతులకు తగిన విధంగా వుండటానికి సెమినార్లు నిర్వహిస్తున్నాము.
- ✶ మిర్చి అమ్మకాలలో ఏదైనా ఇబ్బందులు వస్తే 24 గంటలలో సమస్యను పరిష్కరిస్తున్నాము.
- ✶ యార్డ్ ఆవరణలో సిబ్బంది ఎవరైనా అవకతవకలకు పాల్పడినా, రైతులకు ఏ సమస్యలు వచ్చినా అధికారుల దృష్టికి తెస్తే వెంటనే పరిష్కరిస్తాము.
- ✶ గుంటూరు మార్కెట్ యార్డ్‌లో మీకు ఏ సమాచారం కావాలన్నా 0863-2233699, 2232847 అనే ఫోన్ నంబర్లకు ఫోన్ చేసి సలహాలను పొందవచ్చును.
- ✶ యార్డులో 2005-06లో 438 మంది రైతులకు ఒక కోటి 69 లక్షల, 53 వేల రూపాయలు రైతు బంధు పథకం క్రింద తక్కువ వడ్డీకి రైతులుకు రుణాలు ఇచ్చాం.
- ✶ రైతులకు ఈ సంవత్సరం తక్కువ రేటులో యార్డు ద్వారా యూరియా అందజేశాం.
- ✶ ఈ సంవత్సరం ఫిబ్రవరి నుండి యార్డులో 19 లక్షల టిక్కీలు అమ్మకం చేశాం.



**యం.శివరామయ్య**
సెక్రటరీ
గుంటూరు మార్కెట్ యార్డు

# దుర్గి శిల్పాలు..సృష్టికే అందాలు



మృదుమధురం ఈ బుద్ధుని రూపం

(ఆన్‌లైన్, దుర్గి)

గుంటూరు జిల్లాలో దుర్గి పేరు వినగానే మదిలో శిల్ప కళ తళుక్కున మెరుస్తుంది. ఇక్కడ ఈ కళ నిత్యనూతనంగా వికసించి పరిమళిస్తూ పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది. దుర్గిలో ప్రభవిస్తున్న శిల్ప కళాఖండాలు ఖండాంతర ఖ్యాతిని ఆర్జిస్తున్నాయి. ప్రతి ఏటా ఎందరో దేశ విదేశీయ పర్యాటకులు ఇక్కడి శిల్ప సోయగాలను తిలకించి పులకించిపోతుంటారు. దుర్గిలో ప్రభుత్వ ఆధ్వర్యంలో నడుస్తున్న నాగార్జున శిల్పకళ శిక్షణ కేంద్రంతో పాటు శ్రీ వెంకటేశ్వర శిల్ప కళాశాల, శ్రీ వేణుగోపాలస్వామి శిల్పకళాశాల, దుర్గాదేవి శిల్ప కళాశాల వున్నాయి. ఈ శిల్పశాలల నుంచి నిరంతరం శిల్ప వృష్టి కురుస్తూ విశ్వవ్యాప్తంగా ఎగుమతై స్వదేశ శిల్పకళకు గొప్ప ప్రాచుర్యాన్ని సంపాదించిపెడుతున్నాయి. అంగుళం నుంచి ఆరు అడుగులు ఎత్తు కలిగిన సైజుతో పలు భంగిమలలో శిల్పాలను చెక్కడంలో దుర్గి శిల్పులు సిద్ధహస్తులు. దుర్గి శిల్ప కళాశాలల్లో ప్రాణం పోసుకుంటున్న రాతి విగ్రహాలలో దేవతామూర్తులే కాక పల్లెపడుచు, శిశువుకు పాలు ఇస్తున్న మాతృమూర్తి, దర్పణ సుందరి, వయ్యారాలు ఒలికించే సుందరాంగుల విగ్రహాలు ప్రధానంగా వుంటాయి. వన్నె తగ్గిన శిల్ప కళలో కొత్త కాంతిని ప్రవహింపజేయడానికి ఇక్కడ శిల్పులు కృషి సల్పుతూ రాళ్ళలో అపురూప కళాఖండాల అన్వేషణకై కారుచీకట్లో కాంతిపుంజాల్లా దూసుకుపోతున్నారు.

## దుర్గి శిల్ప కళా చరిత్ర బహు ప్రాచీనం

క్రీస్తుశకం 12వ శతాబ్దంలోనే దుర్గిలో శిల్పకళకు బీజం పడింది. తొలుత కొంతమంది శిల్పులు పెందోట నుంచి ద్వారకాపురి పట్టణానికి వలస వచ్చి ఇక్కడే స్థిరపడి జీవనం సాగిస్తుండేవారు. మహాయాన బౌద్ధమతాన్ని రూపొందించిన ఆచార్య నాగార్జునుడు పెందోట నివాసి అని కొందరి భావన. 12వ శతాబ్ధంలోనే ప్రకృతి వైపరిత్యమో లేక శత్రు రాజుల దాడుల ఫలితమో ద్వారకాపురి పట్టణం పూర్తిగా విధ్వంసం అయింది. ఆ సంఘటనలో ప్రాణాలతో మిగిలిన ద్వారకాపురి ప్రజలు కొందరు దారివేముల అనే ప్రాంతానికి తరలివచ్చి ఆ గ్రామాన్ని నిర్మించుకున్నారు. ద్వారకాపురికి చెందిన మరికొందరు బతికి బయటపడ్డ కొద్దిమంది శిల్పులతో నేటి దుర్గి ప్రాంతానికి వచ్చి స్థిరపడ్డారు. వారు ఈ ప్రాంతానికి వచ్చిన వెంటనే శతృక్షయం కోరుతూ దుర్గాదేవి విగ్రహాన్ని ప్రతిష్ఠాపన చేసి తాము నివశిస్తున్న ప్రదేశానికి దుర్గాదేవి పేరిట 'దుర్గి' అను నామకరణం చేయడం జరిగింది. ఇదంతా యథార్థం అని చెప్పడానికి నిదర్శనంగా దుర్గిలో నేటికీ ప్రాచీన దుర్గాదేవి ఆలయం వుండడం గమనార్హం. దుర్గిలో 15వ శతాబ్దం నాటికి శిల్ప కుటుంబాల సంఖ్య 300 చేరినట్లు కొందరి అభిప్రాయం.

ఇక్కడ కాకతీయుల కాలంనందు 1127లో నాగేశ్వర, ఓంకారేశ్వర ఆలయాలు, 1160లో వేణుగోపాలస్వామి ఆలయం, 1140లో వీరభద్ర ఆలయం, స్థానిక శిల్పులచే నిర్మించినట్లు ఆయా శిలాశాసనాలు స్పష్టం చేస్తున్నాయి. మాచర్లలోని ప్రాచీన చెన్నకేశవ, వీరభద్రాలయాలు, అమరావతి, నాగార్జునకొండలో నిర్మించిన బౌద్ధ స్థూపాల నిర్మాణం వెనుక దుర్గి శిల్పుల పాత్ర వున్నట్లు కూడా పలువురు విశ్వసిస్తున్నారు. కాలక్రమంలో శిల్ప కళాపోషకులు కరువై అన్నిచోట్ల క్షీణదశకు చేరింది. రాజులు, రాజ్యాలు అంతరించడంతో శిల్పకళకు ఈ దుస్థితి దాపురించింది. దీంతో కమనీయ శిల్పాలను మలిచే శిల్పుల బతుకుల్లో చిమ్మ చీకట్లు కమ్ముకున్నాయి. అహర్నిశలు బండల మాటున గుండెలు మోగించి మనోజ్ఞ శిల్ప కళాఖండాలను సృజించినా పూట గడవడం కష్టంగా మారింది. ఈ నేపథ్యంలో ఎందరో శిల్ప కళాకారులు శిల్పవృత్తికి స్వస్తి చెప్పి ఇతర వృత్తులను ఆశ్రయించారు. మిగిలిన కొద్దిమంది శిల్పులు మాత్రం వంశపారంపర్యంగా పుణికిపుచ్చుకున్న శిల్పకళను త్యజించలేక శిలలకు ప్రాణం పోసి జీవనయాత్ర సాగిస్తున్నారు. దుర్గి శిల్పులు కూడా ఇదే బాటలో ప్రయాణిస్తూ శిల్ప కళాసేవకే తమ జీవితాలను అంకితం చేస్తున్నారు.

రాధాకృష్ణులు

## శిల్ప కళాభివృద్ధికి ప్రభుత్వ తోడ్పాటు

గాలిలో దీపంలా కొట్టుమిట్టాడుతూ ఆరిపోయే దశకు చేరుతున్న శిల్పకళను రక్షించి శిల్పులలో దాగి వున్న సృజనాత్మక శక్తిని వెలికితీసే సంకల్పంతో రాష్ట్ర ప్రభుత్వం 1962లో దుర్గిలో శిల్ప కళా శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పింది. పరిశ్రమల శాఖ ఆధ్వర్యంలో ఏర్పాటైన ఈ శిక్షణ కేంద్రంలో మొదటి రెండేళ్ళలో ఆరుగురు మాత్రమే శిల్పకళలో శిక్షణ పొందారు. ఆ తరువాత వందల సంఖ్యలో ఈ శిక్షణ కేంద్రం నందు శిక్షణ పొంది నైపుణ్యం సాధించారు. వీరిలో ఎంతో మంది ఇతర జిల్లాల్లో శిల్ప కళా క్షేత్రాలను నెలకొల్పి శిల్ప కళాభివృద్ధికి తోడ్పడుతున్నారు. శిల్పుల మేధస్సుకు మరింత పదును పెట్టి, శిల్ప తయారీలో అవసరమైన సూచనలు, సలహాలు ఇవ్వడానికి నాగార్జున స్టోన్ క్యారింగ్ వర్కర్స్ కో-ఆపరేటివ్ ఇండస్ట్రియల్ సొసైటీ ఆవిర్భవించి కృషి సల్పుతోంది. 1963లో రాష్ట్ర హస్తకళల అభివృద్ధి సంస్థ ఇక్కడ శిల్ప కళాకారుల సాముదాయక సదుపాయ కేంద్రాన్ని నిర్మించి వారికి బాసటగా నిలిచింది. శిల్ప కళాశిక్షణ కేంద్రంలో శిక్షణ పొందుతున్న విద్యార్థులకు ఇచ్చే 30 రూపాయల స్టైఫండ్‌ను 100 రూపాయలకు పెంచి శిల్పకళ అభ్యాసకులను ప్రోత్సహించింది. గత జూలై 27 నుంచి ఆగస్ట్ 15 వరకు ఇక్కడి శిల్పులకు వృత్తి నైపుణ్యత సాధించడానికి రీజనల్ డిజైన్ అండ్ టెక్నికల్ డెవలప్‌మెంట్ సెంటర్ (బెంగుళూరు) ఆధ్వర్యాన వర్క్‌షాప్ నిర్వహించారు. ప్రస్తుతం సాంప్రదాయ పద్ధతిలో తయారుచేసే శిల్ప వస్తువులకు గిరాకి లేదని, అందువల్ల శిల్పులకు నూతన డిజైన్‌లు నేర్పించడానికి ప్రభుత్వం ఈ వర్క్‌షాప్‌ను

(మిగతా 38వ పేజీలో)



దుర్గి శిల్ప కళాకారుల అద్భుత సృష్టి ఈ శిల్పాలు

# పల్నాటి బెబ్బులి.. కన్నెగంటి హనుమంతు

(ఆన్‌లైన్,దుర్గి)

సిరి సంపదలకు నిలయం మన దేశం. పరాయి కసాయి ప్రభుత్వ పాలకుల కబంధహస్తాల చిక్కిన భరతమాతకు విముక్తి కలిగించాలని ఎందరో దేశభక్తులు అహర్నిశలు పోరాటం జరిపారు. తరతరాల పరపీడనకు చరమగీతం పాడి చిరకాల సుమధుర స్వప్నం 'స్వాతంత్ర్యం' సాకారం చేసుకోవాలని మరెందరో వీరకిశోరాలు కత్తులతో కోలాటాలు ఆడారు. ఉరికొయ్యలను ఉయ్యాలలుగా, తెల్లదొరల తుపాకీ గుండ్లు పూలచెండ్లుగా ఆహ్వానించారు. వీరంతా స్వేచ్ఛావాయువుల కోసం దీక్షాకంకణులై రగిలిన సమర జ్వాలాగ్నికి సమిధలయ్యారు. ఈ కోవకు చెందిన వీరులలో 'పల్నాటి బెబ్బులి' కన్నెగంటి హనుమంతు ఒకరు.

హనుమంతు పేరు వింటేనే బ్రిటిష్ అధికారులకు వెన్నులో చలిపుట్టేది. నాటి బ్రిటిష్ ప్రభుత్వానికి సింహస్వప్నమైన హనుమంతు శ్వేతజాతి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పుల్లరి ఉద్యమం నడిపి వారి తుపాకీ గుండ్లకు బలయ్యారు. స్వాతంత్ర్య పోరాట చరిత్రలో హనుమంతు వీరగాథ ఒక ఉజ్వల ఘట్టంగా రూపొందింది. 1870లో దుర్గి మండలం మించాలపాడు గ్రామంలో వెంకటప్పయ్య, అచ్చమ్మ దంపతులకు జన్మించారు. వ్యవసాయ కుటుంబంలో పుట్టిన కన్నెగంటి హనుమంతు 1920లో సహాయ నిరాకరణ పిలుపు ఆయనను స్వాతంత్ర్య పోరాటం వైపునకు నడిపింది. సహాయ నిరాకరణ ఉద్యమం నాటికి పల్నాడు ప్రాంతంలో 91 గ్రామాలున్నాయి. మూడు తాలూకాల స్థాయిలో విస్తీర్ణం కలిగి లక్షా 92 వేల 039 జనాభా వుంది. పాలరాయి, సిమెంట్‌రాయి, ఇనుప గనులు విస్తారంగా వుండడంతో పాటు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయగల ఎత్తిపోతల జలపాతం అందుబాటులో వుంది. వేలాది ఎకరాల సారవంతమైన భూములు వున్నా ప్రజలు కూటికి, గుడ్డకి అల్లాడిపోవాల్సిన దుస్థితి నాడు నెలకొనివుంది. పల్నాడుకు ఎలాంటి నీటి వనరులు లేవు. పూర్తిగా వర్షాధారం పైనే ప్రజల జీవనాధారం. సకాలంలో వర్షాలు లేక, పండలు పండక ఏటా కరువు కాటకాలు



పుల్లరి నేత కన్నెగంటి హనుమంతు

సంభవించడం పరిపాటైంది. పొలాలు పండినా, ఎండినా శిస్తులు మాత్రం చెల్లించక తప్పేదికాదు. మరోవైపు గ్రామాధికారులు ప్రజలను రాబందుల్లా పీక్కుతినేవారు. ఫారెస్టు గార్డుల ఆగడాలు శృతిమించాయి. పశువుకు రెండు రూపాయల చొప్పున అడవి పుల్లరి (సెస్సు) చెల్లిస్తేనే పశువులను మేత కోసం అడవిలో అనుమతిస్తున్నారు. బ్రిటిష్ పాలకుల దురాగతాలను ఎండగట్టే లక్ష్యంతో హనుమంతు ప్రజలను శిస్తులు చెల్లించవద్దని పిలుపునిచ్చారు. పల్నాడులో శిస్తు చెల్లింపుల నిరాకరణను ప్రోత్సహించిన హనుమంతుపై ప్రభుత్వం కక్షగట్టింది. మరోవైపు హనుమంతు ప్రజలను సమైక్యపరుస్తూ అధికారులకు అన్ని సహాయ సహకారాలను నిలిపివేయాలని ఆదేశించారు. బానిస సంకెళ్ళ నుంచి ప్రజలను విముక్తుల్ని చేయాలనే కర్తవ్యదీక్షతో ప్రజలను విప్లవశక్తిగా మార్చారు. కన్నెగంటి పిలుపుతో ప్రజలు శిస్తులు కట్టడం మానేశారు. అధికారులకు మంచినీళ్ళు కూడా పుట్టడం లేదు. బట్టలు ఉతకడం, క్షవరం చేయడం వంటి పనులు స్తంభించిపోయాయి. దీంతో ప్రభుత్వం పల్నాటి ఉద్యమాన్ని అణచివేయటానికి మన్యం తిరుగుబాటును నిరంకుశంగా అణచిన రూథర్‌ఫర్డ్‌ను జిల్లా కలెక్టర్‌గా ఇక్కడ నియమించింది.

## పోలీస్ దాడులు

పల్నాడులో సమర్థవంతంగా జరుగుతున్న సహాయ నిరాకరణ ఉద్యమాన్ని నీరుగార్చటానికి ప్రభుత్వం పోలీస్, మిలటరీ దాడులకు పాల్పడింది. మొదట రామాపురం, జెట్టిపాలెం, జంగమహేశ్వరపురం తదితర గ్రామాలపై పోలీస్, మిలటరీ దాడులు జరిగాయి. ఈ సందర్భంగా పోలీసులు ఇళ్ళలో జొరబడి యథేచ్ఛగా దోచుకున్నారు. స్త్రీలపై అమానుషంగా అత్యాచారాలను జరిపారు. అనేకమంది కాళ్ళు, చేతులు విరిచారు. దాడికి గురైన గ్రామాలు తప్ప మిగిలిన గ్రామాలు బ్రిటిష్ పాలకులకు లొంగలేదు. శిస్తు చెల్లింపు నిరాకరణను ప్రజలు యథాతథంగా పాటిస్తూనే వున్నారు. హనుమంతు అనుక్షణం ప్రజలను సమైక్యపరచి ఉత్తేజితులను చేయడంతో ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. మించాలపాడు గ్రామ ప్రజలంతా హనుమంతుకు అండగా నిలిచారు. ఈ నేపథ్యంలో రూథర్‌ఫర్డ్ కన్నెగంటికి ధనాశ చూపి ఉద్యమం నుంచి వైదొలిగించడానికి వ్యూహరచన చేశాడు. తమ లక్ష్యసాధన కోసం బ్రిటిష్ పాలకులు కోలగుట్ల కరణం సదాశివయ్యను హనుమంతు వద్దకు రాయబారిగా పంపారు. హనుమంతును కలిసిన శివయ్య 'ఉద్యమాన్ని ఆపి ప్రభుత్వానికి అనుకూలంగా మసలుకో... నిన్ను జమిందారు చేయిస్తా... పేస్కేన్ నీ ఇష్టం వచ్చినంత ఇవ్వచ్చు...' అన్ని దుర్బోధ చేశారు. సదాశివయ్య మోసపూరిత మాటలు హనుమంతులో పట్టరాని ఆగ్రహాన్ని తెచ్చాయి. 'ఉద్యమం నా ఊపిరి... ప్రజలే నా సర్వస్వం... ఉద్యమాన్ని విరమించుకుని ప్రజలకు ద్రోహం చేయం...' అని హనుమంతు గర్జించారు.

## కన్నెగంటి అంటే పోలీసులకు వణుకు

మించాలపాడు కేవలం 125 కుటుంబాలు కలిగిన ఓ కుగ్రామం. గ్రామానికి మూడు వైపులా కొండలు, ఉత్తరం దిక్కున దట్టమైన అడవి కలిగి వుంది. 1922 ఫిబ్రవరి 22న మహాశివరాత్రి పర్వదినం వేడుకల్లో గ్రామ ప్రజలు ఆనందోత్సవాలతో నిమగ్నమై వున్న సమయాన తెల్లదొరలు వంద మంది మిలటరీ దళంతో మించాలపాడుకు బయలుదేరారు. కోలగుట్ల కరణం సదాశివయ్య, దుర్గి సబ్ ఇన్‌స్పెక్టర్ రాఘవయ్య మిలటరీ దళాన్ని అనుసరిస్తున్నారు. అదే సమయంలో ఊరికి దక్షిణ భాగంలో కొండ లోయవద్ద వున్న బావికి మంచినీళ్ళ కోసం వచ్చిన మించాలపాడు పశువులను మిలటరీ దళం ముట్టడించింది. అనంతరం వాటిని ముటుకూరు బందెల దొడ్డికి తోలుకువెళ్తున్న మిలటరీ దళానికి హనుమంతు అల్లుడు పసుపులేటి చిన్నయ్య అడ్డుతగిలి తమ పశువులను వదలమని కోరగా పోలీసులు అతనిని తుపాకీ మడమతో కొట్టి తీవ్రంగా హింసించారు. దీంతో ఆగ్రహించిన పశువుల కాపలాకు వచ్చిన రైతులు పోలీసులపై రాళ్ళురువ్వారు. ఇందుకు ఆగ్రహించిన మిలటరీ దళం లాఠీచార్జ్ జరిపి రైతులను చెదరగొట్టారు. విషయం తెలుసుకున్న హనుమంతు నిరాయుధుడుగానే పోలీసులతో పోరుసల్పేందుకు బయలుదేరారు. ఆయనను గ్రామ ప్రజలు కూడా అనుసరించారు. ఆరు అడుగుల ఎత్తు... విశాలమైన ఛాతి... దట్టమైన కోర మీసం... బలిష్టమైన బాహువులు కలిగి తలపాగ ధరించి వస్తున్న కన్నెగంటిని చూడగానే పోలీసులు, మిలటరీ దళం వెన్నులో వణుకుపుట్టింది. భయంతో కంపించిపోతున్న కరణం సదా శివయ్య 'కన్నెగంటి హనుమంతు మన దగ్గరకు వస్తే బతకనివ్వడు... (మిగతా 30వ పేజీ)

# రాష్ట్రావతరణ దినోత్సవ శుభాకాంక్షలు


స్వర్గీయ ఇందిరాగాంధి


స్వర్గీయ రాజీవ్‌గాంధి


శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు


శ్రీ మన్‌మోహన్‌సింగ్
ప్రధానమంత్రి


శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్రముఖ్యమంత్రి


శ్రీ కె. కేశవరావు
రాష్ట్ర పి.సి.సి. అధ్యక్షులు


శ్రీ కొణిజేటి రోశయ్య
రాష్ట్ర ఆర్థికశాఖామంత్రి


శ్రీ కన్నాలక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణాశాఖామాత్యులు


శ్రీ గాదె వెంకటరెడ్డి
శాసనసభ్యులు, బాపట్ల


శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌ఛార్జిమంత్రి


శ్రీ రాయపాటి సాంబశివరావు
లోక్‌సభ సభ్యులు, గుంటూరు


శ్రీ మేకపాటి రాజమోహనరెడ్డి
లోక్‌సభ, నరసరావుపేట


శ్రీ వల్లభనేని బాలశౌరి
లోక్‌సభ సభ్యులు, తెనాలి


శ్రీమతి దగ్గుబాటి పురంధరేశ్వరి
పార్లమెంటు సభ్యులు, బాపట్ల


శ్రీ జె.డి. శీలం
రాజ్యసభ సభ్యులు


శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
డిసిసి అధ్యక్షులు


శ్రీ కాసు కృష్ణారెడ్డి
శాసనసభ్యులు, నరసరావుపేట







**ఆంధ్రుల అభిమాన పత్రిక ఆంధ్రజ్యోతి**
**తృతీయ వార్షికోత్సవం సందర్భంగా ఆంధ్రజ్యోతి**
**యాజమాన్యానికి, సిబ్బందికి శుభాకాంక్షలు**

**సోనియాగాంధి నాయకత్వంలో ప్రధాని మన్‌మోహన్‌సింగ్ ప్రభుత్వంలో**
**రాష్ట్రంలో ముఖ్యమంత్రి డా॥ వైఎస్ రాజశేఖరరెడ్డి నాయకత్వంలో**

★ రాష్ట్ర ప్రభుత్వం పేద ప్రజల సంక్షేమానికి నిరంతరం కృషిచేస్తుంది.
★ పేద ప్రజలకు ఉచిత విద్యుత్ అమలు ★ అప్పుల భారంతో ఉన్న రైతులకు విద్యుత్ బకాయిల రద్దు.
★ 25 పైసల వడ్డీకే డ్వాక్రా సంఘాలకు రుణాలు ★ 25 రూపాయల మినిమమ్ విద్యుత్.

**బిల్లులు చెల్లించే ప్రజలకు పదిరూపాయల సబ్సిడీ... ఇంకా ఎన్నెన్నో**
**మేలైన పథకాలు అమలు చేస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు మద్దతు తెలుపుదాం.**

**జిల్లా ఎంపిలకు, ఎంఎల్ఏలకు, ప్రజలకు దీపావళి శుభాకాంక్షలు**
**జిల్లా ప్రజానీకానికి శతవసంతాల శుభాకాంక్షలు**


శ్రీ గుదిబండివెంకటరెడ్డి
శాసనసభ్యులు, దుగ్గిరాల

శ్రీ జంగా కృష్ణమూర్తి
శాసనసభ్యులు, గురజాల


శ్రీ మురుగుడు హనుమంతరావు
శాసనసభ్యులు, మంగళగిరి

శ్రీ మోపిదేవి వెంకటరమణ
శాసనసభ్యులు, కూచినపూడి

గుంటూరు జిల్లా ఏర్పడి వందేళ్ళు పూర్తిచేసుకొన్న శుభతరుణంలో జిల్లా ప్రజానీకానికి హార్దిక శుభాకాంక్షలు..
స్వాతంత్రోద్యమంలో కీలక పాత్ర పోషించిన గుంటూరు జిల్లా తెలుగు సీమ కీర్తి కిరీటంలో కలికితురాయిగా బాసిల్లుతున్నది.


డా॥ రాయపాటి శ్రీనివాస్
పిసిసి ప్రధాన కార్యదర్శి

చారిత్రక ప్రాధాన్యంతోపాటు దేశ, రాష్ట్ర రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, సాహిత్య, వ్యాపార తదితర రంగాల్లో జిల్లా రాష్ట్రంలో తనదైన ముద్ర వేసింది. గణనీయమైన వ్యవసాయ ఉత్పత్తులతో జిల్లా వాసికెక్కింది. పొగాకు, పత్తి, మిరప పంటల సాగుకు కేంద్రంగా నిలిచింది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణంతో జిల్లా వ్యవసాయ రంగం దశతిరిగింది. లక్షలాది ఎకరాల్లో జొన్న, సజ్జ పంటల స్థానంలో వరిసాగు చేస్తున్నారు. రాష్ట్ర వ్యవసాయ దిగుబడుల్లో పది శాతం జిల్లా నుంచే వస్తున్నాయి. రాష్ట్ర ఆర్థికాభివృద్ధిలో జిల్లాదే ప్రథమ స్థానం. విద్యా, వైద్య, వ్యవసాయం, సాగునీరు రంగాల్లో విశేషమైన ప్రగతి సాధించింది. మరెంతగానో జిల్లా అన్ని రంగాల్లో ముమ్ముందు మరెంతగానో అభివృద్ధి పథంలో పయనించాలని, జిల్లా ప్రజలకు దీపావళి శుభాకాంక్షలు తెలియజేస్తూ.. ఈ దీపావళి పర్వదినం అందరి లోగిళ్ళలో సుఖసంతోషాలు నింపాలని ఆకాంక్షిస్తున్నాము.


రాయపాటి సాయి మోహనకృష్ణ
1వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ నాదెండ్ల మనోహర్
శాసనసభ్యులు, తెనాలి


శ్రీ డి. మాణిక్య వరప్రసాద్
శాసనసభ్యులు, తాడికొండ


శ్రీ తాడిశెట్టి వెంకటరావు
శాసనసభ్యులు, గుంటూరు-2


శ్రీ మక్కెన మల్లికార్జునరావు
శాసనసభ్యులు, వినుకొండ


శ్రీ దేవినేని మల్లికార్జునరావు
శాసనసభ్యులు, రేపల్లె


శ్రీ సతీష్‌పాల్‌రాజ్
శాసనసభ్యులు, వేమూరు


శ్రీ నంబూరు సుభాని
శాసనసభ్యులు, గుంటూరు-1


శ్రీ రావి వెంకటరమణ
శాసనసభ్యులు, ప్రత్తిపాడు


శ్రీ పిన్నెల్లి లక్ష్మారెడ్డి
శాసనసభ్యులు, మాచర్ల


శ్రీ మర్రి రాజశేఖర్
శాసనసభ్యులు, చిలకలూరిపేట


శ్రీ యర్రం వెంకటేశ్వరరెడ్డి
శాసనసభ్యులు, సత్తెనపల్లి

# పల్నాటి బెబ్బులి.. కన్నెగంటి హనుమంతు


రూథర్‌ఫర్డ్ నిర్మించిన కన్నెగంటి పాత సమాధి

(28వ పేజీ తరువాయి)

కాల్చండి..' అంటూ హెచ్చరించడంతో పోలీసులు హనుమంతుపై తుపాకులు ఎక్కుపెట్టి గుళ్ళవర్షం కురిపించారు. హనుమంతు కుడిడొక్కను చీల్చుకొని రక్తం కాలువలయ్యింది. ఈ సంఘటనలో హనుమంతు పాలేరు ఎల్లంపల్లి శేషు అక్కడికక్కడే నేలకొరిగాడు. మరో 28 మంది క్షతగాత్రులయ్యారు. రక్తపు మడుగులో పడివున్న హనుమంతు కొన ఊపిరితో దాహం.. దాహం అని కలవరిస్తున్నప్పటికీ బ్రిటిష్ అధికారులు కర్కశులై మంచినీళ్ళు ఇవ్వకుండనే తుపాకీ మడమతో హనుమంతు గొంతుపై నొక్కి తీవ్రంగా గాయపరిచారు. ఆ రోజు రాత్రి ఏడున్నర వరకు ప్రాణాలతోవున్న హనుమంతు తుదిశ్వాస విడిచారు. పోలీసులు హనుమంతు భౌతికకాయాన్ని రాత్రంతా అక్కడే వాగులో వుంచి కాపలాకాసారు. హనుమంతు శవాన్ని ఆయన బంధువులకు కూడా ఇవ్వడానికి తెల్లదొరలు నిరాకరించారు. మరుసటి రోజు హనుమంతు మృతదేహాన్ని కోలగుట్ల సమీపంలో వున్న దంతెవాగు వద్దకు తరలించి శవ పరీక్షల అనంతరం ఖననం చేశారు.

హనుమంతు మరణానంతరం మరుసటి రోజు మరో 50 మంది మిలటరీ సిబ్బంది ఊళ్ళోకి ప్రవేశించారు. అప్పటికే గ్రామ ప్రజలంతా కొండల్లో తలదాచుకొని వుండగా నడవలేని వృద్ధులు, పిల్లలు మాత్రమే గ్రామంలో మిగిలిపోయారు. ఇదే అదునుగా భావించిన పోలీసులు, మిలటరీ సిబ్బంది ఇళ్ళల్లో జొరబడి నగలు,డబ్బు కొల్లగొట్టారు. మేకలను, కోళ్ళను అందిన మేరకు కోసుకుతిన్నారు. హనుమంతును కాల్చి చంపిన సమాచారం పల్నాడు తాలూకా అంతటా దావానలంలా వ్యాపించింది. దీంతో సహాయ నిరాకరణ ఉద్యమం నిర్వహిస్తున్న ప్రజల నడుం విరిగినట్టయి నైతిక శక్తి క్షీణించింది. గత్యంతరం లేక ప్రజలు శిస్తులు చెల్లించడం ప్రారంభించారు. నాలుగవ రోజు కొండల్లో దాగి వున్న ప్రజలు గ్రామంలోకి అడుగుపెట్టారు. కొంపలన్నీ మిలటరీ, పోలీసు సిబ్బందిచే దోచుకోబడి ఊరంతా బీభత్స స్థితిలో దర్శనమివ్వడంతో ప్రజలు కన్నీటి పర్యంతమయ్యారు. పోలీసులు గ్రామానికి చెందిన 40 మంది ముఖ్యులను అరెస్టు చేశారు. ఒక్కొక్కరికి 150 రూపాయల జరిమానాతో పాటు ఆరు మాసాల కఠిన కారాగార శిక్ష పడింది. నలబోతుల వెంకయ్యకు మాత్రం 200 రూపాయల జరిమానాతో పాటు 9 నెలల శిక్ష విధించారు.

## హనుమంతు ఆత్మఘోష

హనుమంతును నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపించినప్పటికీ నాటి జిల్లా కలెక్టర్ రూథర్‌ఫర్డ్‌కు హనుమంతుపై కసి తీరలేదు. దంతెవాగులో వుంచిన హనుమంతు శవాన్ని ప్రజలు ఫొటో తీసుకుంటామని కోరినప్పటికీ రూథర్‌ఫర్డ్ ఏమాత్రం అంగీకరించలేదు. హనుమంతును సమాధి చేసిన పిదప గోరి కట్టించి, శిలాఫలకం వేయించాడు. అయితే కొద్దిరోజులకు రూథర్‌ఫర్డ్ ఆ శిలాఫలకాన్ని పెకిలించి హనుమంతు భార్యకు కానుకగా పంపి అపహాస్యం చేశాడు. ఇంకా కసి తీరని రూథర్‌ఫర్డ్ మరో నెల రోజుల తరువాత మించాలపాడు వెళ్ళి హనుమంతు పేర వేసిన శిలాఫలకాన్ని బయటకు తెప్పించాడు. దానిని ముక్కలు ముక్కలుగా పగులగొట్టించి బావిలో పడేసి తన కసినంతా ప్రదర్శించాడు. హనుమంతు సమాధి నిర్మించిన దంతెవాగు మించాలపాడు కొండల్లో పుట్టి కోలగుట్ల పక్క నుంచి ఆత్మకూరు చెరువుగుండా మాచర్ల మీదుగా చంద్రవంకై ప్రవహిస్తూ ఎత్తిపోతల వద్ద 66 అడుగుల ఎత్తు నుంచి కిందకు జాలువారుతోంది. నాటి నుంచి నేటి వరకు హనుమంతు వాగు ప్రవహిస్తూనే వుంది... ఎత్తిపోతల ఘోషిస్తూనే వుంది... ఎత్తిపోతల ఘోష పలనాటి స్వతంత్ర్య ఘోష... అది స్వాతంత్ర్యాన్ని సిద్ధింపచేసిన హనుమంతు ఆత్మఘోష...

మాతృదేశం కోసం అశువులు బాసిన హనుమంతు సమాధికికి ఎటువంటి భద్రత లేదు. 1946లో ఆచార్య రంగా హనుమంతు సమాధిని సందర్శించి సమాధి మరమ్మతులకు కొంతమేర ధన సహాయం చేశారు. కాలక్రమంలో హనుమంతు సమాధికి రక్షణ కరువై ముళ్ళపొదల మధ్యలో చిక్కి శిథిలావస్థకు చేరి దీనస్థితికి అద్దంపట్టింది. ఈ నేపథ్యంలో తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో పల్నాటి వీరుల విగ్రహ ప్రతిష్ఠ కమిటీ ఏర్పాటై హనుమంతు సమాధి పునర్నిర్మాణానికి నడుం బిగించింది. రాష్ట్ర ఎక్సైజ్ రిటైర్డ్ జాయింట్ కమిషనర్ మిరియాల అనంతరామయ్య ఆధ్వర్యంలో 2004, ఫిబ్రవరి 23న మాచర్ల పట్టణం నడిబొడ్డున హనుమంతు కాంస్యవిగ్రహాన్ని ఆవిష్కరించారు. అప్పటి రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖా మంత్రి డాక్టర్ కోడెల శివప్రసాదరావు చేతులమీదుగా కన్నెగంటి హనుమంతు కాంస్య విగ్రహం ప్రతిష్ఠకు నోచుకుంది. విగ్రహ ప్రతిష్ఠతో ఆగక రెండు లక్షల రూపాయల వ్యయంతో కోలగుట్లలోని హనుమంతు సమాధి పునర్నిర్మాణపు పనులకు కూడా శ్రీకారం చుట్టారు.


నిర్మాణంలో వున్న కన్నెగంటి హనుమంతు నూతన ఘాట్

# దొమ్మర్లగొంది 'ఎత్తిపోతల' పులకేనా?



పల్నాటి ప్రజల ఆశాజ్యోతి వరికపూడిశెల రిజర్వాయర్

(ఆన్‌లైన్, వెల్దుర్తి)

వరికపూడిశెల లిఫ్ట్ ఇరిగేషన్ ప్రాజెక్ట్ (దొమ్మర్లగొంది) నిర్మాణం ప్రశ్నార్థకంగానే మిగిలిపోయే పరిస్థితి కనిపిస్తోంది. 50 ఏళ్ళ క్రితం ఈ ప్రాజెక్ట్ ప్రభుత్వ పరిశీలనలో వుంది. ప్రకాశం, గుంటూరు జిల్లాల్లోని రాజకీయ నాయకుల ఎన్నికల ప్రచారంలో ఈ ప్రాజెక్ట్‌ను ప్రధానాంశంగా పేర్కొని పదవి దక్కిన తరువాత ఈ అంశాన్ని పక్కన పెట్టడం ఆనవాయితీగా మారింది. ఈ ప్రాజెక్టు తమకు కల్పవృక్షం లాంటిదని భావించిన రైతులు 50 ఏళ్ళ నుంచి దీని సాధనకు సుదీర్ఘ పోరాటం చేస్తున్నారు. ఎన్ని ఉద్యమాలు చేసినా దొమ్మర్లగొంది ప్రాజెక్టు రైతులకు కలగానే మిగిలిపోయింది. గతంలో దీని నిర్మాణానికి ప్రయత్నాలు ప్రారంభమైనప్పటికీ రాజీవ్ టైగర్ ఫారెస్ట్, బచావత్ ట్రిబ్యునల్ అభ్యంతరాల మధ్య నిలిచిపోయింది. నూతనంగా ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వం రాష్ట్రంలో అనేక ప్రాజెక్ట్‌లకు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చి వరికపూడిశెలను విస్మరించింది. ఈ ప్రాజెక్టుపై గుంటూరు, ప్రకాశం జిల్లాల ప్రజలు పెంచుకున్న ఆశలు అడియాశలయ్యాయి. అయితే 2004 సెప్టెంబరు 27న రాష్ట్ర సహకార శాఖామాత్యులు కన్నా లక్ష్మీనారాయణ వరికపూడిశెల (మిగతా 32వ పేజీలో)

# దొమ్మర్లగొంది 'ఎత్తిపోతల' హుళక్కేనా?


పూర్తయిన జెర్రివాగు-1 లిఫ్ట్ ఇరిగేషన్

(31వ పేజీ తరువాయి)

వద్ద వున్న కృష్ణానది రిజర్వాయర్ పాయను సందర్శించారు. అక్కడికక్కడే ప్రాజెక్ట్ సాధ్యాసాధ్యాలను గూర్చి ఇంజనీరింగ్ నిపుణులతో చర్చించారు. వరికపూడిశెల రిజర్వాయర్‌లో నీటిమట్టం ప్రతికూల పరిస్థితుల్లో కూడా 250 అడుగులకు తగ్గదని, అందువల్ల ఈ ప్రాజెక్ట్ నిర్మాణం జరిగితే ఎప్పుడూ నీటి సరఫరాకు విఘాతం కలగదని మైనర్ ఇరిగేషన్ అధికారులు అంటున్నారు.

ఎగువ పల్నాడులో నీటి ఇక్కట్లు తొలగాలంటే లిఫ్ట్ ఇరిగేషన్ స్కీమ్‌లే శరణ్యమని ఖోస్లా కమిటీ గతంలోనే ప్రభుత్వానికి నివేదించింది. ఎన్నో ఏళ్ళుగా వరికపూడిశెల లిఫ్ట్ ఇరిగేషన్ కోసం రైతాంగం ఇక్కడ పోరాటాలు సల్పింది. మొదట్లో విదేశీ నిపుణులు ఈ ప్రాంతాన్ని పరిశీలించి రూ. 40 కోట్లు వ్యయమవుతుందంటూ అంచనాలను రూపొందించారు. ప్రభుత్వ నిర్లక్ష్యం కారణంగా అప్పుడు ప్రాజెక్ట్ నిర్మాణ ప్రతిపాదన ఆచరణకు రాలేదు. నేడు ఇదే ప్రాజెక్ట్‌ను నిర్మించాలంటే రూ.140 కోట్ల పై చిలుకే ఖర్చవుతోందని ఇంజనీరింగ్ అధికారులు వ్యక్తం చేస్తున్నారు. ఈ ప్రాంతాన్ని పరిశీలించిన రాష్ట్ర సహకార శాఖామాత్యులు కన్నా లక్ష్మీనారాయణ సదరు విషయాన్ని ముఖ్యమంత్రికి నివేదిస్తానని చెప్పారు. ఇంత వ్యయంతో ప్రాజెక్ట్ నిర్మాణం పూర్తి చేయడం కన్నా ఆయా ప్రాంతాల్లో వున్న జలవనరుల స్థాయిని బట్టి లిఫ్ట్ ఇరిగేషన్ ఏర్పాటు విధానంలో ప్రభుత్వం నిమగ్నమైంది. ఇందులో భాగంగానే వెల్దుర్తి మండలం మరసపెంట సమీపాన జెర్రివాగు లిఫ్ట్ ఇరిగేషన్ స్కీమ్‌ను 1998లో శంకుస్థాపన చేసి, 2005 జనవరి 6న ప్రారంభించడం జరిగింది. అనుపు లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా 40 వేల ఎకరాలకు సాగు, తాగునీరు లభ్యమవుతుందని, దీని నిర్మాణం కోసం గత ప్రభుత్వం రూ.40 కోట్ల అంచనాలను రూపొందించి వదిలివేసింది. మాచర్ల ఎమ్మెల్యే పిన్నెల్లి లక్ష్మారెడ్డి ఈ పనులను తిరిగి ప్రారంభించేందుకు ప్రభుత్వం దృష్టికి తీసుకువెళ్ళేందుకు ప్రయత్నిస్తున్నారు. అయితే పల్నాడులోను, ఇతర ప్రాంతాల్లోను పీపుల్స్‌వార్ గ్రూపు నక్సల్స్, ప్రజలు పులిచింతలను వ్యతిరేకిస్తున్నందువల్ల వరికపూడిశెలను తెర పైకి తెచ్చారు. పులిచింతల నిర్మాణానికి టెండర్లను పిలవడం, సర్వే పనులు జరుగుతుండడం వంటి వాటికి ఆటంకం కల్పించకుండా వుండేందుకే మంత్రి కన్నా వరికపూడిశెల ప్రాజెక్టు నిర్మాణాంశానికి విస్తృత ప్రచారం నిర్వహించి మభ్యపెడుతున్నారని కారంపూడి, వెల్దుర్తి, బొల్లాపల్లి, ఎర్రగొండపాలెం, పుల్లలచెరువు మండలాల ప్రజానీకం భావిస్తోంది.

గత ప్రభుత్వం ఈ ప్రాజెక్ట్ నిర్మాణానికి శ్రీకారం చుట్టి 'రాజీవ్ టైగర్ ఫారెస్ట్' అధికారుల నిరాకరణను కారణంగా చూపి దానికి ప్రత్యామ్నాయంగా జెర్రివాగు లిఫ్ట్ ఇరిగేషన్‌ను నిర్మించిన విషయం విదితమే. లక్షలాది ఎకరాలకు సాగు నీరందించే వరికపూడిశెల ప్రాజెక్ట్ వదలి కేవలం నాలుగు వేల ఎకరాలకు ఉపయోగపడే జెర్రివాగు లిఫ్ట్‌ను పూర్తిచేసి నాయకులు చేతులు దులుపుకున్నారు. సాగర్ రిజర్వాయర్ నీటి మట్టం 516 అడుగుల స్థాయిలో వుంటే ఈ లిఫ్ట్ ఇరిగేషన్ పనిచేస్తోంది. లిఫ్ట్ ద్వారా నేరుగా రైతులు నీటిని వినియోగించుకోవడం వల్ల విద్యుత్ బిల్లుల భారం అధికమవుతోంది. ఈ లిఫ్ట్‌కు ప్రత్యామ్నాయంగా నీటిని నిల్వ చేసే ఒక ట్యాంక్‌ను నిర్మించి, అక్కడి నుంచి నీటిని సరఫరా చేసుకున్నట్లయితే ఈ లిఫ్ట్ కమిటీకి విద్యుత్ వ్యయ భారం తగ్గుతుంది. జెర్రివాగు ఫేజ్-2 కింద ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపడం జరిగింది. ఆ లిఫ్ట్‌కు అయ్యే ఖర్చులో మూడవ వంతు ట్యాంక్ నిర్మాణాన్ని మంజూరు చేస్తే ప్రస్తుత జెర్రివాగు లిఫ్టే రైతులకు కల్పవృక్షంగా మారుతుంది. 1998 నుంచి సాగర్ రిజర్వాయర్ అంతంత మాత్రంగానే వుంటూ గత ఏడాది 540 అడుగుల నీటిమట్టానికి చేరింది. అప్పటికే జెర్రివాగు లిఫ్ట్ పనులు పూర్తి కాకపోవడంతో ఉన్న నీటిమట్టం కాస్త పడిపోయింది. దీంతో ప్రారంభించిన జెర్రివాగు నామమాత్రంగా మిగిలిపోయింది.


1996లో అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు శంకుస్థాపన చేసిన వరికపూడిశెల శిలాఫలకం

ఇటీవల కృష్ణానదిలో వచ్చిన వరదనీటికి జెర్రివాగు పూర్తిగా జలమయమైంది. దీంతో రెండేళ్ళ పాటు ఈ ప్రాంతంలోని రైతాంగానికి నీటి కొరత వుండదు. నాగార్జునకొండ రిజర్వాయర్ సమీపాన అనుపు లిఫ్ట్ ఇరిగేషన్‌కు గత ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. అప్పట్లో అంచనాలకే పరిమితం అయిన లిఫ్ట్ ఇరిగేషన్‌ను ప్రస్తుత ఎమ్మెల్యే లక్ష్మారెడ్డి తన భుజస్కంధాలపై వేసుకొని ప్రభుత్వం నుంచి అనుమతి తీసుకువచ్చేందుకు తీవ్రంగా కృషి చేస్తున్నారు. ఈ లిఫ్ట్ ద్వారా మాచర్ల పట్టణానికి కూడా మంచినీటి ఎద్దడి తీరుతుందనే భావనతో అనుమతి కోసం సంబంధిత మంత్రులను కలసి సంప్రదింపులు చేస్తున్నారు. 14 వేల ఎకరాలకు సాగు నీరు, తాగునీరు ఈ లిఫ్ట్ ద్వారా అందించవచ్చునని ఇంజనీరింగ్ అధికారుల నివేదిక ద్వారా తెలుస్తోంది. ఎగువ పల్నాడుకు, ప్రకాశం జిల్లాలోని వేలాది ఎకరాల్ల పంటలకు సాగు నీరు అందించే వరికపూడిశెల (దొమ్మర్లగొంది) లిఫ్ట్ స్కీమ్ నిర్మాణం పట్ల ప్రభుత్వం సానుకూలంగా స్పందించాలని ప్రజలు కోరుతున్నారు.

# నరసరావుపేటకు ప్రకృతి ఇచ్చిన వరం

## మంచినీటి సరఫరాకు పైసా ఖర్చు లేదు...

(ఆన్‌లైన్, నరసరావుపేట)

నరసరావుపేట పట్టణానికి రక్షిత మంచినీటి సరఫరా ప్రకృతి వరప్రసాదం. మానవ మేధస్సుకు ఒక మచ్చుతునక. ఈ రక్షిత మంచినీటి పథకం దేశంలోనే అరుదైనదిగా పేర్కొనవచ్చు. నరసరావుపేట పథకంతో పాటు మరొకటి దేశంలో ఉన్నట్టు సమాచారం. సాంకేతికపరంగా అద్భుతమైన ఈ పథకంలో ప్రజలకు నీటి సరఫరా చేసే దానిలో విద్యుత్ శక్తి, ఎటువంటి యాంత్రిక వినియోగం లేదు. ఖర్చు లేకుండా ప్రజలకు నీటి సరఫరా జరుగుతుందంటే ప్రతి ఒక్కరు ఆశ్చర్యపోక తప్పదు. ఇదేమిటనే ప్రశ్న తలెత్తవచ్చు. కారణం మంచి నీటి పథక రచనలో స్టోరేజ్ చెరువులను శాంతినగర్, నకరికల్లుల వద్ద ఏర్పాటు చేశారు. శాంతినగర్ చెరువు పట్టణానికి ఎనిమిది కిలో మీటర్ల దూరంలో ఉండగా, నకరికల్లు చెరువు 18 కిలోమీటర్ల దూరంలో ఉంది. నకరికల్లు వద్ద వున్న నరసరావుపేట రక్షిత మంచినీటి చెరువు పట్టణం కంటే 125 మీటర్ల ఎత్తులో ఉంది. అలాగే శాంతినగర్ వద్ద ఉన్న చెరువు పట్టణం కంటే 95 మీటర్ల ఎత్తులో ఉంది. దీని కారణంగా పట్టణానికి నీరు ఎటువంటి యంత్రాలు వినియోగించకుండా నేరుగా ఓవర్ హెడ్ ట్యాంక్‌ల్లోకి చేరుతుంది. నకరికల్లు వద్ద చెరువు నుంచి శాంతినగర్ వద్ద వున్న ఫిల్టరేషన్ ప్లాంట్‌కు నీరు పైపుల ద్వారా చేరుస్తారు. ఫిల్టరేషన్ ప్లాంట్ నకరికల్లు కంటే 30 మీటర్ల దిగువున ఉంది. అక్కడి నుంచి శుద్ధిచేసిన నీరు కూడా పైపుల ద్వారా పట్టణంలోని వివిధ ప్రదేశాల్లో నిర్మించిన ఓవర్‌హెడ్ ట్యాంకులకు కూడా ఎటువంటి యాంత్రిక వినియోగం లేకుండా చేరుతుంది. ఫిల్టరేషన్ ప్లాంట్‌కు ఓవర్‌హెడ్ ట్యాంకుల మధ్య భూవ్యత్యాసం 32 మీటర్లు ఉంది. ఓవర్‌హెడ్ ట్యాంకులు 17 మీటర్ల ఎత్తులో నిర్మించబడి ఉన్నాయి. పట్టణంలో కూడా వివిధ ప్రదేశాల్లో భూవ్యత్యాసం పది మీటర్లు ఉన్నందున నీటి సరఫరా కూడా వేగంగా జరుగుతుంటుంది. ఎన్నో ఏళ్ళ క్రితం నిర్మించిన మొదటి దశ రక్షిత మంచి నీటి పథకం ద్వారా ప్రజలకు నీటి సరఫరా సరిపోనందున ప్రస్తుతం రెండోదశ రక్షిత మంచి నీటి పథకం యుద్ధ ప్రాతిపదికన పూర్తిచేశారు. గత రెండేళ్ళు రాష్ట్రంలో తీవ్ర నీటి కరువు నెలకొన్నా నరసరావుపేటలో మాత్రం మండు వేసవిలో సైతం రెండు పూటలా నీటి సరఫరా చేశారు. భూ వ్యత్యాసం వల్ల యంత్రాల వినియోగం లేనందున పురపాలక సంఘానికి మంచినీటి సరఫరా నిర్వహణ ఖర్చు ఇతర పట్టణాలతో పోల్చుకుంటే ప్రతి ఏటా సుమారు 70 లక్షల వరకు ఆదా అవుతున్నట్టే. డబ్బు ఆదాతో పాటు నిర్వహణలో సాంకేతిక పరమైన నిపుణత లేనందున నిర్వహణ కూడా సులభసాధ్యంగా ఉంది. ప్రకృతి వైపరీత్యాల వల్ల విద్యుత్ కోత వున్నా పట్టణ మంచినీటి సరఫరాకు ఎటువంటి ఆటంకం లేకుండా సజావుగా పట్టణానికి నీటి సరఫరా జరుగుతుండడం, ఈ పథకం ద్వారా లభిస్తున్న ఆదాయంతో అభివృద్ధి పనులు చేపట్టడం పట్టణ ప్రజల అదృష్టం.



రక్షిత మంచినీటి పథకం ఓవర్ హెడ్‌ట్యాంక్

# ప్రాచీన చారిత్రాత్మక ప్రదేశాల్లో భట్టిప్రోలు ప్రసిద్ధి



భట్టిప్రోలులోని బౌద్ధస్తూపం

(ఆన్‌లైన్, భట్టిప్రోలు)

ఆంధ్రప్రదేశ్‌లో అత్యంత ప్రాచీన చారిత్రాత్మక స్థలాల్లో భట్టిప్రోలు ఒకటిగా ప్రసిద్ధి చెందింది. ప్రాచీన కాలంలో ఆంధ్రాను పరిపాలించిన శాతవాహనుల కాలంలో ప్రసిద్ధికెక్కిన బౌద్ధ స్తూపం ఇక్కడ నిర్మించబడింది. బుద్ధుని అవశేషాలతో నిర్మించబడిన ఈస్తూపం బౌద్ధక్షేత్రంగా పేరొందింది. ఆంధ్రుల చరిత్ర భట్టిప్రోలులోనే ప్రారంభమైందని 'పట్టావళి' వంటి జైనగ్రంథాలలో యదార్థ, చారిత్రక అంశాలు ఉన్నాయి. క్రీస్తు తర్వాత 8వ శతాబ్దానికి చెందిన జైనకవి రాసిన నయసేనాని 'ధర్మామృతకావ్యం'ను బట్టి యశోధరుడనే ఇక్ష్వాకుల రాకుమారుడు దక్షిణ దేశానికి వలసవచ్చి వేంగి రాజ్యంలోని ప్రరీపాలపురం రాజధానిగా రాజ్యపాలన చేశాడు. ఇదివసు పూజ్యాచార్యుని కాలంలో (క్రీస్తు పూర్వం 5వ శతాబ్దం) జరిగింది. ప్రరీపాలపురమే భట్టిప్రోలు అని చరిత్రకారులు గుర్తిస్తున్నారు. భట్టిప్రోలు ప్రాశస్త్యం క్రీ.శ.1870 నుంచి వెలుగులోకి రాసాగింది. జాతక కథలనుబట్టి బుద్ధుని కాలంలోనే బౌద్ధధర్మాన్ని ఆంధ్రులను ఎంతో ఆకర్షించింది. ఈబౌద్ధ మతానికి ప్రతీకంగా ఆంధ్రప్రదేశ్‌లో భట్టిప్రోలు, అమరావతి వంటి ప్రాంతాలు ప్రధాన కేంద్రాలుగా వుండేవి. మార్కాపురం తాలూకాలోని చంద్రగిరి, గిద్దలూరు తాలూకాలోని ధూపాడులవద్ద బయల్పడిన శాసనాల ద్వారా బౌద్ధ మతాన్ని ఈ ప్రాచీన కట్టడాలగూర్చి తెలియజేస్తున్నాయి.

ఆంధ్రలో ముఖ్యంగా బౌద్ధకేంద్రాలుగా భట్టిప్రోలు, అమరావతి, ఘంటసాల, జగ్గయ్యపేట, నాగార్జుకొండ, నందలూరు, చినగంజాం, గుంటుపల్లి, తిరుమలగిరి, కామిరెడ్డిపల్లి తదితర ప్రాంతాల్లో వుండేవి. అలనాటి శాతవాహనుల కాలంలో బౌద్ధమతానికి చిహ్నంగా నిర్మించిన బౌద్ధరామం (బౌద్ధస్తూపం) నేటికీ భట్టిప్రోలులో ఉంది. భట్టిప్రోలు మిక్కిలి పవిత్రస్థలమైంది. బ్రిటీష్ వర్తకులైన రాబర్ట్ సూయల్ ఈ స్తూపం దర్శించేనాటికి ఈ స్తూపం శిలాఫలకాలు తవ్వి రోడ్లు, వెల్లటూరు కాల్వపై తూములు నిర్మించడంలో వాడారు. 1892లో ఈ స్తూపం తవ్వడం ప్రారంభించేనాటికి స్తూపంలో అధికభాగం నష్టపడింది. ఈ తవ్వకాల్లో చక్రాకార పునాదులపై నిర్మించిన బృహత్ స్తూపం బయల్పడింది. స్తూపం వ్యాసం 132 అడుగులు. స్తూపం మధ్య ఆమూలాగ్రంగా ఇటుకలు అమర్చబడి పద్మాకారంలో ఉన్నాయి. శిలాచరిత్ర శిథిలాలు స్తూపం ఆవరణలో దొరికాయి. స్తూపం చుట్టూ ప్రదక్షిణాపథం, దాని అంచున పాలరాయి ప్రాకారం వుండేది. ప్రాకార వ్యాసం 148 అడుగులు, ప్రాకార స్తంభాలు కూడా బయల్పడ్డాయి. స్తూపం ఆవరణ వైశాల్యం 1700 చదరపు అడుగులు. భట్టిప్రోలు స్తూపం యథార్థమైన బుద్ధధారువుపై నిర్మించినట్లుగా స్పష్టంగా తెలుస్తోంది. అశోకచక్రవర్తి నిర్మించిన స్తూపాల్లో ఉన్న వేయదార్థమైన బుద్ధధాతువులు మిగిలినవి లభించినటువంటి (ధారువులు) బుద్ధునివి కావు. శాసనాలను బట్టి భట్టిప్రోలు స్తూపం అశోకుని కాలంలో నిర్మించబడింది. ఇంతవరకు లభ్యమైన కొన్ని శిల్పాలను అమరావతి, హైదరాబాద్, చెన్నై, లండన్, ప్యారిస్ మ్యూజియంలలో నేటికీ భద్రంగానే ఉన్నాయి. నాజూకైన అంగసౌష్టవం, భావవ్యక్తీకరణ ఈ శిల్పాలలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అందుచేతనే ఈ శిల్పాలు ప్రపంచ ప్రఖ్యాతి గాంచినవి. ఆగ్నేయ ఆసియా దేశంలో కూడా ఈ శిల్పరాతులను చూడవచ్చును. భట్టిప్రోలులోని ఈ ప్రాచీన కట్టడానికి కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు పురావస్తు ప్రదేశం, అవశేషాల చట్టం 1958 (నవంబరు 24, 1958) కింద దేశ ప్రాముఖ్యత నెలకొన్నదిగా ప్రభుత్వాలు ప్రకటించాయి. రాష్ట్రంలో చారిత్రాత్మక బౌద్ధమత ప్రాధాన్యత కలిగిన బౌద్ధారామాలకు మరమ్మతులు జరిపి సందర్శకులను ఆకర్షించేందుకు కేంద్రప్రభుత్వం వినూత్న కార్యక్రమం చేపట్టింది. ప్రస్తుతం ఫెన్సింగ్ వర్క్ పూర్తయింది. వసతిగృహం, బోర్‌వెల్, బెంచీల సౌకర్యం ఏర్పాటు చేయడం కూడా జరగనున్నట్లు అధికారులు తెలిపారు. అమరావతి స్తూపం మాదిరిగానే భట్టిప్రోలు బౌద్ధస్తూపాన్ని కూడా తీర్చిదిద్దడం ఈప్రాంత వాసులకు గర్వ కారణం.

# దీపావళి, రంజాన్, ఆంధ్ర రాష్ట్ర అవతరణ అర్ధ శతాబ్ది ఉత్సవాల శుభాకాంక్షలతో...


శ్రీమతి సోనియాగాంధీ
ఎఐసిసి అధ్యక్షురాలు


శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు


స్వర్గీయ కాసు బ్రహ్మానందరెడ్డి


స్వర్గీయ కాసు వెంగళరెడ్డి

'మా అక్షరం మీ ఆయుధం' అనే నినాదంతో ప్రజాపత్రిక ఎనలేని అభిమానాన్ని సంపాదించు కొన్న 'ఆంధ్రజ్యోతి' దిన పత్రిక అభివృద్ధి దిశలో పయనిస్తూ, మూడు వసంతాలు పూర్తి చేసుకొన్న శుభతరుణంలో ఆంధ్రజ్యోతి యాజమాన్యానికి, సిబ్బందికి హృదయ పూర్వక శుభాకాంక్షలు... జిల్లా ప్రజానీకానికి శత వసంతాల శుభాకాంక్షలు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడి 50 సంవత్సరాలు పూర్తి చేసుకొన్న శుభతరుణంలో, గుంటూరు జిల్లా ఏర్పడి వంద వసంతాలు పూర్తి చేసుకొన్న సందర్భంలో జిల్లా ప్రజానీకానికి హార్ధిక శుభాకాంక్షలు..

స్వాంతంత్రోద్యమంలో కీలక పాత్ర పోషించిన గుంటూరు జిల్లా తెలుగు సీమ కీర్తి కిరీటంలో కలికితు రాయిగా బాసిల్లుతున్నది. చారిత్రక, సాంస్కృతిక, వ్యాపార, సాహిత్య రంగాలలో జిల్లా రాష్ట్రంలోనే తన దైన ముద్ర వేసింది. గణనీయమైన వ్యవసాయ ఉత్పత్తులతో జిల్లా వాసికెక్కింది. పొగాకు, పత్తి, మిరప పంటల సాగుకు కేంద్రంగా నిలిచింది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణంతో జిల్లా వ్యవసాయ రంగం దశ తిరిగింది. లక్షలాది ఎకరాల్లో జొన్న, సజ్జ పంటల స్థానంలో వరి సాగు చేస్తున్నారు. రాష్ట్ర వ్యవసాయ దిగుబడుల్లో జిల్లా నుంచే అత్యధిక శాతం వస్తున్నాయి. గత మూడేళ్ళు కరువును అధిక మించి, ఈ ఏడాది సాగర్ జలాల పరవళ్ళుతో లక్షలాది ఎకరాల్లో పంట సాగు అవుతున్నది. గత ఏడాది వరకు వలస వెళ్ళిన కూలీలు తిరిగి స్వగృహాలకు చేరుకొన్నారు. కాంగ్రెస్ అధికారాన్ని చేపట్టిన తరువాత జిల్లాకు సాగు నీటి కొరత తీరి పోయింది. విద్యా, వైద్య, వ్యవసాయం, సాగు నీరు రంగాల్లో విశేష మైన ప్రగతిని సాధించింది. రాష్ట్ర ఆర్థికాభివృద్ధిలో జిల్లాదే ప్రథమ స్థానం. మరెంతగానో జిల్లా అన్ని రంగాల్లో అభివృద్ధి పథంలో పయనించాలని ఆకాంక్షిస్తున్నాను. జిల్లా ప్రజలకు దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు తెలియజేస్తూ, ఈ పర్వదినాలు అందరి లోగిళ్ళల్లో సుఖ సంతోషాలు నింపాలని ఆకాంక్షిస్తున్నాను.

రాజకీయ చైతన్యానికి వేదికైన నరసరావుపేటను శాంతిపేటగా మార్చే లక్ష్యంతో పయనిస్తున్నాం. శాంతి నెలకొల్పడంతో పాటు, ప్రగతి పనుల రూపకల్పన చేస్తున్నాం. మౌలిక వసతుల కల్పనతో ప ట్టణం, గ్రామాల సర్వతో ముఖాభివృద్ధికి నా వంతు కృషి చేస్తున్నాను. దీనిలో భాగంగా పల్లెపల్లెకు కాసు, పట్టణంలో రాత్రిళ్ళు బస కార్యక్రమాలను రూపొందించు కొని, వీటి ద్వారా ప్రజలను కలుస్తూ, ప్రజలకు, అధికారులకు మధ్య వారధిగా ఈ కార్యక్రమాలను నిలిపి, ప్రజల సమస్యల తక్షణ పరిష్కారానికి కృషి జరుగుతున్నది.



**ప్రతి గుండెలో శాంతి, సంతృప్తి ఇదే మన లక్ష్యం...**
**అందుకే అందరి కోసం ప్రతి ఒక్కరం సమిష్టిగా శ్రమిద్దాం.**
**చేయి చేయి కలుపుదాం. నియోజక వర్గ అభివృద్ధి**
**సాధనకు పునరంకిత మవుదాం.**

సదా మీ సేవలో...

# కాసు కృష్ణారెడ్డి

## నరసరావుపేట, శాసనసభ్యులు

# అద్వితీయ వాగ్గేయకారులు నారాయణతీర్థయతీంద్రులు

(ఆన్‌లైన్, గుంటూరు)

తపశ్శక్తి, అకుంఠిత దీక్షతో తెలుగు తేజాన్ని ప్రపంచ సంగీత వినువీధిలో ప్రసరింప చేసిన అద్వితీయ వాగ్గేయకారుడు నారాయణతీర్థ యతీంద్రులు. సంగీత ప్రపంచంలో 'రత్నత్రయం'గా ఖ్యాతి గడించిన శ్యామశాస్త్రి, త్యాగరాజ స్వామి, ముత్తుస్వామి దీక్షితార్‌లు నారాయణతీర్థ యతీంద్రులను అనుసరించినవారే. సంగీత విద్వాంసుడిగానే కాక వేదాంత, తర్క, గణిత, మీమాంసాది శాస్త్రాలలో ఎన్నో గ్రంథాలను రచించిన మహనీయుడు ఆయన. మంగళగిరి సమీపంలోని 'కాజ' ఆయన జన్మస్థలం. ఈ గ్రామాన్ని నారాయణతీర్థ వంశీయులకు రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు దానం ఇచ్చారు. ఆయన తల్లావఝుల నీలకంఠశాస్త్రి, పార్వతీదేవి దంపతులకు క్రీస్తు శకం 1650 ఆషాఢశుద్ధ ఏకాదశినాడు జన్మించారు. ఆయన అసలు పేరు గోవిందశాస్త్రి. బాల్యంలో వాసుదేవశాస్త్రి వద్ద విద్యనభ్యసించారు. అనంతరం ఆయన దీక్ష తీసుకొని నారాయణతీర్థులయ్యారు. ఆయనకు వేదాద్రికి చెందిన అచ్చమ్మతో వివాహం జరిగింది. ప్రథమ సమాగమం కోసం అత్తింటికి వెళ్లడానికి గింజుపల్లి వద్ద కృష్ణానది దాటుతుండగా, నది మధ్యలో హఠాత్తుగా వరద వచ్చింది. ఈత తెలిసిప్పటికీ ఆయన వరద ఉరవడికి కొట్టుకుపోయారు. వరదలో చిక్కుకుని మరణించాడని భావించిన ఆయన కుటుంబ సభ్యులు కుటుంబ సంప్రదాయాన్ని అనుసరిం పోక్షహేతు అనే మానసిక సన్యాసాన్ని స్వీకరించారు. అయితే, విధి విచిత్రమైంది. వరద ప్రవాహంలో చిక్కుకున్న నారాయణ తీర్థ యతీంద్రులు, వరదప్రవాహ ఉధృతి తగ్గడంతో ఒడ్డుకు చేరుకున్నారు. ఆయన తన అత్తగారింటికి వెళ్లారు. భార్య అచ్చమాంబకు ఆయన భర్తగా కాక సన్యాసి వలే కనిపించాడు. నారాయణ తీర్థులు కూడా భార్య అనుజ్ఞను అర్థించి సన్యాసాశ్రమానికి అనుమతి పొందారు. అనంతరం ఆయన తన స్వగ్రామం కాజ వచ్చి, కుటుంబ వ్యవహారాలు అన్నింటిని సమీప బంధువులకు అప్పగించి కంచి వెళ్లి శివ రామానందతీర్థుల వద్ద దీక్ష తీసుకున్నారు. తరువాత ఆయన కాశీ వెళ్లారు. కాశీలో సుదీర్ఘకాలం తపస్సు చేసి అనేక గ్రంథాలను రచించారు. భగవన్నామాన్ని నృత్య సహితంగా గానం చేస్తూ తన శిష్యబృందంతో దేశ వ్యాప్తంగా పర్యటించి, ప్రజలను చైతన్యపరిచారు. రామాయణంపై విశిష్ట వ్యాఖ్యానం చేసిన ఆంధ్రమహేశ్వర తీర్థులు, కూచిపూడి నాట్య బ్రహ్మ సిద్ధేంద్ర యోగి, నామ సంకీర్తన ప్రభువు బోధేంద్రస్వామిలు నారాయణతీర్థ శిష్యులే. శ్రీ త్యాగరాజస్వామి గురుదేవులు శొంఠి వెంకటరమణయ్య, ఆయన తండ్రి శొంఠి సుబ్బయ్యలు నారాయణతీర్థ వద్ద సంగీతాధ్యయనం చేశారు. ప్రవృత్తి, నివృత్తి మార్గాలను అనుసరించిన రామకృష్ణపరమహంసకు ఆయన పరోక్షగురువని తెలుస్తుంది. చైతన్యస్వామి, భక్తరామదాసు, మీరాబాయి వీరికి సమకాలికులు.

తన శిష్యుడైన సిద్ధేంద్రయోగితో కలిసి పూరి జగన్నాథస్వామిని సేవించి, పిఠాపురం చేరుకున్నారు. కోలవెన్ను జమీందారుచే కూచిమంచి అగ్రహారాన్ని దానంగా పొంది, అక్కడ నుంచి అంతర్వేదికి చేరుకున్నారు. పాలకొల్లు, నరసాపురం, భీమవరం, కైకలూరు, పరిసర ప్రాంతాలలో భక్తజనులను ప్రబోధించారు. అక్కడ నుంచి ఆయన మండపల్లి, గుడివాడ, ఆగిరిపల్లి, సిద్ధాంతం, మచిలీపట్నం, కూచిపూడి, శ్రీకాకుళంలను దర్శించారు. కొంతకాలం శ్రీకాకుళం స్వామిని సేవించి, రేపల్లె తాలూకా వెల్లటూరుకు వెళ్లారు. వెల్లటూరులో కొంతకాలం తపస్సు చేసి, సింగరాయకొండకు వెళ్లారు. అనంతరం ఆయన తిరుమల వెళ్లి, కొంత కాలం గడిపారు. కంచి, గోవిందపురం, నడుకావేరీ, తిరువయ్యూరు, భూపతిరాజపురం, వరహూరులలో పర్యటించారు. చివరకు ఆయన తిరుపందుర్తిలో ఒక మామిడి చెట్టు కింద తపస్సు చేసి, జీవసమాధి పొందారు. నేటికి ఆ ప్రాంతమంతా నారాయణతీర్థయతీంద్రుల ప్రభావానికి లోనై వుంది. ఈ ప్రాంతంలో ప్రతి సంవత్సరం మాఘశుద్ధ అష్టమితో కలుపుకుని మూడు రోజులు నారాయణతీర్థ యతీంద్రుల ఆరాధన ఉత్సవాలుజరుగుతాయి.

# మార్క్సిస్ట్ తత్వవేత్త

# పులుపుల శివయ్య

(ఆన్‌లైన్, వినుకొండ)

"వర్ణధర్మాలున్న ఉక్కుచట్రం పగిలి మాల కన్నమదాసు మనస్సైన సుతుడుగా వీర వైష్ణవ మెచ్చురా! పలనాడు వెలలేని మాగాణిరా" లాంటి గేయాలు రచించిన భారత స్వాతంత్ర్య పోరాట సమరయోధుడు, మార్క్సిస్టు తత్వవేత్త, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత పులుపుల వెంకట శివయ్య 1910వ సంవత్సరంలో రొంపిచర్ల గ్రామంలో సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ప్రాథమిక విద్యను అక్కడే పూర్తిచేసిన అనంతరం బెనారస్‌లో బిఎస్సీ ఆనర్స్ చదువుతూ మార్క్సిస్టు తత్వవేత్తగా మారారు. మార్క్సిజాన్ని గురించి చిన్నచిన్న కథల్లో బెబుతున్నందుకు ఆయన్ను 'తాత' అని పిలవడం బెనారస్‌లో పరిపాటయింది. అక్కడ ప్రొఫెసర్‌గా పనిచేసిన ఆరెస్సెస్ మాజీ అధినేత గురూజీ, రేంగ్డేజీలు శివయ్యను తమ వైపు తీసుకెళ్ళడానికి ప్రయత్నాలు జరిపినా ఆయన భావాలు కమ్యూనిజం వైపు ఉండడంతో అందులోకి వెళ్లలేకపోయారు. చదువు ఆపేసిన అనంతరం బెనారస్ నుంచి గంగాజలాన్ని కాకుండా మార్క్సిజాన్ని తెచ్చి ఆంధ్రలో వెదజల్లారు. అనాడు జరుగుతున్న స్వాతంత్ర్య ఉద్యమ పోరాటాల్లో ప్రధానపాత్ర వహిస్తూ కాంగ్రెస్‌లో అతివాదిగా శివయ్య పేరు పొందారు. సైమన్ గోబ్యాక్ ఉద్యమాన్ని ఆంధ్రకేసరి నడిపినప్పుడు ఆ పోరాటంలో పులుపుల యువ సోషలిస్టులకు నాయకత్వం వహించి పోరాడారు.



చౌరా-చారీ రైతు పోరాటం ఉధృతం సమయంలో మహాత్మాగాంధీ ఉద్యమాన్ని ఆపివేయగా అనేకమంది అతివాదులు ఉద్యమాన్ని తిరిగి నడపాలని నిర్ణయించినప్పుడు శివయ్య కాంగ్రెస్ నుంచి కమ్యూనిస్టుల వైపు ఆకర్షితులైన వారనిలో ఒకరు.

అప్పటినుంచి ఆంధ్రరాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి, నెల్లూరు జిల్లాల్లో రహస్యంగా బహిరంగంగా ఉద్యమం నడిపారు. కొత్తపట్నం, మంతెనవారిపాలెంలో రాజకీయ పాఠశాలకు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. శివయ్య తన జీవితకాలంలో నాలుగేళ్లు రహస్య జీవితాన్ని గడిపారు. ఆయన జైలు జీవితం అనుభవిస్తున్నప్పుడు ప్రముఖ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత డాంగే రచించిన 'ప్రిమిటన్ కమ్యూనిజం టు స్లేవ్ ఇండియా' అనే ఆంగ్ల పుస్తకాన్ని ఆదిమ కమ్యూనిస్టు సమాజం నుంచి బాని సమాజం'గా తెలుగులోకి అనువదించారు. అలాగే చైనా ప్రజాస్వామ్యం అనే పుస్తకాన్ని కూడా తెలుగులోకి అనువదించారు. వీటితోపాటు అనేక రచనలు, గేయాలు రచించారు. ఆయన రచించిన 'పల్నాడు వెలలేని మాగాణిరా' అన్న గేయం బహుళ జనాదరణ పొందినది. ఆగేయాన్ని పలనాటి పౌరుషం సినిమాకు కూడా తీసుకున్నారు. ఆయన రాజకీయ పాఠశాలలో శిక్షణ పొందిన ప్రముఖుల్లో నక్సలైట్ నాయకుడు కొండపల్లి సీతారామయ్య, సిపిఐ అగ్రనేత చండ్ర రాజేశ్వరరావు ఉన్నారు. విశాలాంధ్ర పత్రికలో శివయ్య కొద్దిరోజులు సంపాదకత్వ బాధ్యతలు కూడా నిర్వహించారు.

1952లో వినుకొండ నుంచి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా విజయం సాధించి ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ఉపసభాపతిగా చేసి పులుపుల శివయ్య రాణించారు. అనంతరం 1962లో తిరిగి ఎమ్మెల్యేగా గెలుపొందారు. ఆయన కొంతకాలం పాటు వినుకొండ పంచాయతీ సర్పంచ్‌గా కూడా పనిచేశారు. రాష్ట్రంలో జరిగిన అనేక పోరాటాలకు నాయకత్వం వహించి ప్రత్యేక ఆంధ్ర ఉద్యమానికి వ్యతిరేకంగా విశాఖ ఉక్కు- ఆంధ్రుల హక్కు ఉద్యమానికి మద్దతుగా తన శాసన సభ్యత్వానికి రాజీనామా చేసి సంచలనం సృష్టించారు. వినుకొండ ప్రాంతంలో తొలిసారిగా అటవీ పుల్లరి వ్యవసాయ ఉద్యమం నడిపి రాష్ట్రవ్యాప్తంగా పుల్లరిని రద్దుచేయించిన పోరాట యోధుడు శివయ్య. ప్రముఖ రచయిత తుమ్మల వెంకటరామయ్య, పరకాల పట్టాభిరావు, వాసుదేవరావులు సమకాలీన రచయితలు కాగా, నీలం రాజశేఖరరెడ్డి శివయ్య రాజకీయ సహచరులు. 1979లో రష్యా కమ్యూనిస్టు శాంతిసంఘాల ఆహ్వానం మేరకు రష్యావెళ్లిన పులుపుల శివయ్య అక్కడే తన తుదిశ్వాస విడిచారు. అక్కడి నుంచి తెచ్చిన ఆయన చితాభస్మంతో వినుకొండ ప్రధానకూడలిలో ఆయన పేరుతో కమ్యూనిస్టు పార్టీవారు స్మారక స్థూపాన్ని నిర్మించారు.

శివయ్యస్థూపం సెంటర్ పేరుతో వినుకొండలో ప్రసిద్ధి గాంచింది. స్థూపం వద్దే వేదిక నిర్మించడం వల్ల రాజకీయపార్టీల సభలు, సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతుంటాయి. వినుకొండలో ప్రతియేటా శివయ్యవర్ధంతి, జయంతి సభలు అమరవీరుల పేరుతో ఘనంగా నిర్వహిస్తారు. గుంటూరులోని న్యాయవాది లక్ష్మీనారాయణ పులుపుల శివయ్య పేరుతో ట్రస్టు ఏర్పాటుచేసి ప్రతియేటా అభ్యుదయ రచయితల సమ్మేళాన్ని జరుపుతారు. 'వెనక తరములు వీర చరితల సిరులు నర్పోసి త్యాగంబు, పోరెట్టి పెంచరా' అన్న పులుపుల శివయ్య గేయం స్ఫూర్తితో నేటితరం ఆయనను ఆదర్శంగా తీసుకోవాల్సిన ఆవశ్యకత వుంది.

# దుర్గి శిల్పాలు..సృష్టికే అందాలు

(27వ పేజీ తరువాయి)
ఏర్పాటుచేసి 15 మంది శిల్పులకు శిక్షణా కార్యక్రమం నిర్వహించింది.

## దుర్గి శిల్పులకు సముచిత సత్కారం

మురిపాలు జాలువారే దుర్గి శిల్పాలు సందర్శకులను ఇట్టే ఆకట్టుకుంటాయి. అందుకే కళాభిమానులు ఇక్కడ శిల్ప కేంద్రాలను ఒక్కసారైనా తనివితీరా చూడాలని ఉవ్విళ్ళూరుతుంటారు. 1984లో హైదరాబాద్‌లో వినాయక చవితి ఉత్సవాల సందర్భంగా నిర్వహించిన 'విఘ్నేశ్వర విగ్రహప్రదర్శన'లో దుర్గి విగ్రహాల అందచందాలను తిలకించిన ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావు మంత్రముగ్ధులై దుర్గి శిల్పుల శిల్ప కళా నైపుణ్యాన్ని ప్రశంసిస్తూ ఘనంగా సన్మానించారు. అంతటితో ఆగక ఆ తరువాత కొద్ది కాలానికే ఆయన తన సతీమణి లక్ష్మీపార్వతితో వచ్చి దుర్గి శిల్ప కళాకేంద్రాలను స్వయంగా సందర్శించి ఆనందించారు. మాజీ ముఖ్యమంత్రి టి.అంజయ్య కూడా దుర్గి శిల్పుల కళా సేవకు గుర్తుగా శిల్ప కళాకేంద్రం ప్రధానాచార్యులు ఈశ్వర భిక్షమాచారిని సముచిత రీతిన సన్మానించి సత్కరించారు.

1996లో 'స్టోనా 96' పేరిట బెంగుళూరులో నిర్వహించిన ప్రపంచ శిల్ప విగ్రహ ప్రదర్శనలో పాల్గొనే నిమిత్తం కేంద్ర ప్రభుత్వం దుర్గి శిల్ప కళా కేంద్రానికి ఆహ్వానం పంపడం ఈ శిల్ప కళా కేంద్రం గొప్పతనానికి నిదర్శనం.

## ప్రభుత్వం చేయూతనిస్తే శిల్పకళకు పునరుజ్జీవం

కఠిన శిలలపై శిల్పాలు చెక్కి సృష్టికి అందాలు తెచ్చినా తమకు మాత్రం మోడుబారిన జీవితమే మిగులుతున్నదని దుర్గి కళాకారులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఆరు అడుగుల శిల్పం చెక్కాలంటే ఇరువురు శిల్పులు నెల రోజుల పాటు శ్రమించాలని, శిల్పంలో ఏ ఒక్క భాగం దెబ్బతిన్నా తమ శ్రమ అంతా వృథా అవుతుందన్నారు. తపోదీక్షను మించిన పట్టుదలతో మలచిన శిల్పాలను గిరాకీవున్న ప్రాంతాలకు తరలించి విక్రయించే స్థోమత తమకు లేదని ప్రభుత్వమే తమ శిల్పాలను కొనుగోలు చేసి ఆదుకోవాలని వీరు కోరుతున్నారు. శిల్పాలు చెక్కడానికి, చెక్కిన శిల్పాలను భద్రపరచడానికి వసతి లేక అద్దె భవనాలలో శిల్పశాలలను నిర్వహిస్తున్నామని వారు పేర్కొన్నారు. ప్రభుత్వం ఆర్థిక రుణ సాయం చేస్తే శిల్ప కళా కేంద్రం నిర్మించుకొని శిల్ప కళారాధనకే అంకితమవుతామని స్థానిక శ్రీ వెంకటేశ్వర శిల్ప కళాశాల శిల్పులు అభిప్రాయపడుతున్నారు. శిలలను తేలిగ్గా తొలచడానికి యంత్ర పరికరాలు అందుబాటులో వున్నా వాటిని కొనే స్థోమత లేక ఉలి, సుత్తి వంటి సాంప్రదాయ పనిముట్లతోనే కాలం వెళ్ళబుచ్చుతున్నామన్నారు. శిల్ప కళాభివృద్ధికి ప్రభుత్వం హైస్కూల్ స్థాయిలో ప్రతి క్లాస్‌కు వారానికి ఒక పిరియడ్ చొప్పున కేటాయించి శిల్పాచార్యులచే శిల్పకళపై విద్యార్థులకు శిక్షణ ఇప్పించాలని శిల్పి ఎర్రోజు నరసింహాచారి ప్రభుత్వానికి సూచించారు. దుర్గిలో లభ్యమవుతున్న శిల్ప తయారీకి ఉపయోగపడే ముడి సరుకు క్వారీలను స్థానిక శిల్పులకు ఉచితంగా కేటాయించాలని దుర్గి శిల్ప కళాకారుల సంఘం అధ్యక్షుడు చెన్నుపాటి సీతారామయ్య ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నారు. ఇక్కడి ముడిరాయి అక్రమంగా ఇతర రాష్ట్రాలకు తరలిస్తున్న చోరుల ఆట కట్టించాలని కోరుతున్నారు.

శిల్ప కళకు కాణాచి అయిన దుర్గిలో ఆ కళ మున్ముందు కూడా ఇలాగే పల్లవించాలంటే ప్రభుత్వ ప్రోత్సాహం తప్పనిసరి. దేశంలో అంతిమ దశకు చేరి కళావిహీనమైన శిల్ప కళకు సజీవ చైతన్యం కల్పిస్తున్న శిల్పులను ఆదుకొనే ఆవశ్యకతను గుర్తించాలి. ప్రభుత్వ ఉద్యోగాల కోసం వెంపర్లాడక శిల్పకళనే జీవనోపాధిగా మలచుకొని అనల్ప శిల్ప కళాచాతుర్య శక్తితో అపురూప కళాఖండాలను వెలయిస్తున్న దుర్గి శిల్పుల కృషి అభినందనీయం.


శిల్పానికి తుదిమెరుగులు దిద్దుతున్న శిల్పి మంగళగిరి ఆంజనేయులు


శంకుచక్రధారి శ్రీ వెంకటేశ్వరస్వామి


నల్లనయ్య రూపు ఎర్రని శిలపై...

# గుంటూరు చరిత్రలో ముఖ్య ఘట్టాలు

(ఆన్‌లైన్, గుంటూరు)

* 1752 హిందూ కాలేజీ ప్రాంతంలో ఫ్రెంచి వారి స్థావరాలు వుండేవి.

* 1763 లాలాపేట పెద్ద మసీదు నిర్మాణం

* ఉత్తర సర్కారు మొత్తం ఇంగ్లీషువారి పరిపాలన లోవుంది.

* 1788 నాటికి బ్రిటీష్ పాలన రాలేదు.

* 1810లో మస్తాన్ దర్గా నిర్మాణం జరిగింది.

* 1843లో కోడిగుడ్ల సత్రం నిర్మాణం జరిగింది

* 1844లో గన్‌దొర బోధకుడిగా వచ్చి గన్ దొర బంగళా ఏర్పాటయింది

* 1846లో చలమయ్య సత్రం నిర్మాణం జరిగింది

* 1818లో గుంటూరులో జిల్లాకోర్టు కార్యాలయం ఏర్పాటు జరిగింది

* 1865లో నల్లచెరువు కోనేరు కట్టబడింది.

* 1865 దేవరాజు వంశీకులు జిల్లా కోర్టు శిరస్తాదారు జగన్నాధ రావు పంతులుచే ఆర్ అగ్రహారం కోనేరు నిర్మాణం జరిగింది.

* 1869లో మద్రాసు బ్యాంకు స్థాపన.

* 1885లో అమెరికా వారిచే ఎసి కాలేజీ ఏర్పాటుజరిగింది.

* 1888లో విజయవాడ నుంచి బళ్లారి వరకు రైలు మార్గం జరిగింది.

* 1904లో కూరగాయల మార్కెట్ ఏర్పాటు.

* 1904లో చేపల మార్కెట్ ఏర్పాటు.

* 1904లో భారతదేశంలో భాషా రాష్ట్రాలు కావాలని గుంటూరు గాంధీ పార్కు నుంచి నాదం ఇవ్వబడింది.

* 1905లో పసుపులేటి కృష్ణమనాయుడుచే వెంగళాయపాలెం నుంచి గుంటూరు కు మంచినీళ్ల పథకం ప్రారంభం.

* 1914లో గుంటూరు నుంచి తెనాలి రైలుమార్గం ప్రారంభం.

* 1926లో గుంటూరు ఎసి కాలేజీలో బి ఎ క్లాసులు ప్రారంభం.

* 1927లో గుంటూరు నుంచి మాచర్లకు రైలుమార్గం ప్రారంభం.

* 1911లో గుంటూరులో కలెక్టర్ కార్యాలయం ఏర్పాటు.

* 1952-53లో జాగర్లమూడి పైలెట్ పథకం గొట్టముల ద్వారా మంచినీరు సరఫరా.

* 5-7-1954లో గుంటూరులో హైకోర్టు ఏర్పాటు.

* 9-9-90లో 9.50 కోట్లతో తక్కెళ్లపాడు మంచినీటి పథకం ముఖ్యమంత్రి డాక్టర్ ఎం.చెన్నారెడ్డిచే శంకుస్థాపన.

* 23-9-90న తక్కెళ్లపాడు నుంచి నీటి పథకం ముఖ్యమంత్రి చెన్నారెడ్డిచే ప్రారంభం.

# దేశ, విదేశాలలో ఖ్యాతినార్జించిన 'లాం'

(ఆన్‌లైన్, గుంటూరు)

'లాం' పేరు వ్యవసాయ పరిశోధనా రంగంలో దేశ విదేశాలలో సైతం మారుమోగుతోంది. తెల్లదోమను తట్టుకునే పత్తి వంగడాలను రూపొందించి జాతీయంగా ఖ్యాతినార్జించిన 'లాం' లోని ప్రాంతీయ వ్యవసాయ పరిశోధ నా స్థానంలోని ప్రగతి రైతాంగానికి అందుబాటులోకి వచ్చింది. దేశంలోనే కాకుండా విదేశాల్లో సైతం పేరెన్నికగన్న, తక్కువ కాలంలో అధిక దిగుబడి ఇచ్చే పత్తి, మిర్చి, అపరాలు వంటి పం టలలో అనేక రకాల వంగడాలను కనుగొన్న లాం ప్రాంతీయ పరిశోధనా స్థానానికి దేశంలో విశిష్టమైన స్థానం వుంది. వ్యవసాయరంగంలో మారుతు న్న పద్ధతుల కనుగుణంగా అనేక నూ తన వంగడాలను రూపొందించిన ఘ నత లాం పరిశోధనా స్థానం శాస్త్రజ్ఞులకే దక్కుతుంది. ప్రపంచంలో తొలిసారిగా శనగపచ్చ పురుగు, తెల్లదోమ వంటి చీడపీడలను తట్టుకుని అధిక దిగుబడినిచ్చే పత్తి వంగడాలైన ఎల్‌కె 861, ఎల్‌పిఎస్ 141 వంటి రకాలను కనుగొని లాం పరిశోధనా స్థానం విజయకేతనం ఎగురవేసింది. ప్రస్తుతం ఈ విత్తనాలు కావాలని పంజాబ్‌తోపాటు పొరుగుదేశమైన పాకిస్థాన్ కూడా మనదేశంపై ఒత్తిడి తెస్తున్నాయి. తెల్లదోమను తట్టుకునే ఇతర వంగడాలను కూడా శాస్త్రవేత్తలు రూపొందించారు. వాటన్నింటికి మించి మరో ప్రధాన వాణిజ్య పంట అయిన మిర్చిలో గత 25 సంవత్సరాల నుంచి దేశంలోని వివిధ రాష్ట్ర రైతాం గం వాడుతున్న జి-4, ఎల్‌సిఎ-235 వంటి విత్తనాలను లాం శాస్త్రవేత్తలు కనుగొన్నారు. మిర్చిలో ఘాటుతోపాటు అధిక దిగుబడినిచ్చే వంగడాలుగా ఇవి దేశ వ్యాప్తంగా ప్రసిద్ధికెక్కాయి. వీటిని గుంటూరు మిరప అని పిలుస్తారు. రాష్ట్రంలో అత్యంత సారవంతమైన నేల లు, అధిక దిగుబడినిచ్చే వంగడాలు, ఆధునిక పద్ధతిలో పండించే రైతాంగం వున్న ప్రాంతానికి ఈ వ్యవసాయ పరిశోధనా స్థానం అనేక రకాలైన సలహాలు, సూచనలు ఇవ్వడమే కాకుండా రై తాంగానికి అవసరమైన శాస్త్రీయ పరిజ్ఞానాన్ని నిరంతరం అందిస్తూ వచ్చింది. మొత్తం 103 ఎకరాల్లో విస్తరించి వున్న లాంఫారంలో పత్తి, మిర్చి, అపరాలు వంటి పంటలపై పరిశోధన జరుగుతోంది. మాగాణి భూముల్లో పండించే మినుము, పెసర, కంది వంటి అపరాల పంటల్లో లాం శాస్త్రవేత్తలు పరిశోధన చేసి నూతన వంగడాలను కనుగొనడంతో గతంలో రాష్ట్రంలో లక్ష టన్నులు పండించే మినుము పంట ప్రస్తుతం నాలుగు లక్షల టన్నులకు చేరుకుంది. అదే విధంగా కంది పంటకు శనగపచ్చ పురుగు ఆశించి దిగుబడులు పడిపోయి తీవ్ర నష్టాలకు గురవుతున్న రైతాంగానికి లాంలోని ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా స్థానం శాస్త్రవేత్తలు కనుగొ న్న ఎల్‌ఆర్‌జి-30 రకం కంది విత్తనం శనగపచ్చ పురుగును తట్టుకొని నిలబడగలిగింది. కంది పంటను ఖరీఫ్‌లో కాకుండా రబీకి వేసే విధంగా అనువైన విత్తనాలు రూపొందించారు. దేశంలో తొలిసారిగా సోయాబిన్ విత్తనాలను అధిక దిగుబడి వచ్చే విధంగా రూపొందించి లాం శాస్త్రవేత్తలు నూతన ఒరవడి సృష్టించారు. కేవలం 65 రోజుల్లో కాపుకు వచ్చే ఎల్‌ఎస్‌వి-1 అనే నూతన వంగడాన్ని కనుగొని సోయాబీన్‌లో అద్భుతమైన పురోగతి సాధించారు. ఖరీఫ్, రబీ సీజన్లలో ఉపయోగపడటంతోపాటు పత్తిలో అంతర్ పంటలుగా సోయాబీన్ వేసేందుకు శాస్త్రవేత్తలు చేసిన కృషి విజయవంతమైంది. ఈ ప్రాంతీయ పరిశోధనా స్థానం కృష్ణా-గోదావరి జోన్‌లోని రైతాంగంతో మమేకమైంది. మిర్చిని విదేశాలకు ఎగుమతి చేసే విధంగా ఆ పంటపై పురుగుమందు అవశేషాలు లేకుండా చూసేందుకు సమగ్ర సస్యరక్షణ వంటి వినూత్న పద్ధతులపై లాంఫారం శాస్త్రవేత్తలు పరిశోధనలు జరుపుతున్నారు. ప్రస్తుతం లాంఫారం అసోసియేట్ డైరెక్టర్‌గా డాక్టర్ తిరుపతి రెడ్డి వ్యవహరిస్తున్నారు.


కృషీవలుడు విగ్రహం

## ఉప్పు సత్యాగ్రహంతో ఉద్యమించిన

# కొండా వెంకటప్పయ్య పంతులు

(ఆన్‌లైన్ - గుంటూరు)

బ్రిటీష్ సామ్రాజ్యవాదుల ఆదేశాలను ధిక్కరించి ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా తన ఇంటి ఆవరణలోనే వందలాది పొయ్యిలు పెట్టించి సముద్రపు నీరు తెప్పించి ఉప్పును తయారు చేయించిన మహానుభావుడు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు. వేలాది మంది ఉప్పు పొట్లాలు కట్టుకొని, నల్లజెండాలు పట్టుకొని గుంటూరు నగరం యావత్తు జాతీయ గీతాలతో హోరెత్తేలా ఉద్యమించిన మహనీయుడు వెంకటప్పయ్య పంతులు.

కొండా వెంకటప్పయ్య పంతులు 1866 ఫిబ్రవరి 22న గుంటూరులో జన్మించారు. చిరుప్రాయం నుంచే ఆయన దేశభక్తి, కళలపట్ల ఆసక్తిని ప్రదర్శించేవారు. రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో ఎఫ్ఎ చదివిన అనంతరం ఉన్నత విద్య కొరకు చెన్నై క్రిస్టియన్ కళాశాలలో చేరారు. 1887లో చెన్నైలో జరిగిన మూడవ జాతీయ కాంగ్రెస్ మహాసభలో ఆయన వాలంటీర్‌గా పని చేశారు. మహాసభలో ప్రముఖుల ప్రసంగాలు ఆయనపై తీవ్ర ప్రభావాన్ని చూపాయి. బిఎల్ పరీక్షను ఆయన ఫస్టు గ్రేడ్‌లో పాస్ అయ్యారు. సంఘ సేవకు, ప్రజాహిత కార్యక్రమాలకు కేంద్రంగా వున్న బందరులో 1894లో ఆయన న్యాయవాద వృత్తిని ప్రారంభించారు. తెలుగు ప్రజానీకంలో దేశభక్తి భావాన్ని ప్రజ్వరింపచేసిన కృష్ణా పత్రికకు 1902లో ఆయన ముఖ్య సంపాదకులుగా పని చేశారు. అవినీతి, అక్రమాలకు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా ఆయన రాసిన సంపాదకీయాలు తీవ్ర సంచలనం సృష్టించాయి. స్త్రీ పునర్వివాహ సంస్కరణల కొరకు కృషి చేసి బందరు, గుంటూరు నగరాలలో మంచి పేరు సంపాదించారు. నాడు బందరులోని నోబుల్ కళాశాలలో ఉపాధ్యాయుడుగా వున్న ప్రముఖ సంఘ సంస్కర్త రఘుపతి వెంకట రత్నంనాయుడు, నోబుల్ కళాశాలకు సర్వస్వం త్యాగం చేసిన కోపల్లె హనుమంతరావు, కృష్ణా పత్రిక ద్వారాసమాజాన్ని జాగృతం చేసిన ముట్నూరి కృష్ణారావు, భోగరాజు పట్టాభి సీతారామయ్యలతో ఆయనకు మంచి స్నేహం కుదిరింది. న్యాయవాద వృత్తిలో శ్రీ వెంకటప్పయ్య నైతిక ఉద్దరణకు ప్రాధాన్యం ఇచ్చారు. అహ్మదాబాద్‌లో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు ఆయన కృష్ణాజిల్లా ప్రతినిధిగా హాజరయ్యారు. 1905లో గుంటూరు జిల్లా ఏర్పడిన తరువాత ఆయన తన మకాంను గుంటూరుకు మార్చారు. 1906లో కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు హాజరయ్యారు. స్త్రీ విద్యావ్యాప్తి కొరకు పూనాలో వున్న మహిళా విద్యాలయం తరహాలో ఒక విద్యాలయాన్ని ఏర్పాటు చేయడానికి ఆయన విశేష కృషి సల్పి కొంత మొత్తంలో విరాళాలను సేకరించారు. తాను సేకరించిన ధనంతో ఆయన వేటపాలెంలో కొన్ని భవనాలను నిర్మించారు. కాని తగినన్ని విరాళాలు వసూలు కాకపోవడంతో ఆ కార్యక్రమం మధ్యలో ముగించవలసి వచ్చింది. గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులు స్థాపించిన శారద నికేతన్‌కు ఆయన పది వేల రూపాయల ఆస్తిని విరాళంగా అందజేశారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కొరకు కృషి చేశారు. ఈ నేపథ్యంలోనే ఆయన ఆంధ్రోద్యమం అనే గ్రంథాన్ని రచించారు. అనిబిసెంట్ ప్రారంభించిన హోమ్ రూల్ లీగ్ ఉద్యమాన్ని బలపరచి విస్తృతంగా ప్రచారం చేశారు. ఆయన న్యాయవాద వృత్తిని విడిచి మద్రాసు శాసనసభకు జరిగిన ఎన్నికలలో ఆయన జస్టిస్ పార్టీ అభ్యర్థిని ఓడించారు. ఆయన శాసనసభ్యుడిగా వున్నప్పుడు పౌర గ్రంథాలయాలకు గ్రాంట్లు ఇప్పించడమేకాక మహిళలు ప్రైవేటుగా మెట్రిక్ పరీక్షలు రాసేందుకు కృషి చేశారు. అనంతరం ఆయన పన్నుల సహాయ నిరాకరణ ఉద్యమం, చీరాల, పేరాల ఉద్యమం, పుల్లరి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమాలలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుడిగా కొండా వెంకటప్పయ్య, ప్రధాన కార్యదర్శిగా గొల్లపూడి సీతారామశాస్త్రి ఎన్నికైన తరువాత రాష్ట్రంలో సహాయ నిరాకరణ ఉద్యమం ఉప్పెనలా ఎగిసింది. అప్పటి నుంచి కొండా వెంకటప్పయ్యకు దేశభక్త అనే బిరుదు వ్యాప్తిలోకి వచ్చింది. 1921లో విజయవాడలో అఖిల భారత కాంగ్రెస్ మహాసభకు హాజరవ్వడానికి వచ్చిన మహాత్మాగాంధీతో కలిసి ఆయన పలు ప్రాంతాలలో పర్యటించారు. వెంకటప్పయ్య ఆధ్వర్యంలో రాష్ట్రంలో విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమం ఉధృతంగా సాగింది. గుంటూరులో నాడు ఆయన నేతృత్వంలో స్వరాజ్యరథ ఉత్సవం అత్యంత కన్నుల పండుగగా జరిగింది. వందలాది మంది స్త్రీలు జాతీయ గీతాలు పాడుతూ చేనేత వస్త్రాలు ధరించి రథాన్ని లాగిన దృశ్యం చూపరుల చేత కంట తడి పెట్టించింది. గయా కాంగ్రెస్ మహాసభ జరిగిన తరువాత చిత్తరంజన్‌దాస్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేయడంతో మధ్యేమార్గంగా వెంకటప్పయ్య ఎన్నికయ్యారు. 1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభ ఆహ్వానసంఘ అధ్యక్షుడిగా ఆయన ఎన్నికయ్యారు. ఖద్దరు వ్యాప్తి కొరకు ఆయన సీతారామశాస్త్రితో కలిసి ఇల్లిల్లూ తిరిగి విస్తృత ప్రచారం చేశారు. హరిజనోద్ధరణ కార్యక్రమంలో భాగంగా ఆయన మంతెనవారిపాలెం, కొవూరు గ్రామాలలో హరిజనుల దేవాలయ ప్రవేశం కార్యక్రమాన్ని ప్రారంభించారు. గుంటూరుకు సైమన్ వచ్చిన సందర్భంగా ఆయన నాటి మున్సిపల్ ఛైర్మన్ నడింపల్లి నరసింహరావు, ఉన్నవ లక్ష్మినారాయణలతో కలిసి నిర్వహించిన నగర హర్తాళ్ విజయవంతం అయింది. రౌండ్ టేబుల్ సమావేశం విఫలం అయిన తరువాత నిర్వహించిన సత్యాగ్రహంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. పలుమార్లు అరెస్టు అయి జైలుకు వెళ్ళారు. 1937లో మద్రాసు శాసనసభకు జరిగిన ఎన్నికలలో విజయం సాధించారు. జైలు శిక్ష అనుభవిస్తున్నప్పుడు ఆయన పలు గ్రంథాలను రచించారు. 1947లో ఆయన వెంకటేశ్వర సేవా నందలహరి అనే పద్యకావ్యాన్ని రచించారు. దేశ సేవలో తన తుది శ్వాస వరకు గడిపిన వెంకటప్పయ్య 1949 ఆగస్టు 15న కన్నుమూశారు.


కొండా వెంకటప్పయ్య



# గుంటూరంటే తెల్లదొరలకు దడ

(ఆన్‌లైన్, గుంటూరు)

అక్కడ స్వాతంత్ర్య ఉద్యమం ఉధృతంగా సాగుతున్నదా? అని 1932లో భారతదేశ గవర్నర్ జనరల్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన లార్డ్ వెల్లింగ్‌టన్ అధికారులను ప్రశ్నించారు. దీనిని బట్టి భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమంలో గుంటూరు ఎంత ప్రముఖ పాత్ర వహించిందో ఇట్టే అవగతం అవుతుంది. 1920లో సహాయ నిరాకరణ ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న తరుణంలో లార్డ్ వెల్లింగ్‌టన్ మద్రాసు రాష్ట్ర గవర్నర్‌గా వున్నారు. గుంటూరు జిల్లాలో సహాయ నిరాకరణ ఉద్యమం ఉధృతంగా సాగుతున్నది. ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి లార్డ్ వెల్లింగ్‌టన్ విఫలయత్నం చేశారు. వెల్లింగ్‌టన్ చేపట్టిన విద్రోహ చర్యలతో గుంటూరు జిల్లాలో సహాయ నిరాకరణ ఉద్యమం మరింత ఉధృతం అయింది. ఈ సంఘటన వెల్లింగ్‌టన్ మనోఫలకంపై చెరగని ముద్ర వేసింది. అదే సమయంలో పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమం, పల్నాడులో కన్నెగంటి హనుమంతు ఆధ్వర్యంలో పుల్లరి ఉద్యమాలు జరిగాయి. ఈ రెండు ఉద్యమాలను అణచివేయడానికి వెల్లింగ్‌టన్ అనేక ప్రయత్నాలుచేసి విఫలం అయ్యారు. ఈ ఉద్యమాలను అణచివేయడానికి బ్రిటిష్‌వారు చేసిన ప్రయత్నాల ఫలితంగా అనేక చోట్ల హింసాత్మక సంఘటనలు జరిగాయి. దీంతో లార్డ్ వెల్లింగ్‌టన్‌కు గుంటూరు జిల్లా అంటే దడ పుట్టింది. అనంతరం ఆయన భారతదేశ గవర్నర్ జనరల్‌గా 1932లో పదవీ బాధ్యతలు స్వీకరించారు. ఈ నేపథ్యంలో ఆయన గవర్నర్ జనరల్‌గా పదవీ బాధ్యతలు స్వీకరించిన వెంటనే 'గుంటూరు' ఎలా వుంది అంటూ అధికారులను ప్రశ్నించారు.

# ఆంధ్రజ్యోతికి తృతీయ వార్షికోత్సవ శుభాకాంక్షలు


శ్రీ వి. బాలశౌరి
ఎం.పి. తెనాలి


శ్రీ కె. కేశవరావు
పి.సి.సి అధ్యక్షులు


శ్రీ మన్మోహన్ సింగ్
ప్రధాని


శ్రీమతి సోనియా గాంధి
ఎ.ఐ.సి.సి అధ్యక్షురాలు


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
సహకార & రవాణ శాఖ మంత్రి


శ్రీ మురుగుడు హనుమంతరావు
ఎం.ఎల్.ఎ.,
మంగళగిరి




పత్రికా ప్రపంచంలో సరికొత్త ఒరవడిని సృష్టిస్తూ పునఃప్రారంభమైన అచిరకాలంలోనే అగ్రగామి పత్రికగా ప్రజల హృదయాలను గెలుచుకొని ... నాల్గవ వసంతంలోకి అడుగిడుతున్న 'ఆంధ్రజ్యోతి' కి , యాజమాన్యం వారికి, సిబ్బందికి అభినందనలు

## మంగళగిరిలో చేపడుతున్న అభివృద్ధి పనులు

- రూ. 10కోట్ల వ్యయంతో నియోజకవర్గంలో ఆర్ & బి. రోడ్ల అభివృద్ధి
- రూ. 7.5 కోట్ల వ్యయంతో కొండవీటివాగు ముంపు మళ్లింపు పథకం
- నూతన ప్యాకేజితో 'చేనేత' కు పునరుజ్జీవనం.
- రాజీవ్ గృహకల్పతో మంగళగిరిలో 2,500మందకి గృహవసతి
- ప్రత్యేక గ్రాంటు నిధులతో పట్టణంలోని మురికివాడల అభివృద్ధి
- సుమారు 3కోట్ల వ్యయంతో మునిసిపల్ షాపింగ్ కాంప్లెక్స్‌లు, రహదారుల అభివృద్ధి.

**శ్రీ మురుగుడు హనుమంతరావు**
మంగళగిరి మరియు
మంగళగిరి నియోజకవర్గ కాంగ్రెస్ కమిటి


డా॥ వై.ఎస్. రాజశేఖర రెడ్డి
ముఖ్యమంత్రివర్యులు,
ఆంధ్రప్రదేశ్

# వేయి సంవత్సరాల చరిత్ర కలిగిన కొండవీడు

(ఆన్‌లైన్, గుంటూరు)

యడ్లపాడు మండలంలో ఒక కుగ్రామంలా కనిపించే కొండవీడు ఒకప్పుడు నిత్యం నృత్య, సంగీత కోలాహలాలతో వీరుల సింహనాదాలతో, విజయగర్జనలతో దద్దరిల్లుతూ వుండేది. కోటపై నుంచి కిందికి దిగేవారేగానీ ఎదురు ఎక్కేవారే లేరనే స్థాయిలో సాగిన ఒక మహా సామ్రాజ్యానికి అది రాజధాని వినీల సాహిత్యాకాశంలో నెలవంకగా వెలిగిన సాహితీ వనం కొండవీడు. మనకు తెలిసిన కొండవీడు రెడ్డిరాజులకేగాక ఇంకా పూర్వం నుంచి పలు సామ్రాజ్యాలకు రాజధాని. నేటికీ 30 మైళ్ల విస్తీర్ణంలో నిశ్శబ్దానికి గత వైభవానికి సజీవ చిహ్నంగా,శిథిలావస్థలో కూడా తరగని రీవీతో నిలిచిన కొండవీడు కోట దాదాపు వెయ్యి సంవత్సరాల పాటు పరరాజు కన్నెత్తి చూడలేదు.

## యుగాంతరం నుంచి రాజధాని

భోజరాజు, భీష్మకుడు( ఇతని కాలంలో కుండిన పురం అనే పేరుతో వుంది) కూడా కొండవీడు రాజధానిగా వున్నట్లు దండకవిలే శాసనం ద్వారా తెలుస్తోంది. 12 సంవత్సరాలు పాలించిన గజపతి వంశక్షత్రియుడు విశ్వంభర దేవుడు ప్రప్రథమంగా కొండవీటి కొండపై కోటను నిర్మించారు. ఈ కొండపై నిర్మించిన కోటలు వెయ్యి సంవత్సరాల నాటివని చరిత్రకారులు అంచనా. ప్రోలయ వేమన రెడ్డి కొండవీడును పాలించినట్లు ఇక్కడి శాసనాలు చెబుతున్నాయి. అనవేమారెడ్డి తన రాజధానిని ధరణికోట నుంచి కొండవీడుకు మార్చినట్లు ఆంధ్రు చరిత్ర చెబుతోంది. కాని రెడ్డి రాజులకు కొండవీడే రాజధాని అన్నది పలువురి అభిప్రాయం. 11వ శతాబ్దంలో కరికాళ చోళుని కాలంలో జరిగిన


కోట గ్రామం పక్కన 16 స్తంభాల మండపం



అలనాటి కొండవీటి దుర్గం ఊహాచిత్రం

సీమల విభజన ఆధారంగా కృష్ణా, గుంటూరు, గోదావరి, నెల్లూరు, కర్నూలు జిల్లాల నడుమ ఈ రాజ్యం వ్యాపించివున్నట్లు రెడ్డి రాజుల శాసనాలు చెబుతున్నాయి. ఈ మహాసామ్రాజ్యం కొండవీడు, వినుకొండ, బెల్లంకొండ, నాగార్జున కొండ అను నాలుగు గిరిదుర్గాలుగా, 14 సీమలతో, 2048 గ్రామాలలో, 22,500 చదరపు మైళ్ల విస్తీర్ణంలో అత్యంత సమర్థవంతంగా పరిపాలించబడింది. కాకతీయుల అనంతరం ఏలినరెడ్డిరాజులు నెల్లూరు, గూడూరు తాలూకా ముట్టింబాక గ్రామానికి చెందిన వారు కావడంతో వీరు పంట రెడ్లుగా పేరుపొందారు. రెడ్డిరాజుల పాలనకు ఆద్యుడు కోమటి పోలారెడ్డి పసరువేది వల్ల ధనవంతుపైన వేములు అనే కోమటిని ఈ రెడ్లు హతమార్చి అతని ధనమును హరించిన కారణంగా వీరు తమ పేర్లకు కోమటి, వేమా పేరు తగిలించుకున్నారని ప్రతీతి. కొండవీటి సామ్రాజ్యానికి అద్దంకి రాజధానిగా ఉన్నప్పుడే కొండవీడు సమస్త హంగులతో సహజ రక్షణ వలయంగా రాజధానికి తగ్గ స్థాయిలో వుండేది. పటిష్టమైన రక్షణ నిమిత్తం వీరన్న పోతు బిరుదాంకితుడు అనపోతారెడ్డి హయాంలో కొండవీటి రాజ్య రాజధాని కొండవీడుకు మార్చబడింది. తరువాత కొండవీటి సామ్రాజ్య ప్రతిష్ట ఎంతగా పెరిగిందంటే ఈ రెడ్డి రాజులు కూడా కొండవీటి రెడ్లుగా పేరుపొందారు. కొండవీటి సామ్రాజ్య అస్థిత్వానికే పెను సవాలుగా నిలిచిన బహమనీ సుల్తాన్‌లు, పద్మనాయకులు, విజయనగరాధీశుల తీవ్ర దాడులను ఎదుర్కొన్న అనపోతారెడ్డి నిరంతరం యుద్ధాలతో మునిగి తేలిన వీరుడు. ఇతని కాలంలో సామ్రాజ్యం ఉత్తరాన మేకలపర్వతం, పడమటిన శ్రీశైలం వరకు విస్తరించినట్లు శాసనాలు చెబుతున్నాయి.


దక్షిణ భారతదేశంలో ఎక్కడా లేని ఏకశిలా నంది విగ్రహం

## కోట నిర్మాణం

ఆనాడు కొండవీటి దుర్గంపై పాలకులు 50 శిఖరాలను నిర్మించారు. పర్వత శిఖర పశ్చిమ భాగాన వెదుళ్ల చెరువు నిర్మితమైంది. దీనికి పడమరగా 5 గజాల వెడల్పు, 20 గజాల పొడవుతో 36 స్తంభాలుగల మండపం, రెడ్డిరాజుల భోజనశాల, ఆరున్నర గజాల పొడవు, 4 గజాల వెడల్పు, ఒకటిన్నర గజాల లోతుగల విశేష ప్రాచుర్యం గల నేతి కొట్టు. ఇందులో (మిగతా 48వ పేజీలో)

# ఆంధ్రజ్యోతికి తృతీయ వార్షికోత్సవ శుభాకాంక్షలు

ప్రజాపత్రికగా ఎనలేని అభిమానాన్ని సంపాదించుకున్న
'ఆంధ్రజ్యోతి' దినపత్రిక అభివృద్ధి దశలో పయనిస్తూ, మూడు వసంతాలు
పూర్తి చేసుకొన్న శుభతరుణంలో 'ఆంధ్రజ్యోతి' యాజమాన్యానికి,
సిబ్బందికి హృదయ పూర్వక శుభాకాంక్షలు...

భవిష్యత్‌లో మరెంతో అభివృద్ధిని సాధించాలని ఆకాంక్షిస్తూ...




నియోజకవర్గ ప్రజలకు అర్ధ శతాబ్ది ఆంధ్రరాష్ట్ర అవతరణ
దినోత్సవ, దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు

## నరసరావుపేట పార్లమెంటు నియోజకవర్గ సర్వతోముఖాభివృద్ధికి కృషి


శ్రీ మన్‌మోహన్ సింగ్
ప్రధానమంత్రి


శ్రీమతి సోనియా గాంధి
ఏఐసిసి అధ్యక్షురాలు

శ్రీ వైఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి

నియోజకవర్గ ప్రజల సమస్యల పరిష్కారానికి, నియోజకవర్గ సర్వతోముఖాభివృద్ధికి నావంతు కృషి చేస్తున్నాను. గత ఏడాదిన్నరగా నియోజకవర్గ అభివృద్ధిలో భాగంగా పలు అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. నియోజకవర్గంలోని గ్రామాల్లో తాగు నీటి సమస్య పరిష్కారానికి, విద్యా రంగ అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తున్నాను. పార్లమెంటు సభ్యులకు కేటాయించే నిధులను విద్యా రంగానికి, శాశ్వత నిర్మాణాలకు ఖర్చు చేయుచున్నాను.



## ఏడాదిన్నర కాలంలో చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు...

* నరసరావుపేట రైల్వే స్టేషన్‌లో రెండవ టిక్కెట్ బుకింగ్ కౌంటర్ నిర్మాణం, త్వరలో కంప్యూటర్ రిజర్వేషన్ సౌకర్యం, ఇందుకు పనులు జరుగుతున్నవి.
* మార్కాపురం నుంచి సికింద్రాబాద్‌కు రైలు ఏర్పాటు
* మాచర్ల, నల్గొండ రైల్వే లైన్ పనులు ప్రారంభం
* తర్లుబాడు రైల్వే స్టేషన్ పునర్నిర్మాణం, వినుకొండ రైల్వే స్టేషన్‌కు రెండో ప్లాట్ ఫాం, ఫుట్ ఓవర్ బ్రిడ్జి నిర్మాణం
* ప్రశాంతి ఎక్స్‌ప్రెస్ కంభంలో, కొచ్చిన్ ఎక్స్‌ప్రెస్ పిడుగురాళ్ళలో హాల్ట్
* మార్కాపురం, పిడుగురాళ్ళ రైల్వే స్టేషన్‌లలో కంప్యూటర్ రిజర్వేషన్‌కు మంజూరు
* జనవరి 1 నుంచి నియోజక వర్గంలోని అన్ని మండల కేంద్రాల్లో సెల్‌వన్ సేవలు
* నరసరావుపేట, దర్శి, పొదిలి టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌ల పరిధిలో కాయిన్ బాక్స్ ఫోన్ నుంచి సెల్ ఫోన్‌కు కాల్ సౌకర్యం
* అగ్నిగుండాల, పెదకంచర్ల, మంగినపూడిలలో నూతన టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లు
* 43 గ్రామాల కోసం పుల్లల చెరువు నీటి పథకంకు రూ 13 కోట్లు మంజూరు
* దర్శి సెగ్మెంట్‌లో చందవరం వద్ద రూ 3.5 కోట్లతో గుండ్లకమ్మ పై మార్కాపురం, దర్శి రహదారి కోసం బ్రిడ్జి మంజూరు
* రూ 232 కోట్ల అంచనాలతో కంభం నియోజక వర్గంలో రక్షిత మంచి నీటి పథకాల నిర్మానానికి కేంద్రం రూరల్ డవలప్ మెంట్ శాఖ మంజూరు
* గురజాల, ఎర్రగొండపాలెం, దోర్నాలా, త్రిపురాంతకం, కుర్చేడు, ధనకొండ, కారంపూడి, కంభం, నకరికల్లు సెల్ టవర్‌లు నిర్మాణం.
* మార్కాపురం రైల్వే స్టేషన్‌లో గూడ్స్ రైలు కోసం మూడవ లైన్ మంజూరు
* పొగాకు రైతులు సంక్షేమం కోసం పొదిలిలో టుబాకో మూడవ ప్లాట్ ఫారం మంజూరు
* నరసరావుపేట నుంచి పిడుగురాళ్ళ రైల్వే లైన్‌కు ప్రతిపాదనలు
* మాచర్ల నుంచి నల్గొండ రైల్వే లైన్ అదనపు బడ్జెట్‌కు ప్రతిపాదనలు.
* నియోజక వర్గం పరిధిలోని 12 రైల్వే స్టేషన్లను ఆధునీకరించాలని చేసిన ప్రతిపాదనలు రైల్వే శాఖ పరిశీలన.

మరెన్నో అభివృద్ధి కార్యక్రమాలు...ప్రగతి పనుల అమలుకు ప్రజల అండదండలు ఆశిస్తూ...

సదా మీ సేవలో...

# మేకపాటి రాజమోహనరెడ్డి

పార్లమెంటు సభ్యులు, నరసరావుపేట

# ప్రజా చైతన్యానికి స్ఫూర్తినిచ్చిన 'భావపురి'

(ఆన్‌లైన్-బాపట్ల)

చారిత్రక సాక్ష్యాలకు సజీవంగా నిలచిన ప్రసిద్ధ దేవాలయాలతో అలరారుతున్న భావపురి, విద్యారంగంలో కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా, సాహిత్య రంగంలో భావ సౌంద్యాల విరిగా, రాజకీయ రంగంలో ఆణిముత్యాలను అందించిన రాజకీయ పరంగా, బౌద్ధ రామాలకు నిలయంగా, వ్యవసాయ రంగానికి పట్టుకొమ్మగా విరాజిల్లుతున్న బాపట్ల రాష్ట్ర చిత్రపటంలోనే గాకుండా, దేశ చిత్ర పటంలోనే ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకుంది. ఆంధ్రప్రదేశ్‌లో భూస్వామ్య వ్యతిరేక ప్రజాతంత్ర ఉద్యమానికి శుభారంభం చేసి గడ్డ భావపురి. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కావాలనే నినాదాన్ని మొట్టమొదట బాపట్లలో 1913 లో జరిగిన ఆంధ్రమహాసభ లేవనెత్తింది. బాపట్లలో 1944పొగాకు రైతు మార్కెట్ కమిటీ ఎన్నికలో సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు కొల్లా వెంకయ్య గెలిచారు. 1946 శాసనసభ ఎన్నికల సందర్భంలో 'విశాలాంధ్రలో ప్రజా రాజ్యం' అనే నినాదంతో ఒక కార్యక్రమాన్ని కమ్యూనిస్టు పార్టీ తీసుకొంది. అలాగే క మ్యూనిస్టు నాయకులను బాపట్ల ప్రాంతాలలో వుంచి వారి బాధ్యత తీసుకున్నారు. కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు, దాసరి నాగభూషణ రావు తదితరులు ఈ ప్రాంతంలో ఉండి ఉద్యమాన్ని నడిపారు. 1977 లో నల్లమడ ప్రాంత రైతు సంఘం స్థాపించి దాని నిర్వహణకు కృషి చేసిన ఘనత కమ్యూనిస్టులదే. ఈ ప్రాంతంలో ఈరోజు కాల్వలు వచ్చి సమయానికి సాగునీరు అందుతుంది. 'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా' అన్న వేములపల్లి శ్రీకృష్ణను శాసనసభకు మొదటిసారిగా అందించిన ఘనత భావపురిదే. అపరబాసరగా ఖ్యాతి చెంది, కళారంగంలో సారస్వత మాగాణిగా నిలిచింది. శ్రీ భావన్నారాయణ స్వామి స్వయం భువునిగా వెలియడం వల్ల భావపురిగా నామానాన్ని సంతరించుకొని ప్రసిద్ధ అధ్యాత్మిక సాంస్కృతిక విద్యాకేంద్రంగా నేడు బాపట్ల పట్టణం విలసిల్లుతున్నది. స్వయం భువునిగా వెలసిన శ్రీ భావన్నారాయణస్వామి వారికి క్రిమిచోళ మహారాజు క్రీ.శ.594లో ఆలయం కట్టించారు. క్రీ.శ.594లో ఆలయం కట్టించారు. క్రీ.శ 594నుండి నేటి వరకు అనేక వెలుగునీడలను చవిచూసింది. క్రీ.శ. 594నుండి క్రీ.శ.1574 వరకు హిందూ రాజులు పాలించగా చైతన్యకేంద్రంగా విలసిల్లింది. క్రీ.శ. 1760 నుండి ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారాన్ని బాపట్ల ప్రాంతంపై చెలాయించింది. కాగా క్రీ.శ.1803లో అమరావతికి చెందిన రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు బహుద్దూర్ బాపట్ల ప్రాంతాన్ని బహిరంగ వేలంలో కొనుగోలు చేశారు. శ్రీ భావన్నారాయణుని ఆలయంతో సహా పలు ఆలయాల నిర్వహణలను మెరుగుపరచే కార్యాచరణ అమలు పరిచారు.

## స్వాతంత్ర్య సమరంలో బాపట్ల ప్రాంతం

స్వాతంత్ర్య సంగ్రామంలో బాపట్ల ప్రాంతం గణనీయ పాత్ర నిర్వహించింది. పూర్వపు తాలూకాలో 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య పన్నుల నిరాకరణోద్యమం నడిపిన సంగతి అందరికి విదితమే. 1920లో సహాయ నిరాకరణోద్యమం జరుగగా బాపట్ల తాలూకాలోని 64గ్రామాలలో సంఘాలను ఏర్పరచి ఉద్యమాలను నడిపారు. కొందరు రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు, గుమాస్తాలు తమ ఉద్యోగాలకు స్వస్తి చెప్పి న్యాయ వాదులతో పాటు ఉద్యమంలో చేరారు. మహాత్మాగాంధీజీ బాపట్ల ప్రాంత పర్యటనకు రాగా తిలక్ స్వరాజ్య నిధికి నగదుతో పాటు బంగారు ఆభరణాలను దేశ భక్తులు సమర్పించారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నందుకు 'ఆంధ్ర రత్న' దుగ్గిరాలతో పాటు మంతెన కృష్ణంరాజు, బూదరాజు లక్ష్మీనారాయణ, బూదరాజు లక్ష్మీనరసింహారావు, పిల్లుట్ల హనుమంతరావు, అడుసుపల్లి శ్రీనివాసరావు పంతులు వంటి వారు జైలు పాలయ్యారు. జరిమానాలు కూడా చెల్లించారు. ఉద్యమంలో భాగంగా 1921 డిసెంబరు 31న 48 మంది గ్రామోద్యోగులు రాజీనామాలు సమర్పించారు. పన్నుల నిరాకరణోద్యమంలో భాగంగా నాటి బాపట్ల తాలూకాలోని పెదనందిపాడులో సాగిన ఉద్యమం మరుపురానిది. 'ఆంధ్ర శివాజీ' పర్వతనేని వీరయ్యచౌదరి నాయకత్వంలో జరిగిన పెదనందిపాడు ఉద్యమాన్ని అణచివేసేందుకు నాటి జిల్లా కలెక్టరు రూథర్‌పర్డ్ మిలటరీ క్యాంపును ఏర్పాటు చేశారు. సంకా సీతారామయ్య, దాసరి శ్రీరాములులను పెదనందిపాడు నుంచి చిలకలూరిపేట వరకు ఎనిమిది మైళ్ళు గుర్రం వెంట శిక్షగా పరుగెత్తించారు. 1930 లో సాగిన ఉద్యమంలో పాల్గొన్నందుకు బాపట్ల తాలూకాలోని 124మంది నాటి ప్రభుత్వం జైలుకు పంపింది. విదేశీ వస్తు బహిష్కరణలలో పాల్గొన్నందుకు 44మందిని ఆరు నెలల నుండి రెండు సంవత్సరాల వరకు శిక్ష విధిస్తూ జైలుకు పంపింది. స్థానం పార్థసారథి, నాళం శ్రీరామచంద్రరావు వంటి వారు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నారు.

## ప్రథమ ఆంధ్రమహాసభ

తెలుగువారికి ప్రత్యేక రాష్ట్రం కావాలంటూ ప్రథమ ఆంధ్ర మహాసభ 1913లో బాపట్ల టౌన్‌హాలులో జరిగింది. రెండుసార్లు గాంధీజీ బాపట్ల ప్రాంతాన్ని సందర్శించారు. 1934లో భారత తొలి రాష్ట్రపతిగా పేరు గడించిన బాబూరాజేంద్రప్రసాద్ సందర్శించారు. 1936లో పెనుతుఫాను సంభవించగా బాధితుల సహాయార్థం విరాళాల సేకరణకు గాంధీజీ తమ రెండవ పర్యటనగా వచ్చారు. భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, జయప్రకాష్ నారాయణ, రాజాజీ వంటి ప్రముఖులు కూడా బాపట్ల ప్రాంతాన్ని సందర్శించిన వారిలో వున్నారు.

## కళలకు నిలయం

కళల కాణాచిగా బాపట్ల ఖ్యాతి గడించింది. శ్రీ భావన్నారాయణ స్వామి సన్నిధిలో ఎందరో పరిచారికలు, దేవదాసీలు, పురుష నృత్యకారులు స్వామి వారికి సేవలందించినట్లు ఆలయ శాసనాలు వెల్లడిస్తున్నాయి. కొండవీడును రాజధానిగా చేసుకొని పాలించిన కొమరగిరి ప్రభువు కర్పూర వసంతరాయులు ఆస్థాన నర్తకి లకుమాదేవి బాపట్ల శ్రీ భావన్నారాయణ స్వామి ఆలయంలో నృత్య పూజకు తొలుత ఉద్దేశించబడినది. ప్రసిద్ధ దేవ నర్తకి మలమ్మ తన అనంతరం తన కుమార్తెల కుసుమ స్వామి సేవకునియోగించాలని ఆశించింది. దేవదేవుని సన్నిధిలో తన వంశీయులు నృత్య పూజల చేసిన విధంగా తన కుమార్తె లకుమా కూడా సేవలందించాలని ఆమె ఆశించింది. అయితే కొమరగిరి ప్రభువు తన సేనాధిపతి దొడ్డపురెడ్డిని ఆహ్వాన పత్రంతో పాటు రెండు పల్లకీలను పంపడంతో తల్లి మల్లమ్మ మాత్రం వెళ్ళడానికి నిరాకరించి తన కుమార్తె లకుమా అభీష్టం మేరకు సాగనంపింది. నాటికి నేటికి కళలకు, కళాకారులకు కేంద్రంగా బాపట్ల పట్టణం విరాజిల్లుతూ వస్తున్నది. కళారంగంలో పద్మశ్రీ స్థానం నరసింహారావు,కొమరవోలు హనుమంతరావు, కోన వెంకట్రావు, కోనప్రభాకరరావు, అద్దంకి శ్రీరామమూర్తి, పి.వీరయ్యచౌదరి, సింగరాజు నాగభూషణం, డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు, కె.ఎస్.టి.సాయి, కె.బి.శర్మ, ఊట్ల బుడ్డయ్యచౌదరి, పి.వి.రామ్‌కుమార్, ఇ.నరసింహారావు వంటి కళాకారులను రూపొందించింది. సినీ రంగంలోని బాలివుడ్‌లో ప్రత్యేక స్థానాన్ని సంతరించుకొని గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డు కెక్కిన ప్రముఖ సినీ నిర్మాత డి.రామానాయుడు బాపట్ల ప్రాంతీయుడే. క్రీడా రంగంలో మల్లయోదులు లక్కరాజు కృష్ణయ్య, దాసరి శ్రీమన్నారాయణ, మలిశెట్టి వెంకటకృష్ణారావు, కోనప్రభాకరరావు,కొక్కు సుబ్రహ్మణ్యం, చలికొంత తాతారావు, ఆమంచి కోటేశ్వరరావు, ఖాదర్‌వలి, కర్పూరపు రామారావు, మదన్‌మోహన్ వంటి వారున్నారు.

## రాజకీయ కేంద్రం

క్రియాశీల రాజకీయాలకు బాపట్లకు పెట్టింది పేరు. దేశ రాజకీయ పటంలో బాపట్లకు గుర్తింపు తెచ్చిన ప్రముఖుల్లో ప్రముఖ విద్యావేత్త, డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు ఒకరు. బాపట్ల ప్రాంత సర్వతోముఖాభివృద్ధికి కృషి చేయడంతో పాటు రాష్ట్రాభివృద్ధికి తనదైన శైలిలో అవిరామ కృషితో ముందుగు సాగుతున్న నాయకులుగా ఆయన గుర్తింపు పొందారు. అఖిల భారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించిన వల్లూరి బసవరాజు, పలు రాష్ట్రాలకు గవర్నరుగా, రాష్ట్ర ఆర్థికమంత్రిగా, రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా వ్యవహరించి తన దక్షతను నిరూపించిన కోనప్రభాకరరావులు జాతీయ స్థాయిలో బాపట్లకు గుర్తింపు తెచ్చారు. బాపట్ల అసెంబ్లీ 1952లో ఏర్పడగా తమ తొలి ప్రజాప్రతినిధిగా సిపిఐ నాయకులు, వేములపల్లి శ్రీకృష్ణను శాసనసభకు పంపిన ఘనత బాపట్లది. ప్రముఖ రైతు నాయకులు ఆచార్య ఎన్.జి.రంగా, మంతెన వెంకట్రాజు, కొమ్మినేని వెంకటేశ్వరరావు, కామ్రేడ్ కొల్లా వెంకయ్య, ముప్పలనేని శేషగిరిరావు వంటి రాజకీయ ప్రముఖులు బాపట్ల ప్రాంతీయులు కావడం విశేషం.

## శ్రీలు పొంగిన జీవగడ్డ

బాపట్ల శ్రీలు పొంగిన జీవగడ్డ-పద్మశ్రీలకు పుట్టినిల్లు 'ఏదేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని' అని తమ గేయ రచన ద్వారా జాతిని జాగృతం చేసిన రాయప్రోలు సుబ్బారావు, పద్మశ్రీ స్థానం నరసింహారావు, పద్మశ్రీ కొమరవోలు చంద్రశేఖర్, చీఫ్ ఎలక్షన్ కమిషనర్‌గా పనిచేసిన జి.వి.కృష్ణమూర్తి, ఇంగ్లాడు క్రికెట్ టీమ్ ఓపెనింగ్ బ్యాట్స్‌మన్ రామన్ సుబ్బారావు బాపట్ల వాస్తవ్యులే. పద్మశ్రీ ఈలపాట రఘురామయ్య, పద్మవిభూషణ్ నోరి గోపాలకృష్ణమూర్తి బాపట్ల వారు. 'ఆంధ్రరత్న' దుగ్గిరాల, ప్రముఖ కవి గుర్రం జాషువా వంటి పనులను రూపొందించిన విద్యాసంస్థలు బాపట్లలో వున్నాయి. 'అపర బాసర'గా బాపట్ల వ్యవసాయ కళాశాల ఎందరో వ్యవసాయ శాస్త్రవేత్తలను జాతికందించింది. పద్మశ్రీ డాక్టర్ ఐ.వి.సుబ్బారావు, డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటరమణ వంటి ప్రముఖులు ఈ కళాశాలకు చెందిన వారు కావడం విశేషం.

బాపట్ల సమీపంలోని జిల్లెళ్ళమూడి 'అమ్మ' ఆలయాన్ని సందర్శించేందుకు భక్తులు వస్తూ వుంటారు. బాపట్ల సమీప సముద్ర తీరంలోని సూర్యలంక పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తోంది.

# రాజకీయ స్ఫూర్తినిచ్చిన సత్తెనపల్లి

( ఆన్‌లైన్, సత్తెనపల్లి)

ప్రజా ఉద్యమాలకు . కేంద్రమై, రాజకీయంగా చైతన్యం కలిగిన సత్తెనపల్లి నియోజకవర్గం 1952లో ఏర్పడింది. సత్తెనపల్లి ప్రాంతం పూర్వం ఫిరంగిపురం నియోజకవర్గంలో ఉండేది. సత్తెనపల్లి నియోజకవర్గంలో 62 గ్రామ పంచాయతీలు ఉన్నాయి. నియోజకవర్గ పరిధిలో ఫిరంగిపురం, మేడికొండూరు, ముప్పాళ్ళ, సత్తెనపల్లి మండలాలతో పాటు సత్తెనపల్లి పట్టణం కూడా ఉంది. సత్తెనపల్లి నియోజకవర్గంలో మేడికొండూరు గ్రామంలోని తొమ్మిది గ్రామాలు మాత్రమే ఉన్నాయి. పెదకూరపాడు మండలలోని చినమక్కెన గ్రామం సత్తెనపల్లి నియోజకవర్గంలో ఉంది. సత్తెనపల్లి ప్రజా ఉద్యమాలతో పాటు అనేక చారిత్రక వాస్తవాలతో బాసిల్లింది. నియోజకవర్గంలో సుమారు 65 వేల హెక్టార్ల భూమి విస్తరించి ఉంది. దీనిలో 52వేల హెక్టార్లు సాగు భూమిగా ఉంది. మిగిలిన భూమి నివాసాల క్రింద, సాగుకు పనికిరాకుండా ఉన్నాయి. నియోజకవర్గంలో ప్రజల జీవానాధారం వ్యవసాయం. నియోజకవర్గంలో ప్రధానంగా వరిపటంతో పాటు వాణిజ్య పంటలైన మిర్చి, పసుపు, ప్రత్తి పంటలు సాగవుతున్నాయి. వీటితో పాటు రైతులు నువ్వు, కంది, మొక్కజొన్న, మినుము పంటలు కూడా కొద్ది ఎకరాలలో సాగుచేస్తున్నారు. సాగర్ కాల్వలపై ఆధారపడి 37వేల హెక్టార్లు సాగవుతుండగా, వర్షాధారణపై ఆధారపడి 7వేల హెక్టార్లు, లిప్టులక్రింద 3500 హెక్టార్ల భూమి సాగవుతుంది. పట్టణంలో జిన్నింగ్, పప్పుమిల్లులు ఉన్నాయి. రాష్ట్రంలోనే సహకార సంఘంలో ప్రప్రథమంగా ఏర్పాటు చేసిన అద్దకం మిల్లు, పంబాజి డ్రస్ మెటీరియల్స్ తయారీలో పేరు గాంచిన పట్టణ చేనేత కార్మికులు ఉన్నారు. సత్తెనపల్లి పట్టణంతో పాటు పరిసర గ్రామాల విద్యార్థుల విద్యావసరాలను తీర్చటంలో దశాబ్ద కాలంగా ప్రభుత్వ విద్యాసంస్థలతో పాటు ప్రైవేటు విద్యాసంస్థలు పోటీపడుతున్నాయి. సుమారు 6 దశాబ్దల క్రితం స్థాపించిన శరభయ్య హైస్కూల్ వేలాది మంది విద్యార్థులకు విద్యాదానం చేస్తూ విద్యారంగానికి స్ఫూర్తి దాయకంగా నిలిచింది. సత్తెనపల్లి మార్కెట్ యార్డు రైతులకు సేవలను అందిస్తోంది. యార్డు పరిధిలో ముప్పాళ్ళ, ఫిరంగిపురం, మేడికొండూరు, సత్తెనపల్లి మండలాల్లోని గ్రామాలున్నాయి. రైతులకు మార్కెట్, గిడ్డంగి సౌకర్యాలను కల్పించటం, వారి సరుకు నిల్వ వుంచుకొని వడ్డీలేని ఋణాలు అందించటం, వారికి కావలసిన విజ్ఞానాన్ని అందించేందుకు అవగాహన సదస్సులు నిర్వహించటం వంటి బహుముఖ కార్యకలాపాలతో సత్తెనపల్లి వ్యవసాయ మార్కెట్ కమిటి రైతుల మన్నలను పొందుతోంది. నియోజకవర్గం ఏర్పడిన దగ్గరనుంచి 12సార్లు ఎన్నికలు జరిగాయి. 3సార్లు ఇండిపెండెంట్ అభ్యర్థులు, నాలుగు సార్లు కాంగ్రెస్ అభ్యర్థులు, రెండు సార్లు సిపి ఎం అభ్యర్థులు, రెండుసార్లు టిడిపి అభ్యర్థులు, ఒకసారి ఉమ్మడి కమ్యూనిస్టు అభ్యర్థి విజయం సాధించారు. సిపి ఎం తరుపున 1985లో ఎంఎల్ ఏ గెలిచిన పుతుంబాక వెంకటపతి, 1994లో సిపిఎం తరుపున ఎంఎల్ ఏ గెలిచిన పుతుంబాక భారతి భార్యభర్తలు.

## నియోజకవర్గంలో సమస్యలెన్నో....

రాజకీయంగా ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకొన్న సత్తెనపల్లి నియోజకవర్గంలో సమస్యలు కూడా అధికంగానే ఉన్నాయి. నియోజకవర్గ పరిధిలోని పలు గ్రామాల ప్రజలు ఫ్లోరిన్ నీటినే తాగుతూ రోగాల భారిన పడుతున్నారు. సత్తెనపల్లి పట్టణంలో కూడా నేటికి తాగునీటి సమస్య ఉంది. నియోజకవర్గ పరిధిలోని కొన్ని గ్రామాలలో రక్షిత మంచినీటి పథకాలు ఉన్నప్పటికీ అవి నామమాత్రంగానే పనిచేస్తున్నాయని చెప్పవచ్చు. పట్టణంలో 31 సంవత్సరాల క్రితం ఏర్పడిన ప్రభుత్వ జూనియర్ కళాశాలకు సొంత భవనం నిర్మించినప్పటికీ అది నిరుపయోగంగా మారింది. నేటికీ జూనియర్ కళాశాల ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాలలో కొనసాగుతోంది. బాలికల ఉన్నత పాఠశాలలో జూనియర్ కాలేజి కొనసాగటం వల్ల హైస్కూల్ విద్యార్థినిలకు గదులు చాలక ఇబ్బంది పడుతున్నారు. వృత్తి విద్యలను ప్రోత్సహించే నిమిత్తం పట్టణంలో ఏర్పాటు చేసిన పారిశ్రామిక శిక్షణ సంస్థ( ఐటిఐ) పాలకుల నిర్లక్ష్యం కారణంగా మూతపడింది. శిథిలావస్థలో ఉన్న ఐటిఐ పాతభవనాలకు బదులుగా కొత్త భవనాలు దాత సహకారంతో నిర్మించినా అవి నేడు ఎందుకు పనికిరాకుండా పోయాయి. పట్టణంలోని రైల్వే స్టేషన్ అవతల ఉన్న ఎఫ్‌సి ఐ కాలని ఏరియా, లెలిన్ నగర్, రంగాకాలనీ, అంబేద్కర్ నగర్ ప్రాంతాలలో నివసించే ప్రజలు రైలుపట్టాలు దాటి పట్టణంలోకి రావాలంటే ఎన్నో ఇబ్బందులు పడుతున్నారు. తమ పిల్లలను పాఠశాలలకు పంపించాలన్నా విద్యార్థుల తల్లిదండ్రులు పడుతున్న బాధలు వర్ణనాతీతం. రైలు పట్టాలలో పుట్ బ్రిడ్జి నిర్మాణం చేపట్టాలని ఈ ప్రాంతాల ప్రజలు ఎంపిలకు, ఎం ఎల్ ఏలకు, రైల్వే అధికారులకు ఎన్నిసార్లు వినతి పత్రాలు సమర్పించిన ప్రయోజనం లేకుండా పోయింది. సత్తెనపల్లి పట్టణంలో ప్లానింగ్ సరిగ్గా లేకపోవటం, మురుగుకాల్వలు సరిగ్గా లేకపోవటంతో పట్టణ ప్రజలు పారిశుద్ధ్యం, దోమల సమస్యలను ఎదుర్కొంటున్నారు.

సత్తెనపల్లి పట్టణంలోని రైల్వే గేటు సమీపంలో 1947లో ప్రారంభించిన పణిదెం చేనేత సహకార సంఘం నేడు అప్పులు కట్టలేక కార్మికులకు పని చూపలేకపోతున్నది. 1946లో ఈ సంఘాన్ని ప్రారంభించగా 1947లో పని మొదలైంది. సంఘ ప్రారంభంలో 1975 మంది సభ్యులు ఉండేవారు. 350 దాకా ఫ్రేమ్ మగ్గాలు, 900 మంది కార్మికులు సంఘంలో పనిచేస్తూ జీవనోపాధి పొందేవారు. సత్తెనపల్లి, ఇరుకుపాలెం, రెంటపాళ్ళ, అబ్బూరు, లగడపాడు, గారపాడు, పెదకూరపాడు, నందిగామ, గుడిపూడి మాదల గ్రామాల నుంచి కార్మికులు సత్తెనపల్లి వచ్చి సహకార సంఘంలో పనిచేసి జీవనోపాధి పొందేవారు. ఈ సహకార సంఘంలో తయారైన దుస్తులను రాష్ట్ర వ్యాప్తంగా అమ్మేందుకు 14 పట్టణాలలో డిపోలను ఏర్పాటు చేశారు. రెండు దశాబ్దాల పాటు ఎంతో చక్కగా నడిచిన సహకార సంఘం పాలకుల బాధ్యతరాహిత్యం కారణంగా నేడు నష్టాల ఊబిలో కూరుకుపోయింది. పనులులేక చేనేత కార్మికులు పలువురు ఇతర వృత్తులకు వెళుతున్నారు. కొందరు కార్మికులకు పనులులేక అర్ధాకలితో కూడా అలమటిస్తున్నారు. సహకార సంఘ పరిధిలో ప్రస్తుతం 75 మగ్గాలు పనిచేస్తున్నాయి. 150 మంది కార్మికులు దీనిద్వారా ఉపాధి పొందుతున్నారు. సంఘం పూర్తిగా నడవాలంటే 15 లక్షల రూపాయల వర్కింగ్ కాపిటల్ అవసరమని సంఘ అధ్యక్షుడు కట్టా శివదుర్గారావు తెలిపారు. ప్రభుత్వం 15లక్షల రూపాయలు అప్పుగా ఇచ్చి, ఉన్న అప్పును రద్దు చేస్తే ఎక్కువ మంది కార్మికులకు ఉపాధి కల్పించవచ్చని ఆయన తెలిపారు. ఆర్థిక వనరులు లేకపోవటం కారణంగానే చేనేత కార్మికులందరికీ ఉపాధి చూపలేక పోతున్నామని ఆయన తెలిపారు. చేనేత వస్త్రాల ఉత్పత్తిలో ప్రతిభ కనపరచి విదేశాలలో సైతం నీరాజనాలు అందుకున్న పణిదెం చేనేత సహకార సంఘ అభివృద్ధికి ప్రభుత్వం కృషి చేయాలని పలువురు కోరుతున్నారు. 1984లో సత్తెనపల్లి సమీపంలోని వెన్నాదేవి వద్ద నిర్మించిన శాతవాహన నూలుమిల్లు 10 సంవత్సరాలు గడవకుండానే మూతపడింది. దీనిపై ఆధారపడి జీవిస్తున్న వందలాది కుటుంబాలు బజారున పడ్డాయి. శాతవాహన నూలుమిల్లు తెరిపించటంలో ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తుందని దీనిలో పనిచేసిన కార్మికులు వాపోతున్నారు. కార్మికులకు వి ఎస్ ఆర్ కింద నష్ట పరిహారం ఇచ్చి చేతులు దులపుకున్నారే తప్ప, మిల్లులో ఉన్న కోట్లాది రూపాయల విలువైన యంత్రాంగం రక్షించేందుకు ప్రభుత్వం ఎటువంటి చర్యలు తీసుకోలేదు. దీంతో మిల్లులోని సామాగ్రి అప్పుడప్పుడు దొంగతనాలకు గురవుతోంది. నియోజకవర్గ పరిధిలో సత్తెనపల్లి నుంచి పాకాలపాడు వైపు వెళ్ళే మార్గం మధ్యలో ఉన్న లోలెవల్ చప్టాల వలన ప్రజలు ఇబ్బంది పడుతున్నారు. వర్షాలు వస్తే చప్టాలపై నీరు ప్రవహించి రాకపోకలు స్తంభిస్తున్నాయి. అదేవిధంగా సత్తెనపల్లి నుంచి మాచర్ల వెళ్ళు మార్గంమధ్యలో వెన్నాదేవి వద్ద ఉన్న చప్టా కూడా వర్షాకాలంలో ప్రమాదకరంగా మారుతుంది. ఈ చప్టాల వద్ద గతంలో ప్రజలు కొట్టుకుపోయి ప్రాణాలు కోల్పోయిన సందర్భాలు ఉన్నాయి. లోలెవల్ చప్టాల అభివృద్ధికి కృషి చేస్తామని అధికారంలో ఉన్న నాయకులు చెప్తున్న మాటలు నీటి మూటలు లాగా ఉన్నాయని ప్రజలు విమర్శిస్తున్నారు. పట్టణంలోని సామాన్య ప్రజలకు నేటికి ఇంటిస్థలాలు, రేషన్ కార్డులు లేక ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నారు.

# సాహిత్య సౌరభాలు వెదజల్లిన ప్రత్తిపాడు

(ఆన్‌లైన్ - ప్రత్తిపాడు)

గుంటూరు జిల్లా ప్రత్తిపాడు మండలం కొండవీడుకు అతి చేరువలో వుండటమే కాకుండా చందవోలు, మోటుపల్లి రాజ్యాల నుంచి పలనాటి సీమకు వెళ్లే రహదారికి కీలకమైన స్థానంలో నెలకొని వుంది. 13వ శతాబ్దపు పలనాటి చరిత్రకు పూర్వమే వజ్రాల దిన్నెగా పేరుపొందిన శాతవాహన సామ్రాజ్యపు రాజధాని అమరావతికి వెళ్లే అనేక రహదారులకు ముఖద్వారంగా ఒక నాడు విలసిల్లిన ప్రత్తిపాడు ఎంతో చారిత్రక ప్రాధాన్యత కలిగి వుంది. అందుకు గ్రామంలోని ప్రాచీన దేవాలయాలే సాక్ష్యం. ప్రస్తుతం మేజర్ పంచాయతీగా, నియోజకవర్గ కేంద్రంగా వున్న ప్రత్తిపాడు కేవలం రాజకీయ ప్రాధాన్యతనేగాక సాహిత్య సౌరభాలను వెదజల్లిన ఉద్యానవనంగా పేరుపొందింది. తెలుగు భాషకు మణిహారంగా ప్రసిద్ధి చెందిన మాలపల్లి నవలను ఈ ప్రాంతానికి చెందిన ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు (ఉన్నవ గ్రామం) రచించిన చిరస్మరణీయమైన స్రష్ట ఈ గ్రామంలోనే జన్మించిన ఇంటూరి వెంకటేశ్వరరావు. వాగ్గేయకారుడు సాక్షాత్తూ త్యాగరాజు వారి శిష్యుడు అయిన రాజనాల వెంకటప్పయ్య ఈ గ్రామ నివాసి. ప్రత్తిపాడులో జన్మించిన కాసా సుబ్బారావు పత్రికా సంపాదకత్వ రంగంలో ఎంత ఉన్నతులో జగమెరిగిన సత్యం. శ్రీ ఆలూరి బైరాగి చౌదరి పేరు వినని వారు తెలుగులో ఎవరూ వుండరు. చందమామకు సాటి వచ్చే ఆహ్లాద వినోద పత్రికలు ప్రపంచంలోనే అరుదు అంటే అతిశయోక్తి కాదు. ప్రత్తిపాడు మం డలం వంగిపురం అగ్రహారంలో ఉద్దం డ పండితులు ఎందరో వుండేవారు.

ఈ మండలంలోని యనమదల గ్రామ పరిసర ప్రాంతాల నివాసులైన పా త్తూరి వెంకటేశ్వరరావు లాంటి పత్రికా సంపాదకులు తెలుగు భాషకు ఎనలేని సేవలు చేశారు. గతంలో 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక సంపాదకుడుగా 'ఉలుకు-పలుకు' శీర్షికతో వారం వారం రాజకీయరంగాన్ని ఓ కుదుపు కుదుపుతూ రాజకీయ సాహిత్య రసస్రవంతిని ధారావాహికంగా వెలువరించిన ఇనగంటి వెంకట్రావు ప్రత్తిపాడు గ్రామ శివారు నిమ్మగడ్డవారిపాలెంలో జన్మించారు. ప్రస్తుతం ఆయన ప్రెస్ అకాడమీ ఛైర్మన్‌గా వ్యవహరిస్తున్నారు. నిమ్మగడ్డవారిపాలెంలో ఉదయించిన మరో కవి పండిత మేధావి లల్లాదేవి. శ్రీమాన్ పరుచూరి నారాయణాచార్యులు ఆంజనేయాస్వామి కోవెలలో అర్చకస్వామిగా వుంటూ లల్లాదేవి కలం పేరుతో తెలుగు నవలా సాహిత్యరంగాన్ని ఓ కుదుపు కుదిపారు. నూరుకు పైగా నవలలు, వివిధ పత్రికల్లో 30 పైగా ధారావాహికలు, అనేక చారిత్రక కథలు, రేడియో నాటికలు, సినిమా కథలతో చరిత్ర సృష్టించారు.



# వేయి సంవత్సరాల చరిత్ర కలిగిన కొండవీడు


కొండవీడు కోటపైన సైనిక బురుజు


కోట గ్రామంలో గోపీనాథ స్వామి దేవాలయం


గోపీనాథ స్వామి దేవాలయంపై అపురూప శిల్ప కళా చాతుర్యం

(44వ పేజీ తరువాయి)

రాజులు నెయ్యిని పోయడం అప్పటి రాజ్య రమావైభవానికి దర్పణం. అయితే దీనికి రెడ్డి రాజుల ఆయుధశాల అన్న మరొక వాదన కూడా వుంది. దీనికి ఉత్తరాన 24 స్తంభాలలో రెండు వరుసలతో నిర్మించిన మండపద్వయం వుంది. కొండపైకి పోయే మార్గం పక్కన శిధిలమైన నృసింహాలయం వుంది. ప్రస్తుతం వున్న అటవీ శాఖ బంగ్లాకు తూర్పున రెండు వరుసలు గల 16 స్తంభాల మండపం యోగి వేమనదిగా ప్రసిద్ధి. కొండ కింద ప్రస్తుతం కోట గ్రామానికి దక్షిణంగా గోపీనాధ స్వామి దేవాలయం వుంది. శిల్ప శాస్త్రానికి తలమానికంగా నిలిచిన ఈ దేవాలయంలో కడురమణీయంగా చెక్కిన స్తంభాలు, చిత్తరువులు అనేకం వున్నాయి. దీనికి పక్కగా వేయి గళ్ల మండపం వుంది.

నాలుగు అంతరాళాలుగా నిర్మించిన ఈ మహాకట్టడం నేడు శిధిలావస్థకు చేరింది. దీనికి దక్షిణంగా గల శిధిల శివాలయం, దేశ వ్యాప్తంగా ప్రసిద్ధి చెందిన నంది విగ్రహం వుంది. కొండకు ఉత్తర భాగాన శ్రీనాధ ప్రేరితమైన ఏకరాతంబున నిర్మించిన గృహరాజు మేడ వుంది.

కొండపై అరకోట, పిల్లకోట, పెదమాలెంకోట, చినమాలెంకోట, తట్టకోటలను ఆనాడు రక్షణ ప్రయోజనాల నిమత్తం నిర్మాణం చేయడం విశేషం. కొండపైన 23 బురుజుల నిర్మాణం జరిగింది. ఆనాటి కొండవీటి పురం ఇప్పటి చంఘీజ్‌ఖాన్ వరకు 18 పేటలుగా విస్తరించి వుండేది.

## కత్తుల బావి కుతంత్రం

కొండవీడు పేరు వినగానే అందరికి గుర్తుకొచ్చేది కత్తుల బావి. ఇంత ప్రసిద్ధి చెందిన కత్తుల బావి నిర్మాణకర్త అచ్యుతరాయలు. తన సామంతులలో 72 మంది తనకు వ్యతిరేకంగా తిరుగుబాటుకు సిద్ధమవుతున్నారని గ్రహించిన అచ్యుతరాయలు తాను నిర్మించిన గోపీనాధ పురంలోని ఒక అంతరణాన్ని బావిగా మార్చి అంతరాళం (గర్భగుడి ద్వారం) పై కాలు మోపగానే అడుగు రాతి పలకలు తొలగిపోయే విధంగా ఏర్పాటుచేశారు. 72 మంది సామంతులను ఆహ్వానించి స్వామి దర్శనానికి పంపారు. 68 మంది ఈ రాజకీయ ఎత్తుకు బలైపోయారు. పోతున్న వారే వరూ తిరిగి రాకపోవడం గ్రహించిన నలుగురు మాత్రం పారిపోయి ప్రాణాలు నిలుపుకున్నారు. ఈ దేవాలయంపైన చెక్కిన శిల్పాల నైపుణ్యం బహు అరుదుగా కనిపిస్తుంది.

## మహాసామ్రాజ్య పతనం

చరిత్ర పుటల్లో దేదీప్యమానంగా వెలిగిన కొండవీటి సామ్రాజ్య పతనదశ 1515వ సంవత్సరంలో ప్రారంభమైంది. ఒరిస్సా పాలకులైన గజపతులు, గుల్బర్గా పాలకులైన బహమనీ సుల్తానులు, విజయనగరాధీశులు 1424 వ సంవత్సరం నుంచి జరిపిన దాడులు 90 సంవత్సరాల పాటు నిరోధించిన ఈ మహాసామ్రాజ్యం తరువాత నిలువలేక పోయింది. విజయనగరాధీశులు శ్రీకృష్ణదేవరాయలు 1515లో కొండవీడులో గజపతుల గవర్నర్ కేశవపుత్రుని ఓడించి కొండవీడుతో గుంటూరు ప్రాంతాన్ని తన సామ్రాజ్యంలో విలీనం చేసుకున్నారు. తరువాత 1565లో తళ్లికోట యుద్ధంలో కొండవీడు గోల్కొండ కుతుబ్‌షాల పాలనలో కొచ్చి మూర్తజానగర్‌గా మార్చి సర్కార్ స్థాయిని పొందింది. తిరిగి 1687లో మొఘల్ చక్రవర్తి ఔరంగజేబు గోల్కొండను ఆక్రమించాడు. 1788లో రాష్ట్ర రాజధానిగా వెలిగిన కొండవీడు జిల్లా స్థాయికి తగ్గింది. బ్రిటీష్ ప్రభుత్వం జమీందార్లకిచ్చిన ఈనాముల్లో భాగంగా కొండవీడును యడ్లపాడు మండలంలోని ఒక కుగ్రామంగా మార్చింది. ప్రస్తుతం అదొక పంచాయతీ, అందులోను మైనర్ పంచాయతి.

## కదన రంగంలో కొదమ సింగాలే

గొప్ప పరిపాలనా దక్షుడు, ప్రజారంజకంగా పాలించిన ప్రోలయ వేమారెడ్డి కొండవీడు దుర్గాన్ని నిర్మించారు. 1324 ప్రాంతంలో దాదాపు 30 సంవత్సరాలు పాలించిన వేమారెడ్డి ధరిణికోట, బెల్లంకొండ, వినుకొండ, కొండపల్లి దుర్గాలను కూడానిర్మించారు. వేమారెడ్డి తరువాత అతని కుమారుడు అనపోతారెడ్డి తన 11 సంవత్సరాల పాలనలో కొండవీడు, చందోలు, కందుకూరు దుర్గాలను శత్రు దుర్భేధ్యంగా తీర్చిదిద్దాడు. కొండ సామ్రాజ్య రాజధానిని అద్దంకి నుంచి కొండవీడుకు మార్చి ఆంధ్రప్రదేశ్ చరిత్రనే మలుపు తిప్పిన మహా రాజనీతిజ్ఞుడు అనపోతారెడ్డి. అయితే ఇతని హయాంలోనే కృష్ణానదికి ఉత్తర భాగంచే జారిపోయినట్లు 1355 నాటి ద్రాక్షారామం శాసనం చెబుతోంది. ప్రసిద్ధకవి త్రిలోచకుడు ఇతని ఆస్థాన కవి. 1364 ప్రాంతంలో ఎన్నో విజయాలను పొందిన పోతారెడ్డి కృష్ణను దాటి దివి సీమ దుర్గాన్ని ఆక్రమించాడు. కృష్ణా, గోదావరి నదుల మధ్యగల పలు చిన్న రాజ్యాలను గెలిచాడు. తాను స్వయంగా పోకుండా తన దండనాయకుడు చెన్నమనాయుడిని పంపి సింహాచలం వరకు జయించిన రణ పిపాసి ఇతడు. విలాసాలలో కూడా అగ్రగామిగా నిలిచి కర్పూర వసంతరాయుడు బిరుదు పొందాడు. తరువాత రాజైన కుమారరెడ్డి నాట్యశాస్త్రానికే తలమానికంగా నిలిచిన వసంతరాజకీయం అన్న గ్రంథ రచయిత. ఆస్థాన నర్తకి లకుమాదేవి ప్రేరణతో ఈ గ్రంథ రచన చేశాడు. దాయాదుల అంతఃకలహాలు, పెదకోమటి వేమారెడ్డి రాజ్యకాంక్షలకు ఇతను బలయ్యాడు. ఇతని దాయాది వేమారెడ్డి 1402 నుంచి 18 సంవత్సరాలు పాలించాడు. క్షణం విశ్రాంతి ఎరుగని ఇతని పాలన జయాపజయాల కలపోతగా చరిత్ర నిలిచింది. నలువైపులా చుట్టుముట్టిన రాజమహేంద్రవర రాజులు, విజయనగరాధీశులు, రాచకొండ వెలమల ధాటికి తట్టుకొనలేక బహమనీ సుల్తానులతో సంధి చేసుకున్నాడు. ఇతని ఆస్థానంలోనే కవి సార్వభౌముడు శ్రీనాధుడు విద్యాధికారిగా, శాసన కర్తగా వున్నారు. 1410 సంవత్సరంలో సూరమాంబ పేరిట నిర్మించిన సంతాన సాగరం (మల్కాచెరువు) చెప్పుకోదగినది. ఇలాంటిచరిత్ర కలిగిన కొండవీడును కృష్ణా పుష్కర యాత్రికులు చూడాల్సిన ప్రదేశం. ఇక్కడికి వెళ్లడానికి గుంటూరు, చిలకలూరిపేటల నుంచి ప్రతి గంటకు ఒక బస్సు నడుస్తోంది.



1968 2005

# ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్

## H.O. చిలకలూరిపేట, గుంటూరు జిల్లా



**డా॥ఎస్.జాన్‌డేవిడ్ అయ్యగారు**
**వ్యవస్థాపకులు**
**ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్**

**డా॥అరుణ్ కుమార్ కె.మహంతి**
**డైరెక్టర్**
**ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్**

ఎ.ఎం.జి. ఇండియా ఇంటర్నేషనల్ స్వదేశీ క్రైస్తవ స్వచ్ఛంద సేవాసంస్థ. డా॥ఎస్.జాన్‌డేవిడ్ ఈ సంస్థ వ్యవస్థాపకులు. డా॥అరుణ్ కుమార్ కె.మహంతి ఈ సంస్థ డైరెక్టర్. ఈ సంస్థ చేసే సేవలన్నీ ఉచితం. కుల, మత, జాతి విచక్షణ లేకుండా శారీరకంగా, మానసికంగా మరియు ఆధ్యాత్మికంగా వెనుకబడిన వారిని, వారి బిడ్డలను మరియు దిక్కులేని, సంరక్షణ లేని పిల్లలను అన్ని విధాల పెంచి, పోషించి అభివృద్ధి పథంలో ముందుకు నడిపించి చేయూత నిచ్చుటయే ఎ.ఎం.జి. సంస్థ ముఖ్యోద్దేశ్యం. తిండి, బట్ట, విద్య, వైద్య మరియు ఆధ్యాత్మికంగా చేయు సేవలన్నీ ఉచితం. ఆంధ్రప్రదేశ్‌లోని 7 కోస్తాజిల్లాలైన, నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం మరియు ఒరిస్సా రాష్ట్రములోని టిట్లాగర్, బలంగీర్ మరియు జగత్‌సింగ్‌పూర్, తమిళనాడు రాష్ట్రములోని చెన్నై నందు ఈ సంస్థ యొక్క సేవలు అమలు జరుగుచున్నవి.



టి.బి వ్యాధిగ్రస్తులకు అందిస్తున్న ఉత్తమ సేవలకు గాను రాష్ట్ర గవర్నర్ సుశీల్‌కుమార్ షిండే నుండి జ్ఞాపికను అందుకుంటున్న ఎయంజి డైరెక్టర్ అరుణ్ కుమార్ మహంతి

### ఎయంజి ప్రాజెక్టుల ద్వారా సహాయం పొందుతున్న లబ్దిదారుల వివరాలు

| వివరాలు | లబ్దిదారులసంఖ్య (సుమారు) |
|---|---|
| 1. పిల్లల సంరక్షణ, విద్య | 14,400 |
| 2. మిల్క్ ప్రాజెక్ట్స్ | 3,300 |
| 3. డే కేర్ సెంటర్స్ | 7,000 |
| 4. హెల్త్ ప్రాజెక్ట్స్ | 21,000 |
| 5. వయోజన విద్య | 13,100 |
| 6. సాంకేతిక విద్య | 1,600 |
| 7. ఓల్డ్ ఏజ్ హోమ్స్ | 6,700 |
| 8. పునరావాస కార్యక్రమాలు | 6,100 |
| 9. కుష్టువ్యాధిగ్రస్తుల పునరావాసం | 3,100 |
| 10. కమ్యూనిటీ వర్కర్లు | 1,600 |
| 11. జీవిత ఖైదీల పిల్లలు | 200 |
| 12. ఆత్మహత్యలు చేసుకున్న రైతుల పిల్లలు | 1000 |
| **మొత్తం లబ్దిదారులు** | **79,100** |

### ఎయంజి ప్రాజెక్టుల వివరాలు

**చిలకలూరిపేట** : ఎయంజి హైస్కూల్, ఎయంజి జూనియర్ కాలేజి, ఎయంజి డిగ్రీ కాలేజి, ఎయంజి డైక్‌మెన్ ఐటిసి, ఎయంజి బిఇడి కాలేజి, ఎయంజి బైబిల్ కాలేజి, డే కేర్ సెంటర్స్, మిల్క్ ప్రాజెక్ట్స్, ఫ్రీ క్లినిక్స్ / హాస్పిటల్స్, ఓల్డ్ ఏజ్ హోమ్స్, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్స్, టిబి, కుష్టు వ్యాధిగ్రస్తులకు రేషన్ పంపిణీ, **గణపవరం** :టిబి, ఛెస్ట్ డిసీజెస్ హాస్పిటల్, **విశాఖపట్నం** : ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్ (భీమిలి), ఎయంజి ఇంగ్లీష్ మీడియం జూనియర్ కాలేజి (భీమిలి), బిఇడి కాలేజి (భీమిలి), కుట్టుశిక్షణా కేంద్రం (అనకాపల్లి), వృద్ధులకు సహాయం, మిల్క్ ప్రాజెక్టులు, కుష్టు వ్యాధి గ్రస్తులకు పునరావాసం (విజయనగరం,సింహాచలం), లిటరేచర్ మినిస్ట్రీ, **కాకినాడ** : ఎయంజి కుట్టు శిక్షణా కేంద్రాలు, డే కేర్ సెంటర్స్, ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, మిల్క్ ప్రాజెక్ట్, అడల్ట్ ఎడ్యుకేషన్, ఫ్రీ క్లినిక్, ఓల్డ్ ఏజ్ హోమ్, **ఏలేశ్వరం** : ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఒకేషనల్ ట్రైనింగ్ సెంటర్, ఫ్రీ హెల్త్ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్, **పరిమితడక** : ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఒకేషనల్ ట్రైనింగ్ సెంటర్, ఫ్రీ హెల్త్ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ ప్రోగామ్, గ్రామాలలో వైద్య క్యాంపులు, **చీరాల / ఓడరేవు** : ఎయంజి స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, డే కేర్ సెంటర్, ఎయంజి ఇంగ్లీష్ మీడియం స్కూల్, ఫ్రీ క్లినిక్, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్, నర్సింగ్ స్కూల్,కమ్యూనిటీ డెవలప్‌మెంట్స్, **విజయవాడ**: ఎయంజి స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, మిల్క్ ప్రాజెక్ట్, డే కేర్ సెంటర్, ఫ్రీ క్లినిక్, **రాజవోలు** : ఎయంజి హైస్కూల్, ఎయంజి కంటి ఆసుపత్రి, **కడియం** : ఎయంజి కంటి ఆసుపత్రి, **బొమ్మూరు**: ఎయంజి హైస్కూల్, ఎయంజి జూనియర్ కాలేజి, **రాజమండ్రి** : ఎయంజి డే కేర్ సెంటర్, ఫ్రీ క్లినిక్, కుట్టు శిక్షణా కేంద్రాలు, అడల్ట్ ఎడ్యుకేషన్ సెంటర్స్, స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, హోమ్ ఆఫ్ హోప్ సెంటర్, కుష్టు వ్యాధిగ్రస్తులకు రేషన్ పంపిణీ, **పెద్దాపురం** : ఎయంజి ఓల్డ్ ఏజ్ హోమ్, ఎయంజి కుట్టు శిక్షణా కేంద్రం, **సామర్లకోట** : ఎయంజి హోమ్ ఆఫ్ హోప్ సెంటర్, స్ట్రీట్ చిల్డ్రన్ హోమ్, **టిట్లాగర్** : లెప్రసీ ప్రాజెక్ట్, టిబి ప్రాజెక్ట్, చిల్డ్రన్ హోమ్




సునామీ వలన నష్టపోయిన మత్స్యకారులకు వలలు అందిస్తున్న ఎయంజి ఇండియా ఇంటర్నేషనల్ డైరెక్టర్ అరుణ్ కుమార్ మహంతి

### ప్రభుత్వ అభివృద్ధి పథకాలకు ఎయంజి భూరి విరాళాలు

| | (రు) |
|---|---|
| చిలకలూరిపేటలో మంచినీటి పథకానికి | - 4.5 కోట్లు |
| చిలకలూరిపేట మురికివాడలలో మంచినీటి పైపులైన్లకు | - 50 లక్షలు |
| మురికివాడల అభివృద్ధిపథకానికి | - 2 కోట్లు |
| మదర్ థెరిస్సా కాలనీ ఎలక్ట్రీసిటి కొరకు | - 6 లక్షలు |
| పారిశుధ్య సిబ్బంది గృహ సముదాయంకు | - 11.52 లక్షలు |
| 4వ వార్డులో డ్రైనేజికి | - 1 లక్ష |
| పట్టణ అభివృద్ధి పథకంకు | - 3 లక్షలు |
| గుంటూరులో వయోజన విద్య నభ్యసిస్తున్న పేదమహిళలకు ఉచిత కంటి అద్దాలకు | - 7 లక్షలు |
| నరసరావుపేటలో చంద్రబాబునాయుడు గృహ సముదాయంకు | - 21 లక్షలు |
| కాకినాడలో జనరల్ హాస్పిటల్‌లో సి.టి.స్కాన్‌కు | - 50 లక్షలు |
| మంచి నీటిపథకంకు | - 30 లక్షలు |
| ఏలేశ్వరం రోడ్లు మరియు డ్రైనేజికి | - 2.5 లక్షలు |
| అమలాపురం మహిళల అభివృద్ధి కొరకు ప్రాజెక్టుకు | - 10 లక్షలు |
| మరియు ఒరిస్సాలో జగత్‌సింగ్‌పూర్ స్కూల్ బిల్డింగ్‌కు | - 4 లక్షలు |
| గుంటూరులో జిల్లా టి.బి.హాస్పటల్ అభివృద్ధి కొరకు | - 10 లక్షలు |
| నరసరావుపేటలో మురికివాడల అభివృద్ధి పథకం | - 1 కోటి |
| నాగార్జునయూనివర్సిటి ఆడిటోరియం నిర్మాణంకొరకు | - 1 కోటి |

### వరద బాధితులకు నిత్యావసర వస్తువుల పంపిణీ

2005 సెప్టెంబరు, అక్టోబరు నెలలలో కురిసిన భారీ వర్షాల కారణంగా వచ్చిన వరదల వలన నష్టపోయిన 3,700 మంది బాధితులకు 35 లక్షల రూపాయల వ్యయంతో ఎయంజి సంస్థ భారీ ఎత్తున సహాయం అందించింది. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో వరదలు వచ్చిన సమయంలో ఆహారవు పొట్లాలు అందచేయడమేకాక ఒక్కొక్క కుటుంబానికి 10 కిలోల బియ్యం, 2 కిలోల కందిపప్పు, 1 కిలో వంటనూనె, 2 దుప్పట్లు, చీరెలు, సబ్బులు పంపిణీ చేయడం జరిగింది.

### ఆత్మహత్య చేసుకున్న రైతుల పిల్లల సంరక్షణ

ఆంధ్రప్రదేశ్‌లోని 23 జిల్లాలకు చెందిన ఆత్మహత్య చేసుకున్న రైతుల పిల్లలకు ప్రతి సం॥ 60 లక్షల రూపాయల సహాయంతో స్కూల్ బ్యాగ్స్, పుస్తకాలు, స్కూలు / కాలేజి ఫీజు మరియు ప్రతి నెల కొంత ఆర్థిక సహాయం అందించబడుతున్నది.

### ఖైదీల పిల్లల సంరక్షణ

ప్రతి సం॥ 5 సెంట్రల్ జైళ్ల జీవిత ఖైదీల పిల్లలకు పుస్తకాలు, యూనిఫాం, స్టేషనరీ, షూస్, స్కూల్‌బ్యాగ్స్, స్కూలు / కాలేజి ఫీజు మరియు ఖైదీల భార్యలకు ఉపాధిసహాయం అందించబడుతున్నది.

### సునామీ బాధితులకు ఎయంజి భారీ సహాయం

* కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలోని 4,700 మంది సునామీ బాధితులకు పెద్ద ఎత్తున సహాయం
* 3 కోట్ల రూపాయల విలువ చేసే బియ్యం, కందిపప్పు, వంట పాత్రలు, దుస్తులు, చేపల వలలు పంపిణీ
* సునామీ బాధిత మత్స్యకారుల బోటు ఇంజన్ల మరమ్మత్తుల కోసం ఆర్థిక సహాయం
* సునామీ బాధితుల గృహ నిర్మాణానికి 4జిల్లాలలో 3000 గృహాల నిర్మాణానికి 3 కోట్ల రూపాయల ఆర్థిక సహాయం

# అంతర్జాతీయ చదరంగంలో జిల్లా కాంతులు


కె.లక్ష్మీప్రణీత


గోగనేని రోహిత్


హరికృష్ణ


శ్రీకర్


డి.హారిక

(గుంటూరు - ఆన్‌లైన్ క్రీడాప్రతినిధి)

క్రీడారంగంలో చెస్ ప్రత్యేక ప్రాధాన్యతను సంతరించుకుంది. మానవుడి మేధస్సుకు పదునుపెట్టి అతనిలో వ్యూహాత్మకంగా మెరుపులాంటి ఆలోచనలు రేకెత్తించే క్రీడగా చెస్‌ను అభివర్ణిస్తున్నారు. పూర్తిగా యుద్ధ తంత్రం ఇమిడివున్న ఈ క్రీడలో పోటీ పడే ఇద్దరు క్రీడాకారులు తమ మెదడుకు పూర్తిగా పదును పెట్టి ఆడుతారు. క్రీడాకారుడి మేధాశక్తికి అగ్నిపరీక్ష వంటిది చెస్ క్రీడ. ఈ చెస్ క్రీడలో అయిదుగురు గుంటూరు జిల్లా బాల,బాలికలు అంతర్జాతీయ ఖ్యాతి గడించడం గుంటూరు క్రీడారంగం మరువలేని విషయం. గుంటూరు క్రీడారంగ చెస్ పుటల్లో పి.హరికృష్ణ, డి.హారిక, జి.రోహిత్‌లు సాధించిన ఘనతను సువర్ణాక్షరాలతో లిఖించవచ్చు.

పెంటేల హరికృష్ణ : సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన హరికృష్ణ అతి స్వల్ప వ్యవధిలోనే 100 అంతర్జాతీయ చెస్ పోటీలలో పాల్గొన్నారు. ప్రస్తుతం ప్రపంచంలో 97వ ర్యాంకులో నిలిచారు. హరికృష్ణ ఎల్లో పాయింట్సు 2612గా ఇటీవల ఫైడ్ ప్రకటించారు.

## సాధించిన టైటిల్

2000 సంవత్సరంలో ఇస్తాంబుల్ చెస్ ఓలింపియాడ్‌లో మొదటి జిఎం నార్మ్‌ని 2001 జనవరి నెదర్లాండ్‌లో జరిగిన కోరస్ ఇంటర్నేషనల్ చెస్ టోర్నీలో రెండో జిఎం నార్మ్‌ని, కోల్‌కత్తాలో జరిగిన ఆసియా వ్యక్తిగత చెస్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో మూడవ జిఎం నార్మ్‌ని సాధించాడు. ఇటీవల గ్రీస్‌లో జరిగిన ఫైడ్ సమావేశంలో హరికృష్ణ సాధించిన గ్రాండ్ మాస్టర్ టైటిల్‌ను ఖాయపరచారు. 1996 స్పెయిన్‌లో జరిగిన ప్రపంచ యువ చెస్ పోటీల్లో (అండర్-10) బంగారు పతకం సాధించారు. 1997లో జరిగిన సంగ్లీ ఇంటర్నేషనల్ కామన్‌వెల్త్ చాంపియన్‌షిప్ పోటీల్లో (అండర్-14) బంగారు పతకం, టెహ్రాయిన్‌లో జరిగిన ఆసియన్స్ వార్ చెస్ చాంపియన్‌షిప్ (అండర్-14) పోటీల్లో బంగారు పతకం, టెహ్రాన్‌లో జరిగిన ఏషియన్ జూనియర్ (అండర్ 20) పోటీల్లో సిల్వర్ మెడల్ సాధించారు. లండన్‌లో జరిగిన కామన్‌వెల్త్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీల్లో బంగారు పతకం సాధించారు. 2004 దుబాయ్‌లో జరిగిన అంతర్జాతీయ చెస్ పోటీల్లో సిల్వర్ మెడల్ గెలుచుకున్నారు.

ద్రోణవల్లి హారిక: ఆసియాలో బాలికల విభాగంలో అతి చిన్న వయస్సులోనే ఉమెన్ ఇంటర్నేషనల్ మాస్టర్ హోదా, ఉమెన్ గ్రాండ్ మాస్టర్ హోదాలు సాధించిన ఘనత గుంటూరు క్రీడాకారిణి ద్రోణవల్లి హారికకు దక్కింది.

## సాధించిన అంతర్జాతీయ టైటిల్స్

: 2003 ముంబాయిలో జరిగిన బాలికల కామన్‌వెల్త్ ఛాంపియన్‌షిప్‌లో బంగారు పతకం గెలుచుకుంది. అవే పోటీల్లో మహిళా విభాగంలో రజత పతకం సాధించింది. ఇక్కడే ఉమెన్ గ్రాండ్‌మాస్టర్ నార్మ్, పురుషుల ఇంటర్నేషనల్ నార్మ్ సంపాదించింది. 2003 కోజికోడ్‌లో జరిగిన ఆసియా ఉమెన్ ఛాంపియన్‌షిప్‌లో రజత పతకం గెలుచుకుంది. 2004 ముంబాయిలో జరిగిన కామన్‌వెల్త్ అండర్ 18 బాలికల విభాగంలో బంగారు పతకం గెలుచుకుంది. ఈ పోటీలలో ఉమెన్ గ్రాండు మాస్టర్ హోదా సాధించి ఆసియాలో అతి చిన్న వయస్సులో ఉమెన్ గ్రాండ్ మాస్టర్ హోదాను సాధించిన క్రీడాకారిణిగా నమోదైంది. 2002 టెహ్రాన్‌లో జరిగిన అండర్-12 బాలికల ఏషియన్ చాంపియన్‌షిప్‌లో బంగారు పతకం గెలుచుకుంది. 2000 సంవత్సరం స్పెయిన్‌లో జరిగిన అండర్-10 బాలికల ప్రపంచ యూత్ చెస్ పోటీల్లో బంగారు పతకం సాధించింది. 1999 నుంచి 2004 వరకు జాతీయ పోటీలలో హారిక పాల్గొని పతకాలు సాధించింది. 2004 సంవత్సరం అక్టోబరు 12 నుంచి స్పెయిన్‌లో జరిగే చెస్ ఒలింపియాడ్‌లో భారత మహిళా జట్టు తరపున పాల్గొంటున్నది.

రోహిత్ : ఆంధ్రప్రదేశ్ చెస్ రంగంలో తన సహజ శైలిలో ఆడి పైకి వచ్చి అంతర్జాతీయ స్థాయికి ఎదిగిన మరో గుంటూరు బాలుడు గోగినేని రోహిత్ అని చెప్పవచ్చు. చెస్ కుటుంబంలో జన్మించిన రోహిత్ తన తండ్రి రామారావు శిక్షణలో చెస్ శిక్షణ పొందాడు. ముంబాయిలో జరిగిన కామన్‌వెల్త్ చెస్ చాంపియన్‌షిప్‌లో, జోధపూర్‌లో జరిగిన ఆసియా చెస్ చాంపియన్‌షిప్‌లలో అండర్-14 విభాగంలో స్వర్ణ పతకాలు రోహిత్ గెలుచుకున్నాడు. రాజస్థాన్‌లోని బికనీర్‌లో జరిగిన ఏషియన్ యూత్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో కాంస్య పతకం సాధించాడు. అహ్మదాబాద్‌లో జరిగిన అండర్-10 బాలుర విభాగంలో, ఇరాన్‌లోని టెహారాన్‌లో జరిగిన అండర్ 12 బాలుర విభాగంలో జరిగిన ఏషియన్ యూత్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో రజత పతకం పొందాడు. మద్రాసులో జరిగిన ఓఎన్‌జిసి అంతర్జాతీయ రేటింగ్ చెస్ పోటీలలో పాల్గొని ప్రఖ్యాత క్రీడాకారులపై విజయం సాధించి అంతర్జాతీయ రేటింగ్ సాధించాడు.

కె.ఎస్ శ్రీకర్ : అంతర్జాతీయ చెస్ పోటీలకు గుంటూరు అందించిన ఆణిముత్యం శ్రీకర్. విజయవాడలో జరిగిన అంతర్జాతీయ ఫైడ్ రేటింగ్ చెస్ టోర్నమెంటులో పాల్గొని అద్భుత ప్రతిభ చూపాడు. అదే సంవత్సరం విజయవాడలో జరిగిన అంతర్జాతీయ ఫైడ్ రేటింగ్ ఆల్ ఇండియా ఓపెన్ చెస్ టోర్నమెటులో స్పెషల్ ప్రైజు పొందాడు. జంషెడ్‌పూర్‌లో జరిగిన టాటా ఇంటర్నేషనల్ టోర్నమెంటులో విశేష ప్రతిభ చూపి కాంస్య పతకం పొందాడు. హైదరాబాద్‌లో జరిగిన సౌత్‌జోన్ టోర్నమెంటులో బంగారు పతకం గెలుచుకున్నాడు. తండ్రి కె.త్రినాధరావు, చెస్ కోచ్ జి.శ్రీనివాసరావు ప్రోత్సాహంతో చెస్ క్రీడలో అడుగుపెట్టిన శ్రీకర్ తన మేధాశక్తితో రాష్ట్ర, జాతీయ పోటీల్లో విజయపరంపరతో ముందంజ వేశారు.

లక్ష్మీ ప్రణీత : గుంటూరుకు చెందిన మరొక క్రీడాకారిణి కె.లక్ష్మీప్రణీత జాతీయ, అంతర్జాతీయ పోటీలలో విజయాలు సాధిస్తూ అంచెలంచెలుగా పైకి వస్తున్నది. ముంబాయిలో జరిగిన కామన్‌వెల్త్ చెస్ పోటీలలో అండర్-12 బాలికల విభాగంలో బంగారు పతకం గెలుచుకుంది. కోజికోడ్‌లో జరిగిన ఆసియా యూత్ చెస్ ఛాంపియన్‌షిప్ పోటీలలో అండర్ 12 బాలికల విభాగంలో గోల్డ్ మెడల్ సాధించింది. జాతీయ చెస్ క్రీడాకారుడు జి.రామకృష్ణ దగ్గర శిక్షణ పొందుతున్న లక్ష్మీప్రణీత రాష్ట్ర, జాతీయ స్థాయి పోటీలలో విజయపరంపరలతో అనేక పతకాలు సాధించింది. ఈ ఐదుగురు క్రీడాకారుల్ని అంతర్జాతీయ చెస్ రంగానికి జిల్లా అందించిన వజ్రాలుగా చెప్పవచ్చు.

# 100 సంవత్సరముల బ్యాంక్ ఆఫ్ ఇండియాకు శుభాకాంక్షలు...


బ్రాంచి చిరకాల ఖాతాదారుడు
శ్రీ సుమేర్‌దుల్ జైన్ గారిని సన్మానిస్తున్న దృశ్యం


2005 ఎంసెట్ కౌన్సిలింగ్
కౌంటరు ప్రారంభోత్సవము


బ్యాంక్ ఆఫ్ ఇండియా శతవార్షికోత్సవాల్లో
పాల్గొన్న కేంద్ర ఆర్థిక మంత్రి చిదంబరం


బ్యాంక్ ఆఫ్ ఇండియా శతవార్షికోత్సవాల
సందర్భంగా మహారాష్ట్ర ముఖ్యమంత్రికి వరద
బాధితుల సహాయార్థం చెక్కును అందజేస్తున్న బ్యాంకు సిబ్బంది


బ్యాంక్ ఆఫ్ ఇండియా శతవార్షికోత్సవ
సభలో ప్రసంగిస్తున్న కేంద్ర మంత్రి చిదంబరం

## బ్యాంక్ ఆఫ్ ఇండియా - స్వరూపం

### బ్యాంక్ ఆఫ్ ఇండియా - చరిత్ర

సర్ ససూన్ డేవిడ్, సర్ కొవాస్ జీ జహంగీర్, ప్రధమ జమిందారు మరియు శ్రీ రామ్‌నారాయణ్ హర్నా ద్రాయలతో కూడిన ప్రముఖ ముంబాయి వ్యాపారవేత్తల బృందంచే బ్యాంక్ ఆఫ్ ఇండియా 7 సెప్టెంబరు, 1906న స్థాపించబడినది.

ఈ బ్యాంకుకు ఘనమైన వారసత్వమున్నది. ప్రారంభం నుండే అత్యున్నత ప్రామాణిక సేవలతో ఇది పేరు ప్రఖ్యాతులు గడించినది. దూరదృష్టి మరియు ముందు జాగ్రత్తలు ఈ బ్యాంకు విధానాన్ని నిర్దేశించినది. ఇది భారత ఆర్థిక వ్యవస్థపై గణనీయమైన భారాన్ని మోపినటువంటి 1929లోని ఆర్థికమాంద్యం, రెండవ ప్రపంచ యుద్ధం మొ॥లాంటి అనేక విపత్తుల నుండి ఈ బ్యాంకును బయటపడేలా చేసింది. భారతీయ బ్యాంకింగ్ ప్రపంచంలో ఈ బ్యాంకు అగ్రగామిగా ఉన్నది మరియు ఇతరులు అనుసరించదగిన పద్ధతులు మరియు ప్రమాణాలను రూపొందించినది.

బ్యాంక్ ఆఫ్ ఇండియా పలు రంగాలలో ప్రథమంగా నిలిచింది. 1 జులై 1946లో లండన్‌లో శాఖను తెరచి భారత్ వెలుపల తన శాఖను నెలకొల్పిన మొదటి బ్యాంకు ఇదే. 1950లో జపాన్‌లో కూడా శాఖను ప్రారంభించిన మొదటి భారతీయ బ్యాంకు ఇదే మరియు 1974లో యూరప్ ఖండంలోని ప్యారిస్‌లో ఒక శాఖను తెరచిన మొదటి బ్యాంకు కూడా ఇదే.

రూ.50 లక్షల చెల్లించిన మూలధనం మరియు 50 మంది సిబ్బందితో ముంబయిలో ఒక కార్యాలయంలో ప్రారంభమై శీఘ్రంగా ప్రగతిని సాధించినది. 1969లో జాతీయీకరణ సమయంలో భారత్‌లో 207 శాఖలు, విదేశాల్లో 12 శాఖలు, రూ.11 కోట్ల నికర విలువ, రూ. 436 కోట్ల డిపాజిట్‌లు మరియు రూ.296 కోట్ల అడ్వాన్సులు కలిగి ఉన్నది.

ఈ బ్యాంక్ ఫిబ్రవరి 1997లో తన ప్రథమ పబ్లిక్ ఇష్యూను విడుదల చేసినది.

### బ్యాంక్ ఆఫ్ ఇండియా - నేడు

98 ఏళ్లకు పైగా విజయ పరంపరలతో ఘన చరిత్ర కలిగియున్న బ్యాంక్ ఆఫ్ ఇండియా నేడు ప్రధాన బ్యాంకుగా ఆవిర్భవించినది.

దేశంలోని అన్ని బ్యాంకులలో ఆస్తి పరిమాణంలో చూస్తే ఈ బ్యాంకు 6వ స్థానంలో ఉన్నది. 2617 శాఖలతో విస్తరించిన ఈ బ్యాంకుకు 2594 భారతీయ శాఖలు, 23 విదేశీ శాఖలు/కార్యాలయాలు. 165 ఎక్స్‌టెన్షన్ కౌంటర్లు మరియు 118 ప్రత్యేక శాఖలు ఉన్నవి.

46 జిల్లాలలో లీడ్ బ్యాంక్ బాధ్యత మరియు 16 ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు కలవు.

ఈ బ్యాంకుకు 23 మిలియన్ల పటిష్టమైన ఖాతాదార్ల ఆధారం ఉన్నది.

ఈ బ్యాంకులో ప్రభుత్వ వాటా 69.47%.

ఈ బ్యాంకుకు BOI షేర్ హోల్డింగ్ లిమిటెడ్ లాంటి సబ్సిడీలు, అసోసియేట్లు ఉన్నవి. అవి బాంబే స్టాక్ ఎక్సేంజి మరియు లుసాకా, జాంబియాలోని ఇండో జాంబియా బ్యాంక్ లిమిటెడ్ యొక్క క్లియరింగ్ మరియు సెటిల్‌మెంట్ విధులు చేపడుతున్నవి.

సెక్యూరిటీస్ ట్రేడింగ్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, IL & FS ఇన్వెస్ట్‌మెంట్ మేనేజర్స్ లిమిటెడ్ మరియు సెంట్రల్ డిపాజిటరీ సర్వీసెస్ (I) లిమిటెడ్‌లలో వ్యూహాత్మక పెట్టుబడులను కూడా ఈ బ్యాంకు కలిగియున్నది. ITI మరియు మల్టీ కమాడిటీ ఎక్స్‌చేంజ్ (MC) చే స్థాపించబడిన ASREC అస్సెట్ రీకన్‌స్ట్రక్షన్ కంపెనీలో ఈ బ్యాంకు కు ఈక్విటీ భాగస్వామ్యం కలదు.

చక్కగా నిర్మితమైన ఉత్పాదనలు, సేవలు మరియు సిబ్బంది నైపుణ్యాలను ఈ బ్యాంకు విస్తృతంగా కలిగి యున్నది.

ఈ బ్యాంకులో సుమారు 42,635 మంది ఉద్యోగులు నమోదైయున్నారు.

దేశంలోని ప్రధాన నగరాలలో ఈ బ్యాంకుకు 8 డిపాజిటరీ పార్టిసిపెంట్ ఆఫీసులు ఉన్నవి.

ఈ బ్యాంకుకు విస్తృత స్థాయిలో అంతర్జాతీయ క్రెడిట్ కార్డులు మరియు డెబిట్ కార్డులున్నవి.

ఈ బ్యాంక్ తన ఖాతాదార్లకు పూర్తి స్థాయిలో సేవలందించుటకు ఒక బృహత్ సాంకేతిక స్థాయిపెంపు ప్రణాళికను అమలు పరిచినది. 100% దేశీయ శాఖలు కంప్యూటరీకరించబడినవి. ఈ బ్యాంక్ తన ఖాతాదార్లకు ఎక్కడైనా బ్యాంకింగ్ సేవలు అందే విధంగా SMS బ్యాంకింగ్ టెలీ బ్యాంకింగ్ మరియు ఇంటర్నెట్ బ్యాంకింగ్ సేవలు కల్పించేందుకు 220 నగరాలు / పట్టణాలు వద్ద 731 శాఖలకు పైగా నెట్ వర్క్‌ను కలిగియున్నది. ఈ బ్యాంకు తన ఖాతాదార్ల వినియోగార్థం భాగస్వామ్యంగల ATM నెట్‌వర్క్‌లు మరియు VISA ATM లతో సహా సుమారు 1200 ATM లను కలిగియున్నది.

డిసెంబరు 2006 నాటికల్లా 750 నెట్‌వర్క్‌డ్ శాఖల ద్వారా దాని ఖాతాదారులకు ఏ సమయంలోనైనా, ఎక్కడైనా, ఏ విధమైన బ్యాంకింగ్‌ను కల్పించునట్టి కోర్ బ్యాంకింగ్ సొల్యూషన్‌ను బ్యాంకు అమలు పరుస్తుంది. ఇప్పటికే 128 పైగా శాఖలు సిబియస్ కు తరలించడం జరిగింది.

AC నీల్సన్ ORG-MARG చే 2003-2004 సంవత్సరముల కొరకు వరుసగా అన్నీ జాతీయబ్యాంకులలో ఒకటిగా భారతదేశంలో అత్యంత విశ్వసించదగు సర్వీసు బ్యాంకుగా ర్యాంకు కల్పించడమైనది.

డన్ అండ్ బ్రాడ్ స్ట్రీట్ చే 2004 సంవత్సరంలో భారతదేశంలో 500 పెద్ద కంపెనీలలో 24వ హోదాను ఈ బ్యాంకు పొందినది.

ఈ బ్యాంక్ తన 250 శాఖలకు ISO ధృవీకరణను పొందనున్నది.

వ్యాపార వ్యూహాన్ని పునఃరుద్ధరించుటకు మరియు ప్రక్రియలను తిరిగి రూపొందించేందుకు బోస్టన్ కన్సల్టింగ్ గ్రూపుతో కన్సల్టెన్సీ సహాయానికై ఈ బ్యాంక్ బిజినెస్ ప్రాసెస్ రీ-ఇంజనీరింగ్‌ను చేపట్టినది.

ప్రస్తుత నెట్‌వర్క్ స్థాయిను పెంచుతూ మరియు అవకాశాలు గల కేంద్రాలు వద్ద క్రొత్త శాఖలను తెరవడం ద్వారా అంతర్జాతీయంగా విస్తరించాలని ఈ బ్యాంక్ ప్రణాళికలను సిద్ధం చేసింది.

### ఆర్థిక విశిష్టతలు

మొత్తం వ్యాపారం రూ. 1,36,422 కోట్లు.

మార్చి 2005 ముగింపు నాటికి డిపాజిట్లు రూ. 78,800 కోట్లు. అడ్వాన్సులు రూ. 56,000 కోట్లుగా వున్నవి.

2004-2005 ఆర్థిక సంవత్సరం కొరకు బ్యాంకు యొక్క నిర్వహణలాభం రూ. 1,460 కోట్లు.

2004-2005 ఆర్థిక సంవత్సరం కొరకు బ్యాంక్ నికరలాభం రూ.340 కోట్లు.

ప్రకటించిన డివిడెంట్ 20%.

మార్చి 2005నే బ్యాంక్ యొక్క మూలధన సద్వ్యాప్తత 11.52%

నికర NPA 2.77% (మార్చి 2005)

మార్చి 2005 ముగింపు నాటికి ప్రాధాన్యతా రంగ అడ్వాన్సులుతో 51.33% (నిర్ణయించిన దానిలో 40%) నికర బ్యాంక్ పరపతి మరియు వ్యవసాయ అడ్వాన్సులతో 20.45% (నిర్ణయించిన దానిలో 18%).

### ప్రగతి పథంలో

2005-06 సంవత్సరంలో వ్యాపార వృద్ధి లక్ష్యం సుమారు 20%గా వుంది. నిర్వహణ లాభం వృద్ధి సుమారు 20% మరియు నికర NPA 1.5 కన్నా తక్కువగా వుంది.

వ్యవసాయ రంగానికి పెద్దపీట వేయడంతోపాటు వస్తృతంగా రిటైల్ క్రెడిట్ మరియు SME అడ్వాన్సుల పై కూడా ఈ బ్యాంకు దృష్టి సారిస్తున్నది.

అదనపు ఆదాయము పెంచుటకు ఒప్పందం ఏర్పాట్లు ద్వారా ఇన్సూరెన్స్ ఉత్పాదనలు మరియు మ్యూచువల్ ఫండ్ ఉత్పాదనలు లాంటి మూడవ పార్టీ ఉత్పాదన అమ్మకానికి ప్రాధాన్యతనీయబడినది. సాంకేతికత కాకుండా ఉత్పాదన పునరుద్ధరణ మరియు మార్కెటింగ్ వ్యూహాల పై దృష్టి సారించడం ఊపందుకున్నది.

ఉత్పాదన స్వరూపం విస్తరించడం పంపిణీ వ్యవస్థను బహుముఖం చేయడం, సాంకేతికతను పటిష్టపరచడం మరియు ప్రక్రియ సామర్థ్యాన్ని వృద్ధిపరచడం కొరకు కీలక చర్యలు ప్రారంభించబడినవి. బోస్టన్ కన్‌సల్టింగ్ గ్రూపు (BCG) కన్‌సల్టెన్సీ సహాయంతో ప్రాజెక్టు ప్రగతి పథంలో ఉన్నది.

విదేశీ భాగస్వామ్యాన్ని బాగా పెంచడం, ఉత్పత్తి ఆఫరింగ్స్ మరియు పటిష్టమైన సాంకేతిక మద్దతుతో పెంపుదలతో కూడిన అంతర్జాతీయ కార్యకలాపాలతో ప్రధాన ప్రేరణ.

ప్రస్తుత నెట్‌వర్క్ స్థాయిని పెంచుతూ మరియు కొత్త శాఖలను ప్రారంభిస్తూ బ్యాంకు విదేశాలకు విస్తరిస్తున్నది. బ్యాంక్ తన స్థాయీ పెంపు ప్రక్రియలో షెంజన్ మరియు వియాత్నం ప్రాతినిధ్య కార్యాలయాలను శాఖా కార్యాలయాలుగా మార్చినది. దోహ మరియు బీజింగ్‌లో ప్రాతినిధ్య కార్యాలయాలను ప్రారంభించుటకు ప్రణాళిక సిద్ధం చేస్తున్నది. అంతేగాక యాంట్ వెర్ట్ (బెల్జియం) వద్ద శాఖను మరియు దర్-ఎస్-సలామ్ (టాంజానియా) వద్ద పూర్తి స్వంత సబ్సిడరీని ప్రారంభించేందుకు RBI ఆమోదాన్ని పొందినది. ఈ బ్యాంక్ S.A.A.R.C. ప్రాంతం, ఆఫ్రికా మరియు ఐరోపాలో పలుశాఖలు ప్రారంభించాలని కూడా ప్రణాళికలు సిద్ధంచేస్తున్నది.

# దేశంలోనే ప్రత్యేకతను చాటుకున్న దుగ్గిరాల పసుపు యార్డు



దుగ్గిరాల వ్యవసాయ మార్కెట్ కమిటీ

**(ఆన్‌లైన్ – దుగ్గిరాల)**

పసుపుకు ప్రసిద్ధి చెందిన ఈమని వ్యవసాయ మార్కెట్ కమిటీ యార్డు దేశంలోనే ప్రత్యేకత సంతరించుకుంది. 1984లో గుంటూరు జిల్లా దుగ్గిరాలలో 5.75 ఎకరాల స్థలంలో ఏర్పాటు చేయబడింది. రాష్ట్రం నలుమూలల నుంచి పసుపు దుగ్గిరాల మార్కెట్‌కు తరలివస్తుంది. మార్కెట్ యార్డు కింద కొత్తగా 20.29 ఎకరాల స్థలంలో రైతుల పంట నిల్వల కొరకు గోదాములు నిర్మించారు. 86 వేల క్వింటాళ్ళ సామర్థ్యం గల పసుపు ఈ గోదాములలో నిల్వ వుంచుకొనే అవకాశం వుంది. రైతులు తెచ్చిన పసుపు ప్లాట్‌ఫారాలపై బహిరంగ వేలం నిర్వహిస్తారు.

కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి, కర్నూలు, కడప, ఖమ్మం తదితర జిల్లాల నుంచి రైతులు పసుపు పంటను తీసుకువచ్చి అమ్ముకుని వెళ్తుంటారు. అమ్మకం జరిగిన వెంటనే కాటాలు నిర్వహించి డబ్బు చెల్లించడం ఇక్కడ ప్రత్యేకత. ఎలక్ట్రానిక్ కాటాలపై తూకాల నిర్వహణ జరుగును. రైతులకు తాము తెచ్చిన పసుపు పంటపై రుణం తీసుకుని మూడు నెలల వ్యవధి వరకు ఎలాంటి వడ్డీ లేకుండా యార్డు గోదాములలో నిల్వ వుంచుకునే సౌకర్యం కలదు. తదుపరి ఐదు నుంచి 10 శాతం వడ్డీతో పంట విలువలో 75 శాతం రుణాన్ని 50 వేల రూపాయల గరిష్ట పరిమితిగా యార్డు అందజేస్తుంది. రైతుల సౌకర్యార్థం విశ్రాంతి భవనాన్ని ఇంటర్నల్ రోడ్లు ఏర్పాటు చేయబడ్డాయి. రైతులు పసుపు తెచ్చుకునేందుకు మార్కెట్ యార్డు పరిధిలో లింకు రోడ్లు నిర్మించారు. లాభాలతో నిమిత్తం లేకుండా రైతుల సౌకర్యార్థం ఎరువుల విక్రయ కేంద్రం ఏర్పాటు చేశారు. ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు సబ్సిడీపై విత్తనాలు సరఫరా చేస్తుంటారు. రైతుల కొరకు టార్పాలిన్ పట్టాలు సరఫరా చేస్తుంటారు.

కంప్యూటరీకరణతో ఎప్పటికప్పుడు ధరలు, నిల్వలు అమ్మకాలు తాజా వివరాలు పొందుపరచి రైతులకు అందుబాటులో వుంచుతారు. లైసెన్సు కలిగిన సుమారు 114 మంది హమాలీలు యార్డులో పని చేసి జీవనోపాధి పొందుతున్నారు. హమామీలలో 65 మంది పురుషులు, 35 మంది స్త్రీలు, 14 మంది మేస్త్రీలు వున్నారు. పసుపును గ్రేడింగ్, పాలిషింగ్ చేసి విదేశాలకు ఎగుమతి చేసే పసుపు ఫ్యాక్టరీలు వున్నాయి.



దుగ్గిరాల కొత్త యార్డు ప్లాట్‌ఫారం గోదాములు

సుమారు వంద మంది వ్యాపారులు వున్నారు. దుగ్గిరాల మార్కెట్ యార్డు పరిధి నుంచి ఏటా సుమారు 16 లక్షల బస్తాల పసుపు విదేశాలకు ఎగుమతి చేస్తుంటారు. దుగ్గిరాలలో సుమారు 40 మంది ప్రధాన పసుపు వ్యాపారులున్నారు. పెద్ద ఎత్తున ఎగుమతి చేసే వ్యాపారుల సంఖ్య పది లోపే వున్నప్పటికి 11 ఫ్యాక్టరీలు వున్నాయి. దేశంలో దుగ్గిరాల దేశవాళీ రకం పసుపు అత్యంత నాణ్యత కలిగి ప్రత్యేకతను సంతరించుకుంది.


పద్మాసనంలో కూర్చొని ధ్యానం చేస్తున్న వెంకటేశ్వరరావు

# ఆందోళనలకు విశ్రాంతినిచ్చే 'ధ్యాన' మార్గాలెన్నెన్నో!

(ఆన్‌లైన్-గుంటూరు,క్రీడాప్రతినిధి)

ఆధునిక జీవితంలో వచ్చిన మార్పులు, పెరిగిన వేగం, అంతులేని పోటీతత్వం యువతను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. వీటికితోడు సామాజిక జీవితంలోని అలజడి, ఆందోళనకు గురి చేస్తోంది. ఈ పరిస్థితుల్లో ధ్యానం, యోగలాంటి పద్ధతులు సమస్యకు పరిష్కారాలుగా, ఆధునిక జీవన మార్గాలుగా ముందుకు వస్తున్నాయి. వాస్తవానికి ఈ మార్గాలు, విధానాలు ప్రాచీన భారతీయ సాంప్రదాయం, సంస్కృతిలో భాగమే అయినా ఇప్పుడు కొత్తపేర్లతో రంగంలోకి దిగాయి. ఆర్ట్ ఆఫ్‌లివింగ్, రేకీ, యోగ, భావతీతి ధ్యానం, తాయ్‌చ్, ప్రాణిక్‌హీలింగ్ లాంటి ఈ పేర్లు అంతిమంగా మనిషికి శాంతిని, ప్రశాంతతను, ఆత్మస్థైర్యాన్ని ఇచ్చే సాధనాలుగా పని చేస్తున్నాయి. అలసి సొలసిన మనసు సేదతీరి, ఆత్మశక్తిని నింపుకొనేందుకు ఏ మార్గమైనా ఒక్కటే.

## యోగ

అయిదువేల సంవత్సరాల క్రితం నాటి ప్రక్రియ, భారతీయ సంస్కృతిలో విడదీయరాని అంతర్భాగం ఇది. శారీరక, మానసిక ధృడత్వాలను జనసత్వాలను అందించే వినూత్న ప్రక్రియగా ఇది ప్రపంచ ప్రసిద్ధిగావించింది. శారీరక ధఢత్వాన్ని అందించే ప్రక్రియగా 'ఆసనాలు' మానసిక జనసత్వాలను అందించే పద్ధతిగా 'ప్రాణాయామం'లను విదేశీయులు సైతం నిష్టగా నేర్చుకుంటున్నారు. ధ్యానం కూడా ఏకగ్రసాధనకు, మానసిక నిశ్చలత్వానికి ఉపయోగపడుతుంది.

## ఆర్ట్‌ఆఫ్ లివింగ్

ఈ ప్రక్రియలో వివిధ అంశాలుంటాయి. ఈ అంశాలన్నీ మనిషి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దేవే. మానసిక ఒత్తిడి నుంచి విముక్తి కలిగించడం, నైతిక విలువలను పెంపొందించడం, స్వశక్తిని అభివృద్ధి పరచడం లాంటి అశాలు ఈ ప్రక్రియలో సాధన చేయిస్తారు. ప్రతి రోజు క్రమబద్ధంగా చేసే సాధన వ్యక్తిత్వ వికాసానికి దారులు వేస్తుందని చెబుతారు. యోగ, ధ్యానం, క్రమపద్ధతిలో సాగించే ఉఛ్వాస, నిశ్వాసలు ఇందులో భాగంగా నేర్చుకోవచ్చు.

## ప్రాణిక్ హీలింగ్

వివిధ రకాల రుగ్మతలను, అనారోగ్యాలను సవరించుకొనేందుకు ఈ టెక్నికల్‌ను ఉపయోగిస్తారు. మనిషిలోని అంతరగ్త జీవశక్తి జనసత్వాలను ఇవ్వడంతోపాటు ఆరోగ్యాన్ని కూడా ఇస్తుందని ఈ ప్రక్రియల ప్రతీతిగాంచింది. ఈ ప్రక్రియను నేర్చుకోవడం చాలా సులభం. సాధన పద్ధతులు కూడా చాలా సరళంగా ఉంటాయి.

## రేకీ...

మానసిక, శారీరక ఒత్తిడిని తగ్గించి ప్రశాంతతను అందించేందుకు ఈ జపనీస్ టెక్నిక్‌ను సాధన చేసేవారి సంఖ్య ఇటీవలకాలంలో పెరుగుతోంది. మనిషిలో అంతర్గత శక్తి ఏదో ప్రవహిస్తోందని, ఈ శక్తి మనిషికి సామర్థ్యాలకు కీలకమని ఈ టెక్నిక్ భావిస్తోంది. అంతర్గత శక్తి వక్కువ ఉన్న వారు అనారోగ్యంతో, దుర్బలంగా ఉంటారని, శక్తిని పెంపొందించేందుకున్నవారు సంతోషంగా, ఆరోగ్యంగా ఉంటారని అన్నారు. రే,కీ అనే రెండు శబ్దాల నుంచి ఈ పదం పుట్టింది. రే అంటే దేవుడు, కీ అంటే జీవశక్తి అని అర్థం. రేకే శరీరాన్ని, భావనలను, ఉద్వేగాలను, మెదడును ఆరోగ్యకరమైన రీతిలో పని చేసేందుకు ఉపకరిస్తోంది.

## భావాతీత ధ్యానం

ఈ ధ్యానం మేధోసంపత్తిని పరిపుష్టం చేసే ప్రక్రియ. ప్రతిరోజు 15 నుంచి 20 నిముసాలు సాధన చేస్తే సరిపోతుంది. ఒత్తిడిని తగ్గించి, ఆరోగ్యాన్న మెరుగు పరుస్తోంది. ఈ ప్రక్రియను సాధన చేసే పద్ధతులు చాలా సరళంగా ఉంటాయి.

## తాయ్‌చీ

ప్రాచీన జపనీస్ టెక్నిక్ ఇది. నిశ్శబ్ద కదలికలు, నృత్యం, శారీరక భంగిమలు, తాత్విక భావనలు ఈ టెక్నిక్‌కు పునాది. చేతులు, పాదాలను ఒక క్రమపద్ధతిలో కదిలిస్తూ చేసే విన్యాసాలే దీనికి ప్రాణాధారం. ఈ మధ్య ఎరోబిక్స్‌లో తాయ్‌చీని ఒకానొక అంశంగా చేర్చి ఈ టెక్నిక్‌ను నేర్పుతున్నారు.

## ధ్యానం

ధ్యానం మానసిక ప్రశాంతతను ఇచ్చే శాస్త్రీయ పద్ధతిగా గుర్తింపు పొందింది. ధ్యానంలో రోజువారి చికాకులన్నీ పోగొట్టుకొని అంతులేని ప్రశాంతతను ధ్యానం ద్వారా సాధించవచ్చు. ధ్యానాన్ని సాధన చేసేందుకు ఒకస్థితి అంటూ ప్రత్యేకంగా ఏమి పాటించనక్కరలేదు. మనకు వీలైన పొజిషన్‌లో కూర్చొని సాధన చేయవచ్చు. నిత్య జీవితంలో ఎదురయ్యే శారీరక, మానసిక సంఘర్షణల నుంచి దూరం చేసే చక్కని సాధనంగా ధ్యానం ఉపకరిస్తోందనడంలో సందేహం లేదు.

# దారు శిల్పాల కోవెల జంపని

**(ఆన్‌లైన్, వేమూరు)**

గుంటూరు జిల్లా వేమూరు మండలంలోని జంపని గ్రామం దారు శిల్పాలకు నిలయమైంది. తమ సృజనాత్మక కళాకౌశల్యంతో జంపని లోని దారు శిల్పులు అపరమయ బ్రహ్మలుగా సజీవదారు శిల్పాలను మలచటంలో రాష్ట్రంలోనే పేరెన్నికగన్నారు. "శిలలపై శిల్పాలు చెక్కినారు" అన్నట్లుగా ముస్లింలు చిరుత ప్రాయంలోనే పోగర్లు, ఉలుల సహాయంతో ఊహాచిత్రాలకు సజీవ రూపం కల్పించి, అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేయడం వారి ప్రత్యేకత. అజంతా, ఎల్లోరా శిల్పాల నుంచి మహాలక్ష్మి, అష్టలక్ష్మి, భక్త హనుమాన్, అర్ధనారీశ్వరి, వెంకటేశ్వర, వినాయక, షిర్డిసాయి, సత్యసాయి, శంఖుచక్రాలు, పూర్ణకుంభం, నవగ్రహాలు, అష్టదిక్పాలకులు, పంచలోకపాలకులు లాంటి దేవతామూర్తుల చిత్రాలతోపాటు ముగ్ధ మనోహర లతలను అవలీలగా రూపొందించి శిల్పాల సౌకుమార్యాన్ని వీనుల విందు కావిస్తుంటారు. లక్షలాది రూపాయలు వెచ్చించి నిర్మించుకున్న ఇంటికి తగిన అందాన్ని తీసుకురావాలంటే ఎదురుగా దారు శిల్పాన్ని ఏర్పాటు చేసుకుంటున్న ఈ రోజుల్లో అందుకు తగిన అందాన్ని చూపించగల శిల్పదారులు జంపనికి చెందిన వారేనన్న ప్రచారం విస్తృతమైంది. భవన నిర్మాణ కార్మికులకు, కళాకారులకు, క్రీడాకారులకు గుర్తింపు పొందిన జంపని గ్రామం ఈనాడు దారు శిల్పాలకు నిలయంగా మారింది. ఇక్కడి శిల్పులలోని నిపుణత ఇంతని చెప్పనలవికాదు. సింహద్వారాల కమర్చే తలుపులపై వీరు తీర్చిదిద్దిన శిల్పాలు ప్రజలను కన్నార్పనీయవంటే అతిశయోక్తి లేదు.





డోర్‌పై చెక్కిన అష్టలక్ష్మిలు, నాట్య గణపతి (ఇన్‌సెట్‌లో) కీ.శే.దారు షేక్ షాలెహా (దారు శిల్పాల ప్రముఖుడు)



విదేశాలకు పంపిన నవగ్రహాలు

ఆరు అంగుళాల బొమ్మల నుంచి ఆరు అడుగుల ఎత్తు వరకు గల దేవతా మూర్తులను దారువు (చక్క)పై మరల్చటం వీరి నైపుణ్యానికి ప్రతీకగా చెప్పవచ్చు. సింహద్వారాలు, వాటికమర్చిన లతలు, అందుకు నిండుదనాన్ని చేకూర్చే వివిధ రకాల బొమ్మలు భవనాలకు అందాన్నిస్తాయి. నాణ్యత గల టేకు, నల్ల కర్రలను సాధనంగా చేసుకొని ఏ చిత్రమైతే కావాలో ఆ చిత్రం ఆకృతిని ఒక చార్టుపై రూపొందించి దాని ఆధారంగా పదేళ్ళ బాల కార్మికులను మొదలు పండు వయసు గల దారు శిల్పులు శిల్పాలను తయారు చేయటం, వాటిని ఆర్డర్లపై రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలేకాక ఇతర దేశాలకు కూడా పంపటం వారి ప్రత్యేకతను తెలుపుతోంది. హస్తకళలలో నిపుణత, నవ్యత కల్గిన ఈ శిల్పులు ప్రతి నిత్యం రకరకాల నూతన విధానాల ద్వారా కేవలం చేతితో, సాధనాలతో అబ్బురపరిచే బొమ్మల్ని రూపొందించటం ఈ శిల్పుల ప్రతిభకు నిదర్శనంగా చెప్పవచ్చు.

ఈ శిల్పాల తయారీలో ప్రముఖుడుగా షేక్ షాలెహా గురుతల్యుడు. ఇతని వద్ద ఈ విద్యనేర్చిన వారు ఈనాడు గొప్ప శిల్పులుగా పేరొందారు. మేధస్సుతో పేరు తెచ్చుకోగల పని కాబట్టి గ్రామంలో పదేళ్ళ బాలుడు దగ్గర నుంచి అందరూ ఈ పనిలో నిమగ్నమౌతున్నారు. ఇది చాలా జిలుగు పని. ఆదమరిస్తే ఈ పని దెబ్బతింటుంది అంటారు ఈ శిల్పులు. గతంలో గ్రామంలో తక్కువ సంఖ్యలో పని వారుండటం వల్ల శ్రమకు తగిన ఫలితం లభించేదని, ఈనాడు గ్రామంలోనే వందల మంది ఈ పనిపై ఆధారపడి వుండటం, పోటీతత్వం పెరిగి పనులు రాబట్టుకోవాలన్న ఆలోచన చూపటం వల్ల శ్రమకు తగినంత డబ్బు రావటంలేదని వారంటున్నారు. ఇలాంటి హస్త కళా శిల్పులను ప్రభుత్వం తగిన విధంగా ప్రోత్సహించి ఆదుకుంటే జంపని కళాకారుల కీర్తి దశదిశలా వ్యాపించి వారి ఆర్థిక పరిపుష్టికి దోహదపడగలదని ఈ శిల్పులు కోరుకుంటున్నారు.








# విలువైనది కాలం - మరింత విలువైనది ప్రాణం




## రవాణా శాఖ - గుంటూరు జిల్లా

### స్పాన్సర్డ్‌బై : విద్యా సంస్థలు

# రైతులకు వెన్నూ దన్నూ జంపని షుగర్స్

(ఆన్‌లైన్ – వేమూరు)

తెనాలి ప్రాంత రైతాంగం శ్రేయస్సు దృష్ట్యా గుంటూరు జిల్లా వేమూరు మండలం జంపనిలో చక్కెర కర్మాగారం నిర్మాణం చేశారు. పద కొండు కోట్ల రూపాయల వ్యయంతో లక్షా 65 వేల మెట్రిక్ టన్నుల చెరకు గానుగ ఆడగల సామర్థ్యం గల చక్కెర ఫ్యాక్టరీ మొదటి క్రషింగ్ సీజన్‌ను 1983–84 సంవత్సరంలో ప్రారంభిం చారు. కీర్తిశేషులు రైతుబంధు నన్నప నేని వెంకట్రావు కర్మాగారం నిర్మాణా నికి ప్రత్యేక కృషి చేశారు. దివంగత మంత్రి ఆలపాటి ధర్మారావు, మాజీ ఎమ్మెల్యే డాక్టర్ కొడాలి వీరయ్యచౌదరి, మాజీ రాజ్యసభ సభ్యుడు యడ్లపాటి వెంకట్రావులు తమవంతు ప్రోత్సాహక సహకారం అందించారు. సహకార రంగంలో నెలకొల్పిన కర్మాగారం నిర్మాణానికి 77 ఎకరాల నల్లరేగడి భూమిని కొనుగోలు చేశారు. 11 వేల 129 మంది సభ్యులను చేర్పించి కోటి 26 లక్షల 41 వేల రూపాయల వాటా ధనాన్ని సమకూర్చారు. దీని నిర్మాణా నికి నాటి ముఖ్యమంత్రి మర్రి చెన్నా రెడ్డి, మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కరరావులు కూడా ప్రభుత్వపర మైన సహకారం అందించారు.

22 సంవత్సరాల నాడు నెలకొ ల్పిన ఈ కర్మాగారంకు అన్నపూర్ణ కో ఆపరేటివ్ షుగర్ ఫ్యాక్టరీగా పేరుపె ట్టారు. దీని నిర్మాణం కోసం కృషి చేసి, తొలి పాలకవర్గానికి అధ్యక్షత వహిం చిన నన్నపనేని వెంకట్రావు మృతి చెందటంతో ఫ్యాక్టరీ పేరును నన్నప నేని వెంకట్రావు చక్కెర ఫ్యాక్టరీగా మార్పు చేశారు. మొదటి క్రషింగ్ సీజన్ (1983–84)లో కేవలం 10,005 మెట్రిక్ టన్నుల చెరకు క్రషింగ్ జరిగి 5510 క్వింటాళ్ళ పంచ దార దిగుమతి చేసుకొని 5.50 శాతం రికవరీని సాధించింది. నాటి పాలకవ ర్గాలు చేసిన కృషి ఫలితంగా ఫ్యాక్టరీ పరిధిలో ఆరు జోన్‌లు ఏర్పాటైనాయి.



వేమూరు మండలంలోని జంపని షుగర్ ఫ్యాక్టరీ సముదాయం

ఎనిమిది నియోజకవర్గాల స్థాయిలోని రైతాంగం చెరకు పంటను పండించు టకు ముందుకురావటం జరిగింది. 1987–88 సీజన్‌కల్లా లక్షా 65 వేల 792 టన్నుల సామర్థ్యవంతమైన చెర కును గానుగ ఆడారు. 1999–2000 సీజన్‌లో లక్షా 99 వేల 925 టన్నులు సామర్థ్యానికి మించిన క్రషింగ్ జరి గింది. రైతులకు లాభాల తీపిని అందించే పరిస్థితులు సంతరించుకునే సమయానికల్లా నిర్వహణ విషయా లలో రాజకీయ జోక్యాలు చోటు చేసు కున్నాయి. అనేక లోపాలతో ఫ్యాక్టరీ మనుగడ దెబ్బతినేందుకు సిద్ధమైంది. నష్టాల ఊబిలోకి కూరుకుంది. ప్రభుత్వం ఫ్యాక్టరీ విషయంలో మను గడ కాపాడుటకు చేసే కృషిలో భాగంగా 2002–03 సంవత్సరంలో ఫ్యాక్టరీని ప్రైవేటు వారికి అమ్మటం జరి గింది. 2003–04 సీజన్ కూడా ప్రైవేటు వారికిందే నడిచింది. అయితే కొందరు రైతులు, కార్మికులు, నన్నప నేని, ఆలపాటి, యడ్లపాటి, కొడాలిల ఆశయ సిద్ధి కోసంగా తిరిగి ఫ్యాక్టరీని సహకారంలోనే నడిపించాలన్న సంక ల్పంతో న్యాయస్థానాలు ఆశ్రయించి ఎట్టకేలకు సహకారంలోకి ఫ్యాక్టరీని చేజిక్కించుకున్నారు. 2004–05 క్రషింగ్ సీజన్‌ను సహకారంలోనే నడి పారు. ఫ్యాక్టరీని, పరిధిలోని గ్రామా లను ఎంతో అభివృద్ధి చేయాలనే ఆలో చనతో ప్రస్తుత పాలకవర్గం అధ్యక్షులు నన్నపనేని లింగారావు, కార్యవర్గస భ్యులు, కార్మికులు కంకణం కట్టుకొని శ్రమిస్తున్నారు. 2005–06 క్రషింగ్ సీజ న్‌లో 5020 ఎకరాలలో చెరకును నాటించారు. లక్షా డెబ్బై వేల టన్నుల చెరకు క్రషింగ్‌తోపాటు పది శాతంకు పైగా రికవరీ, అధిక లాభాలు సాధించ గలమన్న ఆశాభావాన్ని పాలకవర్గం వ్యక్తపరుస్తోంది. చెరకు అభివృద్ధికి దీర్ఘ, స్వల్పకాలిక విత్తనం సరఫరా చేయటం, జాతీయ బ్యాంకుల ద్వారా రుణ సదుపాయం కల్పించటం, రవాణా సౌకర్యాల కల్పనకు కూడా ప్రత్యేక ప్రణాళికను రూపొందించారు. రైతు శ్రేయస్సు కోసంగా నిర్మించిన ఈ కర్మాగారం మనుగడ కాపాడుకునే బాధ్యత రైతులు, కార్మికులపైన ఎంతైనా వుంది.

# అరటి రైతుకు ఆసరా కొల్లిపర మార్కెట్

(ఆన్‌లైన్, కొల్లిపర)

రైతుకు పంటలు పండించటం ఒక ఎత్తు అయితే మార్కెట్‌లో గిట్టుబాటు ధర లభించటం మరొక ఎత్తుగా వుంది. ఇటువంటి క్లిష్ట పరిస్థితులను అధికమిం చడానికి మండల కేంద్రమైన కొల్లిప రలో 17 సంవత్సరాల క్రితమే రైతులు సమిష్టిగా ముందడుగు వేశారు. నేటి రైతు మార్కెట్‌ల కన్నా ఎంతో ముందు గానే రైతు అరటి మార్కెట్‌ను నెలకొల్పి నారు. ఆదర్శవంతంగా నేటికి నిర్వహి స్తున్నారు. 1988వ సంవత్సరంలో కొల్లిపర ప్రాంత అరటి రైతులు తమ ఉత్పత్తులకు గిట్టుబాటు ధరలు కల్పిం చుకోవడానికి అందుబాటులోనే కొల్లిప రలో రైతు అరటి మార్కెట్‌ను నెలకొ ల్పారు. ప్రారంభంలో ఒక వేలం కేంద్రం మొదలై దిన, దినాభివృద్ధి చెంది 12 వేలం కేంద్రాలుగా నిలిచి నాయి. ఎటువంటి కమీషన్ లేకుండా నామమాత్రంగా రైతుకు నష్టం కలుగ కుండా గెలకు ఒక్కింటికి నాలుగు రూపాయలు కమీషన్ వసూలు చేయటం, వేలం పాటలో ఎటువంటి అవకతవకలు లేకుండా బహిరంగంలో వేలం పాట నిర్వహించటం జరుగు తుంది.

అరటి గెలలకు వేలం పాటలో గిట్టుబాటు ధరలు లభించుకుంటే వేలం పాటను రద్దు చేసుకునే సదు పాయం రైతుకు కలిగి వుండటం ఈ మార్కెట్ ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు. అవసర కాలంలో రైతులకు ప్రైవేటు రుణ సదుపాయం (వడ్డీ లేకుండా) కల్పించటం జరుగుతుంది. ఎనిమిది నెలలు సీజన్‌గా వుండే ఈ మార్కెట్‌లో సంవత్సరం మొత్తానికి సుమారు పది లక్షలు గెలలు ఎగుమతులు చేయబడ తాయి. జిల్లా, రాష్ట్రంలోని నలుమూల లేకాక ఒరిస్సా, బీహార్, పశ్చిమబెం గాల్ వంటి ఇతర రాష్ట్రాలకు కూడా ఈ మార్కెట్ ద్వారా అరటి గెలలు ఎగుమతులు జరుపబడుతున్నాయి. అరటి పంటకు అందుబాటులో ఈ మార్కెట్ నెలకొల్పడం వలన రైతుకు రవాణా ఖర్చులు తగ్గుతున్నాయి. చిన్న, సన్నకారు రైతులు అయితే సైకిళ్ళు, పశువుల బండ్లపై ఎటువంటి ఖర్చులు లేకుండా మార్కెట్‌కు తమ పంట ఉత్పత్తులను తరలిస్తారు. పెద్ద రైతులు ఆటోరిక్షాలు, ట్రాక్టర్లు ద్వారా నామమాత్రపు కూలీతో గెలలను తర లించటం జరుగుతుంది.

ఈ మార్కెట్‌ను ఆశ్రయించుకొని ప్రత్యక్షంగా, పరోక్షంగాగాని సుమారు 100 నుంచి 150 మంది కుటుంబాల వారు జీవనోపాధి పొందుతున్నారు. సీజన్‌లో ప్రతి నిత్యం సగటున 5 వేల 6 వేల అరటి గెలలు ఈ మార్కెట్‌లలో క్రయ, విక్రయాలు జరుగుతాయి. దూర ప్రాంతాల నుంచి వ్యాపారస్తులు ఈ మార్కెట్‌లో సరుకును కొని తమ ప్రాంతాలకు రవాణా చేసుకుంటారు. మండల పరిధికి చెందిన సుమారు వంద మంది చిన్నకారు వ్యాపారస్థులు ఈ మార్కెట్‌లో గెలలు కొనుగోలు చేసి వాటిని కావు ద్వారా పండించి పరిసర గ్రామాలలో ఇంటింటికి తిరిగి అమ్ము కుంటూ జీవనోపాధి పొందుతున్నారు. కొల్లిపర అరటి మార్కెట్ ఈ ప్రాంత రైతులకేగాక పరిసరాల లంక గ్రామాల రైతులకు ఎంతగానో ప్రయోజనం చేకూర్చుతుంది. ఎటువంటి మోసా లకు తావులేకుండా గిట్టుబాటు ధరలు కల్పించి ఇతర మార్కెట్‌లకు ఆదర్శప్రా యంగా నిలుస్తుంది.



మండల కేంద్రమైన కొల్లిపరలో అరటి కాయల మార్కెట్‌కు అధికంగా వచ్చిన గెలలు

# కోల్డ్‌స్టోరేజీలు మెండుగా.. మిర్చిరైతు కడుపు చల్లగా..

(ఆన్‌లైన్, గుంటూరు)

సరిగ్గా 13 సంవత్సరాల క్రితం 1992వ సంవత్సరం మిర్చిపంట విరగ కాసింది. డిమాండ్ తక్కువగా వుండి ఉత్పత్తి ఎక్కువ కావడంతో ఆ సంవత్సరంలో రైతాంగం నిల్వచేసే సౌకర్యం లేక క్వింటాలు రెండువందల రూపాయలకు తెగనమ్ముకొనే దుస్థితి ఏర్పడింది. ఆ స్థితి నుంచి ప్రస్తుతం మిర్చి రైతాంగం బయటపడింది. గుంటూరు మార్కెట్ యార్డుకు సమీపంలో కోల్డ్‌స్టోరేజ్‌లు రావడంతో రైతాంగం ధరలేని సమయంలో తమసరుకును నిల్వచేసుకొని ఆ తరువాత ధరవచ్చిన సమయంలో సరుకు అమ్ముకునే వీలు ఏర్పడింది. కోల్డ్ స్టోరేజ్‌లు రంగప్రవేశం చేసిన అనంతరం మిర్చి మార్కెట్‌లో స్థిరత్వం ఏర్పడింది. దీనితోపాటు గతంలో ధరలేని సమయంలో రైతులు తమ సరుకును ప్రైవేట్ గోడౌన్‌లలో నిల్వచేయడం వలన సరుకు నిల్వచేసుకొనే సౌకర్యం ఏర్పడి రంగు తగ్గిపోయే ప్రమాదం తొలగిపోయింది. దీనితోపాటు బరువు కూడా సరిగ్గా వుంటుంది. ఇక ఎగుమతి దారులకు కోల్డ్ స్టోరేజ్‌లు వరంగా మారాయి. సరుకును నిల్వచేసి ఎగుమతి మార్కెట్ ఆశాజనకంగా వున్న సమయంలో కోల్డ్‌స్టోరేజ్‌లో మంచి సరుకు తీసి అమ్ముతున్నారు. రాష్ట్రంలో మిర్చి మార్కెట్‌కు ప్రధానకేంద్రంగా విరాజిల్లుతున్న గుంటూరులో కోల్డ్‌స్టోరేజ్‌లు అత్యధిక సంఖ్యలో వచ్చాయి. గుంటూరులో 1993వ సంవత్సరంలో మూడు కోల్డ్‌స్టోరేజ్‌లు వుండేవి. ప్రస్తుతం గుంటూరు మార్కెట్ యార్డ్ పరిసర ప్రాంతాలలో మొత్తం 69 కోల్డ్‌స్టోరేజ్‌లు వచ్చాయి. గుంటూరు నుంచి చిలకలూరిపేట వెళ్ళే జాతీయ రహదారికి ఇరువైపుల పొత్తూరు గ్రామం వరకు, మాచర్ల వెళ్ళే రహదారిలో నల్లపాడు రహదారి వరకు వరసగా మనకు కోల్డ్‌స్టోరేజ్‌లు కనిపిస్తాయి. ఒక్కో కోల్డ్ స్టోరేజ్‌లో 25వేల బస్తాలు నుంచి లక్షా 60 వేల టిక్కీల వరకు నిల్వచేసే సౌకర్యం వుంటుంది. గుంటూరులో ఎక్కువగా 80వేల నుంచి లక్ష టిక్కీలు వరకు నిల్వచేసే సామర్థ్యం వున్న కోల్డ్‌స్టోరేజ్‌లు అధికంగా వున్నాయి. 1993 సంవత్సరానికి పూర్వం రైతాంగం యార్డ్‌కు సరుకు తీసుకువచ్చిన సమయంలో ధర లేని పక్షంలో రెండురోజులు మాత్రం వేచిచూసి ఆ వెనువెంటనే అయినకాడికి అమ్ముకునే పరిస్థితి నెలకొని వుంది. ప్రస్తుతం రైతాంగం 95 సంవత్సరం నుంచి సరుకును కోల్డ్‌స్టోరేజ్‌లో నిల్వచేయడం రైతాంగం ప్రారంభించింది.

కోల్డ్‌స్టోరేజ్‌లో సరుకు నిల్వచేసిన రైతాంగంకు సరుకుపై 13.5 శాతం వడ్డీతో రుణంను జాతీయబ్యాంకులు ఇస్తున్నాయి. మార్కెట్ రేటులో 50 శాతం వరకు జాతీయ బ్యాంకులు రుణంగా రైతులకు ఇస్తున్నాయి. సుమారు రెండులక్షల రూపాయల వరకు రుణం ఇస్తున్నారు. గృహాల వద్ద సరుకు నిల్వచేస్తే రంగు, తూకం తగ్గిపోతుందని రైతాంగం గ్రహించింది. మార్కెట్‌లో సరుకు ఒకేసారి వచ్చిన సమయంలో ధర తగ్గుతుండటంతో ప్రస్తుతం రైతాంగం ఈ సమయంలో సరుకును కోల్డ్‌స్టోరేజ్‌లలో నిల్వచేయడం ప్రారంభించింది. 1997వ సంవత్సరంలో మార్కెట్‌లో మిర్చిధర క్వింటాలుకు రెండువేల రూపాయలు పడిపోయింది. దీనితో రైతాంగం కోల్డ్‌స్టోరేజ్‌లలో అప్పటిలో సరుకు నిల్వచేసింది. ఎగుమతి మార్కెట్‌కు ఎక్కువగా రంగు కలిగిన మిర్చి అవసరం ఏర్పడుతుంది. కోల్డ్‌స్టోరేజ్‌లలో నిల్వచేసిన మిర్చికి రంగు స్థిరంగా వుంటుంది.

గుంటూరులోని కోల్డ్‌స్టోరేజ్‌లలో గుంటూరు, కృష్ణా, ప్రకాశం, నెల్లూరు జిల్లాలకు చెందిన సరుకును నిల్వచేస్తారు. ప్రస్తుతం గుంటూరులో వున్న కోల్డ్‌స్టోరేజ్‌లలో 85 శాతం సరుకు నిండి వుంటుంది. గుంటూరులో ప్రస్తుతం వున్న కోల్డ్‌స్టోరేజ్‌లలో ఒక్క మిర్చిమాత్రమే నిల్వచేసేందుకు వీలుంటుంది. అదేవిధంగా, అపరాలు నిల్వచేసేందుకు వీలుగా రైతాంగంను చైతన్యవంతం చేయాల్సిన అవసరం వుంది. అదేవిధంగా పసుపు నిల్వచేసేందుకు కూడా సౌకర్యం వుండి, కూరగాయలను నిల్వచేసేందుకు అవసరమైన కోల్డ్‌స్టోరేజ్‌లను నిర్మించేందుకు ప్రభుత్వం ప్రోత్సహించాలని వారు కోరారు. తమ డిపాజిట్‌లు బ్యాంకులలో వేస్తున్నాయని, ఇది రైతుల నుంచి వసూలుచేసిన సొమ్ము స్టోరేజ్‌లలో నిల్వచేసిన వారికి రుణంగా ఇవ్వాలని అసోసియేషన్ నాయకులు కోరారు. అదేవిధంగా కోల్డ్‌స్టోరేజ్‌లు వున్న ప్రాంతాలలో విద్యుత్‌కోత లేకుండా చేయాలని వారు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఇతర దేశాలకు మిర్చి ఎగుమతి చేసేందుకు మార్క్‌ఫైడ్, నాఫెడ్, ఎస్‌టిసిలు సరుకును, కొనుగోలు చేసి ఎగుమతి చేయాలని కోరారు. దీనివలన మార్కెట్‌లో ధర నిలకడగా వుంటుందని వివరించారు.

# సహజ వనరుల ఖిల్లా గుంటూరు జిల్లా

(ఆన్‌లైన్, గుంటూరు)

గుంటూరు జిల్లా సుసంపన్నమైనది. ప్రకృతి శోభలకు ఆలవాలమైనది. ఎత్తయిన కొండలు, కోనలు, లోయలు, సాంద్రారణ్యములు, ఖనిజాలు, తటాకాలు, పంట కాలవలు, నవధాన్యములు ఫలించు భూములు గల గుంటూరు జిల్లాలో కృష్ణానది ప్రవహించు పునీతము చేయుచున్నది. ఇంతటి విశిష్టతను సంతరించుకున్న గుంటూరు జిల్లా 1904 అక్టోబరులో ఏర్పడింది. ఈ ఏడాది అక్టోబరు మాసంతో జిల్లా ఏర్పడి 101 సంవత్సరాలు పూర్తవుతున్నది. గుంటూరు జిల్లాను క్రీస్తు పూర్వము నాల్గవ శతాబ్ది నుంచి నేటి వరకు గణతంత్ర రాజులు, శాతవాహనులు, ఇక్ష్వాకులు, ప్రాచీన పల్లవులు, ఆనంద గోత్రికులు, బృహత్పలాయనులు, విష్ణుకుండులు, దుర్జయులు, తూర్పు చాళుక్యులు, చాళుక్య చోళులు, మాండలిక రాజులు, కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర పాలకులు, కుతుబ్‌షాహీలు, మొగలులు, ఆసఫ్ జాహీలు, బ్రిటీష్ పాలకులు, ప్రజా ప్రతినిధులు పాలిస్తూ వచ్చారు. భూ విజ్ఞాన పరంగా చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకున్న ప్రముఖ విద్యాకేంద్రంగా విరాజిల్లుతున్న గుంటూరు జిల్లాకు తూర్పున బంగాళా ఖాతం, పశ్చిమాన మహబూబ్‌నగర్, ఉత్తరాన నల్గొండ, ఉత్తర ఈశాన్యాన కృష్ణాజిల్లాతో ఆవరించబడి వుంది.

1904 అక్టోబరు 1న గుంటూరు కేంద్రంగా జిల్లా ఏర్పడగా, ఆ తరువాత 1985 మే నెలలో ఈ జిల్లా 57 రెవెన్యూ మండలాలుగా విభజించబడింది. 11వేల 391 చదరపు కిలోమీటర్లమేర విస్తరించిన ఈ జిల్లాలో చాలా భాగం తూర్పు, ఆగ్నేయదిశగా వాలి వున్న విశాలమైన ప్రదేశం, అక్కడక్కడా అవశిష్ట పర్వతాలతో అంతర్లీనమై వుంది. పశ్చిమాన శ్రీశైలం పీఠభూమితోను, తూర్పు వైపున డెల్టా అవక్షేపాలతోను, కృష్ణానది నీటి ప్రవాహ మార్గాలతోను కూడివుంది. తూర్పు కనుమలతో పరివేష్టితమైన ఈ జిల్లాలో నల్లమలై, వెంకటాయపాలెం, కొండవీడు మొదలైనవి ప్రధాన పర్వత శ్రేణులు. సానుకొండ, కాకిర్ల కొండలను ఎత్తైన శిఖరాలుగా పేర్కొనవచ్చు. జిల్లాలో ఉత్తరాన దాదాపు 250 కిలోమీటర్ల పొడవునా ప్రవహించే కృష్ణానది గుంటూరు, కృష్ణా జిల్లాలను విభజించే సరిహద్దుగా వుంది.

కృష్ణానది పల్నాడు ప్రాంతంలోని గనికొండ వద్ద జిల్లాలో ప్రవేశించి ఉత్తర, తూర్పు సరిహద్దులను చుడుతూ ప్రవహిస్తుంది. మున్నేరు, చంద్రవంక, నాగులేరు కృష్ణానదికి ముఖ్య ఉపనదులు కాగా గుండ్లకమ్మ ఈ జిల్లా గుండా ప్రవహించే మరో ముఖ్యమైన నది. నాగులేరు వినుకొండ ప్రాంతంలో కొండల్లో పుట్టి ఉత్తరంగా పల్నాడుతోకి ప్రవేశించి కృష్ణానదిలో కలుస్తుంది. చంద్రవంక పల్నాటి గుండా ఉత్తరంగా ప్రవేశించి కృష్ణానదిలో కలుస్తున్నది. గుంటూరు జిల్లాలో నాగార్జునసాగర్‌కు 15 కిలోమీటర్ల దూరంలో మాచర్ల, సాగర్ రహదారిపై ఏడో మైలువద్ద ఎత్తిపోతల జలపాతం వుంది. ఎత్తిపోతల జలపాతం మనోహరంగా పర్యాటకుల దృష్టిని ఆకర్షిస్తోంది.

గుంటూరు జిల్లాలో వ్యవసాయానికి అనుకూలించే నాలుగు రకాలైన భూములున్నాయి. నల్లరేగడి, ఎర్రనేలలు, ఇసుక, ఒండ్రు నేలలున్నాయి. నల్లరేగడి నేలలకు ప్రకృతి సిద్ధంగా వాటికి అవే సొంత ఎరువును తయారు చేసుకుని సారవంతమయ్యే గుణం వుంది. వర్షాకాలంలో ఈ నేలలు నీటిని పీల్చుకుని ఉబకడం, ఎండాకాలంలో తేమను కోల్పోయి చిన్న చిన్న ముక్కలుగా పగుళ్లివ్వడం సాధారణమైన విషయం. ఎండాకాలంలో నేలలోని తేమ కోల్పోవడం వలన భూ ఉపరితలంలో సుమారు అడుగు లోతు వరకు ముక్కలు ముక్కలుగా పగలడం, అందువల్ల గాలిలోని ఆక్సిజన్ మొదలగువాయువులు ఆ పగుళ్లలోకి వెళ్లడం, ఎండిన ఆకులు, అలములు, చిన్న చిన్న పాకుడు జంతువులు, కీటకాలు ఈ పగుళ్లలో పడటం సామాన్యంగా జరిగే విషయం.

వర్షాకాలంలో భూమి పై పొరకు సంబంధించిన మట్టి కరిగి ఈ పగుళ్లలో పడటం, అందువల్ల కొత్తపొర బయటకు రావడం, పగుళ్లలో పడిన ఆకులు, కీటకాల సముదాయం భూమిలోపల పొరల్లో చిక్కుకుని ఎరువుగా మారడం ప్రతి సంవత్సరం ప్రకృతి సిద్ధంగా జరిగే విషయం. అందువల్ల నల్లరేగడి నేలలు స్వయంగా దున్నుకుని ఎరువును సమకూర్చుకుని సారవంతమవుతాయనే విషయం వాడుకలో వుంది. అంతేగాక నల్లరేగడి నేలలకు తేమను ఎక్కువ కాలం నిల్వ వుంచుకునే సామర్థ్యం వుంది. అందువల్ల వర్షాభావ పరిస్థితుల్లో కూడా ఈ భూములు కొంత కాలం వరకు నాటిన పంట చెడకుండా కాపాడబడుతుంది. గుంటూరు జిల్లాలోని శిలావిన్యాసాలు ఆర్థిక ప్రాధాన్యత కలిగిన అనేక ఖనిజ నిక్షేపాలకు నిలయమై అనేక ఖనిజ ఆధార పరిశ్రమలు నెలకొల్పడానికి అవకాశం కల్పించాయి.

ఈ జిల్లాలో లభించే ఖనిజాల్లో వజ్రాలు, సున్నపురాయి, గాజు - ఇసుకలు, రాగి-సీసం-జింకు నిక్షేపాలు, క్వార్ట్జ్ కట్టడపు రాళ్లు, గృహాలంకరణ శిలలు ముఖ్యమైనవి. కృష్ణానది పరీవాహక ప్రాంతమైన అచ్చంపేట మండలం, కోళ్లూరు గ్రామ సమీపాన వున్న గ్రావెల్ క్వారీల్లో అతి విలువైన వజ్రాలను వెలికి తీసినట్లు భూవిజ్ఞాన శాస్త్రవేత్తల వలన తెలుస్తోంది. ప్రపంచ ప్రసిద్ధి చెందిన కోహినూర్ వజ్రం ఇక్కడనే లభించింది. ఈ గ్రామంతోపాటు వెంకటాయపాలెం, అచ్చంపేట, సారంగపల్లి, మాడుగుల, మల్లవరం గ్రామాల్లో కూడా వజ్రాలు లభిస్తుంటాయి. వర్షాకాలంలో నేటికీ ఈ ప్రాంతంలో వజ్రాన్వేషణ ప్రక్రియ కొనసాగుతుండటం విశేషం.

సున్నపు రాతి నిక్షేపాలు కూడా గుంటూరు జిల్లాలో అధికంగా వున్నాయి. రాష్ట్రంలో ఉత్పత్తి చేయబడే సున్నపురాతిలో 25 శాతం గుంటూరు జిల్లాలోనే ఉత్పత్తి చేయడం ప్రధానమైన అంశం.

సిమెంటు, పంచదార, టెక్స్‌టైల్,కాగితం, ఔషధాల తయారీ పరిశ్రమల్లో వినియోగించే అనేక శ్రేణుల సున్నపురాళ్లు ఈ జిల్లాలో విస్తరించివున్నాయి. దాచేపల్లి, నడికుడి, పిడుగురాళ్ల, సీతారాంపురం, మాచర్ల, పిల్లుట్ల, పొందుగల తదితర ప్రాంతాల్లో విస్తరించివున్న సున్నపురాళ్లను సిమెంటు పరిశ్రమలో ఉపయోగిస్తున్నారు. దాదాపు 2455 మిలియన్ టన్నుల సున్నపురాతి నిల్వలు ఈ ప్రాంతంలో వున్నాయనేది భూవిజ్ఞాన శాఖ అంచనా.



# శారీరక రుగ్మతలను తరిమివేసే 'జాగింగ్'

(ఆన్‌లైన్, గుంటూరు-క్రీడాప్రతినిధి)

నగరజీవికి శారీరక శ్రమ చేసే అవసరం అంతగా లేకుండాపోతుంది. శారీరక శ్రమ లేకపోతే ఆరోగ్యం సజావుగా ఉండే అవకాశాలు కూడా సన్నగిల్లుతున్నాయి. అనేక రుగ్మతలకు శారీరక దృఢత్వం లేక పోవడమే కారణమని వైద్య నిపుణులు అభిప్రాయపడుతున్నారు. నగరజీవితంలో శారీరక శ్రమకు అవకాశం అంతగా లేకపోయినా కనీసం వ్యాయామమైనా చేయాలని చెబుతున్నారు. జిమ్‌లకు వెళ్ళి గంటల తరబడి భారీ వ్యాయామం చేయలేకపోయినా, తేలికపాటి జాగింగ్ అయినా చేయాలని సూచిస్తున్నారు. లేకపోతే యువరక్తం ఉన్నప్పుడు కాకపోయినా నాలుగేళ్ళు గడిచాక ఏదో ఒక జబ్బు తప్పదంటూ హెచ్చరికలు కూడా చేస్తూనే ఉన్నారు. అయితే డాక్టర్ల హెచ్చరికల వల్లనో లేక ఉదయం పూట కొద్దిసేపు అలా నడకకు వెళ్లడం వల్ల వచ్చే మానసిక ఉల్లాసానికోసమో కాని ఇటీవల జాగింగ్ చేస్తున్న వారిసంఖ్య నగరంలో బాగా పెరిగిపోయింది. యువకులు చాలా మంది పొద్దు ఎక్కేవరకు ముసుగుపెట్టి పడుకుంటున్నారు. అయితే వయసు మీద పడేవరకు కాకుండా ఇప్పటి నుంచే కాస్త శారీరక వ్యాయామం చేయడం భవిష్యత్‌లో మేలు చేస్తుందని వైద్యులు సూచిస్తున్నారు.

## జాగింగ్ చరిత్ర

ప్రతి వ్యాయామానికి ఒక చరిత్ర ఉంది. ఒక్కోదానికి ఒక్కో దేశయతి ఉంది. ఉదాహరణకు యోగ మనదేశానికి సంబంధించింది. అలాగే జాగింగ్ న్యూజిలాండ్‌కు చెందింది. ఒలింపిక్ క్రీడల నుంచి రిటైరైన క్రీడాకారులకు వారి శరీర పటుత్వాన్ని నిలుపుకోనేందుకు తేలికపాటి రన్నింగ్ (అదే జాగింగ్ అయింది) చేయమని సూచించారు. అప్పటి నుంచి మెల్లగా ఈ ప్రక్రియ వెలుగులోకి వచ్చింది.



జాగింగ్ చేస్తున్న చిత్రం

## ఎలా చేయాలి

జాగింగ్ చేయడమంటే మైళ్ళకొద్ది పెరిగెత్తాలని, గంటల తరబడి సమయాన్ని కేటాయించాలని చాలామంది భావిస్తుంటారు. కాని ఎవరి ఓపిక, శక్తిని బట్టి వారి సమయాన్ని నిర్ణయించుకోవచ్చు. సాధారణంగా ప్రతిరోజు 20 నుంచి 30 నిముషాల వరకు జాగింగ్ చేస్తే సరిపోతుంది. వేగమైన నడక మొదలుకొని చిన్నపాటి పరుగు చేస్తే సరిపోతుంది.

వారానికి కనీసం రెండుగంటలు జాగింగ్ చేయడం మంచిది. జాగింగ్‌లో ఇతర ఆటల కన్నా కాస్త ఎక్కువ కేలరీలు శక్తి ఖర్చవుతుంది. పరుగు, సైక్లింగ్, ఈత, వడివడి నడకలలాగా జాగింగ్ కూడా ఒక మంచి ఎరోబిక్ ఎక్సర్‌సైజ్. జాగింగ్‌లో ముఖ్యంగా గుర్తు పెట్టుకోవాల్సిన అంశం మనం ఎంతదూరం, ఎంతవేగంగా పరుగెత్తుతున్నామన్నది కాదు. ఎన్నిసార్లు, ఎంత సమయం చేస్తున్నామన్నదే ముఖ్యం.

## జాగింగ్ వల్ల కలిగే మేలు

అరగంట పాటు చేసే జాగింగ్ వల్ల శరీరంలోకి ధారాళంగా ఆక్సిజన్ చేరి గుండెకు, ఊపిరితిత్తులకు ఎంతో మేలు కలుగుతోంది. బరువు తగ్గడం, కండరాలు ఉత్తేజం కావడం, డిప్రెషన్ లేకపోవడం, నిద్రలేమి దూరమవడం, ఆత్మ విశ్వాసం పెరగడం జరుగుతుంది. జాగింగ్‌కు వయసు, లైంగికత, ఆదాయం తదితర బేదాలేమి లేవు ఎవరైనా చేయవచ్చు.

## తీసుకోవాల్సిన జాగ్రత్తలు

జాగింగ్ చేసేందుకు మంచి షూస్, ట్రాక్‌సూట్ ఉండటం అవసరం. జాగింగ్ చేస్తే తల తిరిగినట్లుగా ఉన్న, గుండెలో నెప్పి అనిపించినా వైద్యుని ఆశ్రయించాలి. వేసవికాలంలో డీ హైడ్రేషన్ కాకుండా జాగ్రత్త పడాలి. జాగింగ్ వెళ్ళేకొద్ది ముందు, వచ్చాకా మంచినీటిని సేవించాలి. కాస్త వదులుగా ఉండే దుస్తులు వేసుకోవాలి. మీమీ శారీరక స్థితిని బట్టి ఎంత దూరమైనా పెంచుకుంటూ పోవచ్చు. ఒకరోజు భారీగా మరోరోజు తేలికపాటి జాగింగ్ చేయడం మంచిది. ఇక నగరంలో రోడ్లపై పరుగులు పెట్టడం కొంత ప్రమాదకరమే. కనుక ట్రాఫిక్‌ను గమనించుకోవటం మరువద్దు. రెగ్యులర్‌గా జాగింగ్ చేస్తున్న వారికన్నా చేయనివారిలో ముందస్తు మరణాలు ఎక్కువగా కనిపిస్తున్నాయని వైద్య నిపుణులు అంటున్నారు.

# అపురూప కళాసంపదకు పుట్టినిల్లు అమరావతి

(ఆన్‌లైన్, గుంటూరు)

అమరావతి అందాన్ని మరింతగా ఇనుమడింపజేసేందుకు, ప్రపంచ దేశదేశాల్లో సైతం దీని ఖ్యాతిని పెంచేందుకు సహకరించిన అమూల్య శిల్పకళాసంపద అమరావతిలో వుండటం అదృష్టదాయకం. ఆనాటి ధాన్యకటకంలో రాజకీయం రక్షణగా వుండగా, మతం తనకు ఆలంబనగా ఒప్పుచుండగా శిల్పకళాలత బౌద్ధ భావనలలో మనోమందిరాన్ని అలంకరించుకొని నిరంతర సవ్యరోచిస్సులతో దిగంతములు నిండిన రోజులవి. కళామతల్లి కళ్యాణ కింకిణులు భావనా ప్రపంచమును ప్రభావిత మొనర్చిన స్వర్ణయుగమది. ఆనాడే బౌద్ధాంధ్ర శిల్పి తన కళాతపః ప్రభావంతో గండశిలలను మైనపు ముద్దగా మార్చుకుని ఆ మూసలలో తన మధర భావనలను, దివ్యాకృతులను కల్పించారు. ఆంధ్రుల యశస్సుకు మేలి జలతారు మైపూత పూసినారు. పౌరాణిక ప్రశస్తి, చారిత్రక ప్రసిద్ధి కలిగి మహాశిల్పసందపలకు పుట్టినిల్లుగా వెలసి, ఆంధ్ర రాజులకు రాజధానియై ప్రాచ్య సంస్కృతికి పట్టుకొమ్మయై లలిత కళామృత కలశంబై అలరారిన అమరావతి నిజంగా ఆంధ్రుల స్వర్ణసీమ అనుటలో అతిశయోక్తి లేదు. దక్షిణ భారతదేశంలో వాస్తవంగా యావత్ భారత దేశంలోనే బౌద్ధ ధర్మ చరిత్రలో ఆంధ్ర దేశంలోని అమరావతి నాగార్జున కొండలు విశిష్ట స్థానాన్ని పొందాయి. శాతవాహనుల కాలంనాటి పూర్వమే ఆనాటి ఆంధ్ర శిల్పులు బుద్ధ భగవానుని దివ్యస్మృతికి నిర్మించిన శిల్పనీరాజనం అమరావతి స్థూపమని, ఆ స్థూపాన్ని అశోక చక్రవర్తికి పూర్వమే ఆంధ్ర దేశాన్ని పాలిస్తున్న నాగరాజు ప్రారంభించినట్టుగా తెలుస్తుంది. అశోకుడు దానిని వృద్ధి చేశాడు. అశోకుని అనంతరం శాతవాహనుల కాలంలో అమరావతి స్థూపం వృద్ధి చేయబడుటయేగాక వింతశోభను చేకూర్చుకొని దక్షిణపథ బౌద్ధచిత్రమందే సమున్నత స్థానం ఆక్రమించుకుంది. ఆచార్య నాగార్జునుని కాలంలో అమరావతి మహాచైత్యం చుట్టూ శిల్పచిత్ర సంయుత ఆయక వేదికలు నిర్మించబడినట్లు తెలియుచున్నది.

మహా ప్రాకార నిర్మాణం అశోకుని కాలం నాటికే అనగా, క్రీ.పూ. 3వ శతాబ్దపు కాలం నాటికే జరిగింది. మొత్తం నిర్మాణం అంతా 4 దశలలో జరిగిందని, మొదటి దశ క్రీ.పూ.300 సంవత్సరం నాటిది. కాగా 4వ దశ క్రీ.పూ. 3వ శతాబ్దం నాటిదని చరిత్రకారులు అంచనా. అకుపచ్చని పాలరాయితో మలిచి అలనాటి శిల్పకళ, ఆంధ్ర శిల్పుల ప్రజ్ఞాకౌశల్యాలకు, భక్తిజ్ఞాన వైరాగ్యాలకు సాక్షీభూతాలుగా నేటికీ మన కనులకు ఇంపును కలిగిస్తున్నాయి.





1958 తవ్వకాల్లో డాక్టర్ రాయప్రోలు సుబ్రమణ్యం ఆధ్వర్యంలో జరిపిన తవ్వకాల్లో పెద్ద ఎత్తున శిల్పాలు, శిల్పలేఖనాలు, వానితోపాటుముఖ్యంగా స్పటిక భరిణలో నిక్షిప్తం చేసిన సువర్ణ పుష్పాలతో కూడిన బుద్ధ భగవానుని ధాతువులు లభ్యమయ్యాయి.

1973-74లో శ్రీ ఇంగువ, కార్తికేయ శర్మ జరిపిన తవ్వకాల్లో బయల్పడిన అనేక నాణేలు శిల్ప శాసనాల వల్ల ఈ శిల్ప నికుంజాలు అలంకరించిన స్థూపం క్రీ.పూ. 3వ శతాబ్దినాటిదిగా నిరూపితమైంది. 1797లో మొట్టమొదటి సారిగా కర్నల్ కాలిన్ మెకంజీ ఈ స్థూపాన్ని చూసి రాశారు. 1845లో వాటర్‌స్మిత్, అనంతరం రాబర్ట్ సీవెల్, జేమ్స్‌బర్గ్, అలగ్జాండరీలు తవ్వకాలు జరిపి నివేదిక తయారుచేశారు. ఆనాటి తవ్వకాల్లో వెలుగుచూసిన అద్భుత శిల్పాలు కొన్ని ఆనాడే లండన్, బ్రిటిష్ మ్యూజియాలకు తరలించారు. స్వాతంత్ర్యం అనంతరం జరిపిన తవ్వకాల్లో బయల్పడిన శిల్పాలను అమరావతి మ్యూజియంలో ప్రస్తుతం తిలకించవచ్చు.

సంగ్రహాలయంలోని శిల్పాల శోభ వర్ణనాతీతం. శిల్పాలలో ఆనాటి ప్రజా జీవనం ప్రతిబింభించడమేగాక సాంఘిక జీవనం తెలుసుకోడానికి ఈ శిల్పాలు ఎక్కువగా ఉపకరిస్తున్నాయి. లలిత కళలలో ఒకటైన సంగీతానికి కూడా అమరావతి శిల్పంలో ప్రాధాన్యత ఇచ్చారు. స్త్రీ పురుషులేగాక నాట్యాభినయార్ణములైన కుబ్జ, యక్ష గణాలు కూడా నాట్యం చేస్తున్నట్లు రాజాంతఃపురాన జరిగిన నాట్యాన్ని, బుద్ధుని అవశేషాలు విభజించుకునే సందర్భంలో అక్కడ సమావేశమైన రాజులు, సన్యాసుల ఎదుట నడిచిన నాట్యాలు చిత్రించారు.

స్త్రీ ప్రతిమలు చూస్తే ఆ కాలపు స్త్రీలు సౌందర్య శృంగారాల మీద ఎంతటి లక్ష్యంవుందో విశదమవుతోంది. వివిధ రకాల కేశాలంకరణలు నాటి ప్రజల అభిరుచులు, సౌందర్యోపాసన అందు వారికి గల శ్రద్ధాసక్తులను మనకు కళ్లకు కట్టినట్లు వుంటాయి. రాజులు, రాణులు, రాణివాసపు స్త్రీలు, సామాన్య ప్రజలలో వివిధ వర్ణాలకు చెందిన స్త్రీ పురుషులు వివిధ రకాల ఆభరణాలు ధరించినట్లు అమరావతి శిల్పాల్లో చెక్కారు. శిరోభూషణాలు చూడామణి మేకరిక మకర కుండలాలు కర్ణికలు వంటి కర్ణభూషణాలు ఏకావళి రత్నావళి మణిబంధనం జలమయం రత్నవలయం వంటివి ఎన్నో రమణీయంగా చెక్కారు. ప్రతి రేఖ, ప్రతి వంపులోను విశేష నైపుణ్యం సౌకుమార్యం అమరావతీ శిల్పాల్లో కనిపిస్తాయి. కంటికి ఆనందంతో విశ్రాంతి కలుగుతుందేగాని విసుగుపుట్టదు. ఇదీ అమరావతీ శిల్ప విశిష్టత. మహాచైత్య నమూనా సంగ్రహాలయానికి ప్రత్యేక ఆకర్షణ కాగా, అలనాటి ఆంధ్ర శిల్పకళా వైభవం బౌద్ధుల యుగంనాటిది కళ్లకు కట్టినట్లు అమరావతీ సంగ్రహాలయంలో అత్యంత రమణీయంగా గేలరీలలో అమర్చారు.

# ఎంపిలు, ఎమ్మెల్యేల సెల్‌ఫోన్ నంబర్లు

## పార్లమెంటు సభ్యులు

రాయపాటి సాంబశివరావు(గుంటూరు) 9849061777, 9848138555
వల్లభనేని బాలశౌరి(తెనాలి) 9849013456, 9440113456
దగ్గుబాటి పురంధరేశ్వరి(బాపట్ల) 9849453430
మేకపాటి రాజమోహనరెడ్డి(నరసరావుపేట) 9849199009

## శాసనసభ్యులు

కన్నా లక్ష్మీనారాయణ(పెదకూరపాడు)-9440260506
రావి వెంకటరమణ(పత్తిపాడు)-9394159777
నంబూరు సుభాని(గుంటూరు-1)-9848133881
తాడిశెట్టి వెంకటరావు(గుంటూరు-2)-9848136616, 9849095454
గుదిబండి వెంకటరెడ్డి(దుగ్గిరాల)-9440054896
డొక్కా మాణిక్యవరప్రసాద్(తాడికొండ)-9440878871
గాదె వెంకటరెడ్డి(బాపట్ల)-9848027091
దేవినేని మల్లికార్జునరావు(రేపల్లె)-9848132566
మక్కెన మల్లికార్జునరావు(వినుకొండ)-9440264025
మర్రి రాజశేఖర్(చిలకలూరిపేట)-9440257383
కాసు వెంకటకృష్ణారెడ్డి(నర్సరావుపేట)-9849960999
జంగా కృష్ణమూర్తి(గురజాల)-9440103692
ధూళిపాళ్ల నరేంద్ర(పొన్నూరు)-9848042113
మోపిదేవి వెంకటరమణ(కూచినపూడి)-9849122337
మురుగుడు హనుమంతరావు(మంగళగిరి)-9440261600
నాదెండ్ల మనోహర్(తెనాలి)-9849000006
పిన్నెల్లి లక్ష్మారెడ్డి(మాచర్ల)-9866394561
సతీష్‌పాల్‌రాజ్(వేమూరు)-9848539227
యర్రం వెంకటేశ్వరరెడ్డి(సత్తెనపల్లి)-9440264464




డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార మరియు రవాణా శాఖామాత్యులు


శ్రీ ధర్మానప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జి మంత్రి


శ్రీ రెడ్యానాయక్
సాంఘిక సంక్షేమ శాఖామాత్యులు


శ్రీమతి జి. జయలక్ష్మి IAS.,
జిల్లా కలెక్టర్


శ్రీ ఆర్.డి. విల్సన్
ఛైర్మన్ ఎస్‌సి కార్పొరేషన్

# జిల్లా షెడ్యూల్డు కులముల సేవా సహకార సంఘము లిమిటెడ్, గుంటూరు

## 2005-06 సంవత్సరము యొక్క వార్షిక ప్రణాళిక

### రు. 1312.94 లక్షలతో 10272 మంది ఎస్.సి. కుటుంబములకు ఎస్.సి.కార్పొరేషన్ ద్వారా ఆర్థిక సహాయము

దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న షెడ్యూల్డు కులముల వారి అభివృద్ధి కొరకు ప్రభుత్వము 2005-06 సంవత్సరమునకు గుంటూరు జిల్లాకు రు. 1312.94 లక్షల వ్యయముతో 10272 కుటుంబములకు వివిధ పథకాలకు ఆర్థిక సహాయము అందించుటకుగాను ప్రణాళికను ప్రభుత్వము మంజూరు చేసియున్నారు.

**ఎస్.సి.యాక్షన్ ప్లాన్ 2005-06 ప్రాధాన్యతాంశములు :**

**ఎ. భూమి కొనుగోలు పథకము :**
ఈ పథకము క్రింద జిల్లాలో భూమి లేని నిరుపేదలకు భూమి కొనుగోలు చేసి ఇచ్చుటకు రు.240.00 లక్షలతో 400 ఎకరముల కేటాయించడమైనది.

**బి. మైనర్ ఇరిగేషన్ మరియు భూసంభందిత పథకాలు :**
ఈ పథకముల క్రింద ఎలక్ట్రిక్ మోటార్లు, ఫిల్డర్ పాయింట్స్ ఎలక్ట్రిక్ మోటారుతో, బోరు బావులు, సామాజిక బావులు, ఇన్ వెల్ బోర్లు, చెక్ డ్యామ్స్, ట్యూబ్ వెల్స్, సబ్మెర్జిబుల్ పంప్ సెట్స్, పైప్ లైనులు, వాటర్ హార్వెస్టింగ్ నిర్మాణాలు, డగ్ కమ్ బోర్ వెల్స్, ఎత్తిపోతలు, డ్రిప్ ఇరిగేషన్ / మైక్రో ఇరిగేషన్ బోరులకు విద్యుధీకరణ మొదలైన పథకము క్రింద 1461 మంది లబ్దిదారులకు రు. 167.22 లక్షలు కేటాయించడమైనది.

**సి. హార్టికల్చర్, సెరికల్చర్, భూ అభివృద్ధి పథకములు :**
ఈ పథకముల క్రింద 2865 లబ్దిదారులకు రు.170.75 లక్షలు కేటాయించుట జరిగినది.

**డి. స్వయం ఉపాధి పథకములు :**
నిరుద్యోగులైన ఎస్.సి. యువతీ, యువకులకు స్వయం ఉపాధి పథకముల క్రింద ఆర్థిక సహాయము అందించుటకు 2119 మందికు రు.547.00 లక్షలు కేటాయించడమైనది.

**ఇ. శిక్షణా కార్యక్రమములు మరియు అవగాహన సదస్సులు :**
ఈ పథకము క్రింద చదువుకున్న ఎస్.సి. నిరుద్యోగ యువతీ యువకులకు మరియు భూ సంబంధ పథకాలను అమలు చేయుటలో భాగముగా వివిధ శిక్షణా కార్యక్రమములు, అవగాహన సదస్సులు ఏర్పాటు చేసి లబ్దిదారులు వారి ప్రతిభను పెంపొందించుకొని తద్వారా వారియొక్క జీవన ప్రమాణములు మెరుగు పరచుకొనుటకు 3377 మందికి రు.152.97 లక్షలు కేటాయించడమైనది.

**దరఖాస్తులు పంపు విధానము :**
ఇట్టి ఎస్.సి. యాక్షన్ ప్లాన్‌ను ఆగష్టు నెల నుండి అమలు పరచుట జరుగుచున్నది. పై పథకములద్వారా లబ్ది పొందగోరువారు సంబంధిత మండల/మున్సిపల్ కార్యాలయములలో నియమ నిబంధనలు తెలిసికొని వారి యొక్క ప్రతిపాదనలను మండల అభివృద్ధి అధికారి/మున్సిపల్ కమీషనర్ వారి ద్వారా మాత్రమే ఎస్.సి. కార్పొరేషన్ కార్యాలయమునకు పంపవలెను. నేరుగా తెచ్చిన ప్రతిపాదనలు తిరస్కరించబడును మరియు ఈ పథకముల క్రింద లబ్దిపొందుటకు ఎస్.సి కార్పొరేషన్ వారిచే సరఫరా చేయబడిన దరఖాస్తులు ఉచితముగా సంబంధిత మండల/మున్సిపల్ కార్యాలయములలో పొంద వచ్చును. ఎస్.సి. కార్పొరేషన్ కార్యాలయములలో నేరుగా ఎటువంటి దరఖాస్తులు ఇవ్వబడవు.


కాకుమాను శ్రీనివాసరావు
కార్యనిర్వాహక సంచాలకులు

# పానకం ఎంత ఒలికినా చీమ చేరదు.. ఈగ వాలదు

## మంగళాద్రిలో నృసింహుని మహత్యం



ఆలయ దృశ్యం

(ఆన్‌లైన్, మంగళగిరి)

తీపి పదార్థం కింద పడితే క్షణాలలోనే ఈగలు, చీమలు చేరడం సహజంగా సృష్టి ధర్మం. ఈ ధర్మానికి విరుద్ధంగా బహుతీపిగా వుండే పానకం భారీగా ఒలికిపోతున్నా.. పానక ద్రవ్యం మడ్డిలా పేరుకుపోతున్నా మంగళాద్రి పర్వతంపై చీమలు, ఈగలు ఆ తీపి చెంత చేరవు. ఇది మంగళాద్రి శ్రీపానకాల నృసింహ స్వామి వారు నేటి కృతయుగంలో సైతం ప్రత్యక్షంగా చూపుతున్న మహత్యం. అలాగే భక్తుడు నివేదించిన నైవేద్యాన్ని నేరుగా స్వీకరించే ఏకైక ప్రత్యక్ష దైవంగా స్వీకరించే భగవానుడు కూడా మంగళగిరి శ్రీపానకాల నృసింహస్వామివారే కావడం ఈ క్షేత్ర గొప్పతనం. ఈ క్షేత్రానికి శ్రీఆంజనేయస్వామి క్షేత్రపాలకుడై పట్టణానికి నాలుగు దిక్కులా సంరక్షకునిగా వున్నారు.

గుంటూరు జిల్లాలో కృష్ణా తీరానికి సమీపంలో వున్న ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలలో అమరావతి, సీతానగరం, మంగళగిరి ప్రముఖమైనవి. ప్రకాశం బ్యారేజీకి చేరువలో రెండు అతి పెద్ద క్షేత్రాలు వుండగా వాటిలో ఒకటి శక్తి క్షేత్రమైన కనక దుర్గమ్మ వారి ఆలయం కాగా రెండవది దక్షిణ భారతావనిలోనే ప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమైన మంగళగిరి శ్రీలక్ష్మీనృసింహస్వామి వారి దేవస్థానం. యాత్రీకులు ఖచ్చితంగా దర్శించవలసిన మహాపుణ్యక్షేత్రం మంగళగిరి. కేవలం ఆధ్యాత్మికంగానే కాకుండా చక్కని ఆహ్లాదభరితమైన పట్టణంగా కూడా మంగళగిరి యాత్రీకులను అలరిస్తుంది. యుగయుగాల దేవుడు శ్రీపానకాల నృసింహస్వామి వారిని దర్శించుకునేందుకు సులువైన రీతిలో ఘాట్‌రోడ్ నిర్మాణం కూడా జరిగింది.



శ్రీరాజ్యలక్ష్మీ అమ్మవారు

### పురాణ ప్రాశస్త్యం

దివ్య క్షేత్రంగా విరాజిల్లుతున్న మంగళగిరికి పురాణాలలో చాలా గొప్ప ప్రాశస్త్యం వుంది. ఈ క్షేత్రంలో ఎగువ, దిగువ సన్నిధులు వున్నాయి. రెండు సన్నిధులలోను శ్రీనృసింహస్వామి వారే మూల దైవం. ఎగువ సన్నిధిలో శ్రీస్వామి వారు శ్రీ పానకాల నృసింహస్వామి వారిగా ప్రసిద్ధి చెందారు. ఈ స్వామి వారు యుగయుగాల దేవుడు. యుగాలలో కెల్లా తొలి యుగంగా పురాణాలలో పేర్కొనబడే కృత యుగారంభంలోనే శ్రీ స్వామి వారు ఇక్కడి పర్వతంపై స్వయంభువై వెలిశారు. వ్యాస ప్రణీతమైన బ్రహ్మవైవర్త పురాణంలో ఈ క్షేత్ర ఆవిర్భావం గురించి వివరించారు. నముచి అనే రాక్షసుడ్ని శ్రీ విష్ణుమూర్తి సంహరించే సందర్భంగా ఇక్కడ స్వామి వారు వెలిశారు. మునిపుంగవులను బాధిస్తున్న నముచిని సంహరించేందుకు శ్రీస్వామి వారు సముద్రపు నురగలో ముంచిన సుదర్శన చక్రరూపంలో వెంటాడగా నముచి భయపడి ఈ పర్వతంమీది సొరంగంలోకి పారిపోయినట్టు పురాణాలు చెబుతున్నాయి. సుదర్శనరూపుడైన శ్రీస్వామి ఆ సొరంగంలోకి వెళ్ళి నముచిని అక్కడే వధించినట్టు క్షేత్రపురాణం చెబుతుంది. ఆ సందర్భంగా మిక్కిలి ఉగ్రరూపుడైన శ్రీస్వామి వారిని ప్రసన్నం చేసుకునేందుకు మంగళ స్వరూపి అయిన శ్రీ అమ్మవారు దేవతలతో కలసి స్వామిని అర్చించినట్టు చెబుతారు. ఆ సందర్భంగా స్వామి వారు శాంతించి తాను ఇక్కడే నివసించగలనని, కృతయుగంలో అమృతాన్ని, త్రేతాయుగంలో నెయ్యిని, ద్వాపరయుగంలో గోక్షీరాన్ని, కలియుగంలో బెల్లం పానకాన్ని సేవిస్తూ భక్తుల కోర్కెలను తీర్చగలనని స్వామి వారు దేవతలకు



మంగళగిరిలో వేంచిసియున్న శ్రీలక్ష్మీనృసింహస్వామి

(మిగతా 64వ పేజీలో..)

# ది గుంటూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల పరస్పర సహాయక సహకార యూనియన్ లిమిటెడ్




## సంగం డెయిరి, వడ్లమూడి.

ఫోన్సు: 08644-258281 నుండి 258285 వరకు
గ్రామ్స్: సంగం మిల్కు ఫ్యాక్స్: 08644-258248
ISO-9001–2000 HACP, Certified Diary



పాడి పరిశ్రమ పితామహుడు వర్గీస్ కురియన్‌తో సంగం డెయిరీ ఛైర్మన్ కిలారి రాజన్‌బాబు




సంగం డెయిరీ వారి పాల ఉత్పత్తులు



సంగం డెయిరి వారి పాల ఉత్పత్తులు

గుంటూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల పరస్పర సహాయక సహకార యూనియన్ లక్షకు పైగా పాల ఉత్పత్తిదారుల నుండి గిట్టుబాటు ధరపై పాలు సేకరించి, నాణ్యమైన పాలను, పాల పదార్థములను సరసమైన ధరలకు వినియోగదారులకు అందించుచున్న పాల ఉత్పత్తిదారుల సహకార సంస్థ.

## సంగం డెయిరీవారు పాల ఉత్పత్తిదారులకు అందించు సేవలు:

- ★ సంచార పశు వైద్యశాలలు ద్వారా మరియు అత్యవసర పశు సంచార వైద్యశాలలు ద్వారా పాల ఉత్పత్తిదారుల పశువులకు వైద్య సహాయము.
- ★ సబ్సిడీ రేట్లపై గాలికుంటు, గొంతువాపు టీకాలు పాల ఉత్పత్తిదారుల పశువులకు అందజేయుట. సంకర జాతి ఆందజేయుట. సంకరజాతి ఆవులకు ఉచితముగా థైలీరియాసిస్ టీకా మందులు సరఫరా చేయుట. గేదె జాతి / ఆవు జాతి అభివృద్ధికై కృత్రిమ పద్ధతి ద్వారా వీర్య దాన సౌకర్యముగా ఉచితముగా కలుగచేయుట.
- ★ నాణ్యమయిన పశుగ్రాస విత్తనములను ఉత్పత్తి చేసి, మన దేశములోని వివిధ రాష్ట్రములకు సరఫరా చేయుట. జిల్లా లోని పాల ఉత్పత్తిదారులకు సబ్సిడీపై సరఫరా చేయుట. ఎన్నిక చేయబడిన పాల ఉత్పత్తిదారులకు ఉచితముగా పశుగ్రాస విత్తనములను సరఫరా చేయుట. వరిగడ్డిలో పోషక పదార్థముల విలువను పెంచుటకు వరిగడ్డిని యూరియా నీటితో పూరవేయు రైతుకు ఉచితంగా యూరియా సరఫరా చేయుట.
- ★ దీర్ఘకాలిక పశుగ్రాస ఉత్పత్తికై ఉచితంగా పాల ఉత్పత్తిదారులకు పశుగ్రాస కణుపులు అందించుట.
- ★ నాణ్యమైన గుళికల రూపములో పశుదాణా, ఖనిజ లవణముల మిశ్రమము మరియు యూరియా మొలాసిస్ బ్రిక్స్ సబ్సిడీపై పాల ఉత్పత్తిదారులకు అందజేయుట.
- ★ సబ్సిడీ రూట్లపై పశువుల భీమా పథకము పాల ఉత్పత్తిదారుల పశువులకు అందజేయుట.

## గుంటూరు జిల్లా యూనియన్ సంగం డెయిరీలో తయారు చేయు పాలు/పాల పదార్థములు:

టోన్డు పాలు
టెట్రాబ్రిక్ పాలు
శుద్ధి చేయబడిన టేబుల్ బట్టర్
దూద్‌పేడా (కోవా)
మినరల్ వాటరు

వెన్నతీయని పాలు
పాల పొడి
అగ్‌మార్క్ నెయ్యి
మజ్జిగ
కలాఖండ్

టెట్రాప్రాక్ పాలు
వెన్న
మ్యాంగో జ్యూస్
ఫ్లేవర్డ్ మిల్కు
స్వీట్ లస్సీ



**డా॥ యన్. జగన్మోహనరావు**
మేనేజింగ్ డైరెక్టరు (ఎఫ్.ఎ.సి)

**కిలారి రాజన్‌బాబు**
ఛైర్మన్ మరియు పాలకవర్గ సభ్యులు

# ప్రాచీన నాగరికతకు ఆనవాళ్ళు పెనుమాక కొండలు


పాక్షికంగా ధ్వంసం చేయబడిన సీతమ్మవారి పాదాల ప్రాంతం

(ఆన్‌లైన్, తాడేపల్లి)

యాత్రికులను తాడేపల్లి మండలంలోని పెనుమాక కొండలపై గల అలనాటి జనపథం ఆనవాళ్ళు, నాగరికతా విశేషాలు అబ్బురపరుస్తాయి. పెనుమాక కొండలపై వేలాది సంవత్సరాలకిందటి అలనాటి ప్రజల నాగరికతలు, వారి జీవన శైలి విశేషాలు, చారిత్రక శిల్పకళా నైపుణ్యాలు, వారి వైభవానికి సంబంధించిన ఆనవాళ్లు కనిపిస్తుంటాయి. కొండల వద్దనే సహజంగా ఏర్పడిన గుహాలయాలు, శిల్పాలు, సొరంగ మార్గాలు, అద్భుత నైపుణ్యంతో అలనాడు నిర్మించబడిన ఎప్పుడూ నీటితో నిండబడే తటాకాలు, స్నానపు ఘట్టాలు, దిగుడు బావులు, సీతమ్మవారి పాదాలు, ఆంజనేయుని విగ్రహం నేటికీ దర్శనమిస్తుంటాయి. హీనయాన మహాయాన బౌద్ధక్షేత్రాలు, అలనాటి జనపథం, జీవన శైలిని తెలిపే చారిత్రక చిహ్నాలు కనిపిస్తుండడం అద్భుతంగా చెప్పవచ్చు. తాడేపల్లి మండల పరిధిలోని కృష్ణానదీ తీరానికి సమీపాన ఉండవల్లి నుంచి పెనుమాక మీదుగా ఎర్రబాలెం వరకు వ్యాపించి వున్న ఈ కొండను పెనుమాక కొండగా వ్యవహరిస్తుంటారు.

ఈ కొండ నుంచి చూస్తే ఉత్తర భాగాన కృష్ణానది, ఈశాన్యం వైపు కనక దుర్గమ్మ ఆలయం, దక్షిణాన మంగళగిరి నృసింహ, పానకాల స్వాముల ఆలయాలు, కొండ దిగువ భాగంలో ఏకరాతి శిలా విగ్రహం గల ఉండవల్లి అనంతపద్మనాభస్వామి గుహాలయం దర్శనమిస్తాయి. క్రీస్తుశకం నాలుగో శతాబ్దాం వరకు పెనుమాక కొండపై ప్రాచీన బౌద్ధ మతమైన హీనయాన బౌద్ధక్షేత్రం వుండి వుండవచ్చుననే ఆధారాలు వున్నట్టు పరిశోధకులు సైతం చెప్పటం జరిగింది. వారి కాలంలో కుటీరాలు, కొలనులు, స్థూపాలు, దిగుడుబావులు నిర్మించి వాడుకునేవారని చెప్పవచ్చు. విశేషమేమిటంటే కొండపైనే సుమారు 12 వరకు మెట్లు కూడా కలిగిన దిగుడు బావులు నేటికీ కన్పిస్తాయి. ఏ సమయంలో చూసినా సుమారు సగానికిపైగా నీరుండే పెద్ద పెద్ద కొలనులు కనిపిస్తుండడమే కాక దిగుడు మెట్లు సైతం కనిపిస్తుంటాయి. విచిత్రమేమంటే ఈ కొలనుల్లో సంవత్సరం పొడవున నీరుంటుంది. కేవలం రాతిపైనే తవ్వబడిన ఈ కొలనులు, దిగుడుబావులు అలనాటి జనపథం నాగరికతా వైభావాన్ని తెలియజేయడమే కాక, వారు తమ జీవన శైలిలో భాగంగా వాటిని ఉపయోగిస్తుంటారనే భావనగా చెప్పవచ్చు.

అంతాకాకుండా కొండపైన ఈ కొలనుకు దగ్గర్లో నేటికీ విస్తారంగా కనిపిస్తూ అప్పట్లోనే ఏర్పాటు చేయబడి వున్న సువిశాలమైన రహదారి నేటికీ కనిపిస్తుండడం విశేషంగా చెప్పవచ్చు. కొండపైన తవ్వితే నేటికీ రెండంగుళాల పొడవున్న ఇటుకరాళ్ళు బయటపడతాయి. ఎర్రబాలెం వైపు కొండపైన ధ్వంసం కాబడి వున్న ఆంజనేయస్వామి, వినాయక స్వామి విగ్రహాలు, సీతమ్మవారి పాదాలు కనిపిస్తాయి. కొండపై చుట్టూతా అలనాటి రాజవంశీకులు రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు కోట గోడ కట్టించేందుకు ఏర్పాటు చేసినట్టుగా వున్న పెద్ద పెద్ద నల్లరాళ్ళ సమూహం నేటికీ కనిపిస్తుండడం విశేషం. ఈ కొండ ప్రాంతం నుంచి మంగళగిరి కొండకు సొరంగ మార్గం వుందని ప్రతీతి. పరిశోధకులు హీనయాన అనంతరం మహాయాన సాంప్రదాయక బౌద్ధభిక్షువులున్న తైర్థిక ప్రాంతంగా దీన్ని పేర్కొన్నట్టు చెబుతారు. అయితే ఈ కొండపై నిధులున్నాయనే నమ్మకంతో పలువురు వ్యక్తులు ఈ కొండపై వున్న విగ్రహాలు, చారిత్రక చిహ్నాలు, సీతమ్మవారి పాదాలవంటి వాటిని పాక్షికంగా ధ్వంసం చేశారు. వేలాది సంవత్సరాల క్రితం జనపథం జీవనశైలిని తెలిపే విశేషాలను, ఆనవాళ్ళను నాశనం చేస్తుండడం బాధాకరం. అలనాటి ప్రజాచరిత్రను తెలుసుకునే అవకాశాలను ప్రజలు కోల్పోతున్నారు. ఇటువంటి చారిత్రక ఆనవాళ్ళున్న ప్రాంతాలను పరిరక్షించి వెలుగులోకి తేవాల్సిన బాధ్యత పురావస్తు పర్యాటక శాఖల వారిదే. పెనుమాక కొండలను పర్యాటక ప్రాంతంగా తీర్చిదిద్ది నాటి జనపథం జీవన శైలిని అందరికీ తెలియజెప్పాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.


కొండపై ఎప్పుడూ నీటితో నిండి వుండే మెట్ల కొలను

# ఎంత పానకం ఒలికినా చీమ చేరదు.. ఈగ వాలదు

(62వ పేజీ తరువాయి)

అభయమిచ్చారు. ఆనాటి నుంచి శ్రీస్వామి వారు తాను చెప్పిన విధంగా ఆయా యుగాల్లో భక్తుల నుంచి అమృతం, గోక్షీరం, నెయ్యి, బెల్లం పానకాన్ని ప్రత్యక్షంగా సేవిస్తూ భక్తులను ఆనంద పారవశ్యులను గావిస్తున్నారు. ఈ క్షేత్రంలో భక్తులు సమర్పించిన నివేదనాన్ని స్వయంగా స్వీకరించి సగభాగాన్ని భక్తులకు తన ప్రసాదంగా కక్కివేయడం ఓ అద్భుతమైన దృశ్యం. ఇదే గొప్ప విశేషమనుకుంటే కింద భారీగా ఒలికిపోయే బెల్లం పానకంపై ఈగలు, చీమలు చేరకపోవడం మరో ఘనమైన ఘటనగా చెప్పుకోవచ్చు. ఇంతటి ప్రాశస్త్యాన్ని కలిగిన ఎగువ సన్నిధిపైకి చేరుకోవడం వయసుపైబడిన వారికి కష్టమనిపిస్తుండడంతో ఇటీవల ఘాట్‌రోడ్ నిర్మించారు. ఘాట్‌రోడ్‌ను మిక్కిలి సుందరంగా మలిచేందుకు విజిటిఎం-ఉడా సంస్థ ఎంతగానో సహకరించింది. ఘాట్‌రోడ్ నిర్మాణానికై 25 లక్షల రూపాయలను విరాళంగా ఇచ్చిన ఆ సంస్థ ఐదు లక్షల వ్యయంతో ఘాట్‌రోడ్ ప్రవేశ ముఖద్వారాన్ని కూడా నిర్మించింది. అలాగే ఘాట్‌రోడ్ ముఖద్వారం వెంబడి మరో పది లక్షల వ్యయంతో ఉద్యానవనాన్ని కూడా నిర్మించనుంది. ఎగువ సన్నిధిలో వాహనాల పార్కింగ్ నిమిత్తం ఘాట్‌రోడ్ ప్రాంతాన్ని విశాలంగా అభివృద్ధి చేసే నిమిత్తం మరో పది లక్షలను ఖర్చు చేయగలమని ఉడా హామీనిచ్చింది.

ఇక దిగువ సన్నిధి విషయానికొస్తే మూడు చూడచక్కని గోపుర ప్రాకారాలతో శ్రీరాజ్యలక్ష్మి సమేత నృసింహస్వామి వారి దేవస్థానం భక్తులను ఎంతగానో ఆకట్టుకుంటుంది. ఇక్కడి స్వామివారిని ద్వాపరయుగంలో ధర్మరాజు ప్రతిష్టించాడని పురాణాలు చెబుతున్నాయి. అమ్మవారిని ఎడమ తొడపై కూర్చుండబెట్టుకుని వున్నట్టుగా ఈ విగ్రహం కనిపిస్తుంది. శ్రీస్వామి వారి ఆలయం పక్కనే శ్రీరాజ్యలక్ష్మి అమ్మవారి ఆలయం వుంది. ఈ అమ్మవారి విగ్రహం భక్తులను విశేషంగా ఆకట్టుకునే విధంగా వుంటుంది. ఈ ఆలయ ప్రాకారంలోనే శ్రీకోదండ రామస్వామి వారి ఆలయం దక్షిణముఖంగా వుంది. ఆ పక్కనే అద్దాల మహల్, వాహనశాల, కొళాయి మండపం వున్నాయి.

**అద్భుత కళాఖండం మంగళగిరి గోపురం**

దిగువ సన్నిధికే కాదు... మొత్తంగా మంగళగిరికే గుర్తింపును తెచ్చిన అద్భుతమైన కళాఖండం తూర్పు రాజగోపురం. ధరణికోట సంస్థానాధీశుడైన రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు 1807-09 కాలంలో ఈ గోపుర నిర్మాణాన్ని చేపట్టాడు. తక్కువ పీఠంతో అత్యంత ఎక్కువ ఎత్తు లేచిన ఈ గోపురం నిర్మాణవిశిష్టత దృష్ట్యా యావద్భారతదేశంలోనే అద్భుతమైన నిర్మాణంగా ప్రసిద్ధి గాంచింది. ఈ పదకొండు అంతస్తుల గోపురానికి మరో మూడేళ్లలో రెండు శతాబ్దాలు నిండనున్నాయి. ఈ రెండు వందల ఏళ్ళలో తొలిసారిగా గోపురానికి మరమ్మతులను చేపడుతున్నారు. ఇందుకోసం ప్రభుత్వం ప్రాథమికంగా ఇరవై లక్షలను కేటాయించింది. పురావస్తుశాఖ అధికారుల సలహా సూచనలతో సహజనిర్మాణం దెబ్బతినకుండా గోపురానికి మరమ్మత్తు పనులు జరుగుతున్నాయి..

**క్షేత్రపాలకుడు ఆంజనేయస్వామి**

మంగళగిరి క్షేత్రానికి క్షేత్రపాలకునిగా శ్రీఆంజనేయస్వామి వున్నారని పురాణాలు చెబుతాయి. ఇందుకు అనుగుణంగా క్షేత్రానికి నాలుగు వైపులా ఆంజనేయస్వామి ఆలయాలు వున్నాయి. తూర్పున తోపు ఆంజనేయస్వామి, పడమరన కోనేటిలోని ఆంజనేయస్వామి ఆలయం, ఉత్తరాన ఎగువ సన్నిధిలో విరిగిపడే కొండచరియను చేతితో అడ్డుకొంటున్నట్టుగా మలచిన శ్రీవీరాంజనేయస్వామి, దక్షిణాన మిద్దె సెంటర్లోని శ్రీప్రపత్తి ఆంజనేయస్వామి ఆలయం వున్నాయి.


కొండపైకి నిర్మించిన ఘాట్‌రోడ్ దృశ్యం


మంగళగిరి గాలిగోపురం

# అక్షరజ్యోతి 'ఆంధ్రజ్యోతి'కి అభినందనలు





శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు



డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు

ఆంధ్రుల అభిమాన దినపత్రిక 'ఆంధ్రజ్యోతి' మూడు వసంతాలు పూర్తి చేసుకుని నాలుగో వసంతంలోకి అడుగిడుతున్న శుభసందర్భంలో శుభాకాంక్షలు. భవిష్యత్‌లో ఆంధ్రజ్యోతి మరెన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించాలని మనసారా కోరుకుంటూ...




ఆంధ్రజ్యోతి యాజమాన్యానికి, సిబ్బందికి, పాఠకులకు..
తెనాలి పార్లమెంటు నియోజకవర్గ ప్రజానీకానికి దీపావళి మరియు రంజాన్ శుభాకాంక్షలు..

మీ

## వల్లభనేని బాలశౌరి

పార్లమెంటు సభ్యులు, తెనాలి

# అంతర్జాతీయ మార్కెట్‌లో మంగళగిరి 'చేనేత'



అమ్మకానికి సిద్ధంగా ఉన్న డ్రెస్ మెటీరియల్స్

(ఆన్‌లైన్, మంగళగిరి)

దేశ వ్యాప్తంగా చేనేత రంగం అనేక సందర్భాలలో తీవ్ర సంక్షోభాలను ఎదుర్కొన్నప్పటికీ గుంటూరు జిల్లా మంగళగిరి మాత్రం ఆ ఉత్పాతాలను ఎప్పటికప్పుడు తట్టుకుంటూ లేచినిలబడుతూనే ప్రపంచ చేనేత పటంలో 'నిత్యజీవ చేనేత కేంద్రం'గా గుర్తింపును పొందింది. ప్రస్తుతం అంతర్జాతీయ వస్త్ర ప్రపంచంలో వచ్చిన పెనుమార్పులకు చేనేత రంగం అతలాకుతలమవుతున్నప్పటికీ... మంగళగిరి మాత్రం తన దైన శైలిని నిలుపుకొని చేనేతకు జీవం కల్పిస్తూ ఉంది. దేశ వ్యాప్తంగా అనేక చేనేత కేంద్రాలలో మగ్గాల మనుగడ కష్టసాధ్యమై, నేత కార్మికులకు ఉపాధి కరువవ్వడంతో ఎందరో చేనేత కార్మికులు ఆకలిచావులకు గురయ్యారు. కానీ, మంగళగిరిలో మాత్రం నేత కార్మికులకు ఏడాది పొడవునా పని ఉంటూనే ఉంది. నేతన్నలకు ఉపాధిని కల్పిస్తూ, చేనేతను బతికిస్తున్న మంగళగిరికి ఆ ప్రాధాన్యత 'డ్రెస్ మెటీరియల్స్' ద్వారానే ప్రాప్తించింది. చేనేత ప్రపంచంలో మంగళగిరి డ్రెస్ మెటీరియల్స్ ఓ సరికొత్త విప్లవం. మిల్లు వస్త్రాల ధాటికి చేనేత, నానాటికి ప్రజలకు దూరమైపోతున్న నేపథ్యంలో... అధునాతన డిజైన్‌లతో కూడిన వస్త్ర ధారణకు అనువైన రీతిలో డ్రెస్ మెటీరియల్స్ రంగ ప్రవేశం చేసి చేనేతను మళ్ళీ మహిళలు, యువతులు క్రేజీగా వేసుకొనే పరిస్థితిని కల్పించాయి. ఫ్యాషన్ షోలలో సైతం మోడల్స్ మంగళగిరి డ్రెస్ మెటీరియల్స్‌ను ప్రదర్శిస్తుండడాన్ని బట్టే ఈ డ్రెస్ మెటీరియల్స్‌కు మార్కెట్‌లో ఎంత ఆదరణ ఉందో అర్థమవుతుంది.

మంగళగిరి డ్రెస్ మెటీరియల్స్ ఆవిర్భావానికి 'నిజాం బోర్డర్' చీరలు ఓ రకంగా దారి తీశాయని చెప్పవచ్చు. చేనేత పరిశ్రమ 1985లో తీవ్ర సంక్షోభానికి గురైన సందర్భమే మంగళగిరిలో ఆ పరిశ్రమ కొత్త మలుపు తిరిగే ఆలోచనకు దోహదపడింది. నిజం చెప్పాలంటే డ్రెస్ మెటీరియల్స్ ప్రవేశంతో మాస్టర్ వీవర్ల దశ తిరిగి, మంగళగిరి చేనేత దిశమారింది. మాస్టర్ వీవర్స్ సర్వీస్ సెంటర్‌లో ఉపసంచాలకునిగా పనిచేసి రిటైర్ అయిన మంగళగిరి వాసి జంజనం కుటుంబరెడ్డియ్య (జె.కె.రెడ్డియ్య) ఈ డ్రెస్ మెటీరియల్స్‌కు రూపకల్పన చేశారు. 1984-85 కాలంలో ముంబాయిలో 'విశ్వకర్మ ఫెస్టివల్ ఆఫ్ ఇండియా' అనే పేరుతో జరిగిన జాతీయ వస్త్ర ప్రదర్శనలో ఆంధ్రప్రదేశ్ కూడా పాలుపంచుకుంది. కేంద్ర సాంస్కృతిక సలహాదారు శ్రీమతి పపుల్ జయకర్ ఓ ప్రత్యేకమైన డిజైన్‌తో కూడిన చేనేత చీర కావాలని రెడ్డియ్యను కోరగా ఆయన ఆ విలక్షణమైన చీర తయారీకి మంగళగిరిని ఎన్నుకున్నారు. మంగళగిరిలో చిగురంచు లేకుండా నిజాం బోర్డర్ పేరుతో ఆయన ప్రత్యేక మగ్గంపై ఆ చీరలను తయారు చేయించారు. స్థానికంగా చింతక్రింది రాధాకృష్ణ అనే మాస్టర్ వీవర్‌కు చెందిన ప్రత్యేక మగ్గాలపై వీటిని రూపొందించారు. జాతీయ వస్త్ర ప్రదర్శనలో పెట్టించిన ఈ చీరను రూపొందించే క్రమంలో తొలుత రెండు చీరలను పాడుచేశారు. ముంబాయిలోని వస్త్రప్రదర్శనను వీక్షించిన నేటి ఎఐసిసి అధ్యక్షురాలు సోనియాగాంధీని ఈ నిజాం బోర్డర్ చీరే బాగా ఆకట్టుకుంది. అయితే, 'ఆమ్‌రస్' కలర్‌లో ఆ రకం చీర కావాలని సోనియాగాంధీ కోరడంతో కుటుంబరెడ్డియ్య మంగళగిరిలో అదేరకమైన చీరను తయారు చేయించి అందజేశారు. ఈ పరిణామంతో దేశ రాజధానిలోని ఉన్నత వర్గాలకు చెందిన గృహిణులు మంగళగిరి నిజాంబోర్డర్ చీరలపట్ల ఆకర్షితులయ్యారు. దీనితో మంగళగిరి పేరు వస్త్ర రంగంలో (మిగతా 68వ పేజీలో..)



మగ్గం నేస్తున్న నేత కార్మికుడు



ఆసుతోడుతున్న నేత కార్మికురాలు

# నూతన పాలక వర్గానికి, ఎక్స్ ఆఫీషియో సభ్యులకు దీపావళి, రంజాన్ శుభాకాంక్షలతో...



## నగరపాలకసంస్థ, గుంటూరు





శ్రీ కన్నా నాగరాజు
గుంటూరు నగర మేయర్


శ్రీ మురళీ మోహన్
గుంటూరు నగర డిప్యూటీ మేయర్


శ్రీ రాయపాటి సాంబశివరావు
గుంటూరు పార్లమెంటు సభ్యులు


శ్రీ లాలాజాన్‌భాషా
రాజ్యసభసభ్యులు


శ్రీ నంబూరు సుభాని
గుంటూరు 1 శాసనసభ్యులు


శ్రీ టి. వెంకటరావు
గుంటూరు 2 శాసనసభ్యులు


శ్రీ రావి వెంకటరమణ
ప్రత్తిపాడు శాసనసభ్యులు


శ్రీ దువ్వారపు రామారావు
గుంటూరు నగర కమీషనర్

## పరిపాలనా సంస్కరణలు

- ★ సమాచారహక్కు చట్టము, 2005 ప్రకారం నగర ప్రజలకు గుంటూరు నగరపాలక సంస్థ అనేక కార్యక్రమాలు ఆన్‌లైన్‌లో వెబ్‌సైట్ ద్వారా పొందుపరచడమైనది. చాలా ముఖ్యమైన సమాచారం ప్రజలకు అందుబాటులో తీసుకురావడమైనది. సమాచారం ప్రజలకు అందించేందుకు కార్పొరేషన్‌లో, సర్కిల్ కార్యాలయంలో, ప్రత్యేక అధికారులను నియమించాం.
- ★ ప్రజల ముఖ్యమైన పనులను పౌరసేవా కేంద్రము ద్వారా ప్రభుత్వము నిర్ణయించిన గడువులోగా పూర్తి చేయబడుచున్నవి. సమాచారము పూర్తిస్థాయిలో కంప్యూటకరీంచబడినది.
- ★ నగర సమగ్ర సమాచారము మరియు ఫిర్యాదుల నమోదు కొరకు **www.gunturcorporation.com** వెబ్‌సైట్ ప్రారంభించుట. నమోదు కాబడిన ప్రజా ఫిర్యాదులను 48 గం.ల వ్యవధిలో పరిష్కరించుట.
- ★ 802.11బి వైర్‌లెల్ టెక్నాలజీ ద్వారా ఆన్‌లైన్ విధానములో పన్నుల స్వీకరణ.
- ★ నీటి పంపిణీ విధానమునకు సంబంధించి హెడ్ వాటర్ వర్క్స్‌ని కంప్యూటరీకరించి తద్వారా వెబ్‌సెట్ నుంచి మానిటరింగు చేయుట.
- ★ సత్వర బిల్లుల పంపిణీ/చెల్లింపుల కొరకు గృహేతర నీటి వినియోగదారులకు స్పాట్ బిల్లింగ్ సిస్టంను ప్రవేశపెట్టుట.
- ★ సత్వర సమాచారము కొరకు పౌర సేవా కేంద్రములో ఆన్‌లైను విధానములో తెలుసుకొనుటకు **KIOSK** ను ఏర్పాటు చేయుట.
- ★ ఇ-ప్రొక్యూర్‌మెంట్ విధానమును అవలంభించుట, తద్వారా టెండర్ల నిర్వాహణలో పారదర్శకత.
- ★ పూర్తిస్థాయిలో కంప్యూటరీకరించబడి అమలు చేయబడుతున్న పౌర సేవా కేంద్రము. ఈ సంస్థ సేవలను కొరియర్ సర్వీస్ ద్వారా ప్రజల ఇంటి వద్దకే అందించుట.
- ★ నగర సమగ్ర సమాచారము మరియు ఫిర్యాదుల నమోదు కొరకు **www.gunturcorporation.com** వెబ్‌సైట్ ప్రారంభించుట. నమోదు కాబడిన ప్రజా ఫిర్యాదులను 48 గం.ల వ్యవధిలో పరిష్కరించుట.
- ★ నగరంలో ఉత్పత్తి అవుతున్న ఘన వ్యర్ధ పదార్థాలను మురికి నీటి కాలవలో వేయరాదు.
- ★ మీ ఇంటిలోపగాని, ఆవరణలోగాని, పరిసరాలలోగాని నీరు 6 రోజుల మించి నిలవకుండా చూడండి.
- ★ మీ సెప్టిక్ ట్యాంక్ లెట్రిన్‌కు, పగుళ్లు లేకుండా చూడండి. టాంక్ నుంచి బయలకు వచ్చే అన్ని గొట్టాలకు నైలాన్‌మెష్ బిగించండి.
- ★ వర్షాకాలములో నాటిని 20 నిముషాలు మరగకాంచి చల్లార్చి తాగవలెను.


శ్రీ రాయపాటి మోహన్ సాయికృష్ణ
1వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ బొర్రా నాగేశ్వరరావు
2వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ అబ్దుల్ అజీజ్
3వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి తిరుమలశెట్టి ప్రభావతి
4వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ సాధం కోటేశ్వరరావు
5వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి మహ్మద్ మూర్తహాస్
6వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ కుర్రా రవి
7వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ షేక్ గౌస్
8వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి ఉప్పలపాటి దానమ్మ
9వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ పోతురాజు వెంకటేశ్వరరావు
10వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి గోలుసు శైలాకుమారి
11వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి షేక్ రహీమున్నీసా
12వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ షేక్ అప్సర్
13వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి మంగళాపురపు లక్ష్మీకుమారి
14వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి సంకూరి రమణ
15వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ ఈర్ల గురవయ్య
16వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ దేవరకొండ కేశవులు
17వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ అవుతు భారతి
18వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ సంబరాసు శ్రీనివాసరావు
19వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి రేఖా ఉమామహేశ్వరి
20వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి వంజరపు రత్నకుమారి
21వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ అడపా కాశీవిశ్వనాథం
22వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ సొపాటి సుధీర్‌బాబు
24వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ అడకా శ్రీనివాసరావు
25వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ కాచేటి శివనాగమనోహర్‌నాయుడు
26వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి దాసరి సరస్వతి
27వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ షేక్ సైదా
28వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి బొడపాటి జ్యోతి
29వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి దాసరి జ్యోతి
30వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ యేల్చూరి వెంకటేశ్వర్లు
31వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ ఆలపాటి గోపాలకృష్ణ
32వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి షేక్ హుస్సేన్‌బీ
33వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ వేములపల్లి శ్రీరాం ప్రసాద్
34వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ వాసిరెడ్డి జయరామయ్య
35వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ నిమ్మకాయల రాజనారాయణ
36వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ ముత్తినేని రాజేష్
37వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి ఎం.వి. బాలాత్రిపుర సుందరి
38వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి వడ్లమాని రాజ్యలక్ష్మి
39వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ మాగంటి సుధాకర్
40వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి ఏటిగడ్డ సాంబ్రాజ్యం
41వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ ఏలుకా వీరాంజనేయులు
42వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ మద్దిరాల జోసఫ్ ఇమ్మానియేల్
43వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ లింగంశెట్టి వెంకటేశ్వర్లు
44వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ యాగంటి దుర్గారావు
46వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ గోళ్ల ప్రభాకర్
47వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ పూనూరి నాగేశ్వరరావు
48వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ వినుకొండ పెదవేమయ్య
49వ డివిజన్ కార్పొరేటర్


శ్రీ రావుల వెంకట సత్యనారాయణ
50వ డివిజన్ కార్పొరేటర్


ఇంకొల్లు శ్రీనివాసరావు
51వ డివిజన్ కార్పొరేటర్


శ్రీమతి నల్లపనేని విజయలక్ష్మి
52వ డివిజన్ కార్పొరేటర్

# తిక్కనకు జన్మనిచ్చిన గుంటూరు

(ఆన్‌లైన్ - గుంటూరు)

ప్రస్తుతం పాతగుంటూరు అని పిలుస్తున్న ప్రాంతమే తిక్కన కాలం నాటి గుంటూరు మండలానికి ప్రధాన కేంద్రం. మహాకవి తిక్కన పూర్వీకులు ఇక్కడ వుండేవారని, తిక్కన ఇంటిపేరు కొట్టరువు అని చరిత్రకారులు నిర్ధారించి చెప్పారు. తిక్కన నివాసానికి దగ్గరలో వుండి నేటికీ భక్తజన సందోహంతో కళకళలాడుతున్న అగస్తేశ్వరస్వామివారి ఆలయం ప్రాంతంలో లభించిన కొన్ని చారిత్రక ఆధారాలు ఈ విషయాన్ని నిర్ధారిస్తున్నాయి.

తిక్కన వంశీకుల ఇలవేల్పు నల్లశాణాంబ అని తెలుస్తోంది. అగస్తేశ్వర స్వామి ఆలయంలో ఏ ఉత్సవం జరిగినా ఊరేగింపులో తొలి కైంకర్యం తిక్కన ఇంటి దగ్గర జరిగేదట. తిక్కనకు నెల్లూరు సీమతో మేనమామ బంధుత్వం వుండేది. ఈ ఆధారంతోనే తిక్కన నెల్లూరు సీమకు చేరి మనుమసిద్ధి ప్రభువు వద్ద మంత్రిగా చేరారు. యుద్ధ విద్య, యంత్రాంగ లక్షణాలు కలిగిన కవి కనుకనే తిక్కన ఆంధ్రీకృత భారతంలో యుద్ధ వ్యూహాలు, సన్నివేశాలు చక్కగా కనిపిస్తాయి. నెల్లూరు మండలంలో కరణీకులుగా వున్న జైన మతస్తులు ఒక్కసారిగా విధులను బహిష్కరించినప్పుడు తన దగ్గర శిష్యులుగా వున్న వంద మందికి పరిపాలనా విధానంలో శిక్షణనిచ్చి ఆ వంద మందిచేత మరో ఆరువేల మందికి శిక్షణ నిప్పించి రాజ్యపాలన స్తంభించకుండా చేసిన పరిపాలనా దురంధరుడు తిక్కన.

### ఎలా వుండేవాడు

సుమతీ శతక కర్త బద్దెనకు గురువుగా, ఆంధ్ర సాహిత్య రంగం మీద, భారత చారిత్రక ముఖ చిత్రం మీద ఒక విశిష్టతను సంతరించుకున్న తిక్కన సోమయాజి రూపురేఖలు ఎలా వుండేవి అన్న ప్రశ్న తెలుగు పాఠకుడికి ఉదయించక తప్పదు. దీనికి సమాధానంగా కట్టమంచి రామలింగారెడ్డి తెలుగుజాతికి మహోపకారం చేశారనిపిస్తుంది. కేతన అనువదించిన దశకుమార చరిత్రలో తిక్కన సోమయాజి వంశవృక్షాన్ని వివరిస్తూ తిక్కన కొమ్మనామాత్య, అన్నమాంబల సుతుడని పేర్కొన్నారు. అంతేగాక దశకుమార చరిత్ర ఆంధ్రకర్త మరో అడుగు ముందుకు వేసి తిక్కన రూపురేఖా విలాసాన్ని వర్ణించి చెప్పాడు. ఈ రూపురేఖా విలాసాన్ని చదివిన సి ఆర్ రెడ్డి భీమవరంలో గొప్ప చిత్రకారుడుగా పేరొందిన అంకాల సుబ్బారావును పిలిపించి కేతన వర్ణించిన విధానాన్ని వివరించి చెప్పాడు. ఈ వివరణ విన్న సుబ్బారావు తిక్కన రూపాన్ని చిత్రీకరించారు. ఆ చిత్రం రామలింగారెడ్డిని విశేషంగా ఆకట్టుకుంది. తిక్కన కాలంనాటి గుంటూరు ఎలా వుండేది అని నేటి తరానికి కలిగే ఒక స్పందన పూర్వ సందేహం. తెలుగు సాహిత్యంలోని కొన్ని నవలలు గుంటూరు మండల స్వరూపాన్ని తెలుసుకోడానికి సహకరిస్తున్నాయి. అందులో ముఖ్యంగా నోరి నరసింహశాస్త్రి రచించిన రుద్రమదేవి, అడివి బాపిరాజు రచించిన హిమబిందు అత్యంత ప్రధానమైనవి. ఆ నవలలో కథానుసారంగా ఇతర ప్రాంతాల నుంచి గుంటూరు వచ్చే మార్గాలు, గుంటూరులోని రహదారులు, సౌధాలు, చక్కగా చిత్రితమయ్యాయి. అవి ఆనాటి గుంటూరు మండలాన్ని పాఠకుడి మనో నేత్రానికి చూపించి హృదయాన్ని పులకరింపజేస్తున్నాయి.



పాతగుంటూరులోని తిక్కన గ్రంథాలయం



# అంతర్జాతీయ మార్కెట్‌లో మంగళగిరి 'చేనేత'



మొల కడుతున్న కార్మికులు

(66వ పేజీ తరువాయి)

మారుమోగిపోయింది. ఈ చీరలకు దేశవ్యాపిత గుర్తింపు లభించడంతో నిజాంబోర్డర్ చీరలు ఇక్కడి చేనేత పారిశ్రామికులకు సిరులను కురిపించాయి. బిజెపి కేంద్రకమిటీ సభ్యులు స్వర్గీయ తమ్మిశెట్టి రామకృష్ణ ఇదే సందర్భంలో కొత్తగా చేనేత రంగంలో అడుగిడి ఈ తరహా చీరలను నేయించి హైదరాబాద్‌లోని దిల్‌సుఖ్‌నగర్‌లో 'సన్‌ఫ్లవర్' పేరుతో మార్కెటింగ్ కేంద్రాన్ని నిర్వహించారు. ఆ తదుపరి ఐదారు మాసాలలోనే పడుగు, పేకలకు వేరువేరు రంగులను ఉపయోగించి పంజాబీ డ్రస్‌లకు ఉపయోగించే వస్త్రాలను కుటుంబరెడ్డియ్య రూపొందించారు. వాటికి శిల్క్ తలుకులను మేళవించి డ్రస్ మెటీరియల్స్‌కు ఆవిర్భావం పలికారు. దిల్‌సుఖ్‌నగర్‌లోని సన్‌ఫ్లవరే ఈ డ్రస్ మెటీరియల్స్‌ను ముంబాయి, మద్రాసు, ఢిల్లీ, కలకత్తా, అహ్మదాబాద్ వంటి నగరాలకు వీటిని మార్కెటింగ్ చేసింది. తొలి రెండేళ్ళు అనగా 1988 వరకు మంగళగిరి డ్రస్ మెటీరియల్స్ వ్యాపారం ఫరవాలేదనే స్థాయిలో నడిచినా ఆ తదుపరి మంచి ఊపందుకుంది.

మంగళగిరిలో చింతక్రింది రాధాకృష్ణతోపాటు, అందే రామస్వామి అనే మరో చేనేత వస్త్ర ఉత్పత్తిదారుడు ఈ డ్రస్ మెటీరియల్స్‌ను తమ చేనేత షెడ్డులలో తయారు చేయిస్తే వాటికి రామకృష్ణ మార్కెటింగ్ సౌకర్యాన్ని కల్పించేవారు. 1990 తరువాత ఈ డ్రస్ మెటీరియల్స్ ఇతర దేశాలకు కూడా ఎగుమతులు కావడం ప్రారంభమయ్యింది. ఇప్పటికీ యుఎస్ఎ, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ తదితర దేశాలకు ఎగుమతులు అవుతున్నాయి. గార్మెంట్స్ నుంచి కూడా ఇక్కడి చేనేత పారిశ్రామికులకు పెద్ద ఎత్తున ఆర్డర్లు వస్తుంటాయి. తమకు వస్తున్న ఆర్డర్లను బట్టి మాస్టర్ వీవర్లు డ్రస్ మెటీరియల్స్ ఉత్పత్తిలో అనేక మార్పులను కూడా తీసుకువచ్చారు.

గార్మెంట్స్‌కు వెయ్యి నుంచి నాలుగువేల మీటర్ల తానులను తయారు చేయడంతోపాటు, డ్రస్‌లను విడివిడిగా కూడా రూపొందిస్తున్నారు. ఒక డ్రస్‌కు వచ్చి రెండున్నర మీటర్ల షర్టు (టాప్), రెండు మీటర్ల బాటమ్ (ఫ్యాంటు), రెండున్నర మీటర్ల చున్నిని తయారు చేస్తున్నారు. ఇప్పుడు మార్కెట్‌లో ఒక డ్రస్‌లో వచ్చే ఈ మూడు రకాల ఐటమ్స్‌ను విడివిడిగా కూడా అందుబాటులోకి తీసుకువచ్చారు. ఈ రకంగా మాస్టర్ వీవర్లు ఇతర వ్యాపారాల మాదిరి తమ ఉత్పత్తులను కూడా వినియోగదారునికి అన్ని విధాలుగా అందుబాటులోకి తెచ్చారు.

మంగళగిరి డ్రస్ మెటీరియల్స్ ఆవిర్భవించాక మంగళగిరిలో ఈ తరహా చేనేత వ్యాపారం దాదాపుపదేళ్ళపాటు అతికొద్ది మంది మాస్టర్ వీవర్ల చేతిలో చాలా రహస్యంగా కొనసాగింది. మంగళగిరి డ్రస్ మెటీరియల్స్‌కు 'ఇంతింతై వటుడింతయై' అన్న చందాన అంతర్జాతీయ ప్రాధాన్యం పెరిగింది. దీనితో వాటికి పరిమితమైన ఉత్పత్తిదారులగా ఉన్న ఇక్కడి చేనేత పారిశ్రామికులకు సిరులు పండాయి. దండిగా లాభాలు రావడంతోనే చేనేత పారిశ్రామికుల మధ్య వ్యాపార పరమైన విభేదాలు తలెత్తి ఎవరికివారు విడిపోయారు. దీనితో కొన్నేళ్ళపాటు కొనసాగిన ఈ వ్యాపార రహస్యం వీధికెక్కింది. ఆ తరువాత సాధారణ నేతచీరలను ఉత్పత్తి చేసే మాస్టర్ వీవర్లు కూడా డ్రస్ మెటీరియల్స్ ఉత్పత్తి విధానాన్ని, మార్కెటింగ్ మెళకువలను తెలుసుకొని తాము కూడా వాటి తయారీకి శ్రీకారం చుట్టారు.

ప్రస్తుతం ఓ 30 మంది చేనేత పారిశ్రామికులు మంగళగిరిలో డ్రస్ మెటీరియల్స్‌ను నేయిస్తున్నారు. వీరిలో ఐదారుగురు మార్కెటింగ్‌లో విశేషమైన అనుభవాన్ని గడించి దేశంలోని ప్రధాన మెట్రోపాలిటన్ నగరాల్లో తమ శాఖలను ఏర్పాటు చేసుకున్నారు. దీనితో మంగళగిరి డ్రస్ మెటీరియల్స్ అంతర్జాతీయ స్థాయిలో మరింత విస్తృతమయ్యాయి. ఫలితంగా ఒక్కప్పుడు కళతప్పి అంపశయ్య మీదకు చేరబోయిన చేనేత పరిశ్రమకు మళ్ళీ ఊపిరి లభించినట్టయింది. ఈ డ్రస్ మెటీరియల్సే మంగళగిరిని విఖ్యాతి చెందిన చేనేత కేంద్రంగా నిలబెట్టగలిగింది.

మధ్యలో ఎన్‌డిఎ సంకీర్ణ ప్రభుత్వం చిలపల నూలుపై 9.2 శాతం ఎక్సైజ్ సుంకాన్ని విధించడంతో పరిశ్రమ మళ్ళీకొంత ఉక్కిరిబిక్కిరైంది. ఇటీవల నూతన ప్రభుత్వం ఈ ఎక్సైజ్ సుంకాన్ని ఎత్తివేయడంతోపాటు, నూలు ధరలు కొంత నిలకడగా ఉండటంతో మంగళగిరి డ్రస్ మెటీరియల్స్ వ్యాపారం మళ్ళీ ఊపందుకుంది. ఎగుమతుల విధానంలో కూడా జనవరి నుంచి కొన్ని మార్పులు చోటుచేసుకోవడం కూడా అంతర్జాతీయ మార్కెట్‌కు విస్తృతిని కల్పించింది. మంగళగిరి డ్రస్ మెటీరియల్స్‌కు పెరుగుతున్న ఆదరణను కనిపెట్టిన ఇతర ప్రాంత చేనేత వ్యాపారులు కూడా ఈ తరహా వస్త్రాలను అనుకరణలతో తయారు చేసి మంగళగిరి డ్రస్ మెటీరియల్స్ పేరుతో మార్కెట్‌లోకి తీసుకువచ్చారు.

ప్రస్తుతం ఈ అనుకరణ మెటీరియల్స్ కూడా మార్కెట్‌లో మంగళగిరి డ్రస్ మెటీరియల్స్‌గానే చలామణి కావడం విశేషం. ఇంత జరుగుతున్నా ఎగుమతుల విషయానికి వస్తే... ఇప్పటికీ మంగళగిరి ఒరిజినల్ డ్రస్ మెటీరియల్స్‌కు ఏ మాత్రం డోకారా లేదు. దీనికి కారణం ఇక్కడి మాస్టర్ వీవర్ల వృత్తి నిబద్ధత, నేత కార్మికుల నైపుణ్యమేనని చెప్పవచ్చు! మాస్టర్ వీవర్లు కేవలం రాబడినే చూచుకోకుండా వస్త్ర ఉత్పత్తిలో నాణ్యతకు పెద్దపీటను వేస్తారు. సాధారణంగా జెరీబోర్డర్‌కు 80వ నంబర్ లడ్డీలను, పేకలను వాడతారు. 60, 40 సాదారకం డ్రస్ మెటీరియల్స్‌కు 60 నంబర్ నూలును, 40వ నంబర్ పేకలను వాడతారు.

చేనేత కేంద్రంగా మంగళగిరి ప్రఖ్యాతి చెందడానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. ఇక్కడ మాస్టర్ వీవర్లు, కార్మికుల మధ్య ప్రత్యక్ష సంబంధాలు ఉన్నాయి. మిగతా చేనేత కేంద్రాలలో వీరిరువురి నడుమ మధ్యవర్తులు ఉంటుంటారు. ఇక మజూరీల విషయానికి వస్తే... మిగతా చేనేత కేంద్రాలతో పోలిస్తే ఇక్కడ మజూరీలు కొంత ఎక్కువే అనిపిస్తుంది. చేనేత పారిశ్రామికుడు కూడా ఇక్కడ బట్ట నాణ్యత విషయంలో ఏ మాత్రం రాజీ పడకుండా మంగళగిరి కాటన్ ప్రత్యేకతను నిలబెడుతూనే ఉన్నాడు. పడుగులు చేయడంలోను, నేత గట్టిగా నేయడంలోను మంగళగిరికి జాతీయ స్థాయిలో మంచి పేరుంది. నూలు అద్దకానికి కూడా మంగళగిరి ప్రత్యేక కేంద్రంగా మారింది. ఇక్కడి డైయర్స్ చొరవ, ఉత్సాహం, శ్రమ వల్ల డైయింగ్ పని కొత్తపుంతలు తొక్కి స్థానికంగా పరిశ్రమ ఇక్కడ వేళ్ళూనుకు పోయేందుకు దోహదపడింది.

ఒకప్పుడు అద్దకంలో ప్రత్యేకత కారణంగా మంగళగిరి 'పట్టుబడి' చీరలు మంచి పాపులారిటీని తెచ్చుకున్నాయి. నేడు మంగళగిరి డ్రస్ మెటీరియల్స్ అంతర్జాతీయ మార్కెట్‌లో మంచి డిమాండ్‌ను సాధించుకొని చేనేత పరిశ్రమ మనుగడ అంతరించకుండా ఆదుకుంటున్నాయి.

# ఇక్ష్వాక రాజులు ఏలిన గడ్డ గుంటూరు సీమ

(ఆన్‌లైన్ - గుంటూరు)

చరిత్ర కందని కాలంలో కొన్ని వేల సంవత్సరాల క్రిందట నుంచే గుంటూరు జిల్లా ఏర్పడిందనడానికి అనేక చారిత్రక ఆధారాలు వున్నాయి. అగ్నిగుండాల, తుమ్మలగుంట, రెంటాలలో లభించిన మానవ జాతి సమాధి గూళ్ళు ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం. ప్రాచీనకాలంలో చుట్టూ రాళ్ళు పేర్చి మధ్యలో చనిపోయిన వారి అస్థులు దానిలో వుంచి, ఒక రాతితో ఆనాడు పూడ్చేవారు. నాటి కాలంలో వారు ఉపయోగించిన రాతి పనిముట్లు కూడా అందులో వుంచేవారు.

గుంటూరు జిల్లా కలెక్టర్ కార్యాలయం

ఇటీవల కాలంలో అమరావతీ ప్రాంతంలో జరిపిన త్రవ్వకాలలో అతి పురాతన కాలానికి చెందిన నాణేలు (మధ్యలో బెజ్జము) లభించాయి. ఈ నాణేములు వెండి, ఇతర లోహాలతో తయారు చేయబడ్డాయి. ఈ నాణేములు శాతవాహన రాజులకు ముందునాటి కాలమునకు చెందినవని చరిత్రకారులు పేర్కొంటున్నారు. శాతవాహన రాజుల కాలం నుంచి గుంటూరు జిల్లా ఆంధ్రపథంలో ప్రధాన భాగముగా ప్రసిద్ధ చెందినట్టు తెలుస్తుంది.

మూడవ శతాబ్దంనాటి పల్లవుల శాసనమొకదానిలో 'ఆంధ్ర-పథము' పేరు వ్రాయబడింది. రాష్ట్రంలో విద్యా, వాణిజ్య, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో ప్రఖ్యాతి చెందిన గుంటూరు జిల్లా 1904 అక్టోబరు 1వ తేదీన ప్రత్యేకంగా ఏర్పడింది. తరతరాలుగా అనేక ప్రాంతీయ రాజవంశాల పాలనలోను, విదేశీయుల పాలనలోను గుంటూరు జిల్లా కేంద్ర స్థానాన్ని ఆక్రమించింది. రవి అస్తమించని సామ్రాజ్యాన్ని స్థాపించిన ఆంగ్లేయుల కీర్తికిరీటంలో అలంకరించిన 'కోహినూర్' వజ్రం 'కోళ్ళూరు'లో లభించిందే. ఆది మానవుడు గుంటూరు జిల్లాలో సంచరించి నివాసం ఏర్పరచుకున్నాడు. ఆది మానవుడు వినియోగించిన పాత రాతి యుగపు పనిముట్లు కారంపూడి, నాగార్జునకొండలలో లభించాయి. నాగార్జునకొండ లోయ ప్రాంతంలో జరిపిన తవ్వకాలలో లభించిన ఆధారాలను బట్టి జిల్లాలో పాత రాతియుగం నుంచి నిరవధికంగా నాగరికత నడచినట్టు ఆధారాలు వున్నాయి.

నవీన శిలాయుగపుపనిముట్లు, పెద్ద రాతి సమాధులు (రాక్షసగూళ్ళు) జిల్లా అంతటా లభించాయి. రాక్షసగూళ్ళు అని పిలువబడే ఈ సమాధులను క్రీస్తు పూర్వం 500వ సంవత్సరానికి చెందిన మెడిటరేనియన్ (ద్రావిడులు) జాతివారు నిర్మించారు. ఆర్యులు దక్షిణ పథమునకు విస్తరించకుండా ద్రావిడులు ప్రతి ఘటించడం వలన, వారు ఆర్యులచే రాక్షసులుగా వర్ణించబడ్డారు. ఆర్య సంస్కృతి దక్షిణాపథానికి విస్తరించడమే రామాయణ మూలగాథ. రామాయణ కాలంలో జరిగిన అనేక ప్రధాన ఘట్టాలకు కేంద్రం గుంటూరు జిల్లా అనడం అతిశయోక్తి కాదు. జిల్లాలో పాలన చేసిన తొలి రాజవంశం ఇక్ష్వాకువంశం. రామాయణ మూల పురుషుడు శ్రీరామచంద్రుడు ఇక్ష్వాక రాజవంశానికి చెందినవారే.

గుంటూరు జిల్లా ఆంధ్రజాతికి మాతృభూమిగా వుండి, తెలుగు జాతి నిర్మాణంలో ప్రధాన పాత్ర వహించింది. మహాభారతంను అనుసరించి ఆంధ్ర జాతీయులు అనేక తెగలకు చెందిన వారు తెలగలు, నాగులు, ములకలు, జక్కులు (యక్షులు), పల్లవులు, ముండారీలు, ఆంధ్రులు మొదలగు తెగల వారు రాష్ట్రంలోని పలు ప్రాంతాలలో నివసించారు. చారిత్రక కాలంలో గుంటూరు జిల్లా ఆంధ్రా పల్లవ బొగ్గ, ముండ రాష్ట్రం, నాగదేశం అనే పరిపాలనా విభాగాలుగా విభజించబడి వుండేది. ఎడ్లపాడు మండలం లోని మైదవోలు గ్రామంలో లభించిన మూడవ శతాబ్దం నాటి శాసనంలో ధాన్యకటకం (అమరావతి సమీపంలో గల ధరణికోట) ఆంధ్రాపథంగా పేర్కొనబడింది. ధాన్యకటక ప్రాంతాన్ని పాలించిన శాతవాహనులు, విష్ణుకుండినులు, కొండవీటి రెడ్డిరాజులు, ఆంధ్ర జాతీయులని వర్ణించబడ్డారు.

ఈ శాసనంను అనుసరించి మహాభారతం, పురాణాలలో పేర్కొనబడిన 'ఆంధ్రాపథం' ఆంధ్రుల ప్రథమ నివాస స్థలమై నేటి ఆంధ్రప్రదేశ్‌కు కేంద్ర స్థానంగా వుండేది. క్రీస్తు పూర్వం ఐదవ శతాబ్దం నాటికి ఆంధ్రులు బలవంతులై చుట్టుపక్కల వున్న తెగల వారిపై ఆధిపత్యాన్ని సంపాదించి, ఆంధ్ర జాతినే నిర్మించారు. వాఙ్మయ ఆధారాల ప్రకారం 'ప్రతి పాల పుర రాజ్యం' (ప్రస్తుతం భట్టిప్రోలు) జిల్లాలో ఏర్పడిన తొలి రాజ్యం. ఐదవ శతాబ్ద కాలంలో ఇక్ష్వాక వంశస్తుడు అయిన చెంప రాజ్యపాలకుడు యశోధరుడు దక్షిణాపథానికి వలసవచ్చి ప్రతిపాల పుర రాజ్యాన్ని స్థాపించారు.

"ఏస కొంచెము లేని హృదయంగమంబైన  
సిసలైన తెనుగు రంజిల్లుచోటు  
కట్టులో బొట్టులో కడమసీమల యందు  
నగ్రతాంబూలంబునందు చోటు  
ఆజాను బాహువులై కోరమీసాల  
మగవారు దండిగా మసలు చోటు  
కంటి కింపైన చక్కని అందగత్తియ  
లింటింట విద్యుత్తులీను చోటు  
ఆవల పల్నాడు, కొండవీడీవల నిలిచి  
జననమెత్తిన చిరుత బాలునకు గూడ  
గురువులై వీరగాథలు గరపు చోటు  
వీర భాషాభిరామ! గుంటూరు సీమ!!  
– గుర్రం జాషువా

పాటలీపుత్ర ఆస్థానానికి రాయబారిగా వచ్చిన 'మెగస్తనీస్' ఆంధ్రులకు 30 బలీయమైన దుర్గాలు వున్నాయని పేర్కొన్నారు. భట్టిప్రోలులో లభించిన 2వ శతాబ్దంనాటి శాసనాల ప్రకారం భట్టిప్రోలు ప్రాంతంలో కుబేరకా అనే రాజు నిగమసభ (పెద్దల సభ) సహాయంతో పాలించినట్టు తెలుసున్నది. కుబేరకరాజు యశోధర రాజవంశానికి చెందినవాడుగా చరిత్రకారులు భావిస్తున్నారు. ఆంధ్ర శాతవాహనుల కాలంలో గుంటూరు జిల్లా ఉత్తరాన మాళ్వా నుంచి దక్షిణాన మద్రాసు, మైసూరుల వరకు విస్తరించింది. శకదండయాత్రల నుంచి కాపాడుకొనే నిమిత్తం శాతవాహనులు మహారాష్ట్రలో గల పైఠాన్‌ను రాజధానిగా చేసుకున్నారు. అనంతరం గుంటూరు జిల్లాలోని 'ధాన్యకటకం' ఆంధ్ర శాతవాహన మహాసామ్రాజ్యానికి రాజధాని అయింది. శాతవాహన రాజులలో అగ్రగణ్యుడైన 'గౌతమీపుత్ర శాతకర్ణి' ధాన్యకటకం నుంచి తన దిగ్విజయ యాత్రలను ప్రారంభించి తన అశ్వాలకి మూడు సముద్రాలలో దప్పిక తీర్చినాడు. దీర్ఘకాల శక శాతవాహన సంఘర్షణ ఫలితంగా ప్రతిపాలపురంలో గల ఇక్ష్వాకులు బలపడి తమ రాజకీయ కేంద్రాన్ని శ్రీపర్వత-విజయపురం (నాగార్జునకొండ)కి మార్చారు. క్రీస్తుశకం 225 ప్రాంతంలో ఇక్ష్వాకురాజు శ్రీ చాంతమూలుడు శాతవాహనులను జయించి (మిగతా 72వ పేజీలో..)

గౌ॥ డా॥ వై.యస్. రాజశేఖర రెడ్డి గారు
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు

శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి
రాష్ట్ర ప్రాథమిక విద్యాశాఖమంత్రి

శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకారశాఖామాత్యులు

శ్రీ ధర్మానప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జి మంత్రి

శ్రీ ముప్పలనేని శేషగిరిరావు
డిసిసి అధ్యక్షులు


శ్రీ కె. కేశవరావు
పిసిసి అధ్యక్షులు

# వందకోట్ల రూపాయలతో గ్రంథాలయాల అభివృద్ధి


కీ॥శే॥ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు
గ్రంథాలయ ఉద్యమ పితామహుడు

తెలుగు వార్తా జగత్తులో దిన దిన ప్రవర్ధమానమవుతున్న ఆంధ్రజ్యోతి
తృతీయ వార్షికోత్సవం సందర్భంగా శుభాకాంక్షలు




## ముఖ్యమంత్రిగా గౌ॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డిగారు పదవీ బాధ్యతలు స్వీకరించాక రాష్ట్రంలో రూ. 100 కోట్లతో గ్రంథాలయాలను మెరుగుపరిచారు.




* రాష్ట్రంలోని 23 జిల్లా గ్రాంధాలయ సంస్థలతోపాటు 7 రీజనల్ లైబ్రరీలనందు ఎసి. రీడింగ్ హాల్స్ ఏర్పాటు చేయుట.
* త్వరలో 1305 గ్రంథాలయ పోస్టుల భర్తీ
* రూ 32 కోట్ల రూపాయల బకాయిల వసూలు.
* రూ 15 కోట్లతో జిల్లా గ్రంథాలయ సంస్థలు, మునిసిపల్ కేంద్రాలలోని గ్రంథాలయాలను కంప్యూటరీకరించటం.
* రాష్ట్రంలోని రీజనల్ లైబ్రరీలలో AC సౌకర్యం కల్పించటం.
* 11వ ఫైనాన్స్ నిధులతో రాష్ట్రంలో గ్రంథాలయ భవనాలను నిర్మించటం.
* ఒక్కొక్క జిల్లా గ్రంథాలయంలో రూ.15 లక్షలతో కాంపిటీటివ్ పరీక్షలకు అవసరమైన పుస్తకాలను ఏర్పాటు చెయ్యటం జరిగింది.
* రాష్ట్రంలో 4 సం॥లముగా పెన్షన్‌ల బకాయిలలో రూ. 2.64 కోట్లు ఉద్యోగులకు విడుదల చేయుట.
* మునిసిపల్ కేంద్రాలలోని గ్రంథాలయాలలో, జిల్లా గ్రంథాలయ సంస్థలు, రీజనల్ లైబ్రరీలలో ఇంటర్‌నెట్, ఇ.మెయిల్ సౌకర్యం కల్పిస్తున్నాం.
* రీజనల్ లైబ్రరీలో, జిల్లా గ్రంథాలయ సంస్థలలో ఎన్.ఆర్.ఐ. సెల్‌లు ఏర్పాటు చేసి వారి సహకారంతో గ్రంథాలయాలను అభివృద్ధి చేయుచున్నాం.
* రాష్ట్ర వ్యాప్తంగా గ్రంథాలయాలను 50 మండల కేంద్రాలలో త్వరలో ఏర్పాటు చేయుచున్నాం.
* రాష్ట్ర వ్యాప్తంగా వివిధ గ్రామాలలో బుక్ డిపాజిట్ సెంటర్లను ఏర్పాటు చేస్తున్నాం.


చిట్టా విజయభాస్కర రెడ్డి
జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మన్


కూచిపూడి సాంబశివరావు
రాష్ట్ర గ్రంథాలయ సంస్థ ఛైర్మన్

ముఖ్యమంత్రి డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి నాయకత్వంలో, ప్రాథమిక విద్యాశాఖ మంత్రి శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి సహకారంతో రాష్ట్రంలో గ్రంథాలయాలను మెరుగుపరుచుటకు కృషి చేస్తున్నాము. వీటన్నిటికి ప్రజలు సహకరించవలసినదిగా కోరుచున్నాము.

Space Donated By:

**గ్రంథాలయసంస్థ జిల్లా ఛైర్మన్లు, జిల్లా కార్యదర్శులు మరియు రాష్ట్ర గ్రంథాలయ సంస్థ ఎంప్లాయిస్ అసోసియేషన్**

# ఇక్ష్వాక రాజులు ఏలిన గడ్డ గుంటూరు సీమ

(70వ పేజీ తరువాయి)

తన సార్వభౌమాధికారాన్ని నెలకొల్పి దానికి సూచనగా అశ్వమేధయాగం చేశారు. చాంతమూలుడు, అతని వారసుల కాలంలో శ్రీపర్వత-విజయపురం సకల విద్యలకు, సంస్కృతులకు నిలయమై, ప్రపంచ ఖ్యాతి పొందింది. క్రీస్తుశకం 300 ప్రాంతం పల్లవులు, ఇక్ష్వాకులను ఓడించి, కృష్ణాలోయ ప్రాంతాన్ని ఆక్రమించారు. నాగార్జునకొండ, మైదవోలు, ఒంగోలులలో లభ్యమైన తొలి పల్లవ శాసనాలను బట్టి పల్లవులు పల్నాడు, పల్లవ బొగ్గ ప్రాంతంలోనే తమ పరిపాలన ప్రారంభించినట్టు తెలుస్తున్నది.

కాంచీపురాన్ని రాజధానిగా చేసుకున్న తరువాత పల్లవులు తిరిగి పల్నాడు రాలేకపోయారు. పల్లవుల అనంతరం అనందగోత్రజులు, విష్ణుకుండినులు గుంటూరు ప్రాంతాన్ని పాలించారు. ఆనంద గోత్రజులకు చెందిన నాలుగు తరాల రాజవంశీయులు 'విజయకందాపురం'ను రాజధానిగా చేసుకొని, పాలించినట్టు శాసనాధారాలున్నాయి. అనంతరం 'విజయకందాపురమే' గుంటూరుకు సమీపంలోని 'కంతేరు'గా గుర్తించబడింది. ఆనందగోత్రజుల వంశం తరువాత గుంటూరు ప్రాంతం విష్ణుకుండినుల వంశం అయ్యింది.

వినుకొండ ప్రాంతానికి చెందిన వీరు, తాము శ్రీ పర్వత స్వామి పాదారాధకులమని తమ శాసనాలలో పేర్కొన్నారు. చరిత్రకారులు శ్రీ పర్వతస్వామినే బుద్ధుడుగా గుర్తించారు. విష్ణుకుండిన వంశ రాజులలో ప్రముఖుడైన మాధవశర్మ 11 అశ్వమేధయాగాలు, 1 రాజసూయ యాగం, అనేక యజ్ఞయాగాదులు నిర్వహించారు. మధ్యయుగ కాలంలో బాదామీ చాళుక్యరాజైన రెండవ పులకేశి గుంటూరు ప్రాంతాన్ని పాలిస్తున్న విష్ణుకుండినులను ఓడించారు. క్రీస్తుశకం 630లో గుంటూరు ప్రాంతాన్ని, వెంగీతో కలిపి కర్మ రాష్ట్రాన్ని ఏర్పాటు చేసి తన తమ్ముడైన కబ్జ విష్ణువర్ధనుని పాలకునిగా నియమించాడు.

గుంటూరు ప్రాంతం వెంగీ సామ్రాజ్యంలో భాగంగా, తూర్పు దక్కనులో రాజకీయంగా అత్యంత కీలకస్థానంలో వుండడం వలన ఈ ప్రాంతం పల్లవ రాష్ట్రకూట, చాళుక్య-చోళ సంఘర్షణలకు యుద్ధభూమి అయింది. రాష్ట్ర కూటులచే తరిమి వేయబడిన వేంగీ చాళుక్య రాజు మొదటి యుద్ధమల్లుడు చేబ్రోలును (క్రీ.శ.930-34) రాజధానిగా చేసుకొని పాలించారు. వేంగీ చాళుక్య రాజైన రాజరాజ నరేంద్రుని అనంతరం అతని కుమారుడు రాజేంద్ర 'కుళోత్తుంగ' అనే బిరుదుతో తంజావూరు సింహాసనాన్ని అధిష్టించడంతో గుంటూరు చోళ సామ్రాజ్యం అంతర్భాగమయింది. వెంగీ చాళుక్యుల బలహీనపాలనా కాలంలో గుంటూరు ప్రాంతంలో చిన్న చిన్న రాజ్యాలు అనేకం వెలిశాయి. చందవోలులో వెలనాటి చోడులు, ధరణికోటలో కోటరాజులు, నాదెండ్లలో దుర్జయులు, మాచర్ల-గురజాలలో హైహేయులు, అద్దంకిలో యాదవులు రాజ్యాధికారానికి వచ్చారు.

చందవోలు పాలకులైన వెలనాటి చోడులు కొంతకాలం తంజావూరు చాళుక్య-చోళుల తరపున స్థానిక రాజవంశాలపై అధికారాన్ని సాగించారు. ఆ విధంగా గుంటూరు జిల్లాలోని చందవోలు ఆంధ్రదేశానికి కొద్దికాలం కేంద్రం అయింది. వెలనాటి చోడుల ప్రాబల్యం క్షీణించడంతో స్థానిక రాజవంశీకుల మధ్య సంఘర్షణలు ప్రారంభమయ్యాయి. మాచర్ల-గురజాల ప్రాంతాన్ని పాలిస్తున్న హైహేయ రాజకుటుంబంలో ప్రారంభం అయిన సంఘర్షణ కారంపూడి యుద్ధం (పల్నాటి యుద్ధం)గా పరిణమించింది. ఈ యుద్ధమే చాటువుల్లోను, వాఙ్మయంలోను ఆంధ్ర కురుక్షేత్రంగా వర్ణించబడింది. పల్నాటి యుద్ధ ఫలితంగా కర్మ రాష్ట్రంలోని స్థానిక రాజ్యవంశాలు పతనం అయ్యాయి. దీని ఫలితంగా కర్మ రాష్ట్రం కాకతీయుల పాలనలోకి వచ్చింది. కాకతీయ రాణి రుద్రమదేవి పాలనాకాలంలో ఇటలీకి చెందిన వెనీషియా యాత్రికుడు మోటుపల్లి రేవును సందర్శించి రుద్రమదేవి ప్రతిభా సామర్థ్యాలను, పాలనా పటిష్టతను, కాకతీయ రాజ్య ఆర్థికాభ్యుదయాన్ని కొనియాడారు.

క్రీస్తుశకం 1323లో వరంగల్లును ఢిల్లీ సుల్తానులు ఆక్రమించడంతో కాకతీయ రాజవంశం పతనమైంది. దీంతో ఆంధ్రదేశం ముస్లింల పాలనలోకి వచ్చింది. ముస్లింల పాలనలో ఆంధ్ర ప్రజానీకం అనేక కష్టాలు అనుభవించారు. పోలయవేమారెడ్డి అద్దంకి రాజధానిగా స్వతంత్ర హిందూ రాజ్యాన్ని స్థాపించి క్రీ.శ.1325 నాటికి ముస్లింల ప్రాబల్యానికి అడ్డుకట్ట వేసి 'కుంభసంభవ' అనే బిరుదు సంపాదించారు. అనపోతారెడ్డి తన రాజధానిని అద్దంకి నుంచి కొండవీడుకు మార్చారు. ముస్లిం ప్రతిఘటనోద్యమంలో భాగంగానే క్రీ.శ.1336లో సంగమ వంశీకులైన హరిహర బుక్కరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. విజయనగర సామ్రాజ్య వ్యవస్థాపకులైన హరిహర బుక్కరాయలు 'మంగళనిలయ' వాసులని తెలుస్తుంది. గుంటూరుకు సమీపంలోని మంగళగిరే నాటి 'మంగళనిలయం' అని చరిత్రకారుల అభిప్రాయం. ముస్లింల బారి నుంచి హిందూ ధర్మాన్ని రక్షించిన ఘనత ప్రోలయవేమారెడ్డి, హరిహర బుక్క రాయలకు దక్కితే, ఆ మహానాయకులకు జన్మస్థలం గుంటూరు జిల్లా కావడం గమనార్హం.




గుంటూరులోని బ్రహ్మానందరెడ్డి స్టేడియం

కొండవీటి రెడ్డిరాజులు వంశం 1424లో పతనంకావడంతో, గుంటూరు ప్రాంతం మరలా పలురాజవంశాల పాలనలోకి వెళ్ళింది. ఒరిస్సా పాలకులైన గజపతులు, గుల్బర్గా పాలకులైన బహమనీలు, విజయనగర పాలకులు గుంటూరు ప్రాంతాన్ని చేజిక్కించుకోవడానికి శతవిధాలా ప్రయత్నించారు. 1515లో విజయనగర పాలకుడైన శ్రీకృష్ణదేవరాయలు కొండవీడులోని గజపతుల గవర్నర్ కాశవపుత్రునిడించి గుంటూరును తమ రాజ్యంలో విలీనం చేసుకున్నారు.

1565లో జరిగిన తళ్ళికోట యుద్ధ ఫలింగా, గుంటూరు ప్రాంతం గోల్కొండ కుతుబ్‌షాహీల పాలనలోకి వచ్చింది. వీరు కొండవీడు పేరును ముర్తుజానగర్‌గా మార్చారు. మొగల్ చక్రవర్తి ఔరంగజేబు గోల్కొండను ఆక్రమించడంతో 'ముర్తాజానగర్' మొగల్ సామ్రాజ్యంలో విలీనం అయింది. 1724లో నిజాం-ఉల్-ముల్క్ హైదరాబాద్ సుభాలో స్వాతంత్రం ప్రకటించుకోవడంతో గుంటూరు ప్రాంతం వారి ఆధీనంలోకి వచ్చింది. కుతుబ్‌షాహీల పాలనా కాలంలోనే ఆంగ్లీయులు గుంటూరు ప్రాంతంలో వస్త్రాల వ్యాపారం కోసం అనుమతి పొందారు.

వారు మోటుపల్లి, నిజాంపట్నం రేవులలో వర్తక కేంద్రాలను ఏర్పాటు చేసి, అల్లూరు,బాపట్ల, వేటపాలెం, పొన్నూరు, మంగళగిరిలలో వస్త్రాల వ్యాపారం నిర్వహించారు. 1748లో నిజాం-ఉల్-ముల్క్ మరణించడంతో, నాసిర్‌జంగ్, ముజాఫర్ జంగ్‌ల మధ్య వారసత్వ యుద్ధం ప్రారంభం అయింది. ఈ యుద్ధంలో యుజాఫర్‌జంగ్ ఫ్రెంచివారి నుంచి సహాయం పొంది దానికి కృతజ్ఞతగా గుంటూరుతో సహా ఉత్తర సర్కారులను 1750లో ఫ్రెంచి వారికి ఇచ్చారు. 1752లో ఫ్రెంచి వారు గుంటూరులో ఒక కోటను నిర్మించారు. కర్ణాటకలో అధికారం కోసం ఆంగ్లేయులు, ఫ్రెంచివారి మధ్య జరిగిన యుద్ధంలో

(మిగతా 73వ పేజీలో..)

# ఇక్ష్వాక రాజులు ఏలిన గడ్డ గుంటూరు సీమ

(72వ పేజీ తరువాయి)

ఫ్రెంచివారు ఓడిపోవడంతో నిజాం ఆంగ్లేయులతో మైత్రి చేశారు. 1758లో నిజాం నవాబు గుంటూరు మినహా మిగిలిన సర్కార్ జిల్లాలను ఆంగ్లేయులకు అప్పగించారు. గుంటూరు జిల్లా అప్పటికే బసాలత్ జంగ్‌కు మనోవర్తి జాగీరుగా ఇవ్వడంతో అతని మరణానంతరం గుంటూరును ఆంగ్లేయులకు అప్పగించే విధంగా అంగీకారం కుదిరింది. మైసూరు పాలకుడైన హైదర్ ఆలీ గుంటూరును ఆక్రమించే ప్రమాదంవుందనే సాకుతో మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నర్ సర్ థామస్ రాంబోల్డ్ 1779లో గుంటూరును ఆక్రమించాడు. దీంతో నిజాం-ఆంగ్లేయుల మధ్య సంబంధాలు దెబ్బతిన్నాయి.


గుంటూరు నగరపాలక సంస్థ

నిజాం నవాబు మరాఠా నాయకుడైన నానా ఫెడ్నవీస్ నాయకత్వంలో ఏర్పడిన ఆంగ్లేయుల వ్యతిరేక కూటమిలో చేరాడు. ఈ నేపథ్యంలో నాటి బెంగాల్ గవర్నర్ వారన్ హేస్టింగ్స్ జోక్యం చేసుకొని గుంటూరు ప్రాంతాన్ని తిరిగి బసాలత్‌జంగ్‌కు ఇప్పించారు. 1782లో బసాలత్‌జంగ్ మరణించిన తరువాత గుంటూరును ఆంగ్లేయులకు అప్పగించడానికి నిజాం వెనకాడారు. అయితే గుంటూరు పొందే విషయంలో బెంగాల్ గవర్నర్ జనరల్ లార్డ్ కార్న్‌వాలిస్ ప్రత్యేక ఉత్తర్వులు జారీచేయడంతో, నిజాం నవాబు 1788 సెప్టెంబరు 18న గుంటూరును కెప్టెన్ కన్నేవేకు అప్పగించారు. సర్కారు జిల్లాలు తూర్పు ఇండియా కంపెనీ ఆధీనంలోకి వచ్చిన తరువాత వారు పాత జమిందారులనే వివిధ ప్రాంతాలలో పాలకులుగా నియమించారు. గుంటూరు జిల్లా నాలుగు జమీందారీ కుటుంబాల పాలనలోకి వచ్చింది. రేపల్లెలో మాణిక్యరావు వంశీకులు, చింతపల్లి-అమరావతిలో వాసిరెడ్డి వంశీయులు, అట్లూరు (నరసరావుపేట)లో మాల్రాజు వంశీకులు, సత్తెనపల్లి-చిలకలూరిపేటలో మానూరు వంశీకులు పాలకులుగా నియమించబడ్డారు. 1788-94 సంవత్సరాల మధ్య కాలంలో గుంటూరు జిల్లా మచిలీపట్నం నుంచి ఈస్టిండియా కంపెనీ సలహా సంఘంచే పాలించబడింది. అనంతరం ప్రత్యేకంగా గుంటూరు జిల్లా ఏర్పడి కలెక్టర్ల పాలనలోకి వచ్చింది. దాచేపల్లి, తుమృకోట, ప్రత్తిపాడు, మార్టూరు, మంగళగిరి, బాపట్ల, పొన్నూరు, రేపల్లె, తెనాలి, గుంటూరు, కొండవీడు, పెదకూరపాడు, నరసరావుపేట, వినుకొండలతో గుంటూరు జిల్లా ఏర్పడింది.జమీందారుల పాలన అస్తవ్యస్తంకావడంతో 1802లో ఈస్టు ఇండియా కంపెనీ రైత్వారీ విధానాన్ని ప్రవేశపెట్టింది. 1849 నాటికి జమీలన్నింటినీ ఈస్టిండియా కంపెనీ సొంతం చేసుకుంది.

1816లో పిండారీలు గుంటూరు జిల్లాపై దాడిచేసి అనేక గ్రామాలను కొల్లగొట్టారు. 1823లో గుంటూరులో భారీ అగ్ని ప్రమాదం జరిగింది. 1832లో జిల్లాలో తీవ్రమైన కరువు ఏర్పడింది. దీనినే 'డొక్కల కరువు' అంటారు. పరిపాలనా సౌలభ్యం కోసం 1859లో గుంటూరు జిల్లాను తిరిగి కృష్ణా జిల్లాలో విలీనం చేశారు. అయితే జిల్లా కోర్టు, కొన్ని కార్యాలయాలు గుంటూరులోనే వుంచబడ్డాయి. తిరిగి 1904 అక్టోబరు ఒకటవ తేదీన తెనాలి, గుంటూరు, సత్తెనపల్లి, పల్నాడు, బాపట్ల, నరసరావుపేట, వినుకొండ, రేపల్లె, ఒంగోలు తాలూకాలతో గుంటూరు జిల్లా ఏర్పడింది. 1970లో ఒంగోలు తాలూకా పూర్తిగాను, బాపట్ల, నరసరావుపేట, వినుకొండ తాలూకాల లోని కొన్ని ప్రాంతాలను కలిపి ప్రకాశం జిల్లా ఏర్పాటు చేయబడింది.

# కళాకారులకు అక్షరాలు నేర్పిన గుంటూరు

(ఆన్‌లైన్ - గుంటూరు)

సినిమా రంగానికి, గుంటూరు జిల్లాకు అవినాభావ సంబంధం వుంది. ఎందరో మహానటులు, సినీ రచయితలకు, దర్శకులకు జన్మభూమి గుంటూరు జిల్లా. అందులో ఎక్కువ మంది కళలకు కాణాచిగా పేరొందిన తెనాలి పరిసర ప్రాంతాల నుంచి వచ్చినవారే. ఈ దేశంలో రాముడు, కృష్ణుడు వంటి పురాణ పురుషులు ప్రజల మనసుల్లో వున్నంతకాలం మహానటుడు ఎన్‌టి రామారావు ప్రజల హృదయాల్లో చిరస్థాయిగా నిలుస్తారు.

సినీ రంగాన్ని శాసించి, సినీ జగత్తులో తిరుగులేని, ఎదురులేని మహానటుడు ఎన్‌టి రామారావు విద్యాభ్యాసం అంతా గుంటూరు జిల్లాలోనే సాగింది. ఆయన గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలోనే చదివారు. పైగా గుంటూరు సబ్ రిజిస్ట్రార్ కార్యాలయంలో పనిచేశారు. ఇక్కడి నుంచి ఆయన నే ర ం గా మద్రాసు వెళ్లి సినిమాలలో వేషం వేశారు. ఆ మహానటుడికి జిల్లాతో వున్న అనుబంధం అటువంటిది.

ఇక నాటికీ, నేటికీ సినిమా రంగంలో హీరోగా వెలుగొందుతున్న నటశేఖరుడు హీరో ఘట్టమనేని శివరామకృష్ణ(కృష్ణ) తెనాలికి సమీపంలోని బుర్రిపాలెం వాస్తవ్యుడు. అందువలనే ఆయన జన్మభూమిపై మమకారంతో 'బుర్రిపాలెం బుల్లోడు' అనే సినిమాను తీశారు. సినీ పరిశ్రమలో ఎంతటి ఉన్నత శిఖరాలకు ఎదిగినా ఈ హీరో కృష్ణ ఇప్పటికీ తన జన్మస్థలానికి వస్తుంటారు.

ఆక ఈయన సోదరులు జి.హనుమంతరావు, జి. ఆదిశేషగిరిరావులు ఇరువురు నిర్మాతలుగా వున్నారు.

ఇక మహానటి సావిత్రి గుంటూరు జిల్లా వాస్తవ్యురాలే. తాడేపల్లి మండలం చిర్రావూరు గ్రామానికి చెందిన సావిత్రి చిన్ననాడే సినిమా రంగంలోకి ప్రవేశించింది.

అప్పటికీ, ఇప్పటికీ సినీ ర ం గ ంలో త న క ం టూ ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకున్న ఊర్వశి శారద తెనాలి వాస్తవ్యురాలే. ఆమె తెలుగుదేశం పార్టీలో చేరి తెనాలి నుంచి పార్లమెంటుకు పోటీచేసి గెలుపొందారు. 1998 పార్లమెంటు ఎన్నికల్లో మాత్రం పరాజయం పాలయ్యారు.

గుమ్మడి వెంకటేశ్వరరావు, ధూళిపాళ్ల, జగ్గయ్య, ముక్కామల వంటి నటుల జన్మస్థలం కూడా గుంటూరు జిల్లాయే.

ఇక ప్రస్తుతం సినీరంగంలో హాస్యానికి పెట్టింది పేరు బ్రహ్మానందం, ఎవియస్‌లు కూడా గుంటూరు జిల్లా వారే. బ్రహ్మానందం సత్తెనపల్లి వాస్తవ్యులు కాగా, ఎవియస్ తెనాలికి చెందినవాడు. తెరపై కనిపించిన వెంటనే కడుపుబ్బ నవ్వించే హాస్యపాత్రలు పోషించడం వీరి సొంతం. ఇక శుభాకాంక్షలు, సుస్వాగతం, సుప్రభాతం, సూర్యవంశం, శుభమస్తు వంటి హిట్ చిత్రాలను ఆంధ్ర సినీ ప్రేక్షకులకు అందించిన యువ దర్శ కుడు భీమినేని శ్రీనివాసరావు చి ల క లూ రి పే ట ప్రాంతానికి చెందినవారు.

మాటలను తూటాలుగా మలచి మాటలు రాస్తే ఆ సినిమా విజయవంతమయ్యే పోసాని కృష్ణమురళి గుంటూరు జిల్లా పెదకాకానికి చెందినవాడే. వర్ధమాన నటుడు శివాజీ ఎన్నో చిత్రాలలో వేస్తున్నాడు. శివాజీది చిలకలూరిపేట.

మరెందరో వర్ధమాన నటులకు, మహానటులకు గుంటూరు జిల్లా జన్మనిచ్చింది. అందుకే సినిమా పరిశ్రమ జిల్లాలో పెనవేసుకుపోయింది. ఇక రాష్ట్ర సినిమా వ్యాపారం కోస్తా ప్రాంతం 60 శాతం వాటా వుండే పాత గుంటూరు జిల్లాగా పిలువబడే గుంటూరు, ప్రకాశం జిల్లాలో కొంత భాగం 20 శాతం వాటాకు ప్రాతినిధ్యం వహిస్తుంది.

# గుంటూరు జిల్లా ఎంపిలు, ఎమ్మెల్యేలు



దేవినేని మల్లికార్జునరావు
**రేపల్లె**

డొక్కా మాణిక్య వరప్రసాద్
**తాడికొండ**

గాదె వెంకటరెడ్డి
**బాపట్ల**



గుదిబండి వెంకటరెడ్డి
**దుగ్గిరాల**

జంగా కృష్ణమూర్తి
**గురజాల**

కాసు వెంకట కృష్ణారెడ్డి
**నరసరావుపేట**



మక్కెన మల్లికార్జునరావు
**వినుకొండ**

నాదెండ్ల మనోహర్
**తెనాలి**

మర్రి రాజశేఖర్
**చిలకలూరిపేట**



దగ్గుబాటి పురంధరేశ్వరి
**బాపట్ల, పార్లమెంటు సభ్యులు**



రాయపాటి సాంబశివరావు
**గుంటూరు, పార్లమెంటు సభ్యులు**



మేకపాటి రాజమోహనరెడ్డి
**నరసరావుపేట, పార్లమెంటు సభ్యులు**



వల్లభనేని బాలశౌరి
**తెనాలి, పార్లమెంటు సభ్యులు**



కన్నా లక్ష్మీనారాయణ
(పెదకూరపాడు)
**సహకార, రవాణా శాఖ మంత్రి**



మురుగుడు హనుమంతరావు
**మంగళగిరి**

సతీష్ పాల్‌రాజ్
**వేమూరు**

ధూళిపాళ్ళ నరేంద్రకుమార్
**పొన్నూరు**



పిన్నెల్లి లక్ష్మారెడ్డి
**మాచర్ల**

రావి వెంకటరమణ
**ప్రత్తిపాడు**

షేక్ (సంబూరు) సుభానీ
**గుంటూరు-1**



తాడిశెట్టి వెంకటరావు
**గుంటూరు-2**

యర్రం వెంకటేశ్వరరెడ్డి
**సత్తెనపల్లి**

మోపిదేవి వెంకట రమణారావు
**కూచినపూడి**

# పల్నాటి పౌరుషానికి ప్రతీక నాయకురాలు నాగమ్మ

(ఆన్‌లైన్, దాచేపల్లి)

సుమారు 800 ఏళ్ళ క్రితం మాచర్ల, గురజాల కేంద్రాలుగా సాగిన వీరగాథ పల్నాటి చరిత్ర. శ్రీనాథ విరచితమైన పల్నాటి వీరగాథ 'పిచ్చికగుంట్ల' వారిచే ఆంధ్ర దేశం మొత్తంగా పరివ్యాప్తమై ఈనాటికీ అజరామరంగా నిలిచి పోయిన పల్నాటి చరిత్రలో నాగమ్మది నాయకురాలు పాత్ర.

## పల్నాటి రాజ్యం పుట్టుక

క్రీ.శ 12వ శతాబ్దం చివరి దశకంలో జరిగిందని చెబుతున్న పల్నాటి చరిత్ర పుట్టుక ఈ విధంగా ఉంది. కార్త వీర్యార్జునుని సంతతికి చెందిన వాడు అనుగురాజు. అతనికి బ్రహ్మహత్య పాతకం చుట్టుకుంటుంది. తీర్థయాత్రలు చేస్తూపోతే ఎక్కడ తాము ధరించిన బట్టలు మెరుస్తాయో అక్కడ శాపం తీరిపోతుందని చెబుతారు. ఆవిధంగా అనుగురాజు కుటుంబీకులతో తీర్థయాత్రలు చేస్తూ పోతుండగా కృష్ణా నదిలో మోటుపల్లి వద్ద అనుగురాజు కుటుంబీకుల వస్త్రాలు మెరుస్తాయి. అప్పుడది పవిత్ర స్థలంగా భావించి అనుగురాజు అక్కడ స్థిరనివాసం ఏర్పరుచుకుంటాడు.

అప్పుడు ఆ ప్రాంతాన్ని భీమరాజు అనే సామంతరాజు పాలించేవాడు. ఆయనకు చందోలురాజుతో యుద్ధం వస్తుంది. అయుద్ధంలో భీమరాజుకు అనుగురాజు అన్నివిధాల సాయం చేస్తాడు. అందుకు ప్రతిఫలంగా భీమరాజు

(మిగతా 77వ పేజీలో...)

# పల్నాటి పౌరుషానికి ప్రతీక నాయకురాలు నాగమ్మ



కోటముఖద్వారంలో నాగమ్మ నిర్మించినట్లు చెబుతున్న మహిషాసురమర్ధని ఆలయం

(76వ పేజీ తరువాయి ...)

తన రాజ్యంలోని కొన్ని ఊళ్ళతో పాటు తన కుమార్తె భూరమాదేవినిచ్చి అనుగురాజు స్థిరపడేటట్లు చేస్తాడు. ఒకనాడు జొన్నవిత్తులు ఇవ్వలేదనే సాకుతో చందోలు పేరమరాజుపైకి ఈదుల పేర్నేడును పంపి బందిస్తాడు. అప్పుడు పేరమరాజు అనుగురాజుతో సంధి చేసుకొని తన సోదరి మైలమదేవిని ఇచ్చి వివాహం చేస్తాడు. భరణంగా చందోలు రాజ్యంలో సగభాగమైన పల్నాడును అనుగురాజుకిస్తాడు. ఈవిధంగా పల్నాడు రాజ్యం పుట్టుక జరిగింది.

## నాగమ్మ పాత్ర

షుమారు 800 ఏళ్ళ నుంచి ఆంధ్రదేశ ప్రజలు విశేషంగా స్తుతిస్తున్న పల్నాటి చరిత్రలో నాగమ్మది ప్రతినాయకురాలి పాత్ర. యుక్తికుయుక్తులతో పల్నాటి రాజ్యంలో వీరవనితగా పేరొందిన నాగమ్మ గుంటూరు జిల్లా దాచేపల్లి వద్ద జిట్టగామాలపాడు గ్రామంవద్ద గల ఒక పొదలో దొరికింది. గ్రామానికి చెందిన చౌదరి రామిరెడ్డి గ్రామం చెంతనే ఉన్న నాగులేటి ఒడ్డున పొలం పనిలో నిమగ్నమై ఉండగా దూరంలో ఒక పసిబిడ్డ ఏడుపు వినిపించింది. రామిరెడ్డి ఏడుపు వినిపించిన ఆవైపు వెళ్ళి పరిశీలించగా ఒక పొదలో గుడ్డలలో చుట్టబడిన ఒక పసికందు ఏడుస్తూ కనిపించింది. దైవం ఇచ్చిన అదృష్టంగా భావించిన పిల్లలు లేని రామిరెడ్డి ఆ పసికందును ఇంటికి తీసుకువచ్చి పెంచసాగాడు. చిన్న వయసులోనే ఎంతో తెలివితేటలు చూపే నాగమ్మ 12 ఏళ్ళకే భారత, భాగవతాలను ఔపోసన పట్టింది. 12 ఏళ్ళకే మేనమామ సింగారెడ్డితో నాగమ్మకు వివాహం జరిగింది. అయితే దురదృష్టవశాత్తు ఏడాదిన్నరకే భర్త సింగారెడ్డి మరణించటంతో నాగమ్మ గ్రామ రాజకీయాల వైపు దృష్టి సారించింది.

అనతికాలంలోనే గ్రామ ఆధిపత్య నాయకురాలి స్థాయికి ఎదిగింది. ఈక్రమంలో ఆమె ఎత్తులకు పై ఎత్తులు వేస్తూ ఎన్నో యుక్తికుయుక్తులు నేర్చింది. చిన్నతనంనుంచే శివభక్తురాలైన నాగమ్మ ఈనాటికీ చరిత్ర సాక్షంగా నిలచిన గామాలపాడు గ్రామం వెలుపల గల శివాలయాన్ని తన తండ్రి రామిరెడ్డి చేత నిర్మింపజేసింది. పల్నాడు ప్రాంతంలో శైవమతాన్ని అభవృద్ధి చేయుటకు సన్నాహాలు ప్రారంభించింది. ఒకనాడు గురజాల ప్రభువులైన అనుగురాజు వేటకు వెళ్ళి అలసిపోయిన సమయంలో ఆయనకు సకల పరిచర్యలు అందించి రాజు మన్ననలు అందుకొని రాజ్యరాజకీయాలలో పాలు పంచుకునే స్థాయికి ఎదిగింది. తన గురువు శైవ మత పరిరక్షణకు గురజాల రాజ్య ప్రధానమంత్రి బ్రహ్మనాయుడిని ఎదుర్కొనేందుకు తగిన భూమికను నిర్మించుకుంది. కాలక్రమంలో అనుగురాజు ముగ్గురు భార్యల బిడ్డలు నలగామరాజు, మలిదేవుడు, పినమలిదేవుడు, బాలమలిదేవుడులలో అనుగురాజు మరణానంతరం పల్నాటి రాజ్యానికి నలగామరాజు రాజయ్యాడు. నలగామరాజుతో ఉన్న చనువు, సాన్నిహిత్యం కారణంగా నాగమ్మ క్రమంగా బ్రహ్మనాయుని ఆధిపత్యానికి గండికొడుతూ వచ్చింది. దీని మూలంగా అన్నదమ్ముల మధ్య విభేదాలు తీవ్ర స్థాయికి చేరి పల్నాడు రాజ్యం

(మిగతా 78 పేజీలో...)



కోటముఖ ద్వారంలో నాగమ్మ నిర్మించినట్లు చెబుతున్న శివాలయం



గ్రామస్థులు నిర్మించినట్లు చెబుతున్న కోటలోని నాగమ్మ ఆలయం

## పల్నాటి పౌరుషానికి ప్రతీక నాయకురాలు నాగమ్మ

(77వ పేజీ తరువాయి ...)

గురజాల, మాచర్ల కేంద్రాలుగా రెండు రాజ్యాలుగా విడిపోయింది. గురజాల నలగామరాజు, నాగమ్మల ఆధిపత్యంలోకి రాగా మాచర్ల మలిదేవుడు, బ్రహ్మన్నల ఆధిపత్యంలోకి వెళ్ళింది. మాచర్ల రాజ్యాన్ని కబళించాలనే పన్నాగంతో సామ, బేద, దాన, దండోపాయాల ఎత్తుగడలు ఆచరించి నాగమ్మ పల్నాటి చరిత్రను రక్తి కట్టించింది. బ్రహ్మనాయుని అనుసరిస్తున్న చాపకూటి సిద్ధాంతం ద్వారా సనాతన ధర్మం ఏరకంగా బ్రష్టు పట్టిపోతుందో దీనిని నిరోధించుటకు బ్రహ్మనాయుని అంతం చేయటం నాగమ్మకు పంతంగా మారింది. బ్రహ్మనాయుని బలహీనతను పసిగట్టి కోడిపందాలకు రప్పించింది.

(మిగతా 79వ పేజీలో...)

# పల్నాటి పౌరుషానికి ప్రతీక నాయకురాలు నాగమ్మ



శిథిలావస్థలో మహిషా సురమర్ధని విగ్రహం

(78వ పేజీ తరువాయి ...)

వ రాయె రా పా య ం త తో బ్రహ్మన్న ఆరోప్రాణంగా భావించే చిట్టిమల్లు (కోడి పుంజు)ను విషం పూసిన కత్తులు కట్టిన తన కోడిపుంజుచే చంపించి మాచర్ల రాజ్యం వారిని అరణ్యవాసానికి పంపింది. అరణ్యవాసం అనంతరం బ్రహ్మనాయుడు నలగామ రాజు అల్లుడైన అలరాజును గురజాలకు రాయబారం పంపించటం జరిగింది. అలరాజును ఒక పండితునిచే విషం కలిపిన తంగేడుపూలను ఆఘ్రాణింపజేసి అలరాజును తన కుయుక్తితో నాగమ్మ మట్టుబెట్టింది. దీనికి చింతితుడైన బ్రహ్మన్న చివరగా తానే సకల యుద్ధ ఏర్పాట్లు చేసుకొని సర్వ సైన్యాధిపతియైన కన్నమదాసుతో కారంపూడికి చేరుకొని అక్కడ జరిగిన భీకర యుద్ధంలో నాగమ్మను ఎదుర్కొనటం జరిగింది. ఈయుద్ధంలో బ్రహ్మనాయుడు కుమారుడైన బాలచంద్రుడు భారతంలో అభిమన్యుని వలె పోరాడి నలగాముని వధించి భార్య మాంచాల చేతుల్లోనే యుద్ధరంగంలో వీరమరణం పొందటం జరిగింది. ఈయుద్ధంలో నలగాముని తరపున తన సోదరి రాజవంశీయులైన కాకతీయులు, మలిదేవుని తరపున హొయసలులు యుద్ధరంగంలోకి తమ సైన్యాలను పంపించటం జరిగింది. ఈవిధంగా పల్నాటి యుద్ధంలో ఆనాటి దక్షిణ భారతంలోని అన్ని రాజ్యాలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాల్గొని దక్షిణభారతంలోని యావత్‌రాజ్యాలు పాల్గొన్న యుద్ధంగా చరిత్రలో నిలిచిపోయింది.

### నాగమ్మ ఆధ్యాత్మిక జీవితం

పల్నాటి రాజకీయాలలో ఎత్తుకు పై ఎత్తులు వేసి యుక్తి కుయుక్తులు పన్ని చక్రం తిప్పి నాయకురాలుగా పేరొందిన నాగమ్మ గామాలపాడు గ్రామానికి వెలుపల తన కోటలో నిర్మించిన మహిషాసురమర్ధని దేవాలయం తన ఆధ్యాత్మిక జీవితానికి సాక్ష్యంగా నిలుస్తుంది. శైవమతాన్ని చిన్నతనం నుంచే ఔపోసన పట్టిన నాగమ్మ అదే కోటలో శివాలయాన్ని నిర్మించింది. నాగమ్మ మరణానంతరం గ్రామస్తులు నిర్మించిన నాగమ్మ ఆలయం నేటికీ నాగమ్మ చరిత్రకు సాక్షంగా నిలిచిపోయాయి.

# తెలుగుతల్లి వెలుగు

తెలుగులోని కమ్మదనం
తెలుగు భాష తియ్యదనం
తెలుగులోని వెలుగులన్నీ
కనిపెంచిన అమ్మదనం
కనిపెంచెడి అమ్మరుణం
వచ్చీ రాని పలుకుల్లో
తొలి అచ్చు అమ్మవరం
ముద్దు ముద్దు మాటల్లో
తొలి మాట అమ్మపదం
అచ్చులలో, హల్లులతో
యాబదారు అక్షరాల
పదములల్లు తెలుగుభాష
తొణుకుచున్న అమృతం
అమ్మా! అను పిలుపులో
అనురాగపు తియ్యదనం
నాన్నా! అను పలుకులో
ఆదరణకు ఆనందం
మమ్మీ, డాడీ యని పిలుచుట
పరభాషని తెలియదా
మనదికాని పరభాషకు
విలువెందుకు ఇవ్వాలి
తెలుగుతల్లి రుణమును
మనమెలా తీర్చాలి?
నాన్నకు తమ్ముడైతే
చిన్నాన్న అని అంటాము
అమ్మకు తమ్ముడైతే
మామయ్య అంటాము
వరుస కుదరని
అంకుల్, ఆంటీలు
మనమధ్యకు చుట్టమై
ఏ దారిన వచ్చారో?
మనవికాని పిలుపులకు
విలువెందుకు ఇవ్వాలి?
సంప్రదాయ రుణమును
మనమెలా తీర్చాలి?
మరువబోకు మాతృభాష
మరువబోకు జన్మభూమి
మరువబోకు తలిదండ్రిని
మరువబోకు నీవారిని

సహజకవి దుబ్బలదాసు

## యూత్ ఫ్రెండ్లీ హెల్త్ సర్వీసెస్ ప్రారంభం

(ఆన్‌లైన్ - గుంటూరు)

జిల్లాలో ఎంపిక చేసిన ఏడు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో నవంబరు నెల నుంచి ప్రయోగాత్మకంగా యూత్ ఫ్రెండ్లీ హెల్త్ సర్వీసెస్ పథకాన్ని ప్రారంభిస్తున్నట్టు చర్కా ప్రాజెక్టు జిల్లా కో ఆర్డినేటర్ ఎం.కాలేబు తెలిపారు. యూనిసెఫ్ సహకారంతో దేశంలోనే తొలిసారిగా యువతీ, యువకుల కోసం ఈ హెల్త్ సర్వీసెస్ ప్రాజెక్టును జిల్లాలో అమలు చేస్తున్నట్టు ఆయన వివరించారు. ఈ పథకం కింద నిజాంపట్నం, పెదకాకాని, మేడికొండూరు, గణపవరం, కొల్లూరు, కారంపూడి, రెడ్డిపాలెం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఎంపిక చేశామని వివరించారు. ప్రతి శుక్రవారం సాయంత్రం యువతీ, యువకుల వ్యక్తిగత, ఆరోగ్య సమస్యలను పరిష్కరించేందుకు కౌన్సెలింగ్ నిర్వహించటం జరుగుతుందని కాలేబు తెలిపారు. ఇందుకోసం కొంతమంది కౌన్సిలర్లను ఈ పిహెచ్‌సిలో నియమిస్తామని చెప్పారు. అదే విధంగా ఆయా ఆరోగ్య కేంద్రాల వైద్యాధికారులకు, సిబ్బందికి ప్రత్యేక శిక్షణ ఇస్తామని తెలిపారు. కౌమార దశలో యువతీ, యువకులలో కలిగే శారీరక, మానసిక మార్పులను వివరించేందుకు ప్రత్యేక కార్యక్రమాలను కూడా ఈ పిహెచ్‌సిల్లో ఏర్పాటు చేస్తామని కాలేబు వెల్లడించారు. జిల్లాలో వేగంగా వ్యాప్తి చెందుతున్న హెచ్‌ఐవి, ఎయిడ్స్‌లను నివారించేందుకు చర్కా పథకం ద్వారా విస్తృతంగా అవగాహనా కార్యక్రమాలను నిర్వహిస్తున్నట్టు ఆయన చెప్పారు. కళాశాల విద్యార్థులకు ఈ వ్యాధి పట్ల అవగాహన కల్పించేందుకు ప్రత్యేకంగా కాలేజ్ టాక్ ఎయిడ్స్ అనే కార్యక్రమాన్ని అమలు చేస్తున్నట్టు కాలేబు వివరించారు.



చర్కా ప్రాజెక్టు కో ఆర్డినేటర్ కాలేబు

# అభినయానికి అర్థం చెప్పిన కళాతపస్వి 'వల్లూరి'



వల్లూరి వెంకట్రామయ్య చౌదరి

(ఆన్‌లైన్, చిలకలూరిపేట రూరల్)

జై కాపాలి... ఈ మాయల పకీరుకిక చావులేదు... అంటూ పిడుగులు కురిపించే గర్జన... అనంతరం అలలు అలలుగా... తెరలు తెరలుగా సాగే భయంకర వికటాట్టహాసం వింటే పసిపిల్లలు జడుసుకుని మంచమెక్కేవారు... గర్భిణీలు భయంతో ప్రసవించేవారట... మాయల ఫకీరుగా ఆంధ్రదేశంలో వేలాది ప్రదర్శనలిచ్చిన ఏకైక నటుడిగా తారీఖులు, దస్తావేజులు లేని కారణంగా గిన్నీస్ బుక్‌లో స్థానం పొందలేకపోయిన కళావతంసుడు వల్లూరి వెంకట్రామయ్య చౌదరి.

బాలనాగమ్మ నాటకాన్ని ఆంధ్రదేశంలోని వీధివీధిన ప్రదర్శించి మాయల ఫకీరు భయానక రూపాన్ని తెలుగువారి గుండెల్లో శాశ్వతంగా ముద్రించిన వల్లూరి వారి ఘనత తెలుగు నాటకరంగ చరిత్రలో సువర్ణాక్షర లిఖితం. నటుడిగా... సమాజ నిర్వాహకుడిగా జీవిత పర్యంతం ఒక ఉన్నత ఆశయ సాధన కోసం శ్రమించిన సహృదయ కళాశీలి. దాదాపు మూడున్నర దశాబ్దాల నటజీవితంలో కొద్దినెలలు మినహాయిస్తే దాదాపుగా ప్రతిరోజు నాటక ప్రదర్శనలిచ్చిన కళాతపస్వి.

వల్లూరి గుంటూరు జిల్లా తెనాలి సమీపంలోని కొలకలూరు గ్రామంలో 1925 మే 11న అంజయ్య, సౌభాగ్యమ్మ దంపతులకు జన్మించారు. వాస్తవానికి వేంకట్రామయ్య గారి ఇంటి పేరు గన్నేవారు. కృష్ణాజిల్లా తోట్లవల్లూరు నుంచి పది తరాల క్రితం కొలకలూరు వచ్చి స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. వల్లూరు వారు అని గ్రామస్థులు నానుడితో వెంకట్రామయ్య తన ఇంటిపేరును వల్లూరుగా స్థిరపరచుకున్నారు. వెంకట్రామయ్య పెదతండ్రి నాగభూషణం దుగ్గిరాల థియేటర్‌లో సభ్యులుగా వ్యవహరించారు. చిన్నతనంలోనే పెదతండ్రి నుండి స్ఫూర్తిని పొంది హైస్కూలు వార్షికోత్సవంలో కృష్ణరాయబారం నాటకంలో దుర్యోధనుని పాత్రను ధరించి ప్రథమబహుమతిని పొందారు.

ఈ ప్రేరణతో చదువుకు స్వస్తి చెప్పి నాటకరంగంలోనికి ప్రవేశించారు.ఎంఎన్ రాయ్, త్రిపురనేని సంస్కరణ వాదాల పట్ల ఆకర్షితుడై వారి ఆశయాలను పద్యాలు, పాటలుగా ఆలపించేవారు. ఈ రూపేణా కొలకలూరు నుండి తెనాలికి రాకపోకలు జరుగుతున్న సమయంలో స్థానం పర్యవేక్షణలో కృష్ణదేవరాయలు నాటకంలో గణపతి పాత్రను ధరించి వారి మెప్పులను పొందారు. మాధవపెద్ది వెంకట్రామయ్య దర్శకత్వంలో రాణీరుద్రమ నాటకంలో హరిహరదేవుని పాత్రను పోషించారు. తొలిదశలో స్థానం, మాధవపెద్ది వంటి మహామహుల శిష్యరికం, సాన్నిహిత్యం వల్లూరుపై బలీయమైన ప్రభావాన్ని చూపాయి.

రామాంజనేయ యుద్ధంలో యయాతి, సక్కుబాయిలో కృష్ణుడు, హరిశ్చంద్రలో నక్షత్రకుడు, చింతామణిలో భవానీ శంకరుడు, తెలుగుతల్లిలో తిక్కన, కురుక్షేత్రంలో కర్ణుడు పాత్రలను పోషించి నటుడిగా ఆంధ్ర దేశంలో విశేషఖ్యాతిని పొందారు. వల్లూరి 1950లో అంధ్ర డ్రమటిక్ అమెచ్యూర్స్ సంస్థను స్థాపించి తొలి నాటకంగా ప్రదర్శించిన బాలనాగమ్మ ఆంధ్ర దేశంలో సంచలనాన్ని సృష్టించింది. ఈ నాటకాన్ని దేశవ్యాప్తంగా 3500ల ప్రదర్శనలిచ్చారు. కవిరాజు త్రిపురనేని సూతపురాణం ఆధారంగా రచించిన రామరావణయుద్ధం నాటకాన్ని దాదాపు 1000 ప్రదర్శినలిచ్చారు. విరామం లేకుండా నాటకాలను ప్రదర్శించడంతో 1957 నుండి 1961 వరకు తీవ్ర అనారోగ్యానికి గురై నాటకాలను ప్రదర్శించలేదు. తిరిగి 1962లో శ్రీ వెంకటేశ్వర నాట్యమండలిని స్థాపించి మోహినీ భస్మాసుర నాటకంతో ఆంధ్రదేశమంతటా పర్యటించారు. పౌరాణిక పాత్రలతో నటుడిగా పరిణతిని పొందిన వల్లూరి పలు సాంఘిక, చారిత్రాత్మక నాటకాలలో నటుడిగా విశ్వరూపాన్ని ప్రదర్శించారు. మోదుకూరి జాన్సన్ రచించిన దేవాలయం నాటకాన్ని పలు పరిషత్తుల్లో ప్రదర్శించి బహుమతులు పొందారు. సాంఘిక నాటకాలలో తలమానికంగా భావిస్తున్న జాన్సన్ నటనాలయం నాటకాన్ని తొలిసారిగా పరిషత్తులో ప్రదర్శించిన ఘనత వల్లూరిదే. ఈ నాటకంలోని కథానాయకుడైన రాజారావు పాత్రను ధరించి

(మిగతా 82వ పేజీలో...)





# అభినయానికి అర్థం చెప్పిన కళాతపస్వి 'వల్లూరి'

(81వ పేజీ తరువాయి...)

గూడూరు సాంస్కృతీ సమ్మేళనం పరిషత్తులో ఉత్తమనటుడి బహుమతిని పొందారు. కళాభారతి పతాకంపై 45 మంది నటులు, సాంకేతిక నిపుణులతో రూపొందించిన జైభవానీ నాటకంలో బాజీ పాత్ర వల్లూరి నటజీవితంలో మణిపూసగా నిలిచింది.

కృష్ణ జాంబవంత యుద్ధంలో జాంబవంతుడు, రంగూన్‌రౌడీలో గంగారాం సేఠ్ పాత్రలతో పాటు మాజీ నైజాం, టూ రాస్కెల్స్, కష్టజీవి, కట్టబ్రహ్మన్న, భక్తశబరి నాటకాలను విస్తృతంగా ప్రదర్శించారు.

వల్లూరుని ఒక నటుడు అనడం కన్నా ఒక వ్యవస్థ అనడం సముచితం. నటుడిగా ఉన్నత హిమాలయమంత ఎదిగినా సహనటులందరి పట్ల కలివిడిగా ఆప్యాయతను చూపేవారు. నటన, నాటకం, ప్రదర్శన అంశాలలో కొన్ని నిర్దిష్టమైన సిద్ధాంతాలు, ఆశయాలు కలిగిన వల్లూరు వారు వాటిని తు.చ. తప్పకుండా ఆచరించేవారు. సమయపాలనకు అధిక ప్రాధాన్యమిచ్చే వల్లూరు రిహార్సల్స్, ప్రదర్శనలను నిర్దేశించిన సమయానికే ప్రారంభించేవారు. నాటక ప్రదర్శనల సమయంలో అగ్రశ్రేణి నటుడనే అహాన్ని విడిచి అందరితో కలసి ఉండేవారు. నాటక సమాజంలోని ప్రతి నటుడి వ్యక్తిగత విషయాలపై వారి మంచి చెడ్డలపై శ్రద్ధ వహించేవారు. నాటకాలను ప్రదర్శించే సమయంలో వచ్చిన కాంట్రాక్టు ధనాన్ని మొత్తంగా తాను తీసుకోక అందరి నటులకు సమానంగా పంచేవారు. సమాజాన్ని నిర్వహించడంలో క్రమశిక్షణ విషయంలో మాత్రం రాజీపడేవారు కాదు. రంగస్థల నటుల్లో సహజ లక్షణంగా నివాసముండే ఈర్ష్య, అసూయ, అహంకారాలను ఏనాడూ దరిచేరనివ్వక నిర్మలం, నిరాడంబరంగా ఉండే సహృదయశీలి.

నటుడిగా ఎంత ఎత్తు ఎదిగినా తన సమాజం ప్రదర్శించే నాటకాలకు ఇతరులను దర్శకులుగా ఎన్నుకొనేవారు. రామరావణయుద్ధం నాటకానికి గుమ్మడి కుటుంబరావు, జై భవానీ నాటకానికి మొక్కపాటి కృష్ణమోహన్ దర్శకత్వం వహించారు. దాదాపు మిగిలిన అన్ని నాటకాలకు రామకుమారి దర్శకత్వం వహించారు. ఎవి సుబ్బారావు, బండారు రామారావు, రేబాల రమణ, నూతక్కి సుబ్బారావు, ఆకుల వెంకయ్య, డివి సుబ్బారావు, కాళిదాసు కోటేశ్వరరావు, లక్ష్మీకాంతం, రామకుమారి, శకుంతల, ఇందిర వంటి నటీనటులు వల్లూరి నాటక సమాజంలో పలు పాత్రలను పోషించారు.

సత్యహరిశ్చంద్ర పాత్రలో ఆంధ్రదేశంలో చిరకీర్తిని పొందిన ఆంధ్రా తాన్‌సేన్ డివి సుబ్బారావు వల్లూరి శిష్యరికంలో రూపుదిద్దుకున్న ఆణిముత్యం. బాలనాగమ్మ నాటకంలో కార్యవర్థిరాజు పాత్ర ద్వారా వల్లూరి డివి సుబ్బారావును ఆంధ్రదేశానికి పరిచయం చేశారు. ఆరున్నర పదులు దాటి వృద్ధాప్యంలో వున్నా 1988లో మద్రాసు వాణీమహల్ ఆడిటోరియంలో అఖిలాంధ్ర కళాకారుల సమాఖ్య సదస్సులో మాయలఫకీరు పాత్రను అద్భుతంగా నటించగా గుమ్మడి, వాణిశ్రీ, అల్లు వంటి సినీనటులు వల్లూరి నటనను వేనోళ్ల కొనియాడారు. నాటకాల ద్వారా ఆర్జించిన ధనాన్ని కుటుంబానికి, వ్యవసాయం ద్వారా సంపాదించిన దానిని నాటకాలకు ఏనాడూ ఖర్చు చేయక సమ్యక్ దృష్టిని పాటించేవారు.

సినిమాలో నటించినా ఒకానొక సంఘటన మూలంగా సినిమా అవకాశాలకు శాశ్వతంగా గుడ్‌బై చెప్పారు. నటుడిగా తొలిదశలో ఉన్నప్పుడు ఉంగరాన్ని అమ్మి సినీ కేంద్రంగా ఉన్న కోయంబత్తూరుకు వెళ్లి సినిమాలో నటించడానికి ప్రయత్నించారు. ఒక సినిమాలో ప్రధాన పాత్రకు ఎంపికై తల్లిదండ్రుల నుంచి లిఖిత అనుమతిని కోరడంతో కొలకలూరు వచ్చారు. సినిమాలలో చేరడానికి తల్లి అంగీకరించక కాంట్రాక్టు పత్రాలను చించివేయడంతో ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నారు. తెలుగు భాషపై మంచి అధికారాన్ని సాధించిన వల్లూరు చక్కని ఉపన్యాసమిచ్చేవారు. కళాకారుల సంక్షేమం కోసం అనుక్షణం ఆరాటపడే వల్లూరి తెనాలి ప్రాంతంలో ఉన్న కళాకారులను సమీకరించి తెనాలి పట్టణ కళాకారుల సమాఖ్య ఆవిర్భావానికి కృషి చేశారు. ఆంధ్రదేశంలో వందలాది ఘనసన్మానాలతోపాటు బళ్లారి రాఘవ అవార్డును పొందారు. భారత రాష్ట్రపతి జ్ఞానీ జైల్ సింగ్, ఎన్‌టిరామారావుచే ఘనసన్మానాన్ని పొందారు.

నటనను వృత్తిగా, ప్రవృత్తిగా, ఆరాధ్యదైవంగా భావించిన వల్లూరి 1990 డిసెంబరు 9వ తేదీన కృష్ణాజిల్లా గుడివాడలో బాలనాగమ్మ నాటకాన్ని ప్రదర్శించిన అనంతరం మేకప్ తీసివేసి పిచ్చాపాటి మాట్లాడుతున్న సమయంలో తీవ్రమైన గుండెపోటుతో నటరాజులో లీనమైపోయారు.

# భక్తజనుల నీరాజనాలందుకున్న బాలకోటేశ్వరుడు

(ఆన్‌లైన్, అమృతలూరు)

జిల్లాలో ప్రసిద్ధి గాంచిన దేవాలయాలలో ఒకటైన అమృతలూరు మండలం గోవాడలోని శ్రీ బాలకోటేశ్వరస్వామి దేవస్థానంకు విశేష చరిత్ర ఉంది. కోటప్పకొండ తర్వాత భక్తజనులు అధిక సంఖ్యలో ఈ శైవక్షేత్రాన్ని దర్శించి తరిస్తుంటారు. సుమారు ఎనిమిది శతాబ్దాల చరిత్ర కలిగిన గోవాడ గతంలో గోవులవాడగా వ్యవహరించినట్లు ఆధారాలున్నాయి. చోళరాజులు వెలనాటిలో కాలు మోపకముందు ఈ ప్రాంతం దగ్గుమిల్లి అనే గ్రామంగా వ్యవహరింపబడేది. కాలక్రమేణా దగ్గుమిల్లి అంతరించి అక్కడున్న శ్రీ సోమేశ్వరస్వామి క్రమేణా మార్పు చెంది నేడు శ్రీ బాలకోటేశ్వరస్వామిగా భక్తజనుల నీరాజనాలందుకుంటున్నాడు. క్రీ.శ. 11వ శతాబ్ధాంతంలో సనదవోలు (నేటి చందోలు) రాజధానిగా వెలనాడును మొదటి గొంకరాజు పాలించేవాడు. జైన మతాభిమాని అయిన గొంకరాజు తన రాజ్యంలో జైనులకు సకల సౌకర్యాలు ఏర్పాటు చేస్తుండటంతో దగ్గుమిల్లిలో కూడా అనేక మంది జైనులు వసతులేర్పరచుకుని పాడి పంటలతో సుఖంగా జీవించారు. 12వ శతాబ్ది ఉత్తరార్థంలో వెలనాటి రెండో ప్రభువు చోడ భూపతి బౌద్ధ మతాభిమాని అయినప్పటికీ తన రాజ్యంలో బౌద్ధ, జైనులకు సమాన గౌరవాన్ని ఇచ్చేవారు. ఆయన పాలనా కాలంలో వీరశైవ మతాచార్యుడైన మల్లిఖార్జున పండితారాధ్యులు తన శిష్యులతో సంచారం చేస్తూ రాజుల ఆస్థానాలు, బౌద్ధారామాలు, జైన వసతులలో తన వాద ప్రతివాద నైపుణ్యంతో పండితులతో పోటీ పెట్టుకుని ఓడించి వీరశైవ దీక్షను బలవంతంగా విధిస్తూ విజయయాత్ర సాగిస్తుండేవాడు. వీరశైవులు, బౌద్ధుల మధ్య గొడవలు చెలరేగగా వీరశైవులు సనదవోలు నుంచి వచ్చి దగ్గుమిల్లిపై పడి అరాచకం సృష్టించారు. దీనితో భయపడిన జైనులు దూరంగా ఉత్తరాన ఉన్న బీళ్ళలో పశువులను ఉంచి చావిళ్ళు వేసుకుని నివసించేవారు. గోవులను ఉంచిన ఆ ప్రాంతమే నేటి గోవాడ గ్రామం. 13వ శతాబ్దంలో సనదవోలు (నేటి చందోలు)లో ఉన్న మంచన కవి తన కేయూరబాహు చరిత్రలో దగ్గుమిల్లి గురించి వివరించారు. దగ్గుమిల్లిలోని సోమేశ్వరాలయం చిన్నబోగా క్రమంగా ప్రజలందరూ ఊరు విడిచి వెళ్ళిపోవటంతో దగ్గుమిల్లిపాడు అయింది. 14వ శతాబ్దంలో వెలనాటి చోళుల పాలన అంతరించగా పెదకోమటి వేమారెడ్డి చందోలు సింహాసనం ఎక్కారు. ఈ కాలంలో ప్రముఖ కవి శ్రీనాధ కవి సార్వభౌముడు దగ్గుమిల్లికి చెందిన తిప్పన్న కుమార్తెను వివాహమాడి సోమేశ్వర స్వామిని అర్చిస్తూ 'శృంగార నైషధం' రచించాడని తెలుస్తున్నది. కాలక్రమేణా దగ్గుమిల్లి శిథిలమై సమీపంలోని గోవాడగా అభివృద్ధి చెందింది. కాలచక్ర గమనంలో 20వ శతాబ్దం వచ్చింది.

బ్రాహ్మణకోడూరుకు చెందిన కూచిపూడి తిరుపతిరాయుడు గుంటూరు - బుడంపాడు మధ్యలో బాటసారులకోసం చెరువు త్రవ్వించే కార్యక్రమానికి విరాళాలకై గోవాడ వచ్చాడు. గోవాడలో విరాళాల పని చూసుకుని కావూరు వెళ్ళి విరాళాలు సేకరించి తిరిగి వస్తూ మార్గ మధ్యంలోని సోమేశ్వరస్వామి శిథిలావశేషాలను సందర్శించాడు. భక్తి పారవశ్యంతో ఆ రాత్రి అక్కడే నిదురించిన ఆయనకు కలిగిన ఈశ్వరప్రభోధం మేరకు 1904లో గోవాడ గ్రామస్తులు బుచ్చమ్మ, మాచమ్మ, ఆలపాటి దేవయ్య, రామినేని కామయ్య, పావులూరి వెంకయ్య, తోట ఆదెయ్య, గోవాడ బుచ్చికృష్ణయ్య, తుమ్మల బాపయ్య, పావులూరి రంగయ్య, హనుమయ్య, బాపయ్య, రెడ్డియ్య, కాట్రగడ్డ సూర్యనారాయణ, ఉప్పల పెదపిచ్చయ్యల సహకారంతో ఆలయ నిర్మాణం గావించి 1907 ఏప్రిల్ 25న ప్రతిష్ట చేశారు. ఆనాటి నుంచి ప్రతి ఏటా మహాశివరాత్రికి ప్రభలు కట్టుకునివచ్చి ఉత్సవాలు నిర్వహించటం మొదలుపెట్టగా క్రమేణా వైభవంగా జరగటం మొదలయింది.

1986లో గ్రామస్తులు ఆలయానికి ఈశాన్యంగా అష్టకోణాకారంలో నవగ్రహాలయాన్ని నిర్మించారు. ఇలాంటి ఆలయం

(మిగతా 85వ పేజీలో...)



శ్రీ బాలకోటేశ్వర స్వామి ఆలయానికి ఈశాన్య దిక్కులో విశిష్ట రీతిలో నిర్మించిన అష్టకోణ నవగ్రహాలయం

# భక్తజనుల నీరాజనాలందుకున్న బాలకోటేశ్వరుడు

(85వ పేజీ తరువాయి...)

తమిళనాడులోనే ఉందని తెలుస్తోంది. 1993లో గ్రామస్తులు ఆలపాటి శివకుమార్, సుబ్బుకృష్ణ, జయదేవ్, శ్రీకృష్ణకుమార్ సోదరులు 50 వేల రూపాయిల విరాళంతో ఆలయానికి ముఖ మండపాన్ని నిర్మించారు. సుమారు లక్షల రూపాయిలతో కార్యాలయ భవనాన్ని విస్తరించారు. ఆలయం లోపల వీరభద్రస్వామి, బాలకోటేశ్వర స్వామి, పార్వతి అమ్మవార్ల గర్భాలయాలను లక్షా 20వేల రూపాయిలతో గ్రానైట్‌తో శోభాయమానంగా తీర్చిదిద్దారు. ఈ ఏడాది గ్రామస్తుల విరాళాలు ఆరు లక్షల రూపాయలతో ఆలయ ప్రాంగణంలో అభయాంజనేయ స్వామి ఆలయాన్ని పునర్నిర్మించారు. ద్వాదశ జ్యోతిర్లింగాల శిలాఫలకాన్ని, ముఖద్వారాన్ని ఏర్పాటు చేశారు. ఆలయం వద్ద వాస్తుకు అనుగుణంగా ఫ్లోరింగ్ జరిపారు. గతంలో తొమ్మిదేళ్ళ పాటు ఈ ఆలయానికి ట్రస్ట్‌బోర్డు లేని కారణంగా అభివృద్ధి నిలిచిపోయింది. ట్రస్ట్‌బోర్డు ఏర్పడిన అనంతరం జరిగిన కృషి కారణంగా ఆరు లక్షల రూపాయల మేరకు అభివృద్ధి కార్యక్రమాలు నిర్వహించారు. ఈ ఆలయం వద్ద మరిన్ని అభివృద్ధి కార్యక్రమాలు జరిపేందుకు దాతలు ముందుకు వస్తున్నారు. జిల్లాలో ఇతర శైవక్షేత్రాలలో మహా శివరాత్రి పర్వదిన తిరునాళ్ళ ఒకటి రెండు రోజులకు పరిమితం కాగా గోవాడ తిరునాళ్ళ వారం రోజుల వరకు భక్తులు, సందర్శకులతో రద్దీగా ఉంటుంది.

1935 నుంచి 20 సంవత్సరాల పాటు ఆలపాటి సూర్యనారాయణ ఆధ్వర్యంలో పశు ప్రదర్శనలు, ఎడ్ల పందాలు ఘనంగా జరిగాయి. శివరాత్రి నాడు ఆలయానికి వచ్చే మార్గం గోవాడ గ్రామం నుంచి ఆలయం వరకు గతంలో ఉన్న మెటల్ రోడ్డును పూర్తిగా తారు రోడ్డుగా మార్చారు. గ్రామంలోని ఆర్‌అండ్‌బి రోడ్డు నుంచి పశు వైద్యశాల వరకు సిమెంట్ రోడ్డు నిర్మించారు. అదే విధంగా పొన్నూరు, చెరుకుపల్లి, తెనాలి, అమృతలూరు నుండి ఆలయానికి వెళ్ళే రహదారులన్నీ ప్రభుత్వం బ్రహ్మాండంగా నిర్మించడంతో రహదారుల సమస్య తీరింది. కాని, కాలంతో పాటు ప్రజలలో వచ్చిన మార్పు ఫలితంగా తిరునాళ్ళ సందడి తగ్గిపోతున్నది.



ఆలయం వద్ద పునర్నిర్మించిన అభయాంజనేయ స్వామి ఆలయం



ఆలయం వద్ద నిర్మించిన ముఖద్వారం

# భక్తుల కొంగు బంగారం చలివేంద్ర ఆంజనేయస్వామి

(ఆన్‌లైన్-వినుకొండ)

వినుకొండ పట్టణప్రజల ఇలవేల్పు, పిలిచిన పలికేదేవుడుగా ప్రసిద్ధిగాంచి 100 సంవత్సరాల చరిత్ర కలిగిన శ్రీ చలివేంద్ర ఆంజనేయస్వామి భక్తుల కోర్కెలు తీరుస్తూ కొంగుబంగారమై నిలిచాడు. భక్తునికి స్వప్నమందు కనబడి తాను స్వయంభువుగా పొలమందు నిక్షిప్తమైవునట్లు తనకు పూజాదికములు గావించమని చెప్పగా ఆభక్తుడు స్వామి చెప్పిన స్థలమును త్రవ్వగా స్వామి విగ్రహం లభించింది. ఆ భక్తుడు తన పొలమును కూడా స్వామికి ఇచ్చి భక్తిని చాటుకున్నాడు. తరువాత రాయప్రోలు సీతారామయ్య తనకు చెందిన పొలాలు, ఇళ్ళు 1935లో స్వామివారికి ఆస్తులు దారాదత్తం చేస్తూ వీలునామా వ్రాశారు. అప్పట్లో ఈ గ్రామంలో మంచినీటికి చాలా ఇబ్బందిగా ఉండటంతో బ్రాహ్మణునిచే మంచినీరు పోయించుటకు చలివేంద్రం ఏర్పాటుచేసి అందుకుగాను కొంత భూమిని ఏర్పాటుచేశారు. ఆవిధంగా చలివేంద్రం ఏర్పడటం ప్రతి ఎండాకాలం చలివేంద్రం పెట్టడం మూలంగా చలివేంద్ర ఆంజనేయస్వామిగా స్వామిపేరు నిలిచిపోయింది. ఈ చల్లనిస్వామి ఆస్తులు దేవాదాయశాఖ కలుపుకున్న తరువాత దేవాలయంలో



కార్యక్రమాలు ఆగిపోయాయి. 1967 తుఫానుకు స్వామివారి దేవాలయ మండపం కూలిపోయింది. నిత్య నైవేద్య దీపారాధనలు మాత్రం జరుగుతున్నాయి. ఆతరువాత అర్చకత్వ బాధ్యతలు చేపట్టిన చంగవల్లి వెంకట శ్రీరామచంద్ర బాబు నేతృత్వంలో సనిశెట్టి గురు రామారావు, పువ్వాడ రామలింగేశ్వర రావులు కన్వీనర్లుగా తాతా వెంకట శివరమేష్ బాబు చైర్మన్‌గా కమిటీ ఏర్పడి ఆలయ పునరుద్ధరణ చేయడంతో స్వామికి పునర్వైభవం ఏర్పడింది. దేవాలయంలో భక్తుల సహాయ సహకారములతో దసరా నవరాత్రి ఉత్సవములు, కార్తీకమాసం, ధనుర్మాసం విశేష పూజలు, హనుమజ్జయంతి వంటి అనేక కార్యక్రమాలతో నిత్యకల్యాణం, పచ్చతోరణంగా దేవాలయం విశేషంగా అభివృద్ధి చెందుతున్నది. వివాహం, విద్య, సంతానం వంటి విషయాలలోను విదేశీయానం కోరేవారి విషయంలోను స్వామి అనుగ్రహం మెండుగా ఉండటంతో ఆశించినవారు స్వామికి ప్రదక్షిణలు, ఆకుపూజలు చేసుకుని తమకోర్కెలు తీర్చుకుంటున్నారు. ఆస్తిమొత్తం దేవాదాయశాఖ ఆధీనంలో ఉండి వారినుంచి అతిస్వల్ప సహాయం అందటం భక్తులపై ఆధారపడి కార్యక్రమాలు నిర్వహించటం కష్టంగా ఉందని కమిటీ సభ్యులు వాపోతున్నారు. దేవాలయ ఆస్తులు తమకమిటీకి అప్పగించిన దేవాలయ అభివృద్ధి విశేషంగా చేయగలమని స్థానిక ఎమ్మెల్యే, పెద్దల ద్వారా ఈప్రయత్నం చేయాలనుకుంటున్నట్లు వారు చెప్పారు.

పట్టణంలో అనేక ఆంజనేయ స్వామి దేవాలయాలు ఉన్నప్పుడు తూర్పుముఖంగా సూర్యునికి నమస్కరిస్తూ ఉన్న ప్రసన్నాంజనేస్వామి దేవాలయం ఇది ఒక్కటే కావడం విశేషం. దేవాలయానికి ధర్మకర్తగా వ్యవహరిస్తున్న కంచర్ల సూర్యనారాయణ శర్మ వృద్ధాప్యం వల్ల దేవాలయ ఆస్తులను దేవాదాయశాఖకు అప్పగించారు. 1970 వరకు వారణాశి మల్లయ్య అర్చకత్వంలో స్వామివారు వైభవంగా వెలుగొందారు.

ప్రతి మంగళవారం, శనివారం రెండుపూటలా విశేషపూజలు, భజనలు జరిగేవి. ఆస్తులు ప్రభుత్వ స్వాధీనం కావటంతో అవి మూతపడ్డాయి. 1975-78 మధ్య అర్చక యీనాములు నిత్యనైవేద్య దీపారాధనకు ఏర్పాటుచేసిన భూములు కూడా దేవాదాయశాఖ స్వాధీనం చేసుకుని అర్చకత్వ బాధ్యతలు నిర్వహిస్తున్న చంగవల్లి వెంకటేశ్వర్లుకి నామమాత్రంగా నెలకు రూ.100ల గౌరవభృతిగా, అదేజీతం పడితరంగా ఇచ్చారు. అదికూడా నెలలు, సంవత్సరాల తరబడి ఇవ్వకుండా ఉండటంతో జీవనం కొనసాగక అర్చకస్వామి ఇతర మార్గాలు వెతుక్కొనవలసిన పరిస్థితి ఏర్పడటంతో ఆస్తులన్నీ ప్రభుత్వం తీసుకున్నది. గ్రామస్తుల నిర్లిప్తత కారణంగా నిత్యనైవేద్య దీపారాధనలు మాత్రం జరుగుతూ మిగిలిన కార్యక్రమాలు జరగక వైభవం కోల్పోయి జీర్ణావస్థకు చేరుకుంది.

# కనుమరుగవుతున్న చరిత్రకు సజీవ సాక్ష్యం 'చేబ్రోలు'

(ఆన్‌లైన్, చేబ్రోలు)

ప్రభుత్వం విస్మరించిన చారిత్రక ప్రదేశాలలో జిల్లాలోని చేబ్రోలు ఒకటి. ఇక్కడ ఉన్న ఆలయాలు, శాసనాలు, లభ్యమైన పురాతన వస్తుసామాగ్రి, రాజ శాసనాలను పరిశీలిస్తే చేబ్రోలుకు కొన్ని వేల సంవత్సరాల చరిత్ర ఉన్నట్టు తెలుస్తోంది. పురాతన సంప్రదాయాలకు, ప్రాచీన కళలకు పుట్టినిల్లు భారతదేశం. అనేక మంది రాజులు, చక్రవర్తులు శతాబ్దాలుగా దేశంలోని వివిధ ప్రాంతాలను రాజధానులుగా చేసుకుని రాజ్యాలు ఏలారు. రాజులు, రాజ్యాలు కాలగర్భంలో కలిసిపోయినా అప్పటి కట్టడాలు గత వైభవానికి చిహ్నాలుగా ఇప్పటికీ మనల్ని ఆకట్టుకుంటున్నాయి. దేశంలోని పలు ప్రాంతాలలో ఉన్న పురాతన కట్టడాలను, చారిత్రాత్మక ప్రదేశాలను పర్యాటక కేంద్రాలుగా ప్రభుత్వం గుర్తించింది. ఇటువంటి ప్రదేశాలలో ఉన్న ఏ కట్టడాలను పరిశీలించినా అవి మనకు



ప్రసిద్ధిచెందిన చతుర్ముఖ బ్రహ్మదేవాలయం

అనేక కథలు చెబుతాయి. ప్రభుత్వం, పురాతన వస్తు పరిశోధనా శాఖ చేపట్టిన పరిశోధనల్లో అనేక నిజాలు వెలుగులోకి రావడంతో వివిధ ప్రాంతాలు ప్రముఖ పర్యాటక కేంద్రాలుగా భాసిల్లుతున్నాయి.

చేబ్రోలులో ఉన్న ఆలయాలు, శాసనాలు, లభ్యమైన పురాతన వస్తు సామాగ్రి, రాజశాసనాలను పరిశీలిస్తే కొన్ని వేల సంవత్సరాల చరిత్ర ఉన్నట్టు తెలుస్తోంది. చేబ్రోలు పల్లవుల కాలంలో తాంబ్రవ, తాంబ్రపురి అని, ఆ తర్వాత చాళుక్యుల కాలంలో జయవోలు, జయబాలుగా పిలువబడేదని, కాలక్రమేణా చేబ్రోలుగా మారిందని చరిత్ర చెబుతున్నది. ఇక్కడ గతంలో శాతవాహన, రోమన్ చక్రవర్తి కాన్‌స్టైన్, ఇక్ష్వాక నాణాలు లభ్యమయ్యాయి. క్రీస్తుపూర్వం రెండు వందల సంవత్సరాల క్రితమే ఆంధ్రులు సముద్రయానంలో ఆరితేరారని నిరూపించగల నాణాలు ఇక్కడ లభ్యమయ్యాయి. చేబ్రోలు ప్రాంతం మొదట ప్రముఖ బౌద్ధ క్షేత్రంగా అలరారింది.

## ఒకనాటి శైవక్షేత్రం...

ఇక్కడ లభించిన నాణాలను బట్టి చూస్తే ఈ ప్రాంతం కొంత కాలం శాతవాహనుల పాలనలో ఉన్నట్టు తెలుస్తోంది. ఆ తరువాత జైనులు కొన్నాళ్ళు చేబ్రోలును పాలించారు. విష్ణుకుండినుల కాలంలో బౌద్ధ, జైన ధర్మాలపై దాడి జరిగింది. ఒకటవ మాధవవర్మ అమరావతి స్తూపాన్ని ధ్వంసం చేసి శైవ మత వ్యాప్తికి కృషి చేశాడు. ఇదే కాలంలో చేబ్రోలులో శైవమతం వ్యాప్తిచెందింది. తూర్పు చాళుక్య రాజైన యుద్ధమల్లుడు చేబ్రోలును రాజధానిగా చేసుకుని కొన్నేళ్ళు ఏలారని తెలుస్తోంది. ఈ కాలంలో చేబ్రోలును శ్రీశైవ క్షేత్రంగా తీర్చిదిద్దాడు. అనేక దేవాలయాలు నిర్మించి, పలు జాతరులు చేశారు. మహాసేనుని జాతరలో చేబ్రోలు నుంచి బెజవాడ వరకు ఊరేగింపు జరిగినట్టు యుద్ధమల్లుని జెజవాడ శాసనాన్ని బట్టి తెలుస్తోంది. కొంతకాలం పశ్చిమ చాళుక్య నరేంద్రుడైన ప్రత్యాశ్రయుని విడిది నగరంగా చేబ్రోలు వర్ధిల్లింది. కాకతీయ గణపతి సైన్యాధ్యక్షుడైన జాయపసేనాని చేబ్రోలును ప్రధాన కేంద్రంగా చేసుకున్నారు. ఆయన తోబుట్టువులైన నారాంబ, పేరాంబలను గణపతిదేవుడు వివాహమాడాడు. వెలమనాటి చోళులకు సైనిక కేంద్రంగా కూడా భాసిల్లింది. క్రీ.శ. 1570లో గోల్కొండ ఇబ్రహీం కులీకుతుబ్‌షా కొండవీటిని జయించిన పిదప

(తరువాయి 88వ పేజీలో)

# కనుమరుగవుతున్న చరిత్రకు సజీవ సాక్ష్యం 'చేబ్రోలు'

(87వ పేజీ తరువాయి)

చివరిగా తూర్పు ఇండియా వర్తక సంఘం వారు ఆంగ్లేయులు చేబ్రోలుపై ఆధిపత్యం చెలాయించారు.

## కాశీలో తప్ప మరెక్కడా లేనన్ని ఆలయాలు

చేబ్రోలు గుంటూరుకు 14 కిలో మీటర్ల దూరంలో గుంటూరు-పొన్నూరు రహదారిపై ఉంది. ఇక్కడ నూటొక్క దేవాలయాలు, నూటొక్క బావులు ఉండేవని ప్రతీతి. కాలగర్భంలో కొన్ని శిథిలం కాగా, మరికొన్ని దేవాదాయ శాఖ ఆధీనంలో ఉన్నాయి. ఇక్కడున్నన్ని ఆలయాలు భారతదేశంలో కాశీలో తప్ప మరెక్కడా లేవు. ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా బ్రహ్మదేవాలయం చేబ్రోలులో మాత్రమే ఉంది.

## ముచ్చటైన విమాన గోపురం, ఆదికేశవాలయం

చేబ్రోలులోని ఆలయాలలో అతి పురాతనమైనది ఆదికేశవ ఆలయం. ఒకే ప్రాంగణంలో ఆదికేశవ, రాజ్యలక్ష్మి, ప్రసన్నాంజనేయస్వామి ఆలయాల నిర్మాణం జరిగింది. వీటిని పల్లవ రాజులు నిర్మించారు. తొమ్మిదో శతాబ్దంలో ఈ ఆలయాలను నిర్మించినట్టు తెలుస్తోంది. ఈ ఆలయానికి మిగతా ఆలయాల నిర్మాణానికి వ్యత్యాసం ఉంది. ఆదికేశవ ఆలయం పైన నిర్మించిన విమాన గోపురం ఎంతో చూడముచ్చటగా ఉంటుంది. ఈ ఆలయాల ప్రధాన దారిలో పెద్ద గాలిగోపురం నిర్మాణానికి శ్రీకారం చుట్టి పల్లవులు మధ్యలోనే నిలిపినట్టు తెలుస్తోంది. పెద్ద బండరాళ్ళతో అసంపూర్తిగా ఉన్న గోపుర ద్వారం ఇప్పటికీ ఉంది. ముక్కోటి ఏకాదశినాడు ఈ ద్వారాన్ని తెరుస్తారు.

## అరుదైన బ్రహ్మదేవాలయం

బ్రహ్మదేవునికి శాపం కారణంగా భూలోకంలో పూజలు జరగవు. ప్రపంచంలో ఎక్కడా కూడా బ్రహ్మదేవాలయం లేదు. అయితే చేబ్రోలులో బ్రహ్మదేవుడిని లింగాకారంలో మలిచి ప్రతిష్ఠించారు. దీనిని 18వ శతాబ్దంలో రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు నిర్మించాడు. నాలుగు వైపులా నాలుగు ముఖాలతో లింగాకారంలో బ్రహ్మదేవుడున్నాడు. కనుక 'చతుర్ముఖ బ్రహ్మలింగేశ్వరుడు' అని అంటారు. బ్రహ్మదేవుడిని ఇక్కడ అష్ట (ఎనిమిది) దిక్కుల దిగ్బంధనం చేశారు. బ్రహ్మ ఆలయానికి ముందు, వెనుక శైవ, ఇరుప్రక్కలా వైష్ణవ ఆలయాలు నిర్మించారు. అదేవిధంగా నాలుగు మూలలా నాలుగు దేవతా మూర్తుల ఆలయాలను నిర్మించారు. ఈ ఆలయం పర్యాటకులను విశేషంగా ఆకట్టుకుంటుంది.

## ఎత్తయిన గాలిగోపురం, నాగేశ్వరాలయం

క్రీస్తు శకం 14వ శతాబ్దంలో చేబ్రోలుకు గ్రామాధికారులుగా ఉన్న కంతెన్న, మూర్తన్న అనే ఇరువురు సోదరులు నాగేశ్వరాలయాన్ని నిర్మించారు. ఆలయానికి ముందున్న అతి పెద్ద గాలి గోపురం కన్నుల విందుగా విస్తోంది. ఈ ప్రాంతంలో గల అతి ఎత్తయిన కట్టడంగా చట్టుపక్కల గ్రామాలకు సైతం కనిపిస్తుంది. ఆలయంలో దసరా, శివరాత్రి మహోత్సవాలు ఘనంగా నిర్వహిస్తారు. మహాశివరాత్రికి స్వామివారి కళ్యాణం అనంతరం రథోత్సవం జరుగుతుంది. చేబ్రోలులో గల రథం జిల్లాలో కెల్లా అతిపెద్దది. నాగేశ్వరాలయం ముందు నవగ్రహాలను ప్రతిష్ఠించారు. పక్కనే ఉన్న ఏకశిలానంది విశేషంగా ఆకట్టుకుంటుంది. ఈ పరిసర ప్రాంతాలలో లేనంత సైజులో ఒకే ఎర్రరాతితో నందిని మలచి ప్రతిష్ఠించారు. చేబ్రోలులో గల ఆలయాలలో భీమేశ్వరాలయానికి ఓ విశిష్టత ఉంది. ఈ ఆలయాన్ని ఎవరు నిర్మించారు అనే విషయంలో పలు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తుంటారు. ఒకటవ చాళుక్య భీముడు బౌద్ధ చైత్యమును ధ్వంసం చేసి భీమేశ్వరాలయం నిర్మించాడని, ఆ తరువాత కాకతీయ రాజు గణపతి దేవుని సైన్యాధ్యక్షుడు జాయప సేనాని పునర్నిర్మాణం జరిపాడని అంటుంటారు. అయితే, ఈ ఆలయం రథాన్ని పోలి ఉంటుంది. రెండంతస్తులుగా దర్శనమిస్తుంది. 1957లో జరిగిన త్రవ్వకాలలో కింది అంతస్తు రహస్య ద్వారాలు, తలుపులు బయట పడ్డాయి. ఆలయం కింది పక్కగా ఇరువైపులా రెండు ద్వారాలు

(తరువాయి 90వ పేజీలో)

చారిత్రాత్మకమైన ఆదికేశవ స్వామి దేవాలయం





లింగాకారంలో మలచిన చతుర్ముఖ బ్రహ్మ లింగేశ్వర స్వామి



అతి ప్రాచీనమైన ఎర్ర రాతి నంది



# అక్షరజ్యోతి 'ఆంధ్రజ్యోతి'కి అభినందనలతో...


శ్రీమతి సోనియాగాంధి
ఎఐసిసి అధ్యక్షురాలు


శ్రీ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రివర్యులు


శ్రీ కెవిపి రామచంద్రరావు
రాష్ట్ర ప్రభుత్వ సలహాదారు


శ్రీ కె. కేశవరావు
పిసిసి అధ్యక్షులు


శ్రీ తాడిశెట్టి వెంకటరావు
శాసనసభ్యులు, గుంటూరు-2










ప్రజాపత్రికగా ఎనలేని అభిమానాన్ని సంపాదించుకున్న **'ఆంధ్రజ్యోతి'** దినపత్రిక అభివృద్ధి దిశలో పయనిస్తూ **3** వసంతాలు పూర్తి చేసుకున్న శుభతరుణంలో **'ఆంధ్రజ్యోతి'** యాజమాన్యానికి, సిబ్బందికి మా హృదయపూర్వక శుభాకాంక్షలు.





పార్టీ కార్యకర్తలకు, ప్రజలకు, శ్రేయోభిలాషులకు దీపావళి శుభాకాంక్షలు తెలియజేస్తూ.. ఈ దీపావళి మీకు సకల శుభాలు కలుగజేయాలని కోరుకుంటూ...



## తాడిశెట్టి మురళీమోహన్
డిప్యూటీ మేయర్, గుంటూరు

# అంతరించిపోతున్న మడ అడవులు

(ఆన్‌లైన్-బాపట్ల)

తుపాన్ల తీవ్రత తగ్గించేందుకు... తీరప్రాంతాల భూగర్భ జలాలు క్షార మయం కాకుండా కాపాడేందుకు... వివిధ పక్షిజాతులు, క్రిమికీటకాదులు, చేపలు వృద్ధి చెందేందుకు... దోహద పడుతున్న 'మడ' చెట్లను తీర ప్రాంతంలో విచక్షణా రహితంగా నరికి వేస్తున్నారు. కాకినాడ నుంచి ప్రకాశం జిల్లా చినగంజాం వరకు తీరప్రాంతంలో దట్టంగా పెరిగి మట్టికోతను నివారిస్తూ, భూగర్భ జలాలు ఉప్పునీరుగా మారకుండా ఈ 'మడ' చెట్లు కాపాడుతున్నాయి. మడ చెట్లు సముద్ర తీరాల్లో ఉష్ణ మండలాల్లో అధికంగా వ్యాప్తిచెందుతాయి. ఇవి వాతావరణ సమతౌల్యాన్ని కాపాడుతూ మనుషులకు, పక్షులకు, చేపలకు జీవనాధారాన్ని కల్పిస్తున్నాయి. తీర ప్రాంతాల్లో ఈ చెట్లు అవాస కేంద్రాలై గొప్ప వైవిధ్యాన్ని ప్రదర్శిస్తున్నాయి. అనేక పక్షి, మత్స్యజాతులకు ఈ అడవులు జన్మస్థావరాలు. వీటి వల్ల మత్స్యసంపద వృద్ధిచెంది మత్స్యకారులకు జీవనాధారం లభిస్తోంది. ఇలాంటి అమూల్యమైన మడ అడవులను వంట చెరకు, చేపలు, రొయ్యల చెరువుల సాగు కోసం విచక్షణా రహితంగా నరికి వేస్తున్నారు. తమకు పరోక్షంగా జీవనోపాధి కల్పిస్తున్న విషయాన్ని గ్రహించలేక మత్స్యకారులు సహితం ఈ చెట్లను నరికి వంట చెరుకుగా, స్నానపు గదుల చుట్టూ ప్రవారీలా దడులు కట్టుకుంటున్నారు. జిల్లాలో నిజాంపట్నం నుంచి బాపట్ల వరకు 30 కిలోమీటర్ల విస్తీర్ణంలో వ్యాపించి వున్న మడ అడవులు దశాబ్దకాలంగా నరికివేతకు గురవుతున్నాయి. నిజాంపట్నం, అడవుల దీవి, రేపల్లె, కర్లపాలెం మండలాల్లో నరికివేతతో పాటు అక్రమణలకు గురయ్యాయి. ప్రస్తుతం మిగిలివున్న మడ చెట్లు బాపట్ల మండలం ముత్తాయపాలెం ఫారెస్టు, సూర్యలంక రేవులలో రోజూ వంటచెరకు కోసం నరికివేస్తున్నారు. అయినా అటవీశాఖ ప్రేక్షక పాత్ర వహిస్తోంది. కొందరు మడచెట్ల కలపతో, పుల్లలతో పట్టుపడినా ఫారెస్టు గార్డులు వారి వద్ద ముడుపులు అందుకుని మౌనం వహిస్తున్నారు.

రాష్ట్రంలో 23 శాతం అటవీ ప్రాంతం ఉంటే, అందులో ఒక శాతం మాత్రమే మడ అడవులు ఉన్నాయి. తూర్పుగోదావరి జిల్లా బంటుమిల్లి, కోరింగ ప్రాంతాల్లో కాకినాడ సముద్రతీరంలో మొత్తం సుమారు 30 వేల హెక్టార్లలో మడ చెట్లు ఉన్నాయి. గుంటూరు జిల్లాలో 1997 ముందు 16 వేల హెక్టార్లలో మాత్రమే మడ చెట్లు కనిపిస్తున్నాయి. ఈ చెట్ల నరికివేతను ఆరికట్టాలంటే ప్రభుత్వం వేల రూపాయలు జరిమానా విధించాలి. లేదా కారాగార శిక్ష వేయాలి. అవనిగడ్డ ప్రాంతంలో మాదిరిగా ఆక్రమణల్ని తొలగించి నిజాంపట్నం, బాపట్ల, రేపల్లె ప్రాంతాల్లో మడచెట్ల అభయారణ్యాలు పెంచాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది. తరచూ తుపాను తాకిడులను ఎదుర్కొంటున్న పై ప్రాంతాలలో మడచెట్లను అభివృద్ధి చేయాల్సిన బాధ్యత అటవీ శాఖ అధికారులపై ఎంతైనా ఉంది. ప్రజలకు సహకారం లేనిదే ఈ కార్యక్రమం విజయవంతం కాదు. ఇందుకు ప్రభుత్వం, స్వచ్ఛంద సేవాసంస్థలు అటవీ సంరక్షణ, పర్యావరణం, ప్రత్యామ్నాయ ఇంధన వనరుల గురించి తీర ప్రాంత గ్రామాల ప్రజలకు వివరించి వారిని చైతన్యవంతుల్నిచేసే కార్యక్రమాల్ని ముమ్మరం చేయాల్సి వుంది.


చెట్లను నరికివేసిన దృశ్యం

## విచక్షణారహితంగా మడచెట్ల నరకివేత

కర్లపాలెం మండలంలోని పేరలి, తుమ్మలపల్లి, పెదపులుగువారిపాలెం, పెదపులుగువారిపాలెం శివారు పామర్తి గ్రామాల సముద్రతీరంలో మడచెట్లను కొందరు తమ స్వార్థ ప్రయోజనాలకు విచక్షణారహితంగా నరికివేస్తున్నారు. రెండు, మూడేళ్ళ క్రితం సుమారు 450 హెక్టార్లకు పైగా గ్రామాలలో విస్తారంగా పెరిగిన మడఅడవులు వాతావరణ కాలుష్యాన్ని ఆరికట్టడంతోపాటు, వాతావరణ సమతౌల్యాన్ని కాపాడుతూ తుపాను తాకిడిలను సమర్థవంతంగా ఎదుర్కొని తీరప్రాంత గ్రామప్రజలకు ఎంతగానో మేలు చేకూర్చాయి. మత్స్యకారులకు పరోక్షంగా సహాయపడే ఈ మడ అడవులను అధిక సంఖ్యలో పెంచి పోషించమని పలు స్వచ్ఛంద సేవాసంస్థలు విజ్ఞప్తులు చేస్తున్నా, అవి స్వార్థపరుల చెవులకెక్కడం లేదు. వంటచెరకు కోసం, మండల రూపంలో చెట్లను దడులుగా నిర్మించుకోవడానికి లేత అడవులను సైతం పై గ్రామాలలో అధిక శాతం నరికివేస్తున్నారు. కొందరు నిరుపేదలు వీటి ప్రయోజనం తెలియక, చెట్లను నరికి కట్టెపుల్లలుగా విక్రయించుకుని ఉపాధి పొందుతున్నారు. సందట్లో సడేమియాలు కొందరు తుమ్మలపల్లి గ్రామంలో మడ అడవులను ఆక్రమించుకుని చెట్లను నరికివేసి రొయ్యల చెరువులకు నేరుగా సముద్రం నుంచి ఉప్పునీటిని తీసుకునేందుకు సుమారు ఒకటిన్నర కిలో మీటరు దూరంలో అటవీ భూములలో గుండా పైపులైన్లు రాత్రికి రాత్రే అమర్చారు. రెండేళ్ళుగా మడ అడవులను నరికివేస్తున్నా, రొయ్యల చెరువులగా ఆక్రమించుకుంటున్నప్పటికీ అటవీశాఖ అధికారులు చూసీచూడనట్టు వ్యవహరిస్తున్నారు. ఆక్రమణలకు గురైన ప్రాంతాలను సందర్శించి వెళ్ళారే తప్ప ఎలాంటి చర్యలు గైకొనలేదు. దీంతో ఆక్రమణదారులకు, అటవీశాఖ అధికారులకు మధ్య బేరసారాలు కుదిరాయని ఈ ప్రాంత ప్రజలు అనుమానిస్తున్నారు. ఇకనైనా సంబంధిత అధికారులు తగు చర్యలు గైకొని మడచెట్ల అభివృద్ధికి కృషి చేయాలని పలు పర్యావరణ పరరక్షణ స్వచ్ఛంద సేవాసంస్థలు, ప్రజలు కోరుతున్నారు.



# కనుమరుగవుతున్న చరిత్రకు సజీవ సాక్ష్యం 'చేబ్రోలు'

(88వ పేజీ తరువాయి)

ఉన్నాయి. లోపలికి ప్రవేశిస్తే అంతా చీకటిగా ఉంటుంది. ఈ ద్వారం నుంచి కాశీకి మార్గం ఉందని విశ్వసిస్తుంటారు. ఇటీవలే ఈ ద్వారాల్ని మూసివేశారు. 1957వ సంవత్సరంలో భీమేశ్వరాలయం వద్ద పురావస్తు శాఖ జరిపిన తవ్వకాలలో దక్షిణాన టెర్రకోట (జీగురుమట్టి) బొమ్మలు, పూసలు, కూజాలు, త్రిరత్నాలు, శాతవాహనుల సీసపు నాణాలు, సైనికుల బొమ్మలు, ఏనుగులు, కళేబరాలు, గుర్రపు డాంకాలు, శిల్ప కళాఖండాలు, పూర్ణాఘటము గల రాతి ఫలకలు, బంగారు నాణేలు, బౌద్ధ శిల్ప శిలాఖండాలు, రాతి గొడ్డళ్ళు లభ్యమయ్యాయి. ప్రస్తుతం ఈ సంపద అంతా విజయవాడలోని మ్యూజియంలో భద్రపరిచారని తెలుస్తోంది.

## గ్రామదేవత రావులమ్మ

రాష్ట్రంలో ఒక్కో గ్రామానికి ఒక్కో గ్రామ దేవత ఆలయం ఉన్నట్టుగానే చేబ్రోలు గ్రామంలో రావులమ్మ ఆలయం ఉంది. రావులమ్మను గ్రామ దేవతగా కొలుస్తారు. గ్రామంలో ఎన్ని ఆలయాలు ఉన్నప్పటికీ గ్రామస్తులంతా రావులమ్మ ఆలయంలోనే పూజలు నిర్వహిస్తుంటారు. ప్రతి ఏటా ఈ ప్రాంతంలోని రైతులందరూ పొలాల్లో నాట్లు వేసిన తర్వాత జాతర నిర్వహిస్తారు. ప్రతి ఆదివారంనాడు అమ్మవారికి విశేష పూజలు జరుగుతాయి. చేబ్రోలులో ఇవిగాక వీరభద్రాలయం, వేణుగోపాల స్వామి, రంగనాథస్వామి, చంద్రమౌళేశ్వరస్వామి ఆలయాలు ప్రముఖమైనవి. సహస్ర లింగేశ్వరాలయం, నరసింహస్వామి ఆలయాలు, మూడు ఆంజనేయస్వామి ఆలయాలు ఉన్నాయి. కాగా, ఇక్కడ గల కాలభైరవుడి విగ్రహాన్ని గురించి పలు కథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. ఎత్తైన దిబ్బ, ఆ దిబ్బపై ఒక దిమ్మె, దానిపై కాలభైరవుడి విగ్రహాన్ని ప్రతిష్టించారు. ఈ ఎత్తైన దిబ్బలో బంగారపు ధాన్యపు గింజలు ఉండేవని పూర్వీకులు చెబుతారు. దిగంబరంగా ఉండే కాలభైరవుడు గ్రామానికి ఎటువంటి అరిష్టం కలుగకుండా చూస్తాడని ప్రజలు విశ్వసిస్తుంటారు.

ఇవిగాక, చేబ్రోలులో గల అన్నపూర్ణ సత్రంలో నిత్యం బాటసారులకు భోజన వసతి కల్పిస్తూ ఉంటారు. దీనిని చేబ్రోలుకు చెందిన దేవిరాజు గోపాలకృష్ణ మరికొందరు కలిసి 1890లో నిర్మించారు. అప్పట్లో బాటసారులకు దీన్ని ఉచితంగా భోజనం పెట్టేందుకు స్థాపించారు. అదే పద్ధతి ఇప్పటి వరకు కొనసాగుతూ ఉంది. కాగా, ఎన్నో వేల సంవత్సరాల చరిత్రతో, పురాతన ఆలయాలు కలిగిన చేబ్రోలు గురించి ఎక్కువ మందికి తెలియదు. ప్రస్తుతం కొన్ని ఆలయాలు శిథిలావస్థకు చేరుకున్నాయి. ప్రభుత్వం ఇప్పటికైనా తగిన శ్రద్ధ తీసుకుని ఆలయాల పరిరక్షణకు కృషి చేస్తే భావితరాలవారికి మన ప్రాచీన సంస్కృతి, సంప్రదాయాలు, చరిత్ర గురించి తెలిపినవారమవుతాం.


చరిత్రను చెప్పే ప్రాచీన గాలిగోపురం

# జాషువా నాటక సాహిత్య సమాలోచనం

(ఆన్‌లైన్, చిలకలూరిపేట రూరల్)

రాజు మరణించె ఒక తార
రాలిపోయె
కవియు మరణించె నొకతార
గగన మెక్కె
రాజు జీవించె రాతి
విగ్రహములందు
కవి జీవించె ప్రజల
నాలుకలయందు

అంటూ ఆధునిక కవితా ప్రపంచాన 'విశ్వమానవ సౌభ్రాతృత్వం... నిర్మత... నిర్జాతి సంఘం నా ఆదర్శం' అంటూ కలం పట్టిన కసి, కృషి ఉన్న సాహితీ ఋషి, నవయుగ కవి చక్రవర్తి, కవికోకిల గుర్రం జాషువా. ఆయన ఆలోచనాలోచనం.. అంతరంగ తరంగం ..అక్షర గవాక్షం.. మూఢమూర్ఖ విశ్వాసాలపై తిరుగుబావుటాను ఎగురవేయడమే. కులాల కుమ్ములాటలూ.. మతాల మారణహోమాల మధ్య అహం వేయి పడగలతో విషాన్ని కక్కుతుంటే ఆ హాలాహలాన్ని మధించి కవితామృతాన్ని సృష్టించిన నవయుగ వైతాళికుడు జాషువా. మనిషికీ మనిషికీ మధ్య శాంతి హసించాలని.. మానవతా సంగీతం దశదిశలా ప్రవహించాలనీ.. ఈ విశ్వమే మమతల మందిరం కావాలని అభిలషించిన నిత్యసత్య కృషీవలుడు జాషువా. జాషువా వంటి మాననీయ మహోదయ కవివరేణ్యుడు పుట్టడం తెలుగు నేల అదృష్టం. అర్హతలుండి ఉత్తరాయణ దక్షిణాయనాలకు అర్థం తెలియక జాతీయకవిగా గుర్తింపు పొందక పోవడం తెలుగు జాతికే దురదృష్టం.

పద్యం... గద్యం... పాట... మాట... అన్నీ ఆయన మస్తిష్క అక్షయపాత్ర నుండి మనకు వడ్డించిన అమృతాన్నాలే. పద్య గద్య విద్యలతో అప్రతిహతంగా శరసంధానం చేసిన సవ్యసాచి జాషువా నాటక రచన లోను తనదైన శైలిలోను రవ్వలు రాల్చి గరగరల్ పచరించిన దిట్టగా గణుతికెక్కాడు.

జాషువా రుక్మిణీ కళ్యాణం (1918), మదాలస (1919), దావీదు చరిత్ర (1920), చిదానంద ప్రభాతము (1921), ధ్రువ విజయం (1925), వీరాబాయి (1926), తెరచాటు (1935) నాటకాలను రచించారు. రుక్మిణీ కళ్యాణం, చిదానంద ప్రభాతము, ధ్రువ విజయం పౌరాణికేతి వృత్తాలు కాగా వీరాబాయి చారిత్రకం, తెరచాటు సాంఘికం. నాటక రచయితగా జాషువా ప్రతిభాపాటవాలను రేఖామాత్రంగా సహృదయ సమాలోచన చేయవలసి ఉంది.


గుర్రం జాషువా

## రుక్మిణీ కళ్యాణం

హిందూ నాటక సమాజ రథసారథుల్లో ఒకరైన గున్నేశ్వరరావుతో కలిగిన పరిచయం స్నేహంగా మారాకు తొడిగిన అనంతరం ఆయన కోరికపై జాషువా రుక్మిణీ కళ్యాణం నాటకాన్ని రచించారు. నాందీ ప్రస్తావన భరతవాక్యాలతో కూడిన ఆరు అంకాల నాటకం ఇది. ఈ నాటకంలో 192 పద్యాలు, పార్శీ పద్ధతిలో వ్రాయబడిన 26 పాటలూ ఉన్నాయి. ఆంధ్ర మహాభాగవతం దశమస్కంధం లోని రుక్మిణీ కళ్యాణ ఘట్టం ఆధారంగా ఈ నాటకం రచించబడింది.

రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని దేశ సరిహద్దుల నుంచి పారదోలడానికి సమరోత్సాహంగా చేస్తున్న పోరాటాగ్నికి రచయితలు వీరరస స్ఫోరకమైన కవితల ఆజ్యాన్ని అందించారు. దీనితో కన్నెర్రచేసిన తెల్లదొరలు రచనలపై ఆంక్షల కొరడాలను ఝళిపించారు. పైపెచ్చు నాటక ప్రదర్శనలపై వారి డేగ కన్ను పడింది. స్వాతంత్ర్యకాంక్షను ప్రేరేపించే నాటకాలను నిషేధాజ్ఞలను విధించారు. దామరాజు పుండరీకాక్షుడు గాంధీ విజయం, పాంచాలీ పరాభవం, బుద్ధవరపు పట్టాభిరామయ్య మాతృదాస్య విమోచనం వంటి నాటకాలలో ఆసక్తికరమైన ప్రయోగం చేశారు. పురాణకథను నాటకంగా మలచి ఆ పాత్రలను స్వాతంత్ర్య సమరయోధులకు ప్రతీకలుగా చేసి స్వరాజ్య పిపాసను రేకెత్తించే పద్యాలు, పాటలు చొప్పించారు. తద్వారా బ్రిటీష్ వారిని ఏమార్చి ప్రదర్శనల ద్వారా భారతీయులను ఉద్రూతలూగించారు. ఈ ప్రయోగాన్ని జాషువా రుక్మిణీ కళ్యాణంలో రసవత్తరంగా ప్రయోగించారు. నాయిక రుక్మిణి భారత స్వాతంత్ర్య లక్ష్మిగా, శ్రీకృష్ణుని జాతీయ నాయకునిగా, రుక్మిణిని శిశుపాలునికిచ్చి వివాహం చేయాలని తలంపు కలిగిన రుక్మి, అతనికి సహకరించిన జరాసంధ, దంతవక్త్ర, పౌండ్రక, సాల్వ రాజులను దేశమాతను అన్యాక్రాంతగా చేయడానికి ప్రయత్నించే దేశద్రోహులుగానూ అన్యాపదేశంగా చిత్రించడంలో జాషువా కృతకృత్యులయ్యారు.

## చిదానంద ప్రభాతము

కొందరు క్రైస్తవ మిత్రుల ప్రోద్బలంతో దావీదు చరిత్రను 'చిదానంద ప్రభాతము' అనే పేరుతో జాషువా నాటకంగా రచించారు. నాటకంలోని భాష కఠినశైలిలో ఉన్నందున, పాటలు లేవన్న నేపంతో నాటక ప్రదర్శనకు సహకరించలేదు. రేపల్లె తాలూకా కూచినపూడికి చెందిన కుర్రా యేసోపు సహకారంతో జాషువా ఈ నాటకాన్ని 1921లో ప్రచురించారు. మహితాత్ముడైన క్రీస్తు జనన మహత్మ్యాన్ని వివరించే మూడంకాల నాటకం ఇది. బైబిల్ కొత్త నిబంధనలోని సువార్తల్ని ఆధారం చేసుకుని జాషువా ఈ నాటకంలో క్రీస్తు జన్మ వృత్తాంతాన్ని చిత్రించారు.

## ధ్రువ విజయం

శ్రీ రాధాకృష్ణ విలాససభ వారి ప్రోత్సాహంతో ఈ నాటకాన్ని రచించారు. ఈ నాటకంలో 49 పద్యాలు మాత్రమే ఉన్నాయి. పాశ్చాత్య నాటక సంప్రదాయంగా అంక, దృశ్య విభజన చేశారు. ఆంధ్ర మహాభాగవతం చతుర్ధ స్కంధములోని ధ్రువోపాఖ్యానం కథ ఆధారంగా ఈ నాటకాన్ని రచించారు. పాత్రల మనో విశ్లేషణకు ఈ కల్పనలు ఎంతో దోహదపడ్డాయి. కవి పండితలోకంలో తానొక కవిగా గుర్తింపుపొందాలనే ప్రయత్నానికి ఈ నాటక సృష్టి ఒక ప్రబల తార్కాణం.

## వీరాబాయి

గుంటూరు బాలమిత్ర సమాజం వారి కోరిక మేరకు 1926వ సంవత్సరంలో జాషువా ఈ నాటకాన్ని రచించారు. వీరాబాయి ఐదు అంకాలతో కూడిన చారిత్రక నాటకం. చిత్తోడ్‌ఘడ్ ప్రభువైన ఉదయసింహుని అర్ధాంగి వీరాబాయి మాతృదేశ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పరిరక్షణకై తుది నెత్తురు బిందువు నేలరాలేంతవరకూ శత్రువులపై పోరు చేసి, అసువులు బాసిన రసవత్తర గాథను వీరాబాయి నాటకంగా జాషువా రచించారు.

వీరాబాయి నాటకంలో జాషువా ఉపయోగించిన పాత్రోచిత భాష ఆసక్తికరంగా ఉంటుంది. వేదం వెంకటరాయశాస్త్రి ప్రతాపరుద్రీయం నాటకంలో ప్రయోగించిన తెలుగు ఉర్దూ మిశ్రమ భాషను జాషువా వీరాబాయి నాటకంలో మరింత రసరంజితంగా ప్రయోగించారు. వీరాబాయి నాటకంలో ఆదాంఖాన్ అనే సర్దార్‌కు కల్లు, హకీం, మురాద్ అనే భటులకు ఈ మిశ్రమభాషను చక్కగా ప్రయోగించారు. పుట్టిపెరిగిన వినుకొండ ప్రాంతంలోని మహమ్మదీయ మిత్రుల సాహచర్యం ఈ భాషా ప్రయోగానికి ఎంతగానో ఉపకరించింది. వర్తమానకాలంలో ఈ భాషా ప్రయోగం ఎబ్బెట్టుగా కన్పించినా అర్ధ శతాబ్దికి పూర్వం అది జనవ్యవహారంలో చోటుకొన్న విషయం గమనార్హం. ఇటువంటి మిశ్రమభాష హాస్యరస ఆవిష్కరణకు ఎంతగానో దోహదం చేస్తుంది. ఈ నాటకంలోని ద్వితీయాంకం మూడవరంగం, చతుర్థాంకంలోని రెండవ రంగాలలో ఈ మిశ్రమ భాషా ప్రయోగంతో హాస్యరసం సరస మధురంగా చిందులు వేసింది.

## తెరచాటు

ప్రజామిత్ర సంపాదకులైన గూడవల్లి రామబ్రహ్మంగారు ఆంధ్ర నాటక పరిషత్తు కోసం ప్రకటించిన నాటక రచనల పోటీల కోసం జాషువా రచించిన సాంఘికేతివృత్త నాటకం 'తెరచాటు'. వర్తమాన సాంఘిక రాజకీయ మత వ్యవస్థపై జాషువా మాటల ఈటెలను బలంగా విసిరిన వైనం ఈ నాటకంలో ప్రముఖంగా కన్పిస్తుంది. జాషువా రచించిన నాటకాల్లో మదాలస అముద్రితం. అది కాలగర్భంలో కలిసిపోయింది. క్రైస్తవ సోదరుల వాగ్దాన భంగం వల్ల దావీదు చరిత్ర అముద్రితమై జీర్ణమైపోయిందని జాషువాగారే స్వయంగా పేర్కొన్నారు.

జాషువా నాటక సాహిత్యాన్ని సహృదయ విహంగ వీక్షణం చేస్తే కవిత్వంలో చూపిన ఇతివృత్త వైవిధ్యం నాటకాలలో కూడా కన్పిస్తుంది. ఆకాశంలో సగమైన స్త్రీకి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు కావాలని వీరాబాయి, తెరచాటు నాటకాల్లో ఆనాడే ఎలుగెత్తి చాటారు.

నాటకం దృశ్య ప్రధానం. నాటక రచన ఎంత గొప్పదైనా అది పదిచోట్ల ప్రదర్శింపబడితేనే ఆ రచనకు ఒక సాఫల్యం. రుక్మిణీ కళ్యాణం, చిదానంద ప్రభాతం వంటి రెండు నాటకాలు మాత్రమే కొన్ని ప్రదర్శనలకు నోచుకున్నందున నాటక రచయితగా జాషువా ఒక ప్రముఖ స్థానాన్ని పొందలేకపోయారు. అయితే జాషువా కలం నుంచి జాలువారిన 'ఇచ్చోటనే గదా సత్కవీంద్రుని కమ్మని కలము నిప్పుల లోన కరిగిపోయె', 'ఆలోచించిన గుండియల్ కరుగున్', 'వాకొనరాని గొప్ప ధనవంతుల నిర్దపు పాలరాతి గోరీ కడ', 'ముదురు తమస్సులో మునిగిపోయిన కొత్త సమాధి', 'ఇట అస్పృశ్యత సంచరించుటకు తావేలేదు' అనే పద్యాలు సత్యహరిశ్చంద్ర నాటకంలో చోటుచేసుకోవడంతో బంగారానికి తావి అబ్బినట్టుగా ఆ నాటకం మరింత పరిపుష్టమైంది.

# ప్రగతి పథంలో చిలకలూరిపేట మున్సిపాలిటీ

శ్రీ మర్రి రాజశేఖర్
శాసనసభ్యులు, చిలకలూరిపేట

శ్రీ రాయపాటి సాంబశివరావు
పార్లమెంటు సభ్యులు, గుంటూరు

శ్రీమతి జరపల కోటేశ్వరి
చైర్ పర్సన్, చిలకలూరిపేట

శ్రీ జి.వి.వి.యస్. మూర్తి
మున్సిపల్ కమీషనర్, చిలకలూరిపేట

శ్రీ షేక్ అబ్దుల్లా
వైస్ చైర్మన్, చిలకలూరిపేట

## 2005 - 2006 సం॥లో పట్టణంలో అభివృద్ధి పనులు

1. మున్సిపల్ నూతన కార్యాలయ భవనము 50.00 లక్షలు
2. ఎ.పి.యు.ఆర్.యమ్.యస్. ప్రొవిజన్ క్రింద రోడ్లు మరియు కాలువలు 328.00 లక్షలు
3. ఐ.డి.యస్.యమ్.టి. నిధులతో గణపవరం డొంక సిమెంట్ రోడ్డు నిర్మాణం 45.00 లక్షలు
4. యన్.యస్.డి.పి. నిధులతో మురికి వాడలలో రోడ్డు మరియు కాలువల నిర్మాణం 45.00 లక్షలు
5. సాధారణ నిధులతో రోడ్లు, కాలువలు, మరియు పైపులైనుల నిర్మాణం 25.00 లక్షలు
6. కరువు నిధులతో నీటి సరఫరా 15.00 లక్షలు
7. నాన్ ప్లాన్ గ్రాంటు నిధులతో పార్కుల అభివృద్ధి 30.00 లక్షలు
8. డెవలప్‌మెంట్ చార్జీల నిధులతో సాంబశివనగర్ పార్కు అభివృద్ధి 7.00 లక్షలు
9. మసీదుల పునర్నిర్మాణాలు 4.00 లక్షలు

### ప్రజా సంక్షేమ పథకాలు

1. NOAP 812
2. WIDOW 179
3. NFBS 245
4. PHC పెన్షన్లు 122
5. ఈ ఆర్థిక సం॥ నుండి అర్హులైన పొదుపు సంఘాల వారికి పావలా వడ్డీకే ఋణ సదుపాయం.

శ్రీ జె. కోటేశ్వరి
చైర్ పర్సన్, చిలకలూరిపేట
పురపాలక సంఘం

శ్రీ జి.వి.వి.యస్. మూర్తి
చైర్ పర్సన్, చిలకలూరిపేట
పురపాలక సంఘం

శ్రీ ఏలూరు తిరుపతయ్య
1వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి దేవరకొండ మాధవీలత
2వ వార్డు కౌన్సిలర్

శ్రీ గోరంట్ల శ్రీనివాసరావు
3వ వార్డు కౌన్సిలర్

శ్రీ ఇనగంటి పెదజగదీష్‌బాబు
4వ వార్డు కౌన్సిలర్

శ్రీ షేక్ జమాల్ బాషా
5వ వార్డు కౌన్సిలర్

శ్రీ షేక్ కరిముల్లా
6వ వార్డు కౌన్సిలర్

శ్రీ సాతులూరి బాబు
7వ వార్డు కౌన్సిలర్

శ్రీ సయ్యద్ మాబూ సుభాని
8వ వార్డు కౌన్సిలర్

శ్రీ షేక్ వెంకట సాయిబాబు
9వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి అల్లడి విశ్రాంతమ్మ
10వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి కొండెబోయిన పార్వతీదేవి
11వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి శిరమా రజనీదేవి
12వ వార్డు కౌన్సిలర్

శ్రీ గ్రంధి అంజనేయులు
13వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి షేక్ షఫీ ఉజ్మా
14వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి మద్ది కన్యాకుమారి
15వ వార్డు కౌన్సిలర్

శ్రీ గంజి పోలయ్య
16వ వార్డు కౌన్సిలర్

శ్రీ తెల్లబాటి మోహనకృష్ణ
17వ వార్డు కౌన్సిలర్

శ్రీ గాలం కోటేశ్వరరావు
18వ వార్డు కౌన్సిలర్

శ్రీ దివ్వెల వెంకటరత్నం
19వ వార్డు కౌన్సిలర్

శ్రీ సయ్యద్ కరిముల్లా
20వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి చెరుకుపల్లి నిర్మల
21వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి షేక్ వజీరున్నీసా బేగం
22వ వార్డు కౌన్సిలర్

శ్రీ మారుబోయిన శ్రీనివాసరావు
23వ వార్డు, కౌన్సిలర్

శ్రీ గేరా లింకన్
24వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి బత్తినేని లక్ష్మీదేవి
26వ వార్డు కౌన్సిలర్

శ్రీ గుమ్మా పెద్దిరాజు
27వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి బొందు మేరి సలూజ
28వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి అవ్వారు సుజాత
29వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి రమావత్ మంగాబాయి
30వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి మేడూరి కరుణకుమారి
32వ వార్డు కౌన్సిలర్

శ్రీమతి పాములపాటి శివకుమారి
33వ వార్డు కౌన్సిలర్

శ్రీ తియ్యగూర అంజిరెడ్డి
34వ వార్డు కౌన్సిలర్

# సంక్షోభంలో చేనేత పరిశ్రమ

(ఆన్‌లైన్, భట్టిప్రోలు)
'పోగు పోగు పడికినం
మగ్గాలను పట్టినం
మా'నరాలే'దారాలుగా
దుస్తులెన్నో నేసినాం
శ్రమ ఎవడిదిరో
శిరి ఎవరిదిరో' అంటూ
ఓ కవి రూపొందించిన గేయంలో నేటి చేనేత కార్మికుల జీవన స్థితిగతులు కళ్ళకు కట్టినట్టు కన్పిస్తున్నాయి. వస్త్ర నాగరికత ప్రపంచానికే వన్నెతెచ్చిన చేనేత పరిశ్రమ బ్రిటీష్ కాలం నాటి నుంచి ఒడిదుడుకులు ఎదుర్కొంటూనే వుంది. స్వాతంత్ర్యం అనంతరం చేనేత పరిశ్రమకు మంచిరోజు వస్తుందని ఆశించిన కార్మికులకు స్వల్పకాలంలోనే మరిన్ని సమస్యలు ఎదురయ్యాయి.


కార్మికుని జాలిచూపు

1952లో చేనేత పరిశ్రమకు శాశ్వత రక్షణ కల్పించాలని అప్పటి ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో 75 రోజులపాటు కార్మికులు సత్యాగ్రహాన్ని నిర్వహించారు. అగ్గిపెట్టిలో ఆరు గజాల వస్త్రాన్ని అమర్చిన మన నేతన్నకు ఆనాటి బ్రిటీష్ పాలకులు బహుమతిగా చేతివేళ్ళను తీసివేస్తే, ప్రస్తుత మన పాలకులు చేనేతపరిశ్రమకు శాశ్వత రక్షణ కల్పిస్తామని వాగ్దానాలు చేస్తూనే మరోవైపు పూర్తిగా నాశనంచేసేందుకు ప్రయత్నాలు సాగిస్తున్నారు.

గత ఏడాది అసెంబ్లీ ఎన్నికలకు ముందు తమ పార్టీ అధికారం చేపడితే చేనేత పరిశ్రమకు పూర్వవైభవాన్ని కల్పించేందుకు అనేక రాయితీలను ప్రవేశపెడతామంటూ వాగ్దానాలు చేసి అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ చిలప నూలుపై ఉన్న 9.2 ఎక్సైజ్ సుంకాన్ని రద్దు చేయడమినహా చేనేతకు ఒరగబెట్టింది ఏమీలేదు. పాలక ప్రభుత్వాలు అనుసరిస్తున్న చేనేత వ్యతిరేక విధానాల కారణంగా పరిశ్రమ సంక్షోభానికి గురై, ఉపాధిని కోల్పోయిన కార్మికులు అర్ధాకలితో అలమటిస్తూ, ఆకలి చావులకు, ఆత్మహత్యలకు బలవుతున్నారు. ఆర్థిక బాధల కారణంగా ఆత్మహత్యలు చేసుకున్న రైతాంగానికి ఎక్స్‌గ్రేషియా అందిస్తున్న ప్రభుత్వం చేనేత కార్మికుల విషయంలో నిర్లక్ష్యం చూపుతుందంటే చేనేత పరిశ్రమపట్ల, కార్మికులపట్ల పాలకులు చూపుతున్న సవతితల్లి ప్రేమను గమనించవచ్చు.

మిల్లు యజమానులకు కోట్లాది రూపాయల రాయితీలు ప్రకటిస్తున్న కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు చేనేత పరిశ్రమకు రాయతీలు ప్రకటించకపోగా, ఉన్నవాటిని కుదిస్తున్నాయి. మూతపడిన నూలుమిల్లులను తిరిగి పునరుద్ధరించడంలో పాలకులు వైఫల్యం చెందారనడంలో ఎటువంటి సందేహం లేదు. చేనేతకు కేటాయించిన 11 రకాల రిజర్వేషన్ వస్త్రాలు మిల్లు యజమానులు బహుబాటంగా తయారు చేస్తున్నప్పటికీ వాటిని అరికట్టవలసిన అధికార యంత్రాంగం నిమ్మకునీరెత్తినట్టు వ్యవహరిస్తున్నది. చేనేత సహకార సంఘాలను పరిరక్షించాలన్న ఉద్దేశంతో ఏర్పాటుచేసిన ఆప్కో సంస్థ గత తెలుగుదేశం ప్రభుత్వ హయాంలో కూడా అవినీతి ఊబిలో కూరుకుపోయింది. ఆప్కో సహకార సంఘాల నుంచి కొనుగోలుచేస్తున్న వస్త్రాలకు నెలలతరబడి బకాయిలు చెల్లించకపోవడంతో అందులో పనిచేసే సభ్యులకు ఉపాధి చేకూర్చలేని దుస్థితి నెలకొంది. అంతేగాక రాష్ట్రంలో పలు ఆప్కో డిపోలను మూసివేయడం చేనేత పరిశ్రమకు నష్టదాయకంగా మారింది.

ప్రభుత్వ విధాన ఫలితంగా 2003-04 ఆర్థిక సంవత్సరంలో రాష్ట్రవ్యాప్తంగా 184 మంది నేత కార్మికులు ఆకలి చావులకు, ఆత్మహత్యలకు బలయ్యారు. వీరికి ప్రభుత్వం ఎలాంటి ఎక్స్‌గ్రేషియా ప్రకటించలేదు.

2005-06 సంవత్సరంలో కూడా అదే పరిస్థితి నెలకొనివుంది. ప్రాచీనకాలంలో ఒక వెలుగు వెలిగిన చేనేత పరిశ్రమ భవిష్యత్‌తరాలవారికి కనుమరుగుకాకుండా ఉండాలంటే ప్రభుత్వం శాశ్వత రక్షణ కోసం చేనేత వస్త్రాల అమ్మకాలపై సంవత్సరం పొడవునా రిబేటు విధానాన్ని ప్రవేశపెట్టి, సహకార సంఘాలలోనే వస్త్రాలను ఆప్కో కొనుగోలు చేయాలి. అదేవిధంగా చేనేత పరిశ్రమకు గతంలో ప్రకటించిన రాయితీలను సంపూర్ణంగా అమలుచేయాలి. అవసరమైన 50 శాతం చిలపనూలు తయారయ్యేవిధంగా ప్రభుత్వం చర్యలు చేపట్టవల్సివుంది. అప్పుడే చేనేత పరిశ్రమకు తిరిగి పూర్వవైభవాన్ని తీసుకురావడంతోపాటు కార్మికుల ఆకలిచావులు, ఆత్మహత్యలను నివారించవచ్చు.

## గుంటూరు జిల్లాలో

# కమ్యూనిస్టు ఉద్యమం పుట్టుపూర్వోత్తరాలు

(ఆన్‌లైన్ - గుంటూరు)

దేశ స్వాతంత్ర్య పోరాటంలో గుంటూరు జిల్లాకు మహోజ్వల చరిత్ర వుంది. ఒంగోలు తాలూకాను కలిపి ఒకప్పుడు గుంటూరు పెద్ద జిల్లాగా వుండేది. కాటన్ దొర నిర్మించిన బెజవాడ ఆనకట్టతో కృష్ణా వెస్ట్ బ్యాంక్ కాలువ కింద రేపల్లె, తెనాలి, బాపట్ల తాలూకాలలో కొంత భాగం మాగాణి ప్రాంతమైతే, మిగతా ప్రాంతం మెట్ట. పెదనందిపాడు పన్నుల సహకార ఉద్యమం, పల్నాడు పుల్లరి సత్యాగ్రహోద్యమం, చీరాల పేరాల ఉద్యమం వంటి సంఘటనలు చారిత్రాత్మకమైనవి. కన్నెగంటి హనుమంతు కోరమీసం తిప్పిన జిల్లా. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య పట్టణ పౌరులందరినీ ఊరి పొలిమేరల్లో పూరిళ్లు వేసి, మకాం పెట్టించి పోరాటం నడిపిన జిల్లా. ఉన్నవవారి మాలపల్లె నవలకు రూపురేఖలు దిద్దిన కథావస్తువు ప్రసాదించిన జిల్లా. బసవరాజు అప్పారావు దేశభక్తి గేయాలకు ఉత్తేజం కలిగించిన జిల్లా. ఇలాంటి మహోన్నత సంప్రదాయాలకు వారసత్వం అందిపుచ్చుకుని కమ్యూనిస్టు, వామపక్ష ఉద్యమాలు పుట్టి పెరిగాయన్న విషయం గమనార్హం. ప్రతాప రామసుబ్బయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, ముక్తేవి మాధవాచారి, దుర్భాకృష్ణమూర్తి, పెండ్యాల లోకనాథం, పి.పార్థసారథి వంటి యోధానుయోధులు భారతీ యోద్యమంలో జైళ్లకు వెళ్లారు. కాంగ్రెస్ నాయకత్వం అనుసరించే పోరాట పద్ధతుల మీద విసుగుచెందిన వీరికి జైళ్లలో కమ్యూనిస్టు, ఇతర విప్లకారులతో పరిచయాలు ఏర్పడ్డాయి. దీంతో వారు తొలి కమ్యూనిస్టులుగా ముందుకు వచ్చారు. పి.కృష్ణమూర్తి, పులుపుల వెంకటశివయ్య, తుమ్మల వెంకట్రామయ్య వంటి బెనారస్ విశ్వవిద్యాలయం విద్యార్థులు, విశ్వవిద్యాలయంలోనే కమ్యూనిస్టు భావాలను ఒంటబట్టించుకుని కార్యకర్తలుగా జిల్లాలో ప్రవేశించారు. కాకుమాను సుబ్బారావు, నండూరి ప్రసాదరావు, చదలవాడ పిచ్చయ్య, వాసిరెడ్డి శివలింగప్రసాద్, ఒంగోలు కామేశ్వరరావులు వీరికి స్థానికంగా తోడయ్యారు. టెర్రరిస్టు గ్రూపులతో సంబంధం వున్న అన్నాప్రగడ కామేశ్వరరావుకు కూడా నాటి వామపక్ష రాజకీయాలలో ప్రత్యేక పాత్ర వుంది. జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమానికి బీజాలు వేసిన మహనీయులు వీరే.

ఆర్థికంగా స్తోమత లేక పెళ్లికట్నంగా వచ్చిన నగలు, వెండి కంచాలు, చెంబులు, గ్లాసులు అమ్మి గుంటూరు బ్రాడీపేటలోని దయ్యాల మేడలో ఫ్రెండ్స్ హోం పేరుతో హోటలు పెట్టి తిండితోపాటు రాజకీయాలు కూడా వండిపెడుతూ కమ్యూనిస్టు ఉద్యమానికి పునాదులు నిర్మించారు. దానికి కార్యదర్శి పోలేపెద్ది నరసింహమూర్తి. హోటల్ దివాలా తీసిన తరువాత కొత్తపేటలో రూకయ్య హోటల్‌లో పెసరట్టు తిని, కాఫీ తాగి రావడంతో కార్యక్రమం ప్రారంభమైంది. రాత్రికి భోజనానికి ఇంటికి చేరే నిస్వార్థ కార్యకర్తలు. పోలేపెద్ది ఉన్న ఆస్తి హరించుకుపోగా, మలేరియా వ్యాధి సోకి సరైన వైద్యం లేక మరణించాడు. పుల్లారావు క్షయ వ్యాధి సోకి పుష్టికరమైన ఆహారం లేక మరణించాడు. విద్యార్థి ఉద్యమంలో పాత్రధారి ప్రభల కృష్ణమూర్తి వారి త్యాగాలే కమ్యూనిస్టు ఉద్యమానికి నీరుపోసి పెట్టి పోషించిన విషయం స్మరించుకుంటే శరీరం పులకరిస్తుంది. పోలేపెద్ది తరువాత జిల్లా కార్యదర్శిగా పులుపుల వెంకటశివయ్య బాధ్యత తీసుకున్నారు. కూలీలందరూ ఏకమైతే కూటికేమి కరువురా అన్న పెండ్యాల లోకనాథం గేయం, అన్యాయ కాలంబు దాపురించిందిపుడు, అందరము మేల్కోవాలండీ అన్న గరిమెళ్ల సత్యనారాయణ గేయం, ఆకలి మంటలచే మలమల మాడె అనాథలంతా లేవండోయ్ అన్న కవితల్ని పాడుతూ, సమావేశాలు ఏర్పాటుచేసి గుంటూరు జూట్ మిల్లు కార్మికుల్లోను, లాగుడు బండ్ల ముఠా కార్మికుల్లోను తెనాలి ప్రెస్ వర్కర్స్‌లో పనిచేస్తున్న సమయంలో గుంటూరు ఎసి కాలేజీలో డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా 1937-38 సంవత్సరాల్లో రెండుసార్లు విద్యార్థులు సమ్మె చేశారు. శివయ్య నాయకత్వంలో అప్పట్లో విద్యార్థులుగా వచ్చిన అనేక మంది రైతు యువకులను వలవేసి పట్టారు. అదే సంవత్సరంలో కొత్తపట్నం, మంతెనవారిపాలెంలో వేసవి రాజకీయ పాఠశాలలు జరిగాయి. అఖిల భారత స్థాయి కమ్యూనిస్టు నాయకులు అధ్యాపకులుగా వచ్చారు. రాష్ట్రంలోని ఇతర జిల్లాలకు చెందిన యువకులు కూడా ఈ పాఠశాలలకు హాజరయ్యారు. 1934-35 ప్రాంతంలో నిడుబ్రోలులో రంగా ఆధ్వర్యంలో రైతాంగ పాఠశాల జరిగింది.

బసవపున్నయ్య, నాళం నరసింహారావు, మోటూరి హనుమంతరావు, డివి అప్పారావు, వేములపల్లి శ్రీకృష్ణ, ఎల్‌బి గంగాధరరావు, మాదాల నారాయణస్వామి, టి.వెంకటేశ్వరావు,సియస్ నారాయణస్వామి, కొల్లా వెంకయ్య, కంఠంనేని వెంకటరత్నం, కనగాల కుటుంబరావు, గోవాడ నిరీక్షణరావు, ఆంజనేయశాస్త్రి మొదలగు అనేకమంది నాటి విద్యార్థి ఉద్యమం నుంచి కమ్యూనిస్టు సిద్ధాంతం వైపు ఆకర్షితులైనవారే. 1938లో కలకత్తాలో జరిగిన అఖిల భారత విద్యార్థి మహాసభకు బసవపున్నయ్య, హనుమంతరావు, శ్రీకృష్ణ, కంఠంనేని వెంకటరత్నంలు హాజరయ్యారు. విద్యార్థి సమ్మెలు, రాజకీయ పాఠశాలలు కమ్యూనిస్టు ఉద్యమంలో ఒక మలుపు తీసుకొచ్చాయి. గాంధీజీని బూర్జువా ఏజంటు అని, కాంగ్రెస్‌ని మతవాద సంస్థని, మతం మత్తుమందని ప్రచారం సాగించారు. కాంగ్రెస్ అధ్యక్షుడు బాబు రాజేంద్రప్రసాద్‌కు నల్లజెండాలతో స్వాగతం పలికారు. 1935లో జరిగిన అంతర్జా

(తరువాయి 95వ పేజీలో)

# జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమం పుట్టుపూర్వోత్తరాలు

(94వ పేజీ తరువాయి)

తీయ కమ్యూనిస్టు సంస్థ 7వ మహాసభలో వలస దేశాలలో కమ్యూనిస్టు కర్తవ్యాలను గురించి చర్చించారు. ఫాసిజాన్ని తుదముట్టించేందుకు ప్రజా ఐక్య సంఘటనకు శక్తివంచన లేకుండా ప్రయత్నించాలని సమావేశం నిర్ణయించింది. దీంతో కమ్యూనిస్టులు తమ వైఖరి మార్చుకొని కాంగ్రెస్‌లో చేరి వామపక్ష శక్తులను సమీకరించే ఒక వేదిక ఏర్పాటుచేయాలని నిర్ణయానికి వచ్చారు. వీరు సోషలిస్టులతో కలిసి, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని ఏర్పాటుచేశారు. దీనికి అనుబంధంగా వివిధ సంఘాల ఏర్పాటుకు కృషి జరిగింది. ఈ నేపధ్యంలో ఆంధ్రలో వ్యవసాయ, చేనేత, గీత పనివారల సంఘాలు ఏర్పడ్డాయి. గుంటూరులో జరిగిన కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ మహాసభకు జయప్రకాష్ నారాయణ, ఎస్ఎస్ బాట్లివాలా, ఎస్ ఎ డాంగే తదితరులు హాజరయ్యారు. చీరాల ఐ ఎల్ టి డి కార్మికుల సమ్మె సందర్భంగా జరిగిన పోలీసు కాల్పులపై మద్రాసు ప్రభుత్వం హర్విల్ విచారణాధికారిగా నియమించింది. ఆ నివేదిక తప్పుల తడకగా వుండటంతో, నివేదికకు వ్యతిరేకంగా గుంటూరు వచ్చి రాజగోపాలచారికి నిరసన తెలిపారు. ఈ సందర్భంగా ప్రత్యేక రాష్ట్ర నినాదాలు వెలువడ్డాయి. చీరాల కార్మికుల సహాయార్థం కాంగ్రెస్, కమ్యూనిస్టులు కలిసి కన్యాశుల్కం నాటకం ప్రదర్శించి, ఆ నిధిని కార్మికులకు పంపారు. పల్లెకోన, దావులూరు, అనంతవరంలలో వ్యవసాయ కూలీ సంఘాలు ఏర్పడ్డాయి. చీరాల కార్మిక సంఘానికి ప్రధాన బాధ్యుడు పులుపుల వెంకటశివయ్య ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1939లో రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభం అయింది. యుద్ధానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టులు ప్రచారం ప్రారంభించారు. దీంతో కమ్యూనిస్టు పార్టీని నిషేధించారు. యుద్ధ వ్యతిరేక ప్రచారంలో పాల్గొన్నవారిని అరెస్టు చేశారు. అప్పటికే స్వతంత్ర భారత్ అనే రహస్య పత్రికను నడుపుతుండేవారు. పత్రిక పంచుతున్నారనే నెపంతో మోటూరి హనుమంతరావు నడుపుతున్న స్టూడెంట్ ఎంపోరియంపై దాడిచేశారు. దీంతో అరెస్టులను తప్పించుకోడానికి జిల్లా నాయకత్వం రహస్యంగా పనిచేస్తూ వచ్చింది. అంతకుముందే గోవాడలో జరిగిన

(తరువాయి 96వ పేజీలో)

## అక్షరజ్యోతి 'ఆంధ్రజ్యోతి'కి అభినందనలతో...

నవ్యత నిత్యనూతన శోభతో
మూడు వసంతాలు పూర్తి చేసుకున్న
ఆంధ్రజ్యోతికి అక్షర నిరాజనాలు



శ్రీ కోన ప్రభాకరరావు



## శ్రీ కోన రఘుపతి

చైర్మన్ : శ్రీ కోన ప్రభాకరరావు చారిటబుల్ ట్రస్ట్,
బాపట్ల

### ప్రజాసేవలో కోన ఛారిటబుల్ ట్రస్ట్

- బాపట్ల నియోజకవర్గంలో 2,800 వ్యక్తిగత మరుగుదొడ్ల ఏర్పాటు.
- 28 పాఠశాలలకు మధ్యాహ్న భోజన పథక సామాగ్రి పంపిణీ.
- భర్తిపూడి, పూండ్ల, బిడారుదిబ్బ, రామ్‌నగర్ పాఠశాలలకు మరమ్మత్తులు.
- పేరలి, పేరలిపాడు పాఠశాలల్లో విద్యార్థులకు ప్రోత్సాహక బహుమతులు.
- నిరుద్యోగులకు ఉపాధి అవకాశాలపై అవగాహన సదస్సులు.
- ప్రభుత్వ పథకాలపై గ్రామీణ ప్రజలకు అవగాహన సదస్సులు.
- వరద బాధితులకు సహాయక చర్యలు.

బాపట్ల నియోజకవర్గ ప్రజలకు
దీపావళి, రంజాన్, క్రిస్టమస్ శుభాకాంక్షలు

# జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమం పుట్టుపూర్వోత్తరాలు

(95వ పేజీ తరువాయి)

సమావేశంలో బసవపున్నయ్య జిల్లా కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

జిల్లాలో కార్మిక హక్కుల కోసం, వ్యవసాయ కూలీల కూలి పెంపు, బంజరు భూముల ఆక్రమణ, ఇళ్ళ స్థలాలు, సాగునీటి సమస్యలు, బ్లాక్ మార్కెట్, లంచగొండితనాలకు వ్యతిరేకంగా నిరంతరం పోరాటాలు చేయడం ద్వారా కమ్యూనిస్టు పార్టీ పేద ప్రజల్లోకి చొచ్చుకుపోయింది. ఐక్య విద్యార్థి ఉద్యమంలో మాత్రం చీలిక వచ్చింది. సంస్కృత పునర్వికాస ఉద్యమం ఆంధ్ర దేశాన్ని ఊపివేసేలాజరిగింది. జిల్లాలో నాజర్ బుర్రకథ దళం, బాపట్ల షాడోప్లే, అమృతలూరు లంబాడీ నృత్యం, మోటూరి ఉదయం మహిళా బుర్రకథ దళాలు పేరుపొందాయి. పిసి జోషి కేడర్‌లో ఉత్తేజం కల్గించేవారు. 1943లో అభ్యుదయ మహాసభ తెనాలిలో జరిగింది. గుంటూరులో విద్యార్థి, ట్రేడ్ యూనియన్ మహాసభలు జరిగాయి. గుంటూరు, చిలకలూరిపేట, చీరాలలో పొగాకు కార్మికుల ఉద్యమం బాగా విస్తరించింది. గ్రామాల్లో చిన్న గ్రంథాలయాలు నిర్వహించడమేగాక, గోడ పత్రికలు నడుపుతూ, మెగా ఫోన్ ద్వారా రోజూ వార్తలు ప్రసాదం చేసేవారు. పార్టీ సభ్యులు పలువురుతమ ఆస్తులను పార్టీ కోసం త్యాగం చేశారు. ఈ కార్యక్రమాల మూలంగా ప్రవాహానిక ఎదురీదవలసి వచ్చినా ఉద్యమం మాత్రం బాగా విస్తరించింది. ఆ రోజుల్లో గుంటూరులోని జిల్లా పార్టీ కార్యాలయంలో జిల్లా కేంద్ర బాధ్యులు, ప్రజా సంఘాల బాధ్యులు, వైజ్ఞానిక దళాల ముఖ్యులు తమ కుటుంబాలతో వుండే వారు. కమ్యూనిస్టు పార్టీ జిల్లాలో కాంగ్రెస్‌తోపాటు ఒక బలమైన రాజకీయ శక్తిగా అభ్యుదయవాదుల అభిమానాన్ని చూరగొంది. ఆజాద్ హిందు ఫౌజ్‌పై విచారణ రద్దుచేయాలని ఉద్యమం, విద్యార్థి, పోస్టల్ ఉద్యోగుల సమ్మె, సంస్థాన ప్రజా పోరాటాలు, నౌక సైనికుల తిరుగుబాటు జరిగాయి. ఈ ఉద్యమాలలో కమ్యూనిస్టు పార్టీ చొరవ చూపింది. ఈ ఉధృతికి తట్టుకోలేక బలహీనపడిన సామ్రాజ్యవాదులు దిగివచ్చి భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి అంగీకరించారు. కాని దేశాన్ని విభజించారు. తెలంగాణాసాయుధ పోరాటం ప్రారంభమైంది.

1948లో కలకత్తాలో జరిగిన మహాసభలో దేశానికి సంక్రమించింది సంపూర్ణ స్వాతంత్ర్యం కాదని, అర్ధ వలస రాజ్యమని, నెహ్రూ ప్రభుత్వం సామ్రాజ్యవాదుల బంటు అని, ఆ ప్రభుత్వాన్ని గద్దె దించాలని ప్రకటించింది. ఈ నేపథ్యంలో

(తరువాయి 97వ పేజీలో)

## ఆంధ్రజ్యోతికి శుభాకాంక్షలు



పిన్నెల్లి లక్ష్మారెడ్డి
ఎమ్మెల్యే, మాచర్ల

"మా అక్షరం - మీ ఆయుధం"
నినాదంతో తెలుగు పత్రికా
రంగంలో సంచలనాలను
సృష్టిస్తున్న




'ఆంధ్రజ్యోతి' దినపత్రిక

3 వసంతాలను పూర్తి చేసుకొని
4వ వసంతంలోకి అడుగిడుతున్న
శుభసందర్భంలో
యాజమాన్యానికి, సిబ్బందికి
నా హృదయ పూర్వక శుభాకాంక్షలు...



### గంగవరపు కోటేశ్వరరావు

సర్పంచ్, నాగులవరం
మాచర్ల మండలం, గుంటూరు జిల్లా

# అభివృద్ధి పథంలో గిరిజన సంక్షేమ శాఖ, గుంటూరు



డా॥ వై.యస్.రాజశేఖర్‌రెడ్డి గారు
ముఖ్యమంత్రివర్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జి మంత్రి



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర రవాణా, సహకార శాఖా మంత్రి



శ్రీ రెడ్యానాయక్
రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి



శ్రీ దేవర సుబ్బారావు
చైర్మన్, ఎస్.టి. కార్పొరేషన్



శ్రీమతి జి. జయలక్ష్మి, IAS
జిల్లా కలెక్టర్, గుంటూరు.

### గిరిజనులకు అమలు చేస్తున్న సంక్షేమ పథకాలు

- భూమి కొనుగోలు పథకం.
- మైక్రో ఇరిగేషన్ ద్వారా పండ్ల తోటల పెంపకం.
- లిఫ్ట్ ఇరిగేషన్ ద్వారా సాగునీటి సౌకర్యాలు కల్పించడం.
- చిన్నతరహా వ్యాపారం కోసం ఋణ సహాయం.
- బోర్లు వేయించి విద్యుత్ సౌకర్యం కల్పించడం.
- కళాశాలల్లో చదివే విద్యార్థినీ విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లు పంపిణీ.
- యువతకు స్వయం ఉపాధికై ఆటోల కోసం ఋణ సదుపాయం.
- గిరిజన విద్యార్థినీ విద్యార్థులకు ప్రత్యేకంగా 32 సంక్షేమ హాస్టళ్ళు నిర్వహణ.




### 2005-06 కార్యాచరణ ఋణ ప్రణాళిక

| పథకం | లబ్ధిదారుల సంఖ్య | రు. లక్షల్లో |
|---|---|---|
| మాడా | 61 | 62.51 |
| డి.టి.జి | 2739 | 363.00 |
| ఎన్.ఎస్.ఎఫ్.డి | 209 | 141.42 |
| రాజీవ్ యువశక్తి | 240 | 432.00 |
| P.M.R.Y. | 229 | 28.90 |
| S.J.S.Y. | 1311 | 14.42 |
| మొత్తం | 7,789 | 1242.25 |



శ్రీ సరస్వతి రామరాజు
జిల్లా గిరిజన సంక్షేమ అధికారి, గుంటూరు

(96వ పేజీ తరువాయి)

మన రాష్ట్రంలో ప్రకాశం ఆర్డినెన్స్ ప్రకటించారు. జిల్లాలో పార్టీ నాయకత్వం రహస్య జీవితం గడుపుతూ, అరెస్టు కాకుండా జాగ్రత్త పడింది. నిషేధం వున్న వ్యవసాయ, కార్మిక, యువజన మహాసభలు జరిపి, ఊరేగింపులు, ప్రదర్శనలు నిర్వహించారు. జూపూడిలో చర్చి భూములు కౌలు చేస్తున్న వ్యవసాయ కూలీలను తొలగించడంతో, ఆందోళన జరిగింది. ఈ సందర్భంగా జరిగిన ప్రదర్శనపై పోలీసులు జరిపిన కాల్పులలో జెట్టి సుబ్బారావు మరణించాడు. 43 ప్రదేశాలలో పాలేళ్ల సమస్యలపై ఆందోళన జరిగింది. దీంతో వారు పది నుంచి 30 రోజుల వరకు సెలవు, 25 నుంచి 150 రూపాయల వరకు జీతాలు పొందడం జరిగింది.కూలీ రేట్లపై తెనాలి, రేపల్లె, బాపట్ల తాలూకాలలో తీవ్రస్థాయిలో ఆందోళనలు, సమ్మెలు జరిగాయి.

1952లో జరిగిన సాధారణ ఎన్నికల్లో పాల్గొనాలని పార్టీ నిర్ణయించింది. జిల్లాలోని 18అసెంబ్లీ స్థానాలలో మూడు కాంగ్రెస్ గెలుచుకోగా, మితగా 15 కమ్యూనిస్టు, కమ్యూనిస్టు బలపరిచిన అభ్యర్థులు గెలుపొందారు. 1953లో కర్నూలు రాజధానిగా ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది.

# జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమం పుట్టుపూర్వోత్తరాలు

ప్రొహిబిషన్, బంజరు కౌలుదారీ సమస్యలపై సత్యాగ్రహం జరిగింది. జిల్లాలో వేలాది మంది జైలుకు వెళ్లారు. 1955లో జరిగిన ఎన్నికల్లో మాచర్ల మినహా అన్ని స్థానాల్లో పార్టీ ఓడిపోయింది. దీంతో పార్టీలో అంతర్గత విబేధాలు తలెత్తాయి. 1962లో జరిగిన పార్టీ మహాసభలో రెండు విడివిడి విధాన పత్రాలు మీద చర్చ జరిగినా చివరకు అజయ్‌ఘోష్ ప్రతిపాదన మేరకు విధానం ఏకగ్రీవంగానే రూపొందింది. ఈ విధాన ప్రాతిపదికన బెంగుళూరులో సమావేశమై, 1962 ఎన్నికలకు కార్యాచరణ ప్రణాళిక రూపొందించింది. కాంగ్రెస్ గుత్తాధికారాన్ని దెబ్బతీయడానికి గట్టి ప్రయత్నాలు చేయాలని విజయవాడ పార్టీ శాఖ పిలుపునిచ్చిందని చీలిపోయిన పార్టీ (సి పి ఐ ఎం) మహాసభ నివేదికలో పేర్కొన్నదానిని బట్టి, ప్రాక్షికంగానే విధానాన్ని అర్థం చేసుకున్నారని తెలుస్తోంది. అందుకు స్వతంత్ర పార్టీలో జిల్లావ్యాప్తంగా సీట్ల సర్దుబాటుకు సిద్ధమయ్యారు. ఈ విధానాన్ని కొందరు నాయకులు, కేడర్‌తోపాటురాష్ట్ర నాయకత్వం అడ్డు తగిలింది. దీంతో కొందరు స్వతంత్ర అభ్యర్థులను కలుపుకుని కాంగ్రెస్, స్వాతంత్ర్య పార్టీలకు వ్యతిరేకంగా ముక్కోణపు పోటీకి దిగడం జరిగింది. ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ కి అత్యధిక సీట్లువచ్చాయి. 1962లో చైనాతో సరిహద్దుఘర్షణతో పార్టీలో విబేధాలు తీవ్రమై, 1964లో పార్టీ చీలిపోయింది. జిల్లా నాయకత్వంలో ఎక్కువమంది మార్క్సిస్టు పార్టీలోకి వెళ్లినా, కొద్దిమంది జిల్లా నాయకులు అధిక భాగం తాలూకా నాయకులు, కేడర్ సి పి ఐ లోనే వున్నారు. శాసనసభ్యులలో సగం మంది సి పి ఐ లో వున్నారు. జిల్లాలో గుంటూరు, చిలకలూరిపేట, చీరాల వంటి బలమైన కేంద్రాలలు సి పి ఐ తో వున్నాయి. గుంటూరు పట్టణం, తాలూకా, పల్నాడు, నర్సరావుపేట, ఒంగోలులో మెజార్టీ సి పి ఐ లో వుంది. రేపల్లె, తెనాలి, బాపట్ల, సత్తెనపల్లి తాలూకాలలో అధిక సంఖ్య సి పి యం వైపు వెళ్లారు. పార్టీలో చీలిక రావడంతో కమ్యూనిస్టులకు కమ్యూనిస్టులే శత్రువులయ్యారు. పార్టీ పునాది కదిలిపోయింది. సి పి ఐ కాంగ్రెస్ తోక అని విచ్చలవిడిగా ప్రచారం చేశారు. రాను రాను పార్టీ బలం తగ్గిపోయింది.

1967 ఎన్నికల్లో ఒకరిపై ఒకరు జిల్లా అంతటా పోటీకి దిగి ఓటమిపాలయ్యారు. ఓట్ల శాతం తగ్గిపోయింది. కాంగ్రెస్‌కు సమ ఉజ్జీగా నిలిచిన జిల్లాలో కాలక్రమేణా కమ్యూనిస్టు పార్టీ వెనక్కి నెట్టబడింది. ఆ స్థానాన్ని జనతా, తెలుగుదేశం పార్టీలు ఆక్రమించాయి. అధికారం కోసం పోటీపడే పార్టీకి తోడిపెళ్లి కొడుకులులాగా మారాయి. కార్మిక, వ్యవసాయ కూలీ, పేద రైతాంగంలో పోరాటపటిమ తగ్గింది. తాలూకాఫీసులకు అడపాదడపా ప్రదర్శనలు, నిరాహార దీక్షలు, ధర్నాలకే పరిమితమై దైనందిన కార్యకలాపాలు సన్నగిల్లాయి. గుంటూరులో మేడే 20, 30 వేల మందితో ప్రదర్శన నిర్వహించే రోజులు పోయాయి. రెగ్యులర్ శాఖ సమావేశాలు, స్థానిక సమస్యలపై కదలిక మందగించింది. ఈ అనుభవాలపై ఒకే ఒక గుణపాఠం చెబుతున్నాయి. చీలిక వల్ల కలిగిన నష్టాన్ని గుర్తించి, తిరిగి కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు కృషి జరగాలి.

# వారధి ఓకే-అప్రోచ్ రోడ్డు ఏది?

(ఆన్‌లైన్, రేపల్లె)

కోస్తా తీరంలో కృష్ణానదిపై రూ.71 కోట్ల వ్యయంతో నిర్మించిన పెనుమూడి-పులిగడ్డ వారధి అప్రోచ్ రోడ్ నిర్మాణపనులు పూర్తిచేయడానికి అవసరమైన అనుమతి ఇవ్వడంలో ప్రభుత్వం యంత్రాంగం మీనమేషాలు లెక్కిస్తుందని గుంటూరు, కృష్ణాజిల్లాల్లోని తీరప్రాంత ప్రజలు పలువిమర్శలు గుప్పిస్తున్నారు. ఈ వారధి నిర్మాణం పూర్తయి ఏడాది గడుస్తున్నా అప్రోచ్ రోడ్ నిర్మాణం చేయడంలో అధికారులు, ప్రజాప్రతినిధులు దృష్టి కేంద్రీకరించకపోవడంపట్ల ప్రజలు తీవ్ర ఆవేదన వ్యక్తంచేస్తున్నారు. కోస్తా జిల్లాలైన గుంటూరు, కృష్ణా జిల్లాలను వేరేచేస్తూ కృష్ణానది బంగాళాఖాతంలో కలుస్తున్నది. ఈ నదిపై విజయవాడవద్ద ప్రకాశం బ్యారేజి, కనకదుర్గమ్మవారధిల నిర్మాణం జరిగింది. వీటికి 90 కిలోమీటర్ల దిగువ వరకు ఎలాంటి వంతెన లేకపోవడంవల్ల అటు దివి సీమ, ఇటు రేపల్లె తీరప్రాంత ప్రజలు జలరవాణా మార్గంపై ఆధారపడ్డారు. పెనుమూడి రేవు నుంచి పులిగడ్డకు మరపడవలు ప్రయాణికులను చేరవేస్తున్నాయి. అనుమతిలేనప్పటికీ పెనుమూడి-నాగాయలంక రూట్లలో లాంచీలు తిరుగుతున్నాయి. ప్రమాదభరితమని తెలిసినా తీరప్రాంత ప్రజలకు ఈ ప్రయాణే దిక్కైంది. డెల్టా భూములు వ్యవసాయానికి, మత్స్యసంపదకు అనుకూలమైన ప్రాంతం కావడంవల్ల పెనుమూడి-పులిగడ్డ గ్రామాల మధ్య వంతెన నిర్మాణం చేపట్టాలని ప్రజలు గతంలో డిమాండు చేశారు. ప్రజల వినతి మేరకు, ప్రజాప్రతినిధులు, పలుసంఘాల నాయకులు చేపట్టిన ఆందోళన కారణంగా ప్రభుత్వం స్పందించి 2003, ఆగస్టు 20వ తేదీన వారధి నిర్మాణానికి ఉత్తర్వులు జారీ చేసింది. ఇంజనీరింగ్ అధికారులు రూపొందించిన అంచనాల ప్రకారం వారధి, అప్రోచ్ రోడ్ల నిర్మాణానికి రూ.71 కోట్లుగా నిర్ణయించారు. దీనిలో 37 కోట్ల రూపాయలు సబ్సిడీకింద కేటాయించింది. మిగిలిన 34 కోట్లు భరించేందుకు టెండరు మంజూరైన నవయుగ ఇంజనీరింగ్ కంపెనీ సుముఖత చూపి ముందుకు వచ్చింది. టోల్‌గేట్ కలెక్షన్ ద్వారా పెట్టుబడిని తిరిగి పొందడానికి నవయుగ కంపెనీకి ప్రభుత్వం అనుమతినిచ్చింది.



ప్రారంభానికి సిద్ధంగా ఉన్న పెనుమూడి-పులిగడ్డ వారధి

## పూర్తయి ఏడాది గడచినా...

ఈ నేపథ్యంలో వారధి నిర్మాణం పూర్తయినా అప్రోచ్ రోడ్ నిర్మాణ పనులు జరగకపోవడంతో ప్రజలు తీవ్ర అసౌకర్యానికి గురవుతున్నారు. అప్రోచ్ రోడ్ నిర్మాణంలో గతంలో రహదారిని ఎటువైపు నిర్మించాలన్న సమస్యపై తర్జనభర్జనలు జరిగిన అనంతరం ఒక కొలిక్కి వచ్చింది. ఆ తర్వాత అప్రోచ్ రోడ్ నిర్మాణానికి స్థల సేకరణ జరిగింది. కానీ ఇప్పటివరకు రైతుల భూములకు నష్టపరిహారం చెల్లించటానికి జిల్లా కలెక్టర్ మార్కెట్ ధర నిర్ణయించడంలో జాప్యం చేస్తున్నారని రైతులు తెలిపారు. కృష్ణా జిల్లాలో పులిగడ్డ వైపు అప్రోచ్ రోడ్ నిర్మాణం పూర్తయినప్పటికీ, గుంటూరు జిల్లా పెనుమూడివద్ద అప్రోచ్ రోడ్ నిర్మాణ పనులు చేపట్టడంలో తగిన ఉత్తర్వులు ఇవ్వడంలో జిల్లా యంత్రాంగం తాత్సారం చేస్తున్నదని విమర్శలు వస్తున్నాయి. వారధి నిర్మాణం పూర్తయి ఏడాది గడిచినా అప్రోచ్ నిర్మాణంలో జాప్యం చేయడానికి గల కారణాలు ఏమిటని ప్రజలు ప్రశ్నిస్తున్నారు. కొంతకాలం క్రితం స్థానిక రెవెన్యూ అధికారులు అప్రోచ్ రోడ్ నిర్మాణానికి అవసరమైన సుమారు 40 మంది రైతుల పొలాలనుంచి 16 ఎకరాల భూమి అవసరమని, సర్వేచేసి 'డ్రాఫ్ట్ నోటిఫికేషన్ డ్రాఫ్ట్ డిక్లరేషన్'(డిఎన్‌డిడి) జాబితా తయారుచేసి తెనాలి ఆర్డీవోకి పంపించారు. సిఫార్సు చేస్తూ అక్కడినుంచి జిల్లా కలెక్టర్‌కు ఫైల్ పంపించారు. నెలరోజుల క్రితం జిల్లా జాయింట్ కలెక్టర్ రాహుల్ బొజ్జా పెనుమూడివద్ద వారధిని సందర్శించి అప్రోచ్ రోడ్‌నిర్మాణానికి గల అవరోధాల గురించి రెవెన్యూ అధికారులు, రైతులను అడిగి తెలుసుకున్నారు. సెప్టెంబరు నెలలోగా రైతులకు మార్కెట్ ధర నిర్ణయించి భూములకు నష్టపరిహారాన్ని అందిస్తామని అప్రోచ్ రోడ్ నిర్మాణ పనులు ప్రారంభిస్తామని రైతులకు హామీనిచ్చినా ఇప్పటివరకు కార్యరూపం దాల్చలేదు. వెంటనే డ్రాఫ్ట్ నోటిఫికేషన్, డ్రాఫ్ట్ డిక్లరేషన్ ప్రకటించాలని, వారధి అప్రోచ్ రోడ్ నిర్మాణ పనులు జరిగేలా జిల్లా కలెక్టర్ చర్యలు తీసుకోవాలని తీరప్రాంత ప్రజలు కోరుతున్నారు.

ఈ వారధి అప్రోచ్ రోడ్ నిర్మాణం పూర్తయితే కోస్తా జిల్లాలైన తూర్పు, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాలను కలుపుతూ జాతీయ రహదారి నిర్మాణ పనులు కూడా చేపట్టనున్నారు. ఇప్పటికే రేపల్లె పట్టణంలోని స్థానిక అంకమ్మచెట్టువద్ద నుంచి బాపట్లవరకుగల సుమారు 56 కిలోమీటర్ల ఆర్ అండ్ బి రోడ్డును జాతీయ రహదారి శాఖకు అప్పగించారు. ఈ కోస్తా రహదారివల్ల తూర్పుగోదావరి జిల్లాలోని కత్తిపూడి నుంచి కాకినాడ, యానాం, అమలాపురం, నరసాపురం, మొగల్తూరు, పల్లెపాలెం, బట్టుమిల్లి, పెడన, మచిలీపట్నం, చల్లపల్లి, పులిగడ్డ, రేపల్లె, భట్టిప్రోలు, చెరుకుపల్లి, చందోలు, బాపట్ల, చీరాల, ఒంగోలు వరకు ప్రస్తుతం ఉన్న జాతీయ రహదారి నెంబరు అయిదుకు ప్రత్యామ్నాయ రహదారి నిర్మాణం జరుగుతున్నది. పెనుమూడి-పులిగడ్డ వారధి మీద ప్రయాణించడం ద్వారా అయిదు జిల్లాల పట్టణాలు, గ్రామాల మధ్య దూరం గణనీయంగా తగ్గుతుంది. అవనిగడ్డ నుంచి రేపల్లె మధ్య ప్రయాణ దూరం 156 కిలోమీటర్లు, అవనిగడ్డ నుంచి తెనాలి 114 కిలోమీటర్లు, నరసాపురం నుంచి రేపల్లె 112 కిలోమీటర్లు, మచిలీపట్నం నుంచి రేపల్లె 101 కిలోమీటర్ల దూరాభారం తగ్గుతుంది. తీరప్రాంత ప్రజల చిరకాల స్వప్నంగా భావిస్తున్న ఈ వారధి అప్రోచ్ రోడ్ నిర్మాణ పనులు రానున్న వేసవిలోనైనా పూర్తవుతాయో లేదోనని ప్రజలు వాపోతున్నారు.

# ఆంధ్రజ్యోతికి తృతీయ వార్షికోత్సవ శుభాకాంక్షలు

నిజాలను నిర్భయంగా రాస్తూ దేశంలో జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను వెలికితీస్తూ ప్రజలను ఆకర్షిస్తున్న ఆంధ్రజ్యోతి దిన పత్రికకు వార్షికోత్సవ శుభాకాంక్షలు

## ఇట్లు

కందిమళ్ళ రఘురామారావు
యం.పి.పి., యడ్లపాడు

మద్దినేని వెంకట సుబ్బారావు
మాజీ సొసైటీ అధ్యక్షులు, యడ్లపాడు

సి. హెచ్. సువార్త
యం.డి.ఓ. యడ్లపాడు

గోనుగుంట్ల జయలక్ష్మి
గోనుగుంట్ల శివ
జడ్.పి.టి.సి., యడ్లపాడు

కుర్రా రత్తయ్య
సర్పంచ్, ఉన్నవ

పంచాయితీ రాజ్ ఏ.ఇ.
హనుమాన్, యడ్లపాడు

చల్లా యగ్నేశ్వరరెడ్డి
యడ్లపాడు

పోపూరి హనుమంతరావు
మేడూరి శివనాగేశ్వరరావు
దింటెనపాడు

బి. రామారావు
సబ్ ఇన్‌స్పెక్టర్, యడ్లపాడు

అల్లు వీర రాఘవయ్య చౌదరి
సర్పంచ్, జాలాది.

ఒశల పద్మజా శివరామకృష్ణ
సర్పంచ్, బంఘీస్కాన్ పేట

శేఖర్ బాబు
ఆర్.డబ్ల్యు.ఎస్.ఎ.ఇ

షేక్ సాంబశివరావు
సర్పంచ్, లింగారావుపాలెం

యుజావర్ అబ్దుల్ కలాం
సర్పంచ్, కొండవీడు

జి. నవీన్ కుమార్
వ్యవసాయాధికారి, యడ్లపాడు

మద్దూరి వీరారెడ్డి
సర్పంచ్, సోలస

అత్తోట శాంతమ్మ
ఆత్తోట రామారావు
సర్పంచ్, వింతెనపాడు

కె. గంగాధర రావు
యడ్లపాడు సొసైటీ

దేవరపు పద్మా
దేవరపు చౌదరి
ఎం.పి.టి.సి., దింతెనపాడు

నల్లపనేని గంగయ్య
లింగారావు పాలెం

కల్లూరి హరిబాబు
చౌక డిపో డీలరు, యడ్లపాడు

పావులూరి శ్రీనివాసరావు
సర్పంచ్, తిమ్మాపురం

కట్టా శ్రీహరిరావు
లింగారావుపాలెం

మండెపూడి శ్రీనివాసరావు
నంబూరు వీరాంజనేయులు
చౌకడిపో డీలర్సు, లింగాయపాలెం

ఆలోకం సత్యన్నారయణ
జిల్లా తెలుగు రైతు కమిటి కార్యదర్శి

కాగజ్ ఇబ్రహీం
ఎం.పి.టి.సి., కొండవీడు

మదూరి శ్రీనివాసిరెడ్డి
మండల టి.డి.పి. అధ్యక్షులు, సోలస

ముద్దన నాగేశ్వరిరావు
జాలాది నీటి వినియోగదారుల సంఘం అధ్యక్షులు

పారా కిషోర్
యడ్లపాడు

వడ్డేపల్లి శివశంకరావు
సర్పంచ్, వంకాయలపాడు

రావూరి నాగేశ్వరరావు
విజయదుర్గా స్టోన్‌క్రషర్, బోయపాలెం

కల్పన స్టోన్‌క్రషర్స్
బోయపాలెం

భవాని స్టోన్‌క్రషర్
బోయపాలెం

స్టోన్‌క్రషర్ యూనియన్
అధ్యక్షులు,
చెరుకూరి ప్రసాద్

శ్రీనివాస స్టోన్‌క్రషర్
బోయపాలెం

సాయిదుర్గా స్టోన్‌క్రషర్
బోయపాలెం

కుర్రా అప్పారావు
ఉన్నవ

రూట్స్ స్వచ్ఛంధ సంస్థ
డైరక్టర్ : చందోలు కామేశ్వరరావు
మెయిన్ బజారు, యడ్లపాడు

విశ్వసౌభాగ్య మిల్క్‌డైరీ
వంకాయలపాడు

ఆకి శివ వెంకటేశ్వర్లు
బోయపాలెం

కాసు వెంకటరెడ్డి
వి.జి.టి.యం. ఊడా లీగల్ అడ్వయిజర్

మానుకొండ విజయభాస్కరరెడ్డి
జిల్లా తెలుగుయువత కార్యదర్శి, కారుచోల

జాజుల లక్ష్మి
జాజుల పోతురాజు
సర్పంచ్, కారుచోల

కేసరి ముత్యాలరెడ్డి
మాజీ సర్పంచ్, కారుచోల

చౌడవరపు రామారావు
జగ్గాపురం



# కనుమరుగైన పోలీసు సింహం ఉమేష్ చంద్ర

(ఆన్‌లైన్ - తెనాలి)

కుందేళ్ళు తోడేళ్ళను తరిమికొట్టిన నేల విద్యానగరం విజయనగరమైంది. ఒక సింహం విద్రోహశక్తులను వేటాడిన నేల ఒక కడపయ్యింది, ఒక కరీంనగరమైంది. ఆ సింహ గర్జనకు సీమ బాంబులు తుస్సుమన్నాయి, తెలంగాణా అరణ్యాలు దద్దరిల్లాయి. ఆ సింహమే ఉమేష్ చంద్ర. ఆ గర్జనలింకా ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. ఆ కనుమరుగైన సింహం పోలీస్ శాఖకే గర్వకారణం, ఆదర్శం.

## పెదపూడి నుంచి ఐపిఎస్ దాకా...

కర్తవ్యానికి అంకిత భావాన్ని జోడించి వృత్తి బాధ్యతల నిర్వహణలో తనకు తానే సాటి అని నిరూపించుకున్న అత్యుత్తమ పోలీస్ అధికారి చదలవాడ ఉమేష్ చంద్ర. 1966 మార్చి 29న గుంటూరు జిల్లా తెనాలిలో జన్మించారు. తెనాలి సమీపంలోని పెదపూడి ఆయన స్వగ్రామం. చదలవాడ వేణుగోపాలరావు, నయనతార ఉమేష్ చంద్ర తల్లిదండ్రులు. తాత ఉమామహేశ్వరరావు అప్పట్లో జస్టిస్ పార్టీ లీడర్‌గా ఉన్నారు. చిన్న వయస్సులోనే చురుకుదనం, క్రమశిక్షణ ఉమేష్ చంద్ర అణువణువులోనూ జీర్ణించుకు పోయాయి. 1972 నుండి 1984 వరకూ బేగంపేటలోని హైదరాబాద్ పబ్లిక్ స్కూలులో ఆయన విద్యాభ్యాసం కొనసాగింది. అద్భుతమైన తెలివితేటలతో, అగ్రశ్రేణి మార్కులతో, బంగారు పతకాలతో ఆయన తన +2 చదువు పూర్తి చేశారు. సహజంగానే చదువు పట్ల విపరీతమైన శ్రద్ధ, ఆసక్తి ఉన్న ఉమేష్ చంద్ర ఆటపాటల్లో సైతం అదే ఉత్సాహాన్ని చూపించేవారు. ప్రతిసారీ గెలిచి తీరాలన్న పట్టుదల, ఆయన్ని తన మిత్ర బృందంలో అగ్రస్థానంలో నిలబెట్టింది. స్కూల్ చదువు పూర్తయ్యాక 1984 నుండి 1987 వరకూ ఆయన హైదరాబాద్‌లోని నిజామ్ కాలేజిలో బి.ఏ. చదివారు. తర్వాత ఎకనమిక్స్‌లో ఎం.ఏ. కూడా చేశారు. ప్రతి స్థాయిలోనూ ఉమేష్ చంద్ర ప్రథమ శ్రేణి సాధించడమే కాకుండా బంగారు పతకాలను సునాయాసంగా కైవసం చేసుకున్నారు. దీని వెనుక అకుంఠిత దీక్ష ఉంది. స్కూలులో చదువుతున్నప్పటి నుండి ఐఏఎస్ లేదా ఐపిఎస్ ఆఫీసర్ కావాలన్న దృఢ సంకల్పం ఉమేష్ చంద్రలో, ఆయనతో పాటు పెరిగి పెద్దదై ఒక లక్ష్యంగా రూపు దిద్దుకుంది. ఆ దిశలో ఆయన చేసిన కృషి ఫలించి 1991లో ఇండియన్ పోలీస్ సర్వీస్‌కు ఎంపికయ్యారు.

## ఆత్మవిశ్వాసం... పట్టుదల

అనుకున్నది సాధించాలన్న పట్టుదల, సాధించగలనన్న ఆత్మవిశ్వాసం ఉమేష్‌చంద్ర స్వంతం. సివిల్ సర్వీస్‌కి ఎంపిక కావడం మినహా మరే వృత్తి, ఉద్యోగం పట్ల ఆయన ఆసక్తి చూపలేదు. హైదరాబాద్‌లోని సర్దార్ వల్లభాయి పటేల్ జాతీయ పోలీస్ అకాడమీలో శిక్షణ పొందిన అనంతరం ఉమేష్ చంద్ర వరంగల్ జిల్లా ఎఎస్‌పి ట్రైయినీగా నియమితులయ్యారు. ఆరు నెలలకు వరంగల్ రూరల్ సబ్ డివిజన్ ఎఎస్‌పిగా నియమితులయ్యారు. ఉద్యోగ నిర్వహణలో ఎదురైన ప్రతి సవాలును తన బాధ్యతగా స్వీకరించిన ఉమేష్ చంద్ర అనతి కాలంలోనే అత్యంత సమర్థుడైన పోలీస్ అధికారిగా అందరి ప్రశంసలు అందుకున్నారు. ఉద్యోగ నిర్వహణలో భాగంగా కడప జిల్లా పులివెందుల ఎఎస్‌పిగా నియమితులైన ఉమేష్ చంద్ర అక్కడ సమాంతర ప్రభుత్వాలు నడిపే ఫ్యాక్షనిస్టుల పాలిట సింహ స్వప్నమయ్యారు. ఒక చోట విచ్ఛిన్నకర శక్తుల అరాచకత్వం... మరోచోట సంఘ విద్రోహ శక్తుల దౌర్జన్యం... అయినా ఎక్కడా, ఎప్పుడూ ఉమేష్ చంద్ర వెరవలేదు. చట్టాన్ని, శాంతి భద్రతలను, సామాన్య ప్రజలను కాపాడటానికి తన నిబద్ధతను, చిత్త శుద్ధిని ఎక్కుపెట్టిన ఖాకీ సింహంగా ఆయన పేరొందారు.

## పోరాటమే ఆయన జీవితం

పులివెందుల అనంతరం వరంగల్ జిల్లా అదనపు ఎస్‌పి (ఆపరేషన్స్)గా నియమితులైన ఉమేష్ చంద్ర తన విధి నిర్వహణలో ముళ్ళ బాటను ఎన్నుకున్నారు, పోరాటాన్నే జీవితంగా మలచుకున్నారు. వరంగల్ నుంచి 1995 జూన్‌లో కడప ఎస్‌పిగా నియమితులైన ఉమేష్ చంద్ర అక్కడి నాటు బాంబుల కుటీర పరిశ్రమ పునాదులను కదిలించారు. రాయలసీమను గడగడలాడించిన ఫ్యాక్షనిస్టుల పక్కలో బల్లెమయ్యారు. ఫలితంగా ఉమేష్ చంద్ర పని చేసిన కాలంలో కడప ప్రజలు ప్రశాంతంగా నిద్రించారు. కడప జిల్లా తుపాను, వరద బీభత్సంతో తల్లడిల్లిపోయినప్పుడు నిరాశ్రయులైన పేద గ్రామీణులకు కొండంత అండగా నిలిచారు. వరద బాధితులు కోలుకుని తమ మామూలు జీవనం ప్రారంభించే వరకు ఆకలి, రోగాలకు వారు బలి కాకుండా నిత్యావసర వస్తువులను, మందులను అందించి మానవతా స్ఫూర్తిని ఆయన చాటుకున్నారు. ఈ విధంగా పోలీసు శాఖ ప్రతిష్టను పెంచి ప్రతి పోలీసు గర్వంగా తన వృత్తి బాధ్యతలు నిర్వర్తించేలా చేయగలిగిన ఉమేష్ చంద్రను ప్రభుత్వం అనంతరం కరీంనగర్ ఎస్‌పిగా బదిలీ చేసింది. ఆ సందర్భంలో కడప జిల్లా వాసులు తమ ఆత్మీయుడు దూరమవుతున్నంతగా బాధపడ్డారు. పోలీసుఅధికారిని పోలీసు యంత్రాంగమే కాక ప్రజలు ఆరాధించడం రాష్ట్ర చరిత్రలోనే చిరస్మరణీయం.

నక్సల్స్ ప్రభావిత ప్రాంతమైన కరీంనగర్ ఎస్‌పిగా ఉమేష్ చంద్ర సంవత్సర కాలం మాత్రమే పని చేశారు. ప్రతి క్షణం విధి నిర్వహణకు అంకితమైన ఉమేష్ చంద్ర వంటి సమర్థుడైన అధికారికి ఆ సంవత్సర కాలమే ఎంతో అమూల్యంగా నిలిచింది. ప్రభుత్వం చొరబడలేని మారుమూల పల్లెల్లోకి ప్రభుత్వ యంత్రాంగాన్ని ఆయన ధైర్యంగా తీసుకెళ్ళగలిగారు. తీవ్రవాదం బారిన పడి అభివృద్ధికి ఆమడ దూరంలో మిగిలిపోయిన కరీంనగర్ జిల్లాకు కొండంత విశ్వాసాన్ని అందించారు. నక్సల్స్‌ను జన జీవన స్రవంతిలోకి తీసుకురావడంలో కీలక పాత్ర వహించారు. విద్రోహ కార్యకలాపాలకు పాల్పడే దళాలపై దాడులు చేస్తూ వాటిని అరికట్టారు. ధైర్యస్థైర్యాలు, ఎంతో పకడ్బందీ వ్యూహ రచన అవసరమైన 'కోవర్ట్ ఆపరేషన్'ను అత్యంత చాకచక్యంగా నిర్వర్తించి ఆరితేరిన మేధావులు నివ్వెరపోయేలా చేశారు. నక్సలైట్ల వెన్నులో వణుకు పుట్టించి శాంతి భద్రతలను క్రమబద్ధీకరించడంలో తనకు తానే సాటి అని కరీంనగర్ జిల్లా ఎస్‌పిగా ఆయన నిరూపించుకున్నారు. కరీంనగర్ నుండి ఆయనను హైదరాబాద్‌కు బదిలీ చేసినప్పుడు ఆ జిల్లాలోని ప్రతి కానిస్టేబుల్ తమ శరీరం నుంచి ఒక భాగాన్ని వేరు చేస్తున్నంతగా భావోద్వేగానికి లోనయ్యారు. ఉమేష్ చంద్ర బదిలీకి నిరసనగా కరీంనగర్‌లో పోలీసులు జరిపిన ప్రదర్శనకు ఉమేష్ చంద్రనే బాధ్యునిగా చేశారు. ఉమేష్‌కు పెరిగిపోయిన పేరు ప్రతిష్టలు, దూసుకుపోయే తత్వం నాయకులు, ఉన్నతాధికారులలో అసహనాన్ని రేకెత్తించింది. చివరకు అది ఆయన సస్పెన్షన్‌కు దారి తీసింది. తర్వాత ఉమేష్ చంద్ర హైదరాబాద్‌లో ఎఐజి (సంక్షేమం, క్రీడలు)గా నియమితులయ్యారు. ప్రతి పనిని ఒక క్రమ పద్ధతిలో నిర్వర్తించడం ఉమేష్ చంద్ర అలవాటు. ఏ క్రమం లేక అన్ని అక్రమాలకు ఆలవాలమైన వ్యవస్థలన్నీ ఆయన క్రమశిక్షణను, చిత్త శుద్ధిని, అంకిత భావాన్ని, నిజాయితీని భరించలేక పోయాయి. ఫలితంగా ఆయన హైదరాబాద్‌కు బదిలీకి కారణమైంది.

## నేలకొరిగిన మేరునగధీరుడు

అది 1999 సెప్టెంబరు 4వ తేదీ. ఎటు చూసినా ఎన్నికల కోలాహలం. విధి నిర్వహణ నిమిత్తం ఉదయాన్నే కార్యాలయానికి బయలుదేరిన ఉమేష్ చంద్రను హైదరాబాద్ నడిబొడ్డులో నక్సలైట్లు బలిగొన్నారు. అహర్నిశలు తన సర్వశక్తులను సమీకరించుకుని, పోలీసు శాఖలోని సహచరులందరినీ కూడగట్టుకుని సామాజిక భద్రత కోసం పరితపించిన ఉమేష్ చంద్రను చివరకు అసాంఘిక శక్తుల ఘాతుకానికి నేలకొరిగారు. ఈ సంఘటన రాష్ట్రం మొత్తాన్ని నివ్వెర పోయేలా చేసింది. ప్రత్యేకించి పోలీస్ శాఖ మొత్తం హైదరాబాద్‌కు కదిలింది. తాను చేసిన ప్రతి చోటా విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించి ప్రతిసారీ తనదైన ముద్ర వేసుకుంటూ బదిలీలపై వెళ్ళడం అలవాటైన ఉమేష్ చంద్ర శాశ్వతంగా బదిలీ అయి వెళ్ళిపోయినా ఆయన చూపించిన మార్గం, ప్రదర్శించిన తెగువ, సాహసం పోలీసు శాఖకు ఆదర్శంగా నిలిచింది. అందుకే ప్రతి పోలీసు ఆ ప్రచండ భానునికి నమస్కరిస్తూనే ఉంటారు.




# ఆర్థిక పథంలో ముందడుగు - సహకార రంగానికి వెలుగు

( ఆన్‌లైన్,తెనాలి)

సహకార రంగంలో జిల్లాకు అంతర్జాతీయంగా గుర్తింపు తీసుకువచ్చిన ఘనత సంగం డెయిరీకి దక్కుతుంది. రాష్ట్ర పాడిపరిశ్రమలో సహకార రంగాన ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొని గుంటూరు జిల్లా పాల ఉత్పత్తిదారులకు చేదోడువాదోడుగా నిలిచిన సంస్థగా డెయిరీ పేరొందింది. జాతీయ పాడి పరిశ్రమాభివృద్ధి సంస్థ సహకారంతో 1978లో ఆపరేషన్ ఫ్లడ్-1 పథకం కింద ప్రారంభమైన గుంటూరు జిల్లా పాల ఉత్పత్తిదారుల సహకార సంఘం 1997లో దేశంలోనే ప్రప్రథమంగా 1995 పరస్పర సహాయక సహకార సంఘంగా రూపుదిద్దుకుంది. రాష్ట్రంలో గత అయిదారు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా వచ్చిన లాభాలను ధర వ్యత్యాసం కింద తిరిగి ఉత్పత్తిదారునికి చెల్లిస్తున్న సంస్థగా సంగం డెయిరీని పేర్కొనవచ్చు. ఇటీవల పాల సేకరణ కొంత మేర తగ్గినా లాభాల బాటలోనే కొనసాగుతోంది. తగ్గిన పాల సేకరణ స్థానంలో ఇతర డెయిరీల నుంచి కోటి లీటర్లకు పైగా సేకరించి ఆ పాలను పాల పదార్థాలుగా తయారు చేయడం ద్వారా పని సామర్థ్యాన్ని పెంచుకుంది. జిల్లాలో ఇబ్బడిముబ్బడిగా పుట్టుకొచ్చిన ప్రైవేటు డెయిరీల పోటీని తట్టుకుని నిలబడడం జిల్లా ప్రైవేటు డెయిరీల పోటీని తట్టుకుని నిలబడడం జిల్లా పాల ఉత్పత్తిదారులకు డెయిరీపై ఉన్న నమ్మకానికి ప్రతీక. డెయిరీస్థాపించిన *(మిగతా 102వపేజీలో)*

(101వ పేజీ తరువాయి)

నాటి నుంచి పాల ఉత్పత్తిదారులకు ఉచిత వైద్య సేవలు, అత్యవసర వైద్యం, సబ్సిడీపై పశువుల దాణా, పశుగ్రాస విత్తనాల సరఫరా, ఇతర రాష్ట్రాలలో అభివృద్ధి పథంలో ఉన్న డెయిరీలను సందర్శించే అవకాశం ఉత్పత్తిదారులకు కలుగజేయడం, గ్రామాలలో పశు పోషణపై 'ఫిలిం

## ఆర్థిక పథంలో ముందడుగు

## సహకార రంగానికి వెలుగు

షో'ల ప్రదర్శన, ఉచితంగా పశువులకు కృత్రిమ గర్భధారణ, సంకర జాతి ఆవుల్కు, దున్నపోతుల పంపిణీ, పాడి పరిశ్రమకు సంబంధించిన పలు అంశాలపై శిక్షణ కార్యక్రమాలు నిర్వహించడం ద్వారా అనేక రకాలుగా ఉత్పత్తిదారులకు సహాయ సహకారాలు అందిస్తుంది. కొన్ని ప్రైవేటు డెయిరీలు ధర ఎక్కువగా చెల్లించి తాత్కాలికంగా ప్రయోజనం కలిగిస్తున్నా, ధరతో పాటు ఎన్నో ప్రయోజనాలను అందిస్తున్న సంస్థగా సంగం డెయిరీ నమ్మకం కలిగి ఉంది.

సంగం డెయిరీ పాల ఉత్పత్తులకు కూడా రాష్ట్రంలో మరే ఇతర డెయిరీ ఉత్పత్తులకు లేనంత గిరాకీ ఉండటం డెయిరీ ఉన్నత నాణ్యత ప్రమాణాలకు మచ్చు తునక. సంగం డెయిరీ టేబుల్ బట్టర్, వైట్ బట్టర్, స్కిమ్ మిల్క్ పౌడర్లకు జాతీయ స్థాయి మార్కెట్ సెంటర్లలో హెచ్చు ధర ఉంది. డెయిరీ ఏటా సుమారు 1000 టన్నుల వరకు స్కీమ్ మిల్క్ పౌడర్, 900 టన్నుల వైట్ బట్టర్, 800 టన్నుల నెయ్యి, 600 టన్నుల టేబుల్ బట్టర్‌లను మార్కెట్ చేస్తుంది. పాల ఉత్పత్తులకే కాక సంగం డెయిరీ పాలకు జిల్లాలోనే కాకుండా హైదరాబాదు, తిరుపతి, చెన్నయ్ లాంటి నగరాలలో సైతం మంచి డిమాండ్ ఉంది. రోజుకు సరాసరిన లక్ష లీటర్ల వరకు పాలను ప్యాకెట్ల రూపంలో వినియోగదారులకు అందజేస్తుంది.

రాష్ట్రంలోనే కాక ఇతర రాష్ట్రాలలోని ప్రైవేటు డెయిరీలు సైతం సంగం డెయిరీ పాల కోసం క్యూలలో నిలబడతాయనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

### విదేశాలకు ఎగుమతులు

సంగం డెయిరీ ఉత్పత్తులకు దేశంలోనే కాక విదేశాలలో సైతం మంచి డిమాండ్ ఉంది. సంగం నెయ్యి ఇప్పటికే గల్ఫ్ తదితర దేశాలకు ఎగుమతి అవుతోంది. డెయిరీ ఉత్పత్తులకు అంతర్జాతీయ ప్రమాణాలు ఉన్నాయని విదేశాలకు జరుగుతున్న ఎగుమతుల ద్వారా స్పష్టమైంది. జిల్లాలో సీజన్‌లో రోజుకు ఏడు లక్షల లీటర్ల పాల ఉత్పత్తి జరిగితే అందులో సగానికి పైగా పాలను సంగం డెయిరీ సేకరిస్తోంది. గ్రామ గ్రామాన డెయిరీకి అనుబంధంగా పాల సొసైటీలు ఉన్నాయి. 75 శాతం సొసైటీలకు స్వంత భవనాలు ఉండటం విశేషం.

ఇక, గుంటూరులో డెయిరీ ఒక సీడ్ ప్రాసెసింగ్ ప్లాంటును నిర్వహిస్తోంది. దీని ద్వారా రైతులకు అవసమైన పశుగ్రాస విత్తనాలను తయారు చేసి సబ్సిడీపై అందిస్తున్నారు. డెయిరీ ఉత్పత్తులలో పాల పదార్థాలతో పాటు మినరల్ వాటర్, మ్యాంగో జ్యూస్ వంటి అదనపు ఉత్పత్తులు ప్రజాదరణ పొందాయి. అన్ని వర్గాల ప్రజలకు అందుబాటులో ఉండేలా సంగం డెయిరీ ఉత్పత్తుల ధరలను నిర్ణయించారు. రాష్ట్రంలో అనేక సహకార డెయిరీలు ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుండగా, గుంటూరు జిల్లా డెయిరీ మాత్రం ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాగిపోతుండటానికి డెయిరీకి, రైతులకు మధ్య ఉన్న పరస్పర అవగాహనే ప్రధాన కారణమని చెప్పవచ్చు. అన్నింటికి మించి సంగం డెయిరీకి అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు కల్పిస్తూ హ్యాసప్ అవార్డులు లభించాయి. భవిష్యత్తులో మరిన్ని ఉత్పత్తులతో తన మార్కెటింగ్‌ను విస్తృత పర్చుకునేందుకు సంగం డెయిరీ కార్యాచరణ ప్రణాళిక సిద్ధం చేసుకుంటోంది.



**Quality Education within the reach of all :: Quality Education within the reach of all**





# ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం

## దూరవిద్యా కేంద్రం, నాగార్జున నగర్ - 522 510. ఆం. ప్ర.

- ❖ ఆర్థిక, సామాజిక కుటుంబ పరిస్థితులు అనుకూలించక చదువు మధ్యలో ఆపివేసిన వారి కొరకు.
- ❖ చిన్న వయస్సులోనే కుటుంబ నిర్వహణ భారం పడి ఏదో ఒక వ్యాపకాన్ని ఎంచుకొన్న వారి కొరకు.
- ❖ వివాహం చేసుకొని తదుపరి చదువు ఆవశ్యకతను గుర్తించి అవకాశాల కొరకు వేడికే మహిళల కొరకు.
- ❖ ఉద్యోగంలో చేరి ప్రమోషన్లకవసరమైన ఉన్నత విద్యార్హతలు సాధించాలనుకొనే వారి కొరకు.
- ❖ ఆర్థిక కారణాల రీత్యా కళాశాలలో చదువుకోలేని వారి కొరకు.
- ❖ ప్రభుత్వ, ప్రైవేటు సంస్థలలో పనిచేసే ఉపాధ్యాయులకు, ఇతర ఉద్యోగస్తులకు
- ❖ వ్యాపార వ్యవహారాలు నిర్వహించుకొనే వారికి, స్వయం ఉపాధి కార్యక్రమాలు చేసుకొనేవారికి వయస్సు నిబంధనలు లేకుండా అందరికి అందుబాటులో ఉండే ఫీజులతో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం దూరవిద్యా కేంద్రాన్ని స్థాపించి దిగువ కోర్సులను అందజేస్తుంది.




## U.G. COURSES

| CODE | COURSE NAME |
|---|---|
| 40 | B.A. (Economics, History, Politics) |
| 41 | B.A. (Economics, Public Admn., Politics) |
| 42 | B.A. (Economics, Public Admn., Sociology) |
| 43 | B.A. (Economics, History, Sociology) |
| 44 | B.A. (Economics, Politics, Sociology) |
| 45 | B.A. (History, Politics, Sociology) |
| 46 | B.A. (Public Admn.,Politics, Sociology) |
| 47 | B.A. (Public Admn., Politics, History) |
| 48 | B.A. (Maths, Politics, Economics) |
| 49 | B.A. (Maths, English, History) |
| 50 | B.A. (Maths, Telugu, History) |
| 51 | B.A. (English, Economics, Public Admn.) |
| 52 | B.A. (English, Economics, Politics) |
| 53 | B.A. (English, History Politics) |
| 54 | B.A. (English, Politics, Public Admn.) |
| 55 | B.A. (English, History, Telugu) |
| 56 | B.A. (Telugu, History, Sociology) |
| 57 | B.A. (Telugu, History, Politics) |
| 58 | B.Com. (General) |
| 59 | B.Sc. (Botany, Zoology, Chemistry) |
| 60 | B.Sc. (Maths, Physics, Chemistry) |
| 61 | B.Sc. (Costume Design & Fashion Technology) |
| 62 | B.Sc. (Information Technology) |
| 63 | B.Sc. (Maths, Statistics, Computers) |
| 64 | B.B.M. |

## P.G. COURSES

| CODE | COURSE NAME | CODE | COURSE NAME |
|---|---|---|---|
| 01 | M.Sc. (Botany) | 04 | M.Sc. (Chemistry) |
| 02 | M.Sc. (Zoology) | 05 | M.Sc. (Microbiology) |
| 03 | M.Sc. (Physics) | 06 | M.Sc. (Mathematics) |
| 07 | LL.M.(Labour Laws) | 09 | LL.M (Torts and Crimes) |
| 08 | LL.M (Constitutional Law and Administrative Law) | 10 | LL.M (Corporate and Securities Law) |
| 11 | M.B.A. | 19 | M.A. (Sociology) |
| 12 | M.Com. (Accountancy) | 20 | M. A. (Economics) Agricultural Economics and Rural Development option |
| 13 | M.Com. (Banking) | 21 | M.A. Social Work |
| 14 | M.A. (English) | 22 | M.A. Psychology |
| 15 | M. A. (Telugu) | 23 | M.H.R.M. |
| 16 | M.A.(Economics) Economics of Industry option | 24 | M.C.A. |
| 17 | M.A. (History) | | |
| 18 | M.A. (Political Science) | | |

## PG DIPLOMA / ONE YEAR COURSES

| Code | | Course Name |
|---|---|---|
| 80 | B.L.I.Sc. | (Bachelor of Library & Information Science) |
| 81 | PGDBI | (PG Diploma in Bioinformatics) |
| 82 | PGDBT | (PG Diploma in Biotechnology) |
| 83 | PGDHHM | (PG Diploma in Hospital & Health Care Management) |
| 84 | PGDBM | (PG Diploma in Business Management) |
| 85 | PGDMM | (PG Diploma in Marketing Management) |
| 86 | PGDHRM | (PG Diploma in Human Resource Management) |
| 87 | PGDFM | (PG Diploma in Financial Management) |
| 88 | PGDBFM | (PG Diploma in Banking and Financial Management) |
| 89 | PGDIB | (PG Diploma in International Business) |
| 90 | PGDTTM | (PG Diploma in Travel and Tourism Management) |
| 91 | PGDIM | (PG Diploma in Insurance Management) |

*Special features :*

- ◆ Poineer in starting PG and UG Science Courses under the distance mode.
- ◆ Admissions are made twice a year i.e., Academic year Batch (July to June), Calendar Year Batch (January to December).
- ◆ Examinations are held twice a year in May and December. ◆ Supplementary examination and betterment facility to the CDE students. ◆ Weekend Classes / Practicals through Study Centres of Student's Choice.
- ◆ Wide network of Examination Centres for the convenience of the students. ◆ No upper age limit for admission into any of the courses. ◆ Candidates studying other courses on regular basis are also eligible for admission into any one of the courses offered by the CDE, TC and MC need not be submitted.

**DIRECTOR, CENTRE FOR DISTANCE EDUCATION, ACHARYA NAGARJUNA UNIVERSITY**

Nagarjuna Nagar - 522 510, Guntur A.P. &:0863 - 2293299, 2293356; 2293189 - Ext.180; Cell:98482 85518

website : www.nagarjunauniversity.ac.in; e-mail : cde@nagarjunauniversity.ac.in, anucde@yahoo.com, anucde@hotmail.com

Quality Education within the reach of all :: Quality Education within the reach of all

# భక్తుల పాలిటి పెన్నిధి వైకుంఠపుర వాసుని సన్నిధి



వైకుంఠపురం దేవస్థానం

**(ఆన్‌లైన్, తెనాలి)**

కళలకు కాణాచిగా, ధర్మ దాతృత్వాలకు పెన్నిధిగా, ఆంధ్రా ప్యారిస్‌గా ఖ్యాతినార్జించిన తెనాలి పట్టణంలో అంతర్భాగమై, రేపల్లె రైల్వే బ్రిడ్జి సమీపంలోని వైకుంఠపురంలో నిర్మితమైన శ్రీ లక్ష్మీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వర స్వామి దేవస్థానం దేశంలోని దివ్య క్షేత్రాలలో ఒకటిగా ప్రసిద్ధికెక్కింది. శాంతికి, ప్రశాంతికి నిలయమైన వాతావరణంలో నిర్మించబడిన ఈ దేవాలయం కమనీయంగాను, కన్నుల పండువగాను, కామితార్థదాయకంగాను విలసిల్లుతోంది. నిత్యకళ్యాణం పచ్చతోరణంగా విలసిల్లే శ్రీ వేంకటేశ్వరుడు భక్తాభీష్ట వరదుడై లక్ష్మీ పద్మావతీ సమేతంగా పరమ ప్రసన్న శోభలు చిందిస్తూ బహుముఖ వైభవోపేతుడై విరాజిల్లుతున్నాడు. రాష్ట్రంలోని వేలాది భక్తులకు ఈ క్షేత్రం పవిత్ర యాత్రా స్థలమై వేనోళ్ళ కొనియాడబడుతున్నది. అపర తిరుపతిగా పిలువబడే వైకుంఠపురం (మిగతా 106వ పేజీలో)

(105వ పేజీ తరువాయి)

దేవస్థానంలో స్వస్తిశ్రీ పరీధావీ నామ సంవత్సరం నిజ వైశాఖ బహుళ పంచమి శుక్రవారం స్వామివారి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది. అంతకు ముందు ఈ క్షేత్రానికి సంబంధించిన ప్రాశస్త్యం ఇలా ఉంది. దేవస్థానం సంస్థాపకులైన తుళ్ళూరు బాల నరశింహారావు గౌడ్‌కు శ్రీ వేంకటేశ్వర స్వామి నాగేంద్రుని రూపంలో స్వప్నంలో సాక్షాత్కరించి వైకుంఠపుర స్థలం పరమ పవిత్రమైందని, ఇక్కడ తనకో దేవాలయాన్ని నిర్మించవలసిందిగా ఆజ్ఞాపించి అంతర్ధానమయ్యారు. ఈ స్వప్న ఫలితంగా బాల నరశింహారావు

# భక్తుల పాలిట పెన్నిధి - వైకుంఠపుర వాసుని సన్నిధి

గౌడ్ సంఘసేవ పరాయణులతో కలిసి దేవాలయ నిర్మాణానికి సంకల్పించారు. లక్ష్మీ పద్మావతీ సమేతంగా స్వామివారి విగ్రహాలను తయారు చేయించి ఒక శుభ ముహూర్తాన ప్రతిష్ఠించారు. అప్పటి నుంచి ఈ క్షేత్ర మహత్యం దిన దిన ప్రవర్ధమానమై లక్షలాది మంది భక్తులు ఇక్కడకు వచ్చి స్వామి వారిని దర్శించి తరిస్తున్నారు.

దేవస్థాన సంస్థాపకులు బాల నరశింహారావు గౌడ్ స్వామి వారిని సందర్శించడానికి వచ్చే భక్తుల రాకపోకలకు వీలుగా దేవస్థానం స్థలం పక్కనే ప్రవహిస్తున్న తూర్పు కాల్వపై కాలి వంతెన నిర్మించారు. కాలక్రమంలో భక్తుల రద్దీ పెరగడంతో కాలి వంతెనకు ఎగువన పెద్ద వంతెన నిర్మించారు. ఏటా 50 లక్షల రూపాయిల ఆదాయం కలిగిన ఈ దేవస్థానం అనతి కాలంలోనే గణనీయమైన అభివృద్ధి సాధించింది. ప్రతి సంవత్సరం ఇక్కడ దాదాపు రెండు వేల వివాహాలు స్వామి వారి సన్నిధిలో జరుగుతుంటాయి. దూర ప్రాంతాల నుంచి వచ్చే భక్తులకోసం, వివాహాలు, అన్నప్రాసనలు జరుపుకునే భక్తుల కోసం శ్రీనివాస సదన్, పద్మావతీ సదన్‌ల పేరుతో గదులు నిర్మించారు. దేవస్థానం ఆవరణలో విశాలమైన పొంగలి షెడ్డు, కళ్యాణ మండపాలు ఉన్నాయి. దేవాలయంలో భక్తులు పొంగలి తయారు చేసుకునేందుకు గ్యాస్ పొయ్యిలు ఏర్పాటు చేశారు. భక్తులు మొక్కుబడులు చెల్లించేందుకు ఎల్లప్పుడూ నీటి వసతి గల ప్రత్యేక కేశ ఖండన శాల ఉంది. భక్తులు అతి తక్కువ ఖర్చుతో వివాహాలు జరుపుకునేందుకు కళ్యాణ మండపాలు, విశాల ప్రాంగణం ఉన్నాయి. క్రేన్ సంస్థల అధినేత గ్రంధి సుబ్బారావు 18 లక్షల రూపాయిల విరాళంతో స్వామివారికి రాజ గోపురాన్ని నిర్మించారు. దేవాలయం చుట్టూ కాంక్రీటు ఫ్లోరింగ్ వేయించి భక్తులకు సౌకర్యంగా తీర్చిదిద్దారు. భక్తుల సహకారంతో స్వామి వారికి బంగారు కిరీటం, శ్రీ స్వామి అమ్మవార్లకు రజత వస్త్రాలు, రజత మకర తోరణాలు, రజత పాదపీఠాలు అలకరించారు. నూతన రాజగోపుర కలశ ప్రతిష్ఠ అనంతరం ఆలయ వాస్తు ప్రకారం ఆగమ పండితుల సలహా మేరకు పడమర వైపు ద్వారాలు మూసివేసి తూర్పు నుంచి ఆలయంలోకి భక్తుల ప్రవేశం కోసం ఉత్తరపు రహదారిని ఆలయ నిధులతో సిమెంటు రోడ్డుగా అభివృద్ధి చేశారు.

## నిత్యాన్నదానం

శ్రీనివాసుని దర్శించ వచ్చే భక్తజనులకు తిరుమలలో మాదిరిగా శాశ్వత నిత్యాన్నదాన పథకాన్ని వైకుంఠపురం దేవస్థానంలో అమలు చేస్తున్నారు. ఈ పథకం ప్రారంభమైనప్పటి నుంచి అపూర్వ ఆదరణ లభిస్తోంది. ఎంతో మంది దాతలు ఈ పథకానికి విరాళాలు అందిస్తున్నారు. దాతల విరాళాలను శాశ్వత నిత్యాన్నదాన పథకం కింద బ్యాంకులలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసి తద్వారా వచ్చే వడ్డీతో నిత్యాన్నదాన కార్యక్రమం నిర్వహిస్తున్నారు. సాధారణ భక్తులు కూడా ఈ పథకంలో పాలు పంచుకుని వారి సహాయాన్ని అందించాలనే ఉద్దేశ్యంతో దేవస్థానం వారు విరాళాల పరిధిని గణనీయంగా విస్తరించారు. భక్తులు వెయ్యిన్నూట పదహారు నుంచి రెట్టింపు సంఖ్యలో ఎంత మొత్తాన్నైనా అన్నదాన పథకానికి ఇవ్వవచ్చు. ప్రతి ఏటా శ్రీ వేంకటేశ్వర స్వామి బ్రహ్మోత్సవాలు వైశాఖ మాసంలోనూ, ఏకాదశి సందర్భంగా ముక్కోటి ఉత్సవాలను, సంక్రాంతి పర్వదిన సందర్భంగా స్వామివారి తెప్పోత్సవాన్ని వైభవోపేతంగా నిర్వహిస్తున్నారు. గత ఎనిమిది సంవత్సరాలుగా కార్తీక మాసంలో సామూహిక సత్యన్నారాయణ స్వామి వ్రతాలను దేవస్థానం ఆధ్వర్యంలో నిర్వహిస్తున్నారు. ఈ వ్రతాలకు భక్త జనుల నుండి విశేష ఆదరణ లభిస్తోంది. కార్తీక మాసంలో ఏటా 500 మంది దంపతులు ఈ వ్రతాలలో పాల్గొంటున్నారు.



స్వామి, అమ్మవార్ల ఉత్సవ మూర్తులు

# స్వాతంత్ర్యోద్యమ ఘట్టాలను చవిచూసిన

# తెనాలి రైల్వే స్టేషన్



**(ఆన్‌లైన్ - తెనాలి)**

స్వాతంత్రోద్యమ కాలంలోనే ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించిన సన్ని వేశాలు, సంఘటనలు నింపుకున్న తెనాలి రైల్వే జంక్షన్ జిల్లాలోనే ప్రముఖ రైల్వే జంక్షన్‌గా గుర్తింపు పొందింది. ఒకనాడు కేవలం రెండు ప్లాట్‌ఫారా లతో, అరకొర సౌకర్యాలతో, స్టీమ్ ఇంజన్ల రొద మధ్య ప్రస్తుత చెన్నయ్ నాటి మద్రాస్ - హౌరాల మధ్య రైలు మార్గంలో ఉన్న తెనాలి జంక్షన్ గత దశాబ్ద కాలంలో ప్రజాప్రతినిధులు, రైల్వే అధికారుల సహకారంతో రైల్వే ప్రయాణికుల సంఘం సూచనలకు అనుగుణంగా ప్రయాణికుల అవసరా లను తీర్చే విధానంలో గణనీయమైన పురోగతి సాధించింది. అభివృద్ధితో పాటు రైల్వే స్టేషన్ ఆదాయం కూడా పరిగణింపదగిన స్థాయికి చేరుకుంది. గడచిన ఆరు దశాబ్దాలలో స్టేషన్ చరి త్రను పరిశీలిస్తే, 1942 క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో ఆందోళన కారుల ఆగ్రహానికి గురై అగ్నికీలల మధ్య దగ్ధ మైన ఈ స్టేషన్ పదేళ్ళ క్రితం వరకు సామాన్య స్టేషన్‌గా ప్రయాణికులకు నామమాత్రపు సౌకర్యాలను అందిస్తూ వచ్చింది. అయితే ఇటీవలి కాలంలో ప్రయాణికుల అవసరాలకు తగిన విధంగా 2.50 కోట్ల రూపాయలకు పైగా అభివృద్ధి పనులు పూర్తిచేసుకుని అన్ని వసతులు కలిగిన పెద్ద జంక్షన్‌గా రూపుదిద్దుకుంది. స్టేషన్ అభివృద్ధి చెందిన విధానం ఒక్కసారి పరిశీలిస్తే..

గతంలో ఉన్న పాత బుకింగ్ ఆఫీ సును పడగొట్టి అధునాతన భవన సముదాయాన్ని, విఐపి లాంజ్‌ను, స్టేషన్ మాస్టర్ కార్యాలయాన్ని నిర్మిం చారు. అదే విధంగా స్టేషన్‌లో 4, 5 ప్లాట్ ఫారాల నిర్మాణంతో పాటు ఫుట్ ఓవర్ బ్రిడ్జిని పొడిగించి కంప్యూటర్ రిజ ర్వేషన్ సౌకర్యాన్ని కల్పించారు. అలాగే పడమర బుకింగ్ నిర్మాణం జరిగింది. తాజాగా రైళ్ల కోచ్ ఇండికేషన్ బోర్డు లను ఏర్పాటు చేశారు. రైళ్ల రాకపోక లను తెలిపే ఎలక్ట్రానిక్ బోర్డులను కూడా ఏర్పాటు చేశారు. దీనితో హౌరా-చెన్నై రైలుమార్గంలో విజయ వాడ తర్వాత పెద్ద స్టేషన్‌గా తెనాలి జంక్షన్ రూపుదిద్దుకుంది. స్టేషన్‌లోని కొత్త ప్లాట్‌ఫారాలపై అదనంగా షెడ్ల నిర్మాణం, ప్లాస్టింగ్ పనులు జరిగాయి. స్టేషన్‌లో గతంలో మూడే ఉన్న ప్లాట్ ఫారాల సంఖ్య అయిదుకు పెరగడంతో ఈ మార్గంలో రైళ్ళ రద్దీ వల్ల ఏర్పడే సమస్యలకు పరిష్కారం లభించింది. వాస్తవానికి విజయవాడ - చెన్నయ్ రైలు మార్గంలో తెనాలి జంక్షన్ మీదుగా రోజూ 84 రైళ్ళు నడుస్తుం టాయి. జిల్లా కేంద్రమైన గుంటూరుకు 10, రేపల్లె వైపు 7 రైళ్ళు నడుస్తుం టాయి. వీటితో పాటు ప్రతి 15 నిమిషా లకు ఒక గూడ్సు రైలు, ఇంకా సూపర్ ఫాస్ట్ రైళ్ళు తెనాలి మీదుగా ప్రయాణి స్తుంటాయి.

## గణనీయంగా పెరిగిన ఆదాయం

గతంలో లేని విధంగా తెనాలి రైల్వే జంక్షన్ ఆదాయం కూడా గత రెండేళ్ళలో గణనీయంగా పెరిగింది. 2003-2004 ఆర్థిక సంవత్సరంలో స్టేషన్ ఆర్థికంగా వెసులుబాటుకు నోచు కుంది. ఈ ఆర్థిక సంవత్సరంలో సీజన్ టికెట్లతో కలిపి సుమారు 5 లక్షల మందికి పైగా ప్రయాణం సాగించినట్లు అంచనా. *(మిగతా 108వ పేజీలో)*

# నీటికరువు నరశింగపాడుకు తెలియదు

**(ఆన్‌లైన్, నకరికల్లు)**

సాగు నీటి కరువు తెలియని గ్రామం నరసరావుపేట నియోజక వర్గంలోని నకరికల్లు మండలం, నరశింగపాడు. ఇక్కడ 365 రోజులూ రూపాయి ఖర్చు లేకుండా ఉబికి వచ్చే గంగమ్మతో రైతులు వరి సాగు చేస్తున్నారు. ఈ గ్రామానికి ప్రకృతి ఇచ్చిన వరం రైతుల అభివృద్ధికి బాటలు వేసింది. గ్రామ పొలాల్లో బోరు వేస్తే చాలు పాతాళగంగ ఉబికి వస్తూ సిరులు పండిస్తుంది. గత ఏడాది రాష్ట్రమంతటా కరువు కాటకాలతో రైతాంగం అల్లాడింది. ఈ గ్రామంలో మాత్రం ఉబికి వస్తున్న గంగమ్మ వరి సాగు రెండు పంటలను అందించింది. తాగు నీటి సమస్య ఆ గ్రామం దరి చేరదు. బోరుల నుంచి వస్తున్న గంగమ్మ పరవళ్ళను చూసి ప్రతి ఒక్కరూ సంభ్రమాశ్చర్యాలకు లోనవుతుంటారు. గ్రామానికి ఆనుకుని ఉన్న శివాలయం ప్రాంతంలో బోరుల నుంచి జలధారలు భూమి పైకి ఎగబాకుతున్నాయి. ఈ బోర్ల కింద 400 నుంచి 500 ఎకరాలు వరి సాగు జరిగింది. గత ఏడాది ఎకరాకు 30 నుంచి 40 బస్తాలు ధాన్యం దిగుబడి వచ్చింది. ఇలా రెండు పంటలు పండించారు. దాదాపు 15 నుంచి 20 బోర్ల వరకు నిర్మించబడ్డాయి. వీటన్నింటిలో మోటార్లతో పని లేకుండా నీరు దానంతట అదే భూమి పైకి ఎగబాకుతుండడంతో ఆ నీటిని కాల్వల ద్వారా పొలాలకు మళ్ళించుకుంటున్నారు. ఈ గ్రామ రైతులు పొలాల్లో వినియోగించు కోగా, వచ్చే వృథా నీటిని వాగుల్లోకి వదిలేస్తున్నారు. దీంతో నెమలిపురి తదితర ప్రాంతాల్లో ఆ వాగు నీటితో కొందరు రైతులు పొలాలు సాగు చేసుకుంటున్నారు. ఒక్కొక్క బోరు నిర్మాణ వ్యయం రూ 15వేల వరకు అయినట్టు రైతులు తెలిపారు. నరశింగపాడులోని 50 శాతం కుటుంబాలు ఈ బోర్ల పై ఆధారపడి జీవనం సాగిస్తున్నారు. 300 నుంచి 350 అడుగుల లోతు వరకు వీటిని నిర్మించారు. గ్రామానికి కిలో మీటరు దూరంలో కూడా ఇటువంటి బోర్లు పడ్డ దాఖలాలు లేవు. అక్కడి రైతుల పరిస్థితి బోర్లకు మోటార్లు బిగించుకొని సాగు నీటిని వాడుకోవాల్సి వుంది. నరశింగపాడు జీవన విధానాన్ని జలధారాలు మార్చి వేశాయి. బోర్లు లేక ముందు ఎకరం లక్ష రూపాయలు వుండగా, ప్రస్తుతం ఆ రేటు మూడు లక్షలు దాటింది. జలధారలు ఎలా వస్తున్నాయి అనేది ఇంత వరకు కనుగొన్న ప్రయత్నాలను సంబంధిత అధికారులు చేయ లేదు. గ్రామస్తులు మాత్రం గుత్తికొండ బిళం వుందని, ఈ బిళంలో వాగులాగా ఎప్పుడూ నీరు ప్రవహిస్తూనే వుంటుందని, ఈ నీరే తమ పొలాల గుండా వెళుతున్నందున బోర్లు వేస్తే ఆపనలవి కాని విధంగా నీరు ప్రవహిస్తున్నట్టు రైతులు చెబుతున్నారు. నీటి రుచి సాగర్ కెనాల్ నీటి వలె వుంటుంది. శివాలయానికి వచ్చే భక్తులు బోర్ల నుంచి వస్తున్న నీటిని పుణ్యజలంగా భావిస్తున్నారు. ఏది ఏమైనప్పటికీ ఈ జలాలు నరశింగపాడును వరించడంతో రాష్ట్ర మంతటా వరి పంట వేయకపోయినా, ఈ గ్రామంలో మాత్రం వరి సాగు తథ్యం అన్నది నగ్నసత్యంగా ఉంది.



భూమి నుంచి ఉబికి వస్తున్న జలధారలు



## పద్మశ్రీలకు ఆలవాలం-సుబ్బారావులకు ప్రాశస్త్యం

**(ఆన్‌లైన్, నరసరావుపేట)**

విశ్వ విఖ్యాతి చెందిన వేణుగాన విద్యాంసుడు శ్రీ ఏల్లూరి విజయరాఘవరావు, బుర్రకథ పితామహుడు శ్రీ షేక్ నాజర్‌లను కేంద్ర ప్రభుత్వం పద్మశ్రీ బిరుదుతో సత్కరించింది. శ్రీ రాఘవరావు నరసరావుపేటలోనే జన్మించి, ఉన్నత విద్యాభ్యాసం వరకు నరసరావుపేటలోనే పూర్తి చేసుకొన్నారు. కాగా శ్రీ నాజర్ చిన్నతనంలో నరసరావుపేటలోనే వుండి ప్రముఖ సంగీత విద్యాంసులు శ్రీ మురుగుల సీతారామయ్య గారి వద్ద సంగీతం నేర్చుకున్నారు. తరువాతి కాలంలో ఆయన బుర్రకథ పితామహునిగా కీర్తి ప్రతిష్టలు ఆర్జించారు. అదే విధంగా భావకవులలో ప్రముఖుడు శ్రీ నాయని సుబ్బారావు నరసరావుపేట మున్సిపల్ ఉన్నత పాఠశాల హెడ్ మాస్టర్‌గా పని చేస్తూ తరువాతి కాలంలో ప్రసిద్ధి పొందిన 'సౌభద్రని ప్రణయ యాత్ర'ను ఇక్కడ రచించారు. అభ్యుదయ సాహిత్య రథసారథగా పేరు పొందిన శ్రీ అనిశెట్టి సుబ్బారావు కూడా నరసరావుపేట వాస్తవ్యులు.

నాటకరంగంలో మీసాల కృష్ణుడిగా పేరు పొందిన శ్రీ బెల్లంకొండ సుబ్బారావు, హాస్యనట చక్రవర్తిగా చింతమణి నాటకం ద్వారా ప్రఖ్యాతి గాంచిన శ్రీ అర్వపల్లి సుబ్బారావు కూడా నరసరావుపేటవారే.

## తెనాలి రైల్వే జంక్షన్

**(107వ పేజీ తరువాయి)**

ఆదాయం 13 కోట్ల 07 లక్షల 11 వేల 867 రూపాయలు లభించగా, 2004-05లో 13 కోట్ల 83 లక్షల 64 వేల 135 రూపాయల ఆదాయం లభించింది. ఇలా ఏటా కోటి రూపాయల అదనపు ఆదాయాన్ని తెనాలి రైల్వే జంక్షన్ సాధిస్తోంది. ఈ ఏడాది ఆదాయం మరింత గణనీయంగా ఆదాయం పెరిగే అవకాశం ఉన్నట్లు అంచనా వేస్తున్నారు.

### ఎక్స్‌ప్రెస్ హాల్టింగ్‌లు

న్యూఢిల్లీ - చెన్నయ్ గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ హాల్టు, నాగార్జున (ఇంటర్‌సిటీ) ఎక్స్‌ప్రెస్ పొడిగింపు, ఇతర సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్‌లకు హాల్టులను సాధించుకున్న తెనాలి పద్మావతీ సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ హాల్టుతో పాటు జన్మభూమి ఎక్స్‌ప్రెస్ రైలు పొడిగింపునకు కూడా నోచుకుంది. ప్రయాణీకుల సంఘం చిరకాల వాంఛగా ఉన్న ఈ హాల్టింగ్‌లను ప్రజా ప్రతినిధుల సహకారంతో సాధించుకుని ప్రయాణీకులకు సౌకర్యం కల్పించినట్లయింది. గతంలో మంగళ ఎక్స్‌ప్రెస్ తెనాలి మీదుగా ప్రయాణించేది. ఆ ఎక్స్‌ప్రెస్‌ను కొంకణ్ రైల్వే ద్వారా మళ్ళించినందున, ప్రస్తుతం తెనాలి జంక్షన్ మీదుగా నడుపుతున్న కేరళ ఎక్స్‌ప్రెస్‌కు తెనాలిలో హాల్టింగ్ సౌకర్యాన్ని కల్పించాలని ప్రయాణీకుల సంఘం చేస్తున్న విజ్ఞప్తి అటు రైల్వే అధికారులు, ఇటు ప్రజా ప్రతినిధుల పరిశీలనలో ఉంది. అదే విధంగా గుంటూరు-సికింద్రాబాద్ పల్నాడు ఎక్స్‌ప్రెస్‌ను తెనాలి వరకు పొడిగించాలన్న ప్రతిపాదన కూడా ఉంది. ఈ విధంగా రైల్వే అధికారుల కృషి, ప్రజా ప్రతినిధుల స్పందనలతో రూపుదిద్దుకుని, ప్రయాణీకుల సంఘ చైతన్యానికి ప్రతీకగా నిలిచిన తెనాలి రైల్వే స్టేషన్ దక్షిణ మధ్య రైల్వేలోనే ఆదర్శవంతమైన స్టేషన్‌గా రూపుదిద్దుకుంటోంది.

# విశిష్ట సేవలందిస్తున్న ఎఎంజి సంస్థ

(ఆన్‌లైన్, చిలకలూరిపేట)

37 సంవత్సరాల క్రితం చిలకలూరిపేటలో డాక్టర్ ఎస్. జాన్‌డేవిడ్ స్థాపించిన ఎఎంజి ఇండియా ఇంటర్నేషనల్ సేవా సంస్థ రాష్ట్రంలోనే అగ్రగామి సేవాసంస్థగా రూపాంతరం చెందింది. చిలకలూరిపేట కేంద్రంగా ఎఎంజి సంస్థ రాష్ట్రంలోని 7 కోస్తా జిల్లాలతో పాటు, ఒరిస్సా, చెన్నైలలో కూడా పెద్దఎత్తున సేవా కార్యక్రమాలను కొనసాగిస్తున్నది.

జాన్ డేవిడ్ ఈ ఏడాది జనవరిలో దివంగతులైనప్పటికీ సంస్థ డైరెక్టరుగా ఉన్న అరుణ్ కుమార్ మహంతి జాన్‌డేవిడ్ ఆశయాలకు అనుగుణంగా సేవా కార్యక్రమాలను కొనసాగిస్తున్నారు.

ఎఎంజి సంస్థ తన ఉచిత సేవా కార్యక్రమాలను నెల్లూరు, ప్రకాశం, గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం జిల్లాలతో పాటు ఒరిస్సాలోని టిట్లాగర్, బలంగీర్, చెన్నై నగరంలోను అమలు చేస్తున్నది. ప్రధానంగా విద్య, వైద్యం, పిల్లల సంరక్షణకు సంబంధించిన సేవలతో పాటు ప్రకృతి వైపరీత్యాల బాధితులకు అత్యవసర సహాయం, వృద్ధుల సంరక్షణ వంటి కార్యక్రమాలను ఎఎంజి అమలుచేస్తున్నది. ఎఎంజి సంస్థ ద్వారా ఏటా 79 వేల మందికి పైగా సహాయాన్ని అందుకుంటున్నారు.

## విద్యాసేవలు

ఎఎంజి సంస్థ వివిధ ప్రదేశాలలో 8 రెసిడెన్షియల్ ప్రాథమిక పాఠశాలలు, 8 ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాలలు, 3 జూనియర్ కళాశాలలు, 2 బిఇడి కళాశాలలు, 1 డిగ్రీ కళాశాల, ఐటిసి, వయోజన, అనియత విద్యా కేంద్రాలను నెలకొల్పింది. చీరాల ఓడరేవులో మత్స్యకారుల పిల్లలకు, ఏలేశ్వరంలో బాలకార్మికులకు, కాకినాడలో మురికివాడల పిల్లలకు ప్రత్యేకంగా ఇంగ్లీషుమీడియం పాఠశాలలను నెలకొల్పడం జరిగింది. ఎఎంజి పాఠశాలలలో చదువుకునే విద్యార్థులు అందరూ నిరుపేదలు, అట్టడుగువర్గాలకు చెందినవారు. కుల, మత బేధాలు చూపకుండా ఈ పాఠశాలలలో విద్యార్థులకు ప్రవేశం కల్పిస్తున్నారు. పోలియో పిల్లలు, అంధులు, కళావంతుల పిల్లలు, గిరిజనుల పిల్లలు, కుష్ఠు వ్యాధిగ్రస్తుల పిల్లలు, ఆత్మహత్యలు చేసుకున్న రైతుల పిల్లలు, యావజ్జీవ కారాగార శిక్ష అనుభవిస్తున్న ఖైదీల పిల్లలు ఎఎంజి పాఠశాలలలో విద్యను అభ్యసించే అవకాశం ఎఎంజి సంస్థ యాజమాన్యం కల్పించింది.

రాష్ట్రంలోని 23 జిల్లాలలో ఆత్మహత్యలు చేసుకున్న రైతుల పిల్లలకు స్కూలు బ్యాగ్స్, పుస్తకాలు, ఫీజుతోపాటు ఆర్థిక సహాయం అందిస్తున్నది. ఇందుకు ఎఎంజి సంస్థ 60 లక్షల రూపాయలు ఏటా ఖర్చు చేస్తున్నది. ఈ విద్యాసంస్థలలో సుమారు 10 వేల మందికి పైగా పిల్లలు ఉచిత విద్యను అభ్యసిస్తున్నారు.



సునామీ బాధిత మత్స్యకారులకు చేపల వలలను పంపిణీ చేస్తున్న ఎఎంజి డైరెక్టర్ అరుణ్ కుమార్ మహంతి

## విస్తృతమైన వైద్యసేవలు

వైద్యసేవలకు సంబంధించి ఎఎంజి సంస్థ పలుచోట్ల ఆసుపత్రులను నిర్వహిస్తున్నది. ఈ ఆసుపత్రులలో ఉచితంగా రోగులకు వైద్యసేవలను అందిస్తున్నారు. విశాఖపట్నంలో మురికివాడల ప్రజల కోసం, నిరుపేదల కోసం హెచ్‌డిఎం ఆసుపత్రిని నెలకొల్పి ఉచితంగా వైద్యసేవలు అందిస్తున్నారు. జేగురుపాడు, రాజవోలులలో నేత్ర వైద్యశాలలు ఏర్పాటు చేశారు. జేగురుపాడులో ప్రతిఏటా 2000 మందికి ఉచితంగా నేత్ర శస్త్ర చికిత్సలు చేస్తున్నారు. చిలకలూరిపేట పక్కనే ఉన్న గణపవరంలో నెలకొల్పిన ఎఎంజి టిబి ఆసుపత్రి ద్వారా వేలాదిమంది క్షయ వ్యాధిగ్రస్తులకు ఉచిత వైద్యసేవలు అందిస్తున్నారు. టిట్లాగర్‌లో టిబి ఆసుపత్రి, ఏలేశ్వరంలో టిబి క్లినిక్‌ను నెలకొల్పారు. నరసరావుపేట టిబి యూనిట్ పరిధిలో క్షయవ్యాధి నిర్మూలనకు ఎఎంజి సంస్థ నడుంకట్టింది. విశాఖపట్నం, నరవా, చెంఘిజ్‌ఖాన్‌పేట, టిట్లాగర్‌లలో కుష్ఠువ్యాధి చికిత్సకై క్లినిక్‌లను నెలకొల్పడం జరిగింది. ఇవికాక చిలకలూరిపేట, కాకినాడలలో అనేక చోట్ల జనరల్ క్లినిక్‌లను ఎఎంజి సంస్థ నిర్వహిస్తున్నది.

## సునామీ, వరద బాధితులకు చేయూత

ప్రకృతి వైపరీత్యాలు సంభవించిన సమయంలో ఎఎంజి సంస్థ బాధితులకు సహాయం అందించడంలో అగ్రగామిగా ఉంది. ఇటీవల సునామీ కారణంగా నష్టపోయిన బాధితులకు సహాయం అందించడంలో ఎఎంజి ముందంజలో ఉంది. కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలోని 4700 మంది సునామీ బాధితులకు ఎఎంజి సంస్థ పెద్దఎత్తున సహాయం అందించింది. 3 కోట్ల రూపాయల విలువ చేసే బియ్యం, కందిపప్పు, వంటపాత్రలు, దుస్తులు, చేపల వలలు సునామీ బాధితులకు పంపిణీ చేయడం జరిగింది. మత్స్యకారులకు బోటు ఇంజన్ల మరమ్మతుల కోసం ఆర్థిక సహాయం అందించడం జరిగింది. ఇదికాక ఈ నాలుగు జిల్లాలలోని సునామీ బాధితులకు 3000 గృహాల (మిగతా 111 పేజీలో)



వరద బాధితుల గృహాల వద్దకు బోట్లు వేసుకుని వెళ్లి సహాయం అందిస్తున్న ఎఎంజి సిబ్బంది

(110వ పేజీ తరువాయి)

నిర్మాణం కోసం సుమారు 3 కోట్ల రూపాయల ఆర్థిక సహాయాన్ని ఈ సంస్థ అందిస్తున్నది.

భారీవర్షాలు, అగ్నిప్రమాదాలు సంభవించినప్పుడు ఎఎంజి సంస్థ ప్రభుత్వం కంటే ముందు బాధితులను ఆదుకుంటున్నది. ఈ ఏడాది సెప్టెంబరు, అక్టోబరు నెలలలో కురిసిన భారీ వర్షాల వలన నిరాశ్రయులైన బాధితులకు అనేక రోజులపాటు భోజనసహాయం అందించడమేకాక పలుచోట్ల ఆహారపు పొట్లాలను పంపిణీ చేయడం జరిగింది. బాధిత కుటుంబాలకు 10 కిలోల బియ్యం, 2 కిలోల కందిపప్పు, 1 కిలో వంటనూనె, 2 దుప్పట్లు, చీరెలు, సబ్బులు పంపిణీ చేయడం జరిగింది. 3,700 మంది వరదబాధితులకు సహాయం కోసం సుమారు 35 లక్షల రూపాయలకు పైగా ఖర్చు చేయడం జరిగింది. గత కొద్ది సంవత్సరాలలో తీవ్రకరవు పరిస్థితులు ఏర్పడడంతో రైతుల ప్రయోజనార్థం గుంటూరు, ప్రకాశం జిల్లాలలో పశుగ్రాస సరఫరా కేంద్రాలను ఏర్పాటు చేయడం జరిగింది. ఈ సమయంలో గ్రామాలలో ఉన్న వృద్ధులకు మధ్యాహ్న భోజనం సరఫరా చేయడంతో పాటు నిరుపేద కుటుంబాలకు బియ్యం, కందిపప్పు సరఫరా చేయడం జరిగింది. కరవు సహాయ కార్యక్రమాలలో భాగంగా ప్రకాశం, గుంటూరు, తూర్పుగోదావరి, విశాఖపట్నం జిల్లాలలో వందల సంఖ్యలో గొట్టపుబావులను నిర్మించడం జరిగింది.

## అందిస్తున్న సేవలకు అవార్డులు

ఎఎంజి సంస్థ ద్వారా అందించిన సేవలకు గుర్తింపుగా సంస్థ వ్యవస్థాపకుడైన దివంగత సువార్తికుడు డాక్టర్ జాన్‌డేవిడ్ అనేకసార్లు రాష్ట్రపతి, గవర్నర్, వివిధ సంస్థల ద్వారా అవార్డులను అందుకోవడం జరిగింది. ప్రస్తుతం సంస్థను నిర్వహిస్తున్న అరుణ్ కుమార్ మహంతి కూడా అదే కోవలో అవార్డులను అందుకుంటున్నారు. ఇటీవల హైదరాబాదులో రాష్ట్ర గవర్నర్ సుశీల్‌కుమార్ షిండే ద్వారా అరుణ్ కుమార్ మహంతి అవార్డును అందుకున్నారు. క్షయవ్యాధిగ్రస్తులకు చేసిన సేవలకు గాను ఆయనకు ఈ అవార్డు లభించింది.

## గృహ సముదాయాలు

ఎఎంజి సంస్థ వివిధ వర్గాలవారికి గృహాలను నిర్మించింది. కొన్నిచోట్ల గృహాల నిర్మాణానికి ఆర్థిక సహాయం అందచేసింది. అగ్ని బాధితులకు, పారిశుధ్య సిబ్బందికి, మత్స్యకారులకు, దేవదాసీలకు, కుష్ఠు వ్యాధిగ్రస్తులకు, తుఫాను, వరద బాధితులకు గృహనిర్మాణానికి ఎఎంజి సంస్థ సహాయం అందించింది.

## ప్రభుత్వ పథకాలకు విరాళాలు

ప్రభుత్వ పథకాల అమలుకు సంబంధించి ఎఎంజి సంస్థ పెద్దఎత్తున విరాళాలను అందచేస్తున్నది. చిలకలూరిపేటలో మంచినీటి పథకానికి, మురికివాడల అభివృద్ధికి, మురికివాడలలో మంచినీటి పైపులైన్ల నిర్మాణానికి 7 కోట్ల రూపాయలు విరాళంగా ఇవ్వడం జరిగింది. నరసరావుపేటలో మురికివాడల అభివృద్ధికోసం కోటి రూపాయలు, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం ఆడిటోరియం నిర్మాణానికి కోటి రూపాయలు విరాళం ఇవ్వడం జరిగింది. కాకినాడలో ప్రభుత్వ ఆసుపత్రిలో సిటి స్కాన్ ఏర్పాటుకు 50 లక్షలు, మంచినీటి పథకం నిర్మాణానికి 30 లక్షలు, అమలాపురంలో మహిళల అభివృద్ధి ప్రాజెక్టుకు 10 లక్షలు, నరసరావుపేట చంద్రబాబునాయుడు కాలనీలో గృహాల నిర్మాణానికి 21 లక్షలు, చిలకలూరిపేటలో పారిశుధ్య సిబ్బంది గృహ సముదాయానికి 11 లక్షలు విరాళంగా ఇవ్వడం జరిగింది.

# భారతీ తీర్థుని పుట్టిల్లు నరసరావుపేట



శృంగేరి భారతీ తీర్థస్వామి

(ఆన్‌లైన్, నరసరావుపేట)

ప్రపంచ చరితలో శృంగేరికి చాలా ప్రసిద్ధి వుంది. శ్రీ భారతీ తీర్థస్వామి శ్రీ శృంగేరి జగద్గురు పరంపరలో 36వ వారు. ఈ పీఠాన్ని అధిష్టించే నాటికి వారికి 23 సంవత్సరాల వయస్సు. విద్యారణ్య స్వామి వారి తరువాత శృంగేరి జగద్గురు పీఠాన్ని అధిష్టించిన తెలుగువారు శ్రీ భారతీ తీర్థస్వామి వారు. శృంగేరి జగద్గురు పీఠాన్ని అధిష్టించారు.

నేటి శృంగేరి జగద్గురువులు తమ శైశవాన్ని బాల్యాన్ని, కౌమార్యాన్ని గడిపింది నరసరావుపేటలోనే. ఈ అపురూపమైన అదృష్టం నరరావుపేటకు దక్కింది. నేటి శృంగేరి శారదా పీఠ జగద్గురువులు శ్రీ భారతీ తీర్థస్వామివారి పూర్వాశ్రమ నామం శ్రీ తంగిరాల సీతారామాంజనేయులు. శ్రీ భారతీ తీర్థ స్వామి దక్షిణాది భాష లన్నింటిలో అనర్గళంగా ఉపన్యసిస్తారు. ఇంగ్లీషు కూడా వారు చక్కగా సంభాషిస్తారు. హిందీ ప్రాంతీయులు ఆశ్చర్యపడేటట్లు వారు హిందీలో ప్రసంగిస్తారు. ఆయన తపస్విత, వాగ్మిత భారతదేశ మంతటా ఎంతో ప్రసిద్ధి పొందాయి. నరసరావుపేట సహచర్యం పదిహేను సంవత్సరాలే అయినా ఇక్కడ శృంగేరి శారదాలయాన్ని, శంకర మఠాన్ని వీరు నిర్మింప జేశారు.

# సమసమాజ స్థాపనకు ఊపిరిలూదిన కవిశేఖరుడు 'అనిశెట్టి'

(ఆన్‌లైన్, చిలకలూరిపేట రూరల్)

మీతోనే ఉంటాను... మీతోనే వస్తాను...

అడుగడుగునా మీకు అండగా నిలుస్తాను...

పరతంత్రతలో మగ్గు బానిసల ముక్తికై కదన భూములకెత్తి

కదలి వెళ్ళే మీకే అడుగడుగునా నేను అండగా నిలుస్తాను

అంటూ స్వాతంత్ర్య సమరంలోని వారందరికీ కవిగా అండగా నిలిచి... దేశ భక్తిని అణవణువుగా...అడుగడుగునా రంగరించి పోసిన అభ్యుదయ కవిశేఖరుడు అనిశెట్టి సుబ్బారావు. 'విగ్రహంలా వెయ్యేళ్ళు బ్రతకడం కన్నా విద్యుత్తులా ఒక్క క్షణం వెలగడం మేలు' అంటూ మనిషి సామాజిక జీవన ప్రస్థానాన్ని సూటిగా... ఘాటుగా చిత్రీకరించిన నవ్య నవపథగామి అనిశెట్టి.

'పగిలి రణభేరి పద్మవ్యూహము తెంచి..

శివమెత్తి విస్ఫులింగములు

చిమ్ముతూ లేచి ఈ జగతిలో

నూత్న జగతి పెకలిస్తాను'

అంటూ సమసమాజ స్థాపనకు ఒక కవిగా... పవిగా... రవిగా చెలరేగిన అనిశెట్టి అగ్నివీణను మీటి మానవతా సంగీతాలను వినిపించారు.

అనిశెట్టి కవితాధర్మం ఆప్తత.. దాని ప్రధాన లక్షణం గుప్తత.. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన చేసిన అనిశెట్టి కవిత్వం.. అతి అల్పమైన పదాల మూపులపై అతి వేల భావభీతావహాన్ని మోపిన సజీవ చిత్రపటం. తాడిత పీడిత ప్రజల పక్షాన వకాల్తా పుచ్చుకొని పాఠకుల మస్తిష్కాలను కుదిపివేసే గేయ శతఘ్నులను పేల్చిన కవి సైనికుడు అనిశెట్టి. గేయం, పాట, దృశ్యకావ్యం, శ్రవ్యకావ్యం.. ఏ ప్రక్రియ చేపట్టినా తనదైన వాణిని సరికొత్త బాణీలో వినిపించిన అనిశెట్టి కవిత్వం అగ్నిశిఖల తీక్షణం... అజరామర లిఖితం. అనిశెట్టి నిరంతర ఉద్యమశీలి, స్నేహ సౌభ్రాతృత్వాలకు కాణాచి. శాస్త్రీయ సామ్యవాద విప్లవాభిముఖంగా శ్రామిక జనతను సమాయత్తపరచడానికి తన కవిత్వం ప్రయుక్తం కావాలని మనసా వాచా వాంఛించిన కవి బోధిసత్వుడు. అందుకే కవితా కంఠనాళాన్ని విప్లవశంఖంలా పూరించాడు.


అనిశెట్టి సుబ్బారావు

అభ్యుదయ కవిగా లబ్ధప్రతిష్ఠుడైన అనిశెట్టి గుంటూరు జిల్లా చిలకలూరిపేటలో అంతర్భాగమైన పురుషోత్తమపట్నంలో 1922 అక్టోబర్ 23న మాతామహుల ఇంట జన్మించారు. ఆదిలక్ష్మమ్మ, సుబ్బారావు తల్లిదండ్రులు. 1926లో పురుషోత్తమపట్నంలో ప్రాథమిక విద్యను అభ్యసించారు. 1932లో నర్సరావుపేటలోని మున్సిపల్ ఉన్నత పాఠశాలలో చేరిన అనిశెట్టి ఆ పాఠశాల చరిత్రోపన్యాసకులు నాయని సుబ్బారావు గారికి ప్రియశిష్యులు. నయాగారా కవులుగా లబ్ధప్రతిష్టులైన కుందుర్తి, రెంటాల గోపాలకృష్ణ, బెల్లంకొండ రామదాసు, మాచిరాజు దేవీప్రసాద్ అదే పాఠశాలలో అనిశెట్టికి సహాధ్యాయులయ్యారు.

1943లో మద్రాసు లా కళాశాలలో చదివే సందర్భంలో బెంగాలీ విప్లవకారుడు రతన్‌కుమార్ ఛటర్జీకి ఆశ్రయమిచ్చి బెంగాలీ కరపత్రాలను అనువదించారు. దీనికి ఆగ్రహించిన బ్రిటీష్ ప్రభుత్వం రెండేళ్ల జైలుశిక్ష విధించి రాయవెల్లూరు జైలులో బంధించారు. అనిశెట్టి మామ రాజమండ్రి కోర్టు మేజిస్ట్రేట్‌గా వున్నందున ఆయన సిఫార్సుతో అనిశెట్టిని శిక్షాకాలానికి ముందే విడుదల చేయించే ప్రయత్నాలు జరిగాయి. జైలు అధికారులు అనిశెట్టిని కమ్యూనిస్టు పార్టీతో పూర్తిగా తెగతెంపులు చేసుకొంటున్నట్లు లిఖితపత్రం కోరడంతో తిరస్కరించి జైలులోనే ఉండిపోయారు.

1945 జూన్ 5న లక్ష్మీదేవితో అనిశెట్టి వివాహం జరిగింది. ఆ వివాహ సందర్భంగా కుందుర్తి, ఏల్చూరి, బెల్లంకొండ తమ కవితా సంకలనాలను 'నయాగారా' పేరుతో అచ్చువేయించి పెళ్లి కానుకగా బహూకరించారు. 1947లో ఇంగ్లీషు లిటరేచర్‌తో ఎంఎ చదవడానికి ఆంధ్రవిశ్వవిద్యాలయంలో చేరినప్పుడు కెవి రమణారెడ్డి, అజంతా, ఇస్మాయిల్, ప్రయాగ, మాన్స్ వంటి కవులు సహాధ్యాయులుగా ఉండేవారు. హైస్కూల్ స్థాయిలోనే నాయని ప్రోత్సాహంతో ఛందోబద్ధమైన పద్యాలను రాయడం ప్రారంభించిన అనిశెట్టి 1942లో నరసరావుపేటలో నవ్యకళా పరిషత్‌ను స్థాపించారు. ప్రతిభ సాహిత్య పత్రికకు సంపాదకులుగా, ప్రజాశక్తి పత్రికలో సభ్యులుగా పనిచేశారు. 1948లో అభ్యుదయ పత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు. అభ్యుదయ, ఉదయిని పత్రికలలో కాంతులు-కత్తులు అనే శీర్షిక ద్వారా అద్భుతమైన వ్యాసాలను రచించారు. పాట, పద్యం, గేయం, వ్యాసం, కథ, నవల వంటి ప్రక్రియలో విశేషంగా కృషి చేసినా నాటక రచనలో అనిశెట్టి ప్రతిభ అద్వితీయంగా నిలిచింది. గాలిమేడలు, యువజ్వాల, మావూరు నాటకాలతో పాటు శాంతిలేదు, ఉన్నది-కోరుకున్నది, జీవన సంగీతం, చరమాంకం వంటి నాటికలను రచించారు. వీనితో పాటు 12 రేడియో నాటకాలను రాశారు. గొల్లపూడి, ఆత్రేయలతో కలసి 'అవినీతి నీవెక్కడ' అనే సీరియల్ నాటకాన్ని రాశారు. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం ఆధారంగా అనిశెట్టి గాలిమేడలు నాటకాన్ని 1950లో రచించారు. మధ్యతరగతి మానవు విఫల మనోరథాలను, చుట్టూ ఉన్న సమస్యల పద్మవ్యూహంలో చిక్కి ఉక్కిరి బిక్కిరైపోతూ... ఆ బాధలను మరచిపోవడానికి స్వాప్నిక జగత్తులో విహరించే దైన్యాన్ని ఇతివృత్తంగా రచించిన గాలిమేడలు నాటకం ఎంతో ప్రజాదరణను పొందింది. ఈ నాటకం సృష్టించిన సంచలనానికి భీతిల్లిన ప్రభుత్వం గాలిమేడలును నిషేధించింది.

పచ్చని పల్లెటూళ్లను కుటిల రాజకీయాల విషసర్పాలు ఎలా కాటువేస్తున్నాయో ఐదు దశాబ్దాల క్రితం గుండెకు హత్తుకొనేలా చిత్రించిన నాటకం 'మావూరు'. గ్రామ రాజకీయాలకు దర్పణం పట్టిన ఈ విషాదాంత నాటకాన్ని అనిశెట్టి ఆద్యంతం అద్భుతంగా రచించారు. ఈ నాటకాన్ని ఆంధ్ర సాంస్కృతిక మహాసభల సందర్భంగా (మిగతా 114లో)


స్వర్గీయ ఇందిరాగాంధి గారు


స్వర్గీయ రాజీవ్ గాంధి గారు
మాజీ ప్రధాన మంత్రి


శ్రీమతి సోనియాగాంధి గారు
కాంగ్రెస్ పార్టీ అధ్యక్షురాలు


శ్రీ మన్‌మోహన్ సింగ్ గారు
ప్రధానమంత్రి


శ్రీ కె.కేశవరావు గారు
రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులు


శ్రీ కె. రోశయ్య గారు
రాష్ట్ర ఆర్థిక శాఖా మంత్రి


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ గారు
రాష్ట్ర సహకార శాఖా మంత్రి


శ్రీ ధర్మాన ప్రసాదరావు గారు
జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి

# రైతు సంక్షేమం కోరే వై.యస్. నాయకత్వమును బలపర్చాలి

రాష్ట్రంలో వై.యస్. రాజశేఖరరెడ్డి నాయకత్వంలో కాంగ్రెస్ ప్రభుత్వము పేద ప్రజలు, రైతుల సంక్షేమునకు కృషిచేస్తుంది. ఉచిత విద్యుత్తు, ఆత్మహత్యలు చేసుకొన్న కుటుంబములకు పునరావాసము, పావలా వడ్డీలకే డ్వాక్రా సంఘములకు ఋణములు, రాజీవ్ నగరబాట, రాజీవ్ పల్లెబాట, ప్రజాపదం, పట్టణంలో పేదలకు రూ॥ 1200/-కు బాలలు, రాజీవ్‌గృహ కల్ప వంటి పథకములలో ప్రజలకు ఎన్నో సేవా కార్యక్రమములను చేపట్టింది. వై.యస్. పాలనను మెచ్చుకొన్న ప్రజలు ఇటీవల మున్సిపాలిటిల్లో అద్భుతమైన తీర్పు ఇచ్చారు. రాష్ట్ర ప్రభుత్వం చేపట్టుతున్న అన్ని పథకాలకు ప్రజలు అండగా ఉండాలని కోరుతున్నాము.

వలికుల ఆశాజ్యోతి
రాష్ట్ర ముఖ్యమంత్రి
డాక్టర్ వై.యస్. రాజశేఖరరెడ్డి గారికి
శుభాభి వందన కుసుమాంజలి
తెలుగు మాగాణంలో
సిరుల పురులను అడిగితే
అది మీ పేరే చెబుతుంది

రైతన్న ముఖంలో
సంతోషాలను ప్రశ్నిస్తే
అది మీ కృషికి దర్పణం పడుతోంది
పచ్చని పల్లెటూళ్లలో
ఏ తలుపు తట్టినా
మీ ఆశయం ఎదురౌతుంది
కర్షక జనహితుడా
ఆకుపచ్చ సూర్యుడా
హరితాంధ్ర సాధకుడా
అపర భగీరధుడా
రైతన్నే ఈ దేశానికి వెన్నెముక

అందుకే కణం కణం
క్షణ క్షణం
మీ అలుపెరుగని
ప్రస్థానం
అందుకే అందుకోండి
మా భూమి పుత్రుల
కృతజ్ఞతాపూర్వక
అభినందన చందనం



ఇట్లు
**ముప్పలనేని శేషగిరిరావు**
గుంటూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు

**శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు**
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు

# సమ సమాజ స్థాపను ఊపిరిలూదిన కవిశేఖరుడు 'అనిశెట్టి'

(112వ పేజి తరువాయి)

1953 జూన్ 22న విజయవాడ శ్రీ నవయువ మండలి వారు ప్రదర్శించారు. ఈ నాటికను గురజాడ కళామందిర్ విజయవాడ సంస్థ పలు పరిషత్తులలో ప్రదర్శించి బహుమతులను పొందింది. ఈ నాటిక 1961 ఆంధ్ర నాటిక కళాపరిషత్ పోటీలలో ప్రథమ బహుమతిని పొందింది. సర్వగుణాభివృద్ధికి వెలుగురేఖ స్వచ్ఛమైన శాంతి అనే సందేశంతో రాసిన నాటిక 'శాంతి'. పాంటోమైమ్ ప్రక్రియతో ఈ నాటికను ప్రజానాట్యమండలి దళం అత్యద్భుతంగా ప్రదర్శించింది. 1951లో రచించిన ఈ నాటికలో వ్యాఖ్యాత ప్రధాన పాత్ర వహిస్తాడు. మూకాభినయంతో సాగే ప్రక్రియను అనిశెట్టి అత్యద్భుతంగా వినియోగించుకున్నారు. ఈ నాటికకు ప్రముఖ సినీ దర్శకుడు వేణుగోపాల్ నిర్దేశించిన నృత్యం వేనోళ్ల కొనియాడబడింది. ఆంధ్ర మహాసభ పోటీలలో ఈ నాటికకు స్వర్ణపతకం లభించింది. 1952 ఫిబ్రవరి 8 నుండి 19 వరకు జరిగిన అంతర్జాతీయ సినిమా ఉత్సవాలలో సోవియట్ రచయితల సమక్షంలో ప్రదర్శించబడి ప్రశంసలు పొందింది. ఈ ప్రదర్శనకు అచ్చెరువొందిన సోవియట్ చిత్రబృందం ఈ నాటికను 1200 అడుగుల లఘుచిత్రంగా చిత్రించారు. రష్యాలో ఈ చిత్రాన్ని 30 లక్షల మంది ప్రేక్షకులు చూసి ఆనందించారు. తమిళ, కన్నడ, ఇంగ్లీషు, చైనా భాషల్లో అనువదించబడి ప్రదర్శింపబడింది.

1955లో జరిగిన ఎన్నికల ప్రచారం కోసం అనిశెట్టి 'ఓటెవరికి' నాటికను కూడా మూకాభినయ ధోరణిలోనే రచించారు. కమ్యూనిస్టు పార్టీ ఆశయాలూ, సిద్ధాంతాలకు అనుగుణంగా వ్రాయబడింది. ఈ నాటికను కావలిలో 30 వేలమంది ప్రేక్షకుల ఎదుట ప్రదర్శించి మెప్పులను పొందారు. ప్రముఖ సినీ దర్శకుడు గిడుతూరి సూర్యం, అనిశెట్టి రూపొందించిన 'మానవుడు చిరంజీవి' మూకాభినయాన్ని ఇండియన్ బ్యాలే సెంటర్ దాదాపు 100 ప్రదర్శనలను ఇచ్చింది. 8 ప్రాంతీయ భాషల్లోకి అనువదించబడింది. సినీరచయిత త్రిపురనేని మహారథి ఈ నాటికను ఆంగ్లంలోకి అనువదించారు. ఒక రిక్షా కార్మికుని జీవితంలోని ఒకరోజు సంఘటనను ఇతివృత్తంగా అనిశెట్టి రచించిన రిక్షావాలా డాన్స్ బ్యాలే పాంటోమైమ్ ప్రక్రియలో సాగింది. ఈ డాన్స్ బ్యాలేను కూడా 1955 ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ ప్రచారానికి విరివిగా ఉపయోగించారు.

1952లో ప్రముఖ సినీ దర్శకుడు గిడుతూరి సూర్యం ప్రోత్సాహంతో అనిశెట్టి సినీరంగ ప్రవేశం చేశారు. ప్రియురాలు చిత్రంలో అనిశెట్టి రచించిన 15 పాటలు సినీప్రియులను ఉర్రూతలూగించాయి. 'చందురిని మించి అందమొలికించు చిట్టిపాపాయి జో' అనే రక్త సంబంధంలోని పాట అన్నాచెల్లెళ్ల అనుబంధానికి శాశ్వత రూపం కల్పించింది. 48 చిత్రాలకు మాటలు, పాటలు రాశారు. 300 డబ్బింగ్ చిత్రాలకు అనువాద రచయితగా పనిచేశారు. ఎన్టీఆర్ చలనచిత్ర రంగప్రవేశం చేసిన తొలిరోజుల్లో ఆత్రేయ, అనిశెట్టితో కలసి మద్రాసులో ఒకే గదిలో ఉండేవారు. అనిశెట్టి కవిత్వమంటే ఎన్టీఆర్ ఎంతో అభిమానించేవారు. అనిశెట్టి అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శిగా, దక్షిణ భారత చలనచిత్ర రచయితల సంఘ ప్రధాన కార్యదర్శిగా, దక్షిణ భారత చలన చిత్ర మండలి ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు. 1977లో రాజమంత్రి రాజ్యలక్ష్మి కళాసమితి అనిశెట్టిని అభ్యుదయ కవి భాస్కర బిరుదుతో సత్కరించారు. అగ్నివీణ, బిచ్చుగాల్ల పదాలు గేయ సంకలనాలను రచించారు. కరకు రెక్కలు, అణు సంగీతం, పృధ్వీగీతం, ఆకలిపాట వంటి గేయాలు తెలుగు సాహిత్య చరిత్రలో ప్రముఖంగా చోటుచేసుకున్నాయి. పది కథలు వివిధ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. అనారోగ్యంతో 1979 డిశంబరు 27న నరసరావుపేటలో అనిశెట్టి కవితా అగ్నివీణ మూగబోయింది. అభ్యుదయ కవిగా, ప్రయోగాత్మక నాటక రచయితగా విభిన్న ప్రకియా వైవిధ్యాన్ని ప్రదర్శించిన బహుముఖ ప్రజ్ఞాశాలిగా అభ్యుదయ కవిత్వోద్యమ సారధిగా ఆధునిక సాహితీ ప్రస్థానంలో అనిశెట్టి స్థానం పదిలం..

# స్త్రీ పాత్రలకు జీవం

## రసజ్ఞుల మనసు దోచే 'స్థానం'



స్త్రీ వేషధారణలో స్థానం నరసింహారావు



పద్మశ్రీ స్థానం నరసింహారావు

(ఆన్‌లైన్, చిలకలూరిపేట రూరల్)

రంగస్థల చరిత్రలో స్త్రీ పాత్రలను అనితర సాధ్యంగా నటించి సువర్ణాక్షర లిఖితమైన ఖ్యాతి పద్మశ్రీ స్థానం నరసింహారావుకు లభించింది. 'మీరజాలగలడా నాయానతి వ్రతవిధాన మహిమన్ సత్యాపతి' అంటూ సత్యభామ మితిమీరిన ఆత్మవిశ్వాసం, అహంభావంతో అభినయిస్తుంటే ముద్దమందారంలోని సౌకుమార్యం, ముగ్ధమోహనరూపంతో, ఒక కంట దరహాసం మరో కంట పరిహాసంతో అపురూప సౌందర్యం రాశిపోసినట్టు కనిపిస్తున్న ఆ నటీమణి హావభావ విన్యాసాలకు కరతాళ ధ్వనులతో జేజేలు పలుకుతుంటే నటించింది నటి కాదు నటుడు అంటే ఆశ్చర్యపోవడం అందరి వంతు.

అసాధ్యాలను సుసాధ్యాలు చేసి అశేష ప్రజాభిమానాన్ని, భారత ప్రభుత్వం ఉత్తమ కళాకారులకు ప్రదానం చేసే పద్మశ్రీ పురస్కారాన్ని అందుకున్న తొలి రంగస్థల కళాకారుడిగా చరిత్ర పుటలలో స్థానం వారి స్థానం, ఖ్యాతి అజరామరం. పురుష పాత్రలను పురుషులు, స్త్రీ పాత్రలను స్త్రీలు పోషించడం, మెప్పించడం విశేషం కాదు. కానీ సృష్టికి విరుద్ధమైన రీతిలో ఒక పురుషుడు స్త్రీగా మారి నటించి స్త్రీ అనే భ్రమను కలిగించడం అసాధారణం. స్త్రీ పాత్రలను పోషించడం అంటే సామాన్యమైన విషయం కాదు. అందం, అభినయం, నడక, నడత, వేషధారణ ఇలా ముమ్మూర్తులా స్త్రీ అనిపించుకోవడానికి కఠోరశ్రమ, కృషి, పరిశ్రమ, అవగాహన, ఏకాగ్రత అవసరం అనివార్యం. పద్మశ్రీ స్థానం నరసింహారావు 1902 ఫిబ్రవరి 23న గుంటూరు జిల్లా బాపట్లలో జన్మించారు. వయస్సుతో పాటే పెరిగిన కళాభితృష్ణతో రంగస్థలంపై మక్కువను పెంచుకున్న స్థానం ప్రతిరోజూ సాయంత్రం ఊరికి చివరగా ఇసుక తిన్నెలపైకి వెళ్లి పెద్దగా పద్యాలు పాడేవారు. తండ్రి హఠాన్మరణంతో హైస్కూలు చదువు మధ్యలోనే ఆగిపోగా కుటుంబపోషణ కోసం అమెరికన్ మిషనరీ స్కూలులో ఉపాధ్యాయ శిక్షణతో ప్రవేశించారు. 1920లో బాపట్లలో హరిశ్చంద్ర నాటకం ప్రదర్శన సందర్భంగా చంద్రమతి పాత్రధారి రాకపోవడంతో ఆ పాత్ర ధరించవలసింది నిర్వాహకులు (మిగతా 117లో)

# రసజ్ఞుల మనసు దోచే 'స్థానం'

(116వ పేజీ తరువాయి)

స్థానం వారిని ఒత్తిడి చేశారు. ఆపద్ధర్మంగా ఆ పాత్రను ధరించడం ఇష్టం లేని స్థానం అయిష్టంగానే నటించారు. ఈ విధంగా నటనకు శ్రీకారం చుట్టిన స్థానం వారి నటప్రస్థానం దశాబ్దాల తరబడి కొనసాగి తెలుగు ప్రేక్షకులను ఉర్రూతలూగించింది. తొలి ప్రదర్శనను చూసిన తిరుపతి వేంకటకవుల ప్రశంసలు స్థానం వారి నట జీవితానికి పునాదులు వేశాయి.

తెనాలి శ్రీకృష్ణ థియేటర్ సమాజంలో నెల జీతంపై పలు నాటకాలలో స్త్రీ పాత్రలను ధరించి స్థానం అనంతర కాలం రామవిలాస సభలో చేరారు. శ్రీ కృష్ణ తులభారం నాటకానికి స్వయంగా సంగీతాన్ని సమకూర్చి కొన్ని పద్యాలను కూడా రచించారు. 'మీరజాలగడా' అనే వీరి పాటను వేలాది నాటకాలతోపాటు చలనచిత్రాలలో కూడా ఉపయోగించారు. సత్యభామ, శకుంతల, చిత్రాంగి, మల్లమాంబ, దేవదేవి, చింతామణి, మోహిని, యశోద, మురి, మధువాణి, రోషనార, అనసూయ, లీలావతి, మీరాబాయి, సంయుక్త, చంద్రమతి, దయమంతి పాత్రలను అద్వితీయంగా పోషించి నాటికి, నేటికి, ఏనాటికి సాటి లేని మేటి నటుడిగా ప్రఖ్యాతి చెందిన స్థానం వారి ఖ్యాతి జగద్విదితం వివిధ స్త్రీ పాత్రలను రంగస్థలంపై 3 వేల సార్లు ప్రదర్శించి చరిత్ర సృష్టించారు. శృంగార రసానికి ప్రతిబింబంగా సత్యభామ, ప్రణయానికి ప్రతిరూపంగా చిత్రాంగి, వీరరసాధి దేవతగా రోషనార, వలపుల రాణిగా చింతామణి, ప్రణయ రసాధిదేవత, భక్తురాలి దేవదేవి, మౌర్యరాజ్య స్థాపనకు బీజం వేసిన వీరమాతగా మురి, మధురహాస లాలసగా మధురవాణి పాత్రలను నభూతో నభవిష్యతిగా పోషించారు. అలంకార శాస్త్రరీత్యా స్త్రీలను స్వకీయ, పరకీయ, సామాన్య అనే మూడు తరగతులుగా విభజించారు. మధురవాణి, చింతామణి, దేవదేవి సామాన్యస్త్రీలు, వేశ్యలు, చిత్రాంగి పరకీయ, సత్యభామ స్వకీయ. కానీ ఆమె కూడా తన సౌందర్య, చమత్కారం, హావభావ విలాసం చేత పురుషుని ఆకర్షించడానికి ప్రయత్నించే వనిత. శ్రీకృష్ణునిపై రుక్మిణి ప్రేమ భక్తిపరం. రాధాప్రేమ యోగతుల్యం. సత్యభామ ప్రేమ కామగుణం. ఇటువంటి పరస్పర విరుద్ధాలైన పాత్రలను స్థానం పోషించినట్లుగా నటీమణులు కూడా పోషించలేరంటే అతిశయోక్తి కాదు. కన్యాశుల్కం నాటకంలో మధువాణిగా లొట్టిపిట్టల ప్రస్తావన సమయంలో విరగబడినవ్వే సన్నివేశం స్థానం నటజీవితానికే పరాకాష్ఠగా పలువురు పేర్కొన్నారు.

స్థానం పద్యం చదివే విధానం నేర్పునిరుపమానమైనది. అర్థయుక్తంగా, భావద్యోతకంగా పద్యంలో రాగాన్ని మిళితం అత్యంత ఆకర్షణీయంగా అభినయపూర్వకంగా నటించేవారు. పద్యం చదవలసిన పద్ధతి గురించి ఒక గ్రామ్‌ఫోన్ రికార్డులో సోదాహరణంగా వివరించారు. మద్రాసు నగరంలోని ఎస్‌ప్లనేడ్ థియేటర్‌లో స్థానం మురగా, బళ్లారి రాఘవ చాణుక్యునిగా, నెల్లూరు నగరాజారావు చంద్రగుప్తునిగా ప్రదర్శించిన చంద్రగుప్త నాటకం అప్పటికీ, ఇప్పటికీ గొప్ప ప్రదర్శనగా పేరు పొందింది.

స్థానం వారు రంగస్థలంపై స్త్రీపాత్రను పోషించే సందర్భంలో జరిగిన సంఘటనలు విశేషంగా పేర్కొన్నారు. మేకప్ పూర్తి చేసుకుని కూర్చొని ఉన్న స్థానం వారి వద్దకు ముత్తయిదువలుచ్చి బొట్టుపెట్టి పేరంటానికి ఆహ్వానించేవారట. మహానటులు చిత్తూరు నాగయ్యకు స్థానం వారి నటన అంటే వల్లమాలిన అభిమానం. ఆయనను జీవితలో ఒక్కసారైనా చూడాలని కలలు కనేవారు. చిత్రాంగి వేషంలో స్థానాన్ని చూసి తన్మయుడైపోయాడు. చిత్రాంగి పాత్రను పోషిస్తున్న నాగయ్య స్థానం వారిని దృష్టిలో ఉంచుకుని నటించగా ఆ నటనకు స్వర్ణపతాకాన్ని బహుమతిగా పొందారు.

కేవలం నాటక ప్రదర్శనలు ఇవ్వడమే కళాకారుడి బాధ్యత కాదని గ్రహించిన స్థానం దేశం కోసం ప్రాణాలర్పిస్తున్న వారి కుటుంబాల సహాయార్థం కళాకారుడిగా సహాయపడడం ధర్మంగా భావించి తమ సన్మానం సందర్భంగా బహూకరించిన ఘంటా కంకణాన్ని విరాళంగా ఇచ్చారు. స్థానం వారు ఒక పట్టణంలో విషాద సారంగధర నాటకాన్ని ప్రదర్శించడం ఇష్టం లేక పారితోషికంగా 1,000 రూపాయలు కోరారు. వారు ( మిగతా 118లో)

# రసజ్ఞుల మనసు దోచే 'స్థానం'

(117వ పేజి తరువాయి)

వెంటనే ఇవ్వగానే ప్రదర్శించారు. ఆ రోజులలో అదే పెద్ద పారితోషికం. కాని ఆ ధనాన్ని ఆంధ్రనాటక కళాపరిషత్ వారికి బహూకరించి ఉత్తమ ప్రదర్శనకు రోలింగ్ షీల్డ్ ఇవ్వమని కోరారు. నటుడిగా ఎంత ఉన్నత శిఖారాలను అధిరోహించిన తనలోని తప్పులను నిర్భయంగా అంగీకరించే సహృదయ శీలి స్థానం. ఒక పర్యాయం శ్రీ కృష్ణ తులాభారం నాటకం ప్రదర్శిస్తున్నప్పుడు స్థానం వారు స్టేజి మీద ఆవులించారు. దానిని ప్రదర్శనలో అనౌచిత్యంగా భావించిన దర్శకుడు 5 రూపాయలు జరిమానాను విధించగా శిక్షను ఆనందంగా స్వీకరించారు.

నాలుగు దశాబ్దాలకాలం రంగస్థలంపై వెలిగిన స్థానం వారికి జరిగిన సత్కారాలు సన్మానాలు, లభించిన పురస్కారాలు మరే కళాకారునికి దక్కలేదు. మైసూరు మహారాజా ఆహ్వానంపై జగన్మోహిని ప్యాలెస్‌లో స్థానం శ్రీ కృష్ణతులాభారం నాటకాన్ని ప్రదర్శించారు. స్థానం నటనకు పరమానంద భరితుడైన మహారాజ 500 రూపాయలు కానుకగా ఇవ్వగా మహారాణి వెడి జరీచీరను బహూకరించారు. ఈ కానుకను అందుకున్న స్థానం ఒక అంతఃపుర స్త్రీకి మరొక అంతఃపుర స్త్రీ ఇచ్చిన బహుమానం అని సంతోషించారు. పశ్చిమ గోదావరి జిల్లా నరసాపురంలో 'నాటకావతంస' అనే బిరుదును, విజయనగరంలో 'నటశేఖర' బిరుదును, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీచే 'నాటక కళాప్రపూర్ణ' బిరుదును పొందారు. వీరి నటనను చూసిన హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ 'ఆంధ్రబాలగంధర్వ' బిరుదును ప్రదానం చేశారు. కలకత్తా మేయరు డి.ఖైతాన్ బంగారు పతకం బహూకరించగా రంగూన్ ప్రజలచే స్వర్ణ కిరీటాన్ని, న్యూ ఢిల్లీ తెలుగు సంఘం వారిచే రజత పాత్రను, మద్రాసు సినీ కళాకారుల సంఘంచే స్వర్ణకంకణం, రజత అశోక స్థూపాన్ని, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డి.సంజీవయ్య గారిచే బంగారు పతకాన్ని బహుమతులుగా పొందారు. 1982లో హైదరాబాదు నగరంలో వందలాది మంది కళాకారులు పెద్దఎత్తున స్థానం వారి షష్టిపూర్తి మహోత్సవాన్ని నిర్వహించారు. 1956 జనవరి 26న పద్మశ్రీ పురస్కారాన్ని స్వీకరించడానికి వేదికపైకి వెళుతున్న సందర్భంలో మారుమ్రోగిన కరతాళ ధ్వనులు దర్బారు హాలులో ప్రతిధ్వనించాయట. బహుమతి ప్రదానం అనంతరం స్థానం వారి విశిష్టతను తెలుసుకున్న రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధాని జవహర్‌లాల్‌నెహ్రూ స్థానం వారిని తమ సరసన కూర్చొబెట్టుకుని రంగస్థలానికి చెందిన పలు విషయాలను ఆసక్తిగా తెలుసుకున్నారు.

రంగస్థలానికి చెందిన పలు విశేషాలను వివరిస్తూ స్థానం వారు నటస్థానం అనే గ్రంథాన్ని రచించారు. సత్యభామ, రాధాకృష్ణ చలనచిత్రాలలో అర్జునుడు, నారదుడు పాత్రలను పోషించారు. వృద్ధాప్యంలో 1957 నుంచి హైదరాబాదు ఆకాశవాణిలో నాటక ప్రయోగకర్తగా వ్యవహరించారు. పక్షవాతానికి గురై దాదాపు 18 నెలలు తీవ్ర అనారోగ్యానికి గురైన స్థానం 1971 ఫిబ్రవరి 21న తెనాలిలో దివంగతులయ్యారు.

# సజీవ లాలిత్యం

## జింకా చిత్రలేఖనం

(ఆన్‌లైన్ సత్తెనపల్లి)

పట్టణానికి చెందిన జింకా రామారావు చిత్రకళలో ప్రవీణులు. జర్నలిజం, ఫోటోగ్రఫి, చిత్రలేఖనం వంటి బహుముఖ జీవనసాధనలో ఉన్న జింకారామారావు ప్రపంచపు అందాలనుంచి తాను చిత్రకళలో కొంతమేరకే సాధించానని అంటారు. పలకమీద అక్షరాలు దిద్దుకునే వయస్సు నుండే బొమ్మలు వేస్తూ వచ్చిన తనను దుట చిత్రకళ అనేది బ్రహ్మరాసిన గీతగా జింకా చెప్తారు. ఎన్నివందల పెయిటింగ్స్ వేసిన మరొక ప్రజ్ఞావంతుడైన చిత్రకారుని బొమ్మలు చూసినప్పుడు తానింక విద్యార్థినేనని జింకా చెప్పుకుంటారు. చిత్రకళా జంకాకు వెన్నతో పెట్టిన విద్య. వర్షంలో గెంతులేస్తూ పరుగెత్తుతున్న పిల్లల దగ్గరనుంచి భీమ్లి, విశాఖ బీచ్‌ల అందాలు అద్భుతంగా తమ రేఖా చిత్రాల ద్వారా జింకా చిత్రీకరించారు. పెన్ స్కెచెస్ వేయటంలో జింకా కెమారా కన్నువంటి వర్‌స్పెక్టివ్ విధానాన్ని అవలభించటం వల్ల ఆయన పెన్నుతో గీచిన స్కెచ్ అయిన, వాటర్ కలర్ స్కెచ్ అయిన మనకు దృశ్యపులోతు స్ఫూర్తించేదిగా కనిపిస్తుంది. నిమిషాలలో గీసిన స్కెచ్‌లో ఆయన పెన్నుస్ట్రోక్ సజీవ లాలిత్యంతో ఉట్టిపడుతోంది. ఢిల్లీ వెళ్ళినప్పుడు అక్కడ నేషనల్ మ్యూజియంలో ఉన్న కాంగ్రా స్టైల్ మినియేచర్ పెయిటింగ్స్ చూసిన దగ్గరనుంచి తనలో కళాపరమైన మార్పువచ్చిందని జింకా అంటారు. అప్పటినుంచే ప్రకృతి ఆరాధన వంటిది అభివృద్ధి చెంది పెన్‌స్కెచెస్ గీయటం ప్రారంభం జరిగిందని జింకా తెలిపారు. ఢిల్లీలోని కుతుబుమినార్, పురాన్‌కిల్లా తదితర ప్రాంతాలలో, పుట్టపర్తి, విజయవాడ, బనారస్, భీమ్లి, విశాఖపట్నం వంటి చోట్ల జింకా పెను స్కెచెస్ వేశారు. విశాఖతీర ప్రాంతంలో ఉన్న చేపల వృత్తిదారుల రూప విన్యాసాలు, బెనారస్‌లోని గంగానది ఘాట్ దృశ్యాలలో అక్కడివారి వేషదారణ, వాడే వస్తువులను బట్టి ఆయన చేసే కంపోజింగ్‌లో వివిధ ప్రాంతాల సంస్కృతులు మనకు విశదమవుతుంటాయి. పెయిటింగ్‌ల విషయాని కొస్తే సంప్రదాయ శైలిలో 'వెన్నెల ప్రియ', పూబాల వంటి చిత్రాలతోపాటు మదర్‌థెరిస్సా, అరవిద్‌ఘోష్, భగవాన్ రమణమహర్షి వంటి దాదాపు 50కి పైగా అయిల్ కలర్ పొట్రెయిట్ పెయింటింగ్స్ చేశారు.


జింకా రామారావు

ఏ చిత్రకారులను అనుసరించ కుండా ఉండే చిత్రకారుని చిత్రాలలో రంగుల పొందిక ప్రత్యేకంగా కనిపిస్తుంది. రామారావు కేవలం ఊహాలోకాలలోనే విహరించటం కాకుండా 1977 తుఫాను దృశ్యాలు, లాతూర్ భూకంప దృశ్యాలను కళ్ళకు కట్టినట్లు ఆయిల్ కలర్‌లో చిత్రించి సామాజిక బాధ్యతను చాటుకున్నారు. వాష్ టెక్నిక్‌లో వాటర్‌కలర్ చిత్రాలు, పంప్ పౌడర్‌తో చిత్రించిన యన్.టి. ఆర్ పొట్రెయిట్, నైఫ్‌వర్క్ పెయింటింగులు చేసి దాదాపు అన్నిరకాల మీడియాలలో తక కళా ప్రతిభను చాటుకున్నారు. కొందరు కళకారుల మాదిరి కొన్ని విషయాలకే పరిమితంకాని రామారావు, కార్టూన్ కళలోకూడ అందెవేసిన చేయి. ఆల్మట్టి సమస్య వెలుగులోకి వచ్చిన కొత్తలో ఆయన గీసిన కార్టూన్ ఒక ప్రముఖ దినపత్రికాద్వారా అద్భుతంగా ఆకట్టుకుంది.

ఆల్మట్టి డ్యాం ఎత్తుకట్టినందువల్ల దిగువనున్న నాగార్జున సాగర్ దాకా నీరురాక పంటపొలాలు నెర్రెలు కొట్టిన నేపథ్యంలో నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు రెండు కాళ్ళూ తన్నిపట్టి శ్రీశైలం డ్యాం మీదుగా కర్ణాటకలోని'ఆల్మట్టి' డామ్ వరకు తను చేతుల్ని చాచి ఆడామ్‌ను పట్టుకుని లాగుతున్నట్లుగా ఒకరైతు బొమ్మను ప్రధానంగా చూపిన కార్టూన్ ప్రశంసాపాత్రమైనది. 'వెన్నెలప్రియ' పెయిటింగ్ ఆయిల్ కలర్లో వేయబడ్డా నీటిరంగులలో వాష్ టెక్నిక్‌లో వేయబడ్డ చిత్రంలా ఆబొమ్మ కనిపించటం ప్రత్యేకత. శబరి పెయింటింగ్ ఆరు మాసాలకు పైగా శ్రమించి చిత్రించిన గొప్ప కళాఖండం. మీకు నచ్చిన చిత్రకారులెవరని ప్రశ్నిస్తే అలాచెప్పటం సాధ్యపడదని రహమాన్ చుగ్తాయ్ రేఖలన్నా, బాపూగారు అలవోకగా గీసే చిత్రాలన్నా, అద్భుతమైన కంపోజింగ్‌తో సుసంపన్నమైన రంగుల ప్రపంచంలో రసప్రదర్శన ఉట్టిపడే రాజారవివర్మ చిత్రాలన్నా, వడ్డాది పాయ్యగారి కుంచెనుంచి జాలువారే కమనీయ వర్ణ కోమలులన్నా మనం శిరసునుంచి ప్రణామం చేయవలసిందేనని రామారావు వివరించారు. భావి చిత్రకారులకు ఉపకరించే రీతిలో సత్తెనపల్లిలో ఒక ఆర్టుగాలరీ వంటిది ఏర్పాటు కావాలని తాను కోరుకుంటున్నానని, అదే జరిగితే తన చిత్రాలతోపాటు ఈ ప్రాంతంలోని ప్రముఖుల పెయింటింగులను అందులో పొందుపరచటం ద్వారా ఈ శతాబ్దిలో వర్ధిల్లిన సంస్కృతిని ఎరిగిచంటతో బాటు భావిచిత్రకారులకు స్ఫూర్తి కలిగించేందుకు దోహదం కలుగుతుందని జింకా రామారావు వివరించారు.

# ఆంధ్రజ్యోతికి తృతీయ వార్షికోత్సవ శుభాకాంక్షలు






అశేష ఆంధ్రుల అభిమాన దినపత్రిక ఆంధ్రజ్యోతి మూడు వసంతాలను పూర్తి చేసుకొని తెలుగునాట ప్రత్యేక శైలిగల ప్రముఖ దినపత్రికగా వెలుగొందుతూ అక్షర మహాయజ్ఞంలో ఉన్నత శిఖరాలను అధిరోహిస్తూ నాల్గవ వసంతంలోకి అడుగిడుతున్న శుభసందర్భంగా మా హృదయపూర్వక అభినందనలు. మునిసిపల్ నూతన ఛైర్మన్‌గా ఎన్నికైన

**శ్రీ కాండ్రు శ్రీనివాసరావుగారికి**

మా హృదయపూర్వక శుభాకాంక్షలను తెలుపుకుంటూ...

| | |
|---|---|
| శ్రీ సిహెచ్.టి.ఆర్. ప్రసాద్, M.Tech., మునిసిపల్ ఇంజనీర్ | శ్రీ ఎం. ఆంజనేయశాస్త్రి, M.Tech., మునిసిపల్ అసిస్టెంట్ ఇంజనీర్ |
| శ్రీ శాంతిరాజు, M.Tech., మునిసిపల్ అసిస్టెంట్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ | శ్రీ జె. వెంకటేశ్వరరావు, J.T.O. |
| శ్రీ ఎస్.ఎస్.ఆర్. కృష్ణారెడ్డి, W.O. | శ్రీ ఎం. మురళి జూనియర్ అసిస్టెంట్, ఇంజనీరింగ్ సెక్షన్ |

శ్రీ జె. పార్థసారథి
ఫిట్టర్

**శ్రీ కాండ్రు శ్రీనివాసరావు**
ఛైర్మన్, మంగళగిరి మునిసిపాలిటీ

| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ ఆర్.వి. దత్తు<br>క్లాస్ 1 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ వెనిగళ్ళ సాంబశివరావు<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ కన స్ట్రక్షన్స్<br>విజయవాడ | శ్రీ ఆర్.వి.ఆర్. కుమార్<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ అమిరిశెట్టి వెంకటేశ్వర్లు<br>క్లాస్ 1 కాంట్రాక్టర్, మంగళగిరి |
| శ్రీ షేక్ ఖాజా<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ పి. శోభన్‌బాబు<br>క్లాస్ 1 కాంట్రాక్టర్, విజయవాడ | శ్రీ షేక్ దస్తగిరి<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ కె. నాగేశ్వరరావు<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ పాగోలు శ్యామ్ ప్రసాద్<br>కాంట్రాక్టర్, మంగళగిరి |
| శ్రీ పి. వెంకటేశ్వర్లు<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ వాకా మంగారావు<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ బాపనపల్లి రవికుమార్<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ కె. అబ్బయ్య<br>క్లాస్ 2 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ టి. శ్రీనివాసరావు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి |
| శ్రీ కె. భిక్షాలరావు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ వై. భూషణం<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ కాసాని కోటేశ్వరమ్మ<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ గట్టెం నాగేశ్వరరావు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ అలూరి కొండయ్యచౌదరి<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి |
| శ్రీ ఇర్ల సాంబశివరావు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ పాగోలు సాంబశివరావు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ మునగపాటి సీతారామాంజనేయులు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ వెనిగళ్ళ శంకరరావు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి | శ్రీ సుంకర రఘుపతిరావు<br>క్లాస్ 3 కాంట్రాక్టర్, మంగళగిరి |

# ఆధ్యాత్మిక దివ్యక్షేత్రం కారంపూడి

(ఆన్‌లైన్, కారంపూడి)

"వీరులు దివ్యలింగములు, విష్ణువు చెన్నాడు,కల్లిపోతరా
జారయకాలభైరవుడు, నంకమశక్తియెయన్నపూర్ణయున్
గెరిడు గంగాధరమడుగే మణికర్ణికరగా జెలంగునీ
కారంపూడి పట్టణము కాశిగదా పలనాటివారికిన్"

కారంపూడి పట్టణము పలనాటివారికి కాశీతో సమానము అందుకే దీనిని దక్షిణ కాశి అని అభివర్ణించారు. ఉత్తరవాహినిగా ప్రవహించి జీవనది నాగులేరుండట ఈ క్షేత్ర ప్రాశస్త్యమును మరింత కీర్తివంతము చేసినది. పట్టణము కేంద్రస్థానములో మహిషాసురమర్ధని అంకాళమ్మ దేవాలయము, ఆప్రక్కనే గణములకు అధిపతి వినాయక దేవాలయము, సూరేశ్వరదేవాలయము, ఇటుప్రక్క చెన్నకేశవ దేవాలయము, ఆముంగట వీరాంజనేయ స్వామిదేవాలయము. ఈ దేవాలయముల సముదాయములో కారంపూడి గ్రామము భక్తులకు ఆలయాలమై అధ్యాత్మికోన్నతి కలిగిన దివ్యక్షేత్రముగా భాసిల్లుతున్నది. ఈ ప్రదేశములోనే గ్రామపెద్ద యేచూరి హరినాథ్ షిర్డిసాయి దేవాలయాన్ని నిర్మించాడు. వీరాంజనేయ స్వామి దేవాలయమునకు ఉత్తరావైపునగల స్థలంలో ఒక వేదికవుండేది. అవేదికను ఆధ్యాత్మిక కేంద్రంగా తీర్చిదిద్దవలెనని హరినాథ్ భావించారు. గ్రామపెద్దలను సంప్రదించి మనసులోని ఆలోచనకలుగగానే ఆకలిగిన తొలిసంకల్పమే సాయిమందిర నిర్మాణము ఈసందర్భంలోనే పల్నాటి చరిత్ర గ్రంధ రచయిత, అయ్యప్పస్వామి దీక్షాపరుల గురుస్వామి అయిన డా॥ పి.వి. ఆచార్యను కలసి సాయి మందిర నిర్మాణ సంకల్పమును తెలిపారు. దుఃఖ నివారణార్ధం, సాధన, తపస్సు, అందరినీ ప్రేమించే గుణం, కారుణ్యం అదే సాయి తత్వమని, ఆ ప్రదేశం షిర్డి సాయి మందిరం నిర్మించటం శుభప్రదమని చెప్పి కార్యక్రమానికి రూపకల్పన చేశారు. ఈమందిర రూపకల్పనకు సాయి బంధువులైన నర్సరావుపేట వాస్తవ్యులు కొత్త గోపయ్య, గోపాలరావు, జొన్నలగడ్డ సాయి, నల్లపాటి చంద్రశేఖరం, కంపా చెన్నకేశవరావు సలహా సూచనలు స్వీకరించి నిర్మాణాలు చేపట్టారు. 2003 ఫిబ్రవరి 17వ తేదీన శంఖుస్థాపన చేశారు. ఈనేపథ్యంలో పక్కనే ఉన్న ఆంజనేయస్వామి దేవాలయం ముందుగల ధ్వజస్థంభం వద్ద తవ్వుచుండగా మట్టిలో రెండు అంగుళాల సాయినాధుని వెండి విగ్రహం దొరికింది. మందిర నిర్మాణానికి ఇదే సాయి ఆశీస్సులుగా భావించి ఏచూరి హరనాధ్ దంపతులు, నిర్మాణ సహకారవేత్త డా॥



అంకాళమ్మ అమ్మవారి దేవాలయ ప్రాంగణం

పి.వి. ఆచార్య సాయి దేవాలయ నిర్మాణ కార్యక్రమాలను ముమ్మరం చేశారు. అక్కడి నుండి దేవాలయ నిర్మాణం ఎటువంటి ఆటంకం లేకుండా ముందుకు సాగింది. శంఖుస్థాపన కార్యక్రమానికి ముందురోజు సాయి భక్తబృందం అఖండ సాయి నామం ఏకాహంగా జరిపించారు. శిలా శంఖువునకు తమ స్వహస్తాలతో ఆవుపాలతో అభిషేకం చేసి ౬గర్తం*లో నవధాన్యాలు నిక్షేపం చేశారు. జైపూర్ నుండి వచ్చిన శర్మ అనే శిల్పి షిర్డిసాయి విగ్రహాన్ని పాలరాయితో చెక్కించి ఇవ్వడానికి ఒప్పందం కుదుర్చుకున్నారు. 2003 జూన్ 19వ తేదీన షిర్డిసాయి విగ్రహ ప్రతిష్ఠా కార్యక్రమాన్ని ఏర్పాటుచేశారు. ఆకార్యక్రమానికి సుదూర ప్రాంతాల నుండి సాయి భక్తులు వేలాదిగా తరలి వచ్చారు. ప్రతిష్ఠా కార్యక్రమం సందర్భంగా షుమారు 20వేల మందికి అన్నదాన కార్యక్రమాన్ని ఏర్పాటు చేశారు. కంపా చెన్నకేశవరావు బాబాకు వెండి కిరీటం బహూకరించారు. ఇక్కడ సాయినాధుడు పిలిస్తే పలికే దేవుడుగా, ఆకలితీర్చే అన్నపూర్ణగా, భక్తుల పాలిట ఆపద్బాంధవుడుగా తన మహిమలను చూపించి ప్రసిద్ధికెక్కారు.



అంకాళమ్మ అమ్మవారి మూలవిరాట్

## మహిమాన్వితమైన అమ్మవారు అంకాళమ్మ

కారంపూడిలో వెలసిన అంకాళమ్మ అమ్మవారు గొప్ప మహిమ గల దేవత. పల్నాటి వీరాచారవంతులు అంకాళమ్మ అమ్మవారును ఇష్టదైవంలా, పిలిస్తే పలికే దైవంలా, భక్తుల పాలిటి కొంగుబంగారంలా భావించి పూజిస్తారు. పల్నాటివీరులు ఆరాధించే దేవత కనుక ఈమెను వీర్ల అంకాళమ్మగా పిలుస్తారు. జనసామాన్యంలో అనేకమంది ఈమె పేర్లు పెట్టుకుంటారు. అంకయ్య, అంకమ్మ, వీర్లఅంకయ్య, అంకారావు అనేపేర్లు కనిపిస్తాయి. కారంపూడి నడిబొడ్డున వెలసిన దేవాలయంలో అమ్మవారి విగ్రహం తలవొంచి ఎడమవైపుకు ఒరిగినట్టుటుంది. యుద్ధ రంగంలో ఒక్కక్కరే పల్నాటివీరులు నేలకొరుగుతుంటే, రాలిపోయిన ఆ వీరుల కోసం దు:ఖిస్తుంది. అమ్మవారి కంటికింద ఒక గిన్నె పెట్టి ఉంటుంది. కొమ్మరాజు తదితర భక్తులు రణరంగంలో చనిపోవటంవల్ల అంకమ్మతల్లి దుఃఖిస్తున్నదని అందుకే ఆమె ఎడమకన్ను నుంచి నీరు కారుతుందని చెప్పుకుంటారు. ఆమె కన్నీరు గిన్నెలోకి కారుతుంటుంది. ఆకన్నీరు కిందపడితే అరిష్టమని, అందుకే గిన్నె పెట్టబడిందని చెబుతారు. ఈ అమ్మవారి విగ్రహానికి ఎదురుగా గల ప్రహారీ గోడకు చిన్న కిటికీ ఉంది. నాగులేరు రణరంగ స్థలం కనిపిస్తుంది. అన్ని కులాల వారు అమ్మవారిని పూజిస్తారు. వ్యాధులు ప్రబలినపుడు(మిగతా 121లో)

# ఆధ్యాత్మిక దివ్య క్షేత్రం కారంపూడి

(120వ పేజి తరువాయి)

ఆపదలు వాటిల్లినపుడు అమ్మవారిని మొక్కుకుంటారు. భక్తుల పాలిటి కొంగుబంగారంగా నిలిచిన అంకాళమ్మకు తలనీ లాలిచ్చి మొక్కుతుంటారు. అమ్మవారి మహిమలను తెలిపే అనేక ఉదంతాలు ప్రాచుర్యంలో వున్నాయి. అంకాళమ్మతల్లి పిడుగువారి ఇలవేల్పాని తల్లిలా ఆదరిస్తుందని ఆడపడు చులా ప్రేమానురాగాలు కురిపంస్తుందని కథలుగా చెప్పు కుంటారు. అలాగే గ్రామంలో వ్యాధులు ప్రబలినప్పుడు కొలుపులు జరిపితే అమ్మవారు స్వయంగా వేపమండలు పట్టి గ్రామానంత చుట్టి తిరిగి రక్షించేదని కొందరు పెద్దలు అది స్వయంగా దర్శించారని కథలుగా చెబుతుంటారు. ఏది ఏమైన నాటికి నేటి మహిమాన్వితమైన అంకాళమ్మ అమ్మ వారు భక్తుల పాలిట కొంగుబంగారామై కారంపూడిలో వెలిసి ఉండి ఆపనులను సర్వావస్తలలో అదుకుంటుందనేది నగ్న సత్యంగా అమ్మవారి మహిమలు బహిరతమైయ్యాయి.

అప్పటి వీరాచార పీఠాధిపతి అయిన కీర్తిశేషులు పిడుగు భద్రయ్య జీవించి ఉండగా వారు ఎప్పుడు పిలిస్తే అప్పుడు అమ్మవారు వచ్చినట్లు ఈప్రాంత ప్రజలు కథలుగా చెప్పుకుం టారు. ఒకప్పుడు వీరాచారమునకు సంబంధించిన వివాద ముతో కొందరు మరణించగా అందుకు బాధ్యులు భద్రయ్యేనని నేరమారోపించగా విచారణకు కొండవీడులోని కోర్టుకు వెళ్ళవ లసి వచ్చింది. కొంతదూరం వెళ్ళగానే ఒక గాజుల శెట్టి ఎదురై భద్రయ్యను ఆపి ఎవరో ఒక ముత్తయిదువ తెల్లచీర కట్టి, పెద్ద బొట్టు పెట్టి గుత్తికొండ బిలం వద్ద ఆపి రెండుచేతుల నిండా గాజులు వేయించుకొని డబ్బు అడిగితే, వెనుక మాఅన్నయ్య గుర్రం మీద వస్తున్నాడు అని చెప్పింది. మీ చెల్లెలు గాజులు వేయించుకుంది అని చెప్పి డబ్బులు ఆయనే ఇస్తాడని చెప్పాడు. ఈవిషయం విన్న భద్రయ్య ఆశ్చర్యపోయాడు. ఇది అంకాళమ్మ తల్లి పనే. తనకు న్యాయం చేయడానికి తనకంటే ముందు నడు స్తున్నది. ఇక మనకు ఏభయం లేదు అని శిష్యులను వెనక్కి పంపి బయల్దేరాడు. కోర్టులో న్యాయాధిపతి వాదప్రతివాదనలు పరిశీలించిన తర్వాత తీర్పువాసిన ప్రతిని చదవి వినిపించాలని సిద్దమయ్యాడు.

విచిత్రం అయనకు కళ్ళు సరిగా కన్పించలేదు. కళ్ళముందు ఎవరో ముత్తైదువా కదలాడసాగింది. తీర్పు చదవలాని మరలా ప్రయత్నించగా పెద్ద కుంకుమ బొట్టుతో కన్పించసాగింది అమ్మ వారు. ఇదేదో దైవ మహిమని మనస్సులోనే నమస్కారంచేసు కొని తను సరైన తీర్పు ఇచ్చేట్లు అనుగ్రహించాలని వేడుకున్నా డట. తీర అమ్మవారిని మనస్సులో తలుచుకోగా న్యాయాధిప తికి కళ్ళు కన్పించాయి. తీర్పు ప్రతిలో భద్రయ్య నిర్ధోషిత్వన్ని నిరూపిస్తూ రాసిన విషయం బహిరంగంగా చదివి భద్ర య్యను సగౌరవంగా సత్కరించి పంపారట. భద్రయ్య కారం పూడి రాగానే విషయం తెలుసుకున్న శిష్య, ప్రశిష్యులు, ప్రజ లందరు గానంగా అంకాళమ్మ అమ్మవారికి నివేదనలు సలిపి సంబరాలు చేసుకున్నారట. ఇటు వంటి మహత్యాలు ఎన్నెన్నో...

# క్రీడా సేవలో ఎల్వీఆర్ క్లబ్


ఎల్‌విఆర్ అండ్ సన్స్ క్లబ్

(ఆన్‌లైన్ – గుంటూరు)

ఆంధ్రప్రదేశ్‌లో నూరు సంవత్సరాలు చరిత్ర కల్గిన ప్రాచీనమైన సంస్థ ఎల్‌విఆర్ అండ్ సన్స్ క్లబ్, రీడింగ్ రూమ్, గుంటూరు ఎల్‌విఆర్ అండ్ సన్స్ క్లబ్, రీడింగ్ రూమ్ వారు వివిధ రంగాలలో పేరు గాంచి రాష్ట్రంలో అగ్రగామిగా వున్నారు. క్లబ్‌లో అధునాతన రీడింగ్ రూంతోపాటు టెన్నిస్, బిలియర్డ్స్, స్నూకర్స్, చెస్, క్యారమ్స్, అధునాతన జిమ్, విశ్రాంతి గదులు ఏర్పాటు చేశారు. దేశంలోని ప్రముఖ క్లబ్‌లతో ఎల్‌విఆర్ క్లబ్‌కు అఫిలియేషన్ వుంది. ప్రపంచ బిలియర్డ్స్, స్నూకర్ ఛాంపియన్స్ మైఖేల్ ఫెరిరా, గీత్‌సేథి, అగర్‌వాల్, జగదీష్ అగర్వాల్ మొదలగు క్రీడాకారులందరు క్లబ్‌లో జరిగే పోటీలలో పాల్గొన్నారు. రాష్ట్రంలో పేరుగాంచిన జాతీయ, అంతర్జాతీయ క్రీడాకారులను ఎల్‌విఆర్ క్లబ్ వారు సన్మానించారు. వారిలో ఆల్ ఇంగ్లాండ్ మాజీ బ్యాడ్మింటన్ చాంపియన్ పుల్లెల గోపీచంద్, ఒలింపిక్ వెయిట్ లిఫ్టింగ్ పోటీల్లో కాంస్య పతకం సాధించిన కరణం మల్లేశ్వరి, ప్రపంచ స్నూకర్ ఛాంపియన్ గీత్‌సేధి మొదలగువారిని ఘనంగా సత్కరించారు. డాక్టర్ నాయుడమ్మ, విద్వాన్ గోగినేని కనకయ్య, దరువూరి వీరయ్య, వాలీబాల్ క్రీడలో అర్జున, ద్రోణాచార్య అవార్డులు పొందిన అరికెపూడి రమణరావు, క్రికెట్, హాకీలో డబుల్ బ్లూగా పేరుగాంచిన ఎస్ఎల్ నారాయణరావు, సవరం నాగేశ్వరరావు, పట్నాయక్, చలన చిత్ర నిర్మాత విబి రాజేంద్రప్రసాద్‌లను క్లబ్ సన్మానించింది.

# నాణ్యమైన నాపరాళ్ళకు పెట్టింది పేరు రెంటచింతల


గోలిలోని నాపరాయి క్వారీ

**(ఆన్‌లైన్, రెంటచింతల)**

గుంటూరు జిల్లా రెంటచింతల మండలం నాపరాయి గనులకు పెట్టింది పేరు. మండలంలోని గోలి, జెట్టిపాలెం, పశర్లపాడు, తుమ్మకోట గ్రామాల పంచాయతీల పరిధిలో వేలాది ఎకరాల్లో విస్తరించి వున్న ఈ నల్ల బంగారం(నాపరాయి) గనులలో లభించే నాపరాయి ఎంతో నాణ్యమైనది. నాపరాయి క్వారీల ద్వారా తీసే ఇక్కడి రాయి రాష్ట్ర స్థాయిలోనే గాక ఇతర రాష్ట్రాలకు సైతం ఎగుమతి చేస్తుంటారు. రెంటచింతల మండలంలో ముఖ్యంగా గోలి గ్రామంలోని క్వారీలలో లభించే నాపరాయికి అత్యంత గిరాకి వుంటుంది. మండలంలో రోజుకు దాదాపు 60 నుండి 70 లారీల నాపరాయి రవాణా అవుతుంది. మండలంలో విస్తరించి వున్న నాపరాయి క్వారీల ద్వారా సీనరేజి రూపంలో పంచాయతీలకు లక్షలాది రూపాయల ఆదాయం లభిస్తుంది. పంచాయతీలకు క్వారీల కారణంగా లక్షల ఆదాయం వస్తున్నప్పటికీ కొన్ని పంచాయతీలు ఇప్పటికి మౌలిక సదుపాయాలు లేక అల్లాడుతుండడం దురదృష్టకరం. పలు గ్రామాలలో నిక్షిప్తమై వున్న నాపరాయి క్వారీలు మండలంలో వందలాది మందికి ఉపాధి కల్పిస్తున్నాయి. వందల సంఖ్యలో కుటుంబాలు క్వారీలలో పనిచేస్తూ జీవనం సాగిస్తున్నాయి. ఒక్క గోలి గ్రామంలోనే ఉన్న జనాభాలో 90 శాతం కుటుంబాలు ఈ క్వారీలలోనే పనిచేసుకుంటూ కుటుంబాలను పోషించుకుంటున్నారు. అయితే నాపరాయి వ్యాపారం చేసే వ్యాపారులు మాత్రం ఆర్థికంగా ఎదిగిపోతున్నారు గాని కార్మికుల బ్రతుకులు మాత్రం ఎక్కడ వేసిన గొంగలి అక్కడే అన్న చందంగా వున్నాయి.

క్వారీల మీద మైనింగ్ శాఖకు ఏటా లక్షలాది రూపాయలు ఆదాయం వస్తుంది. అయితే సంబంధిత మైనింగ్, చెక్‌పోస్టులు, రెవెన్యూ శాఖల అధికారుల అవినీతి కారణంగా కొన్ని వాహనాలు 'వే' బిల్లులు లేకుండా రవాణా చేస్తూ ప్రభుత్వ ఆదాయానికి గండి కొడుతున్నారన్న విమర్శలు వినిపిస్తున్నాయి. కొంత మంది నాపరాయి వ్యాపారులు తాము లీజుకు తీసుకున్న భూముల లోనే రాయిని వెలికి తీయాల్సి వుంది. అయితే లీజు భూములలోనే కాకుండా మరికొంత భూమిని ఆక్రమించుకొని అక్రమ త్రవ్వకాలు జరుపుతూ వ్యాపారం చేస్తున్నారన్న ఆరోపణలు సైతం వినిపిస్తున్నాయి. అక్రమ తవ్వకాలు జరుపుతున్నప్పటికీ రెవెన్యూ, మైనింగ్ శాఖలకు చెందిన అధికారులు ఏమాత్రం పట్టించుకోవడం లేదన్న ఆరోపణలు వున్నాయి. నాపరాయి క్వారీలలో పనిచేసే వందలాది కార్మికులు పలు ప్రమాదాలకు గురవుతూ ప్రాణాల మీదకు తెచ్చుకుంటున్న సందర్భాలు అనేకం. క్వారీలలో రాళ్ళు తొలిచే సమయంలో, మలచిన రాయిని లారీలకు లోడు చేసేటప్పుడు ప్రమాదాలకు గురై సరైన వైద్యం చేయించుకునే ఆర్థిక స్తోమత లేక శాశ్వత అంగవైకల్యం పొందిన కార్మికులూ వున్నారు. నాపరాయి క్వారీల్లో పనిచేసే కార్మికులకే సంఘటితంగా ఏర్పాటు చేసి వారికే క్వారీ భూములను లీజుకు ఇచ్చి వారిని ఆదుకోవాలని ప్రజా సంఘాలు ఆందోళన కార్యక్రమాలు సైతం చేపట్టడం జరుగుతున్నాయి. క్వారీలలో పనిచేసే నాపరాయి కార్మికులకు తరచూ ప్రమాదాలు సంభవించే అవకాశాలు వున్న దృష్ట్యా వారికి భీమా సౌకర్యం కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుంది. వందలాది కుటుంబాలు క్వారీల పై ఆధారపడి జీవిస్తున్నాయి. ప్రమాదం సంభవించిన సమయంలో గాయపడిన వారిని చికిత్స కోసం 11 కిలోమీటర్ల దూరంలో వున్న రెంటచింతలకు తీసుకురావాల్సి వస్తున్నది. క్వారీల సమీపంలోనే వైద్య సదుపాయాలు అందే విధంగా వ్యాపారులు, ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది. వర్షాకాలంలో కురిసే వర్షాలకు క్వారి గుంతల్లో నీరు చేరి కార్మికుల ఉపాధికి తీవ్ర అవరోధం ఏర్పడుతున్నది. దీంతో వర్షాకాలంలో కార్మికులు ఉపాధి లేక కుటుంబ పోషణకు ఇబ్బందిగా మారుతున్నది. కాబట్టి వర్షాకాలంలో కార్మికులు ప్రత్యమ్నాయ ఉపాధి కల్పనకు ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలని కార్మికులు కోరుతున్నారు.

# సమస్యల వలయంలో నిజాంపట్నం హార్బర్

(ఆన్‌లైన్, నిజాంపట్నం)

రాష్ట్రంలో ప్రధాన ఓడరేవులలో నిజాంపట్నం ఒకటి.గతంలో ఈఓడరేవుకు ఓడలు వచ్చివెళ్ళేవని స్థానికులు అంటున్నారు. ఈ హార్బర్ నుంచి ఇతర దేశాలకు సరుకులు పంపేవారని, ఇతర దేశాలనుంచి వచ్చిన సరుకులను వివిధ ప్రాంతాలకు చేరవేసేవారు. ప్రధాన పట్టణాలకు దూరంగావున్న ఈహార్బర్ నుంచి స్మగ్లింగ్‌వంటి అసాంఘిక కార్యక్రమాలకు ఒకప్పుడు నిలయంగా వుండేదని ఒక కథనం. నిజాంపట్నం హార్బర్ ఏర్పడటానికి ప్రధాన కారణం ఒకేచోట రెండు మురుగుకాల్వలు హార్బర్‌లో కలవటమే. రెండు మురుగుకాల్వల సంగమ ప్రదేశమే హార్బర్. మత్స్యకారుల వేటకు ఇతర కార్యక్రమాలకు వుపయోగిస్తున్న హార్బర్‌ను 1980 సంవత్సరం మే 5వ తేదీన ప్రారంభించారు. ప్రారంభ సమయంలో 60 మరపడవల అంచనాలతో ప్రారంభించబడింది. అరకొర వసతులతో ప్రారంభమైన హార్బర్ క్రమేపీ అభివృద్ధి చెందింది. 2000 సంవత్సరానికి మరపడవల సంఖ్య నాలుగు వందలకు పెరిగింది. వ్యాపారపరంగా మత్స్యసంపద స్థానికంగానేకాక ఇతర ప్రాంతాలకు పంపటం జరిగింది. మత్స్యసంపద వ్యాపారం పెరిగిన కొద్ది నిజాంపట్నం బోట్లే కాకుండా నెల్లూరు, ప్రకాశం జిల్లాలలోని కొత్తపట్నం, చినగంజాం, గొండాయిమూల, గొండాయిపాలెం, కరేడు, ఈతముక్కల, మన్నవవారిపాలెం, చీరాల ఓడరేవు, పాకాల తదితర ప్రాంతాల నుంచి బోట్లు వచ్చి వేటచేసేవి. ఇతర ప్రాంతాల వేటబోట్లు రావటంతో స్థానికంగా వ్యాపారస్తుల రద్దీ ఎక్కువ కావడం మొదలైంది. మత్స్యసంపద ఇతర ప్రాంతాలకు తరలించేందుకు స్థానికంగా కొన్ని కొనుగోలు కేంద్రాలు స్థాపించబడ్డాయి. ప్రతిబోటులో ఏడు గురు చొప్పున కలాసీలు(మత్స్యకార వేట కార్మికులు) పనిచేస్తుంటారు. వేటకు వెళ్ళిన బోటు పది రోజులకు తగ్గకుండా సుమారు రెండు నెలలవరకు వేట చేస్తూనే వుంటాయి. మత్స్యకారులు తమవెంట ఆహారం, కూరగాయలు, అవసరం కొద్ది మందులు, నిత్యావసర సరుకులను తీసుకువెళతారు. సముద్రంవేట సమయంలో దారితప్పిన బోట్లు అనేకం. దురదృష్టవశాత్తూ సముద్రంలో పడి మరణించిన వారి సంఖ్య లెక్కకుమించినదే. ప్రమాదకరమైన వేట చేస్తున్న మత్స్యకారుల భార్యల గుండెల్లో దినదినం గండంగా గడుస్తుంది. నిజాంపట్నం హార్బర్ పరిధిలో 40 వేలకుపైచిలుకు కలాసులు వేటచేస్తూ జీవిస్తున్నారు. లంకెవానిదిబ్బ, మోళ్ళగుంట, కొత్తపాలెం, అడవులదీవి, ముత్తాయిపాలెం వంటి గ్రామాల నుంచి మత్స్యకారులు కూడా హార్బర్‌కు చేరుకొని వేటచేస్తారు. వేట సమయంలో గ్రామదేవత మొగదారమ్మ తల్లి కాపాడుతుందని, సురక్షితంగా తమను ఇంటికి చేరుస్తుందని మత్స్యకారుల ప్రగాఢవిశ్వాసం. కొత్తపాలెం, నక్షత్రనగర్‌లకు చెందిన మత్స్యకారులు మీరాసాహెబ్ తమను కాపాడతాడని వీరి విశ్వాసం. సముద్ర అలల తాకిడి పెరిగినప్పుడు మీరా సాహెబ్‌ను తలచుకోవటం ఒక ఆనవాయితీ. గత డిసెంబరు 26న సంభవించిన సునామీ పెనువిపత్తు కారణంగా మత్స్యకారులు వేట చేసేందుకు భయానికి (మిగతా 129వ పేజీలో)

హార్బర్‌లోని పోర్టు, మత్స్యశాఖ కార్యాలయం

శ్రీనాధకవి శిరస్సీమ నట్టువ ద్రొక్కు
దీనారములకు మదింపు గట్టి
బాలచంద్రుని లేత పచ్చలపడిబాకు
మొలిపించు యశము గాదెలకు బోసి
యెఱగడ్డపాటిలో నొటిగిన తెలుగు
మన్నీల శార్యంబు మానికల గొలిచి
వేమన్న యోగి గుపిన్న జాలువాకైతే
తులము వేయి వరాలు విలువసెప్పి
భాస్కరుని దానధారా ప్రవాహసమితి
తెలుగు బిడ్డ చిఱువేడి పలుకు నెత్రు
టేర్లు తుకతుకనుడికి పొంగెత్తిపొరల
వీరగీతంబు లెచ్చోట వీను మిగిలె
నదియె పలునాడు దీనికున్నదియె
జోడు

- తుమ్మల



# గుంటూరు సీమ

నబ్దినానధున కిడి వివాహం బొనర్చి
పేరు మోసిన వీర గుంటూరు క్షితికి
సతులోసర్చని యాంధ్ర మానసముగ
లదె
ఏసకొంచెములేని హృద్యంగముంబైన
సిసలైన తెనుగు రంజిల్లు చోటు
కట్టులో బోట్టులో కడమసీమల
యందు
సగ్రతాంబూలంబు నందగు చోటు
ఆజానుబాహువులై కోరమీసాల
మగవారు దండిగా మసలుచోటు
కంటికింపైన చక్కని అందగత్తియ
లింటింట విద్యుత్తులీనుచోటు

ఆవల పల్నాడు కొండవీడివల నిలిచి
జనన మెత్తిన చిరుత బాలునకు కూడ
గురువులై వీరగాధలు గరపుచోటు
వీర భాషాభిరామ గుంటూరు సీమ

--- గుర్రం జాషువా

ఏనుగులే గుంపులుగా
తానమాడు పెనుగుంటలు
పెక్కులున్న ఊరుగాన
పేరువచ్చె గుంటూరే !
తెలుగుచోళ మన్నెరికము
వెలుగుచున్న కాలమందు
దండ నాధుడధివసించు
స్థావరమీ గుంటూరే.

తనవైపున గతమందున
కొనసాగిన చరితనుండి
వివిధ రాజ్య గాధలెన్నో
వినిపించును గుంటూరే
తన ముంగిట నదిగట్టున
మునుపెన్నడో విలసిల్లిన
విశ్వకళాక్షేత్రమ్మును
వీక్షించెను గుంటూరే

--- ధనీకుల

సీ// రక్తస్రవంతులారక యేరులైపాఱ
సనయమ్ము కత్తినూరిన తలమ్ము
దీర్ఘ రోషమ్ములు తెగక వందల ఏండ్లు
బుసగొట్టి పోరిన పోతుగడ్డ
కవితామతల్లి అక్కఱసక్కఱల దీర్చి
రంగుగా పెంచిన రాజ్యలక్ష్మి
ఆంధ్రసామ్రాజ్యాన కాయుగ్ర పట్టుగా
బావుటావెత్తిన భాగ్యసీమ

హైందవజ్యోతి తేజమ్ము నాఱనీక
వెలుగు వెలయింప జాలిన తెలుగునగరి
వన్నెసెడి వెలయింప జాలిన తెలుగున
గరి
గుండెలవియవె స్వాస్థమ్ము కుదురుగ
లదె

సీ// శ్రీనాధ కవిరాజ వాణీవిపంచికా
శ్రుతసుదాధారలెచ్చోట నొలికె
మధురాపురీ బుధప్రధ దూల్చు
సోమన్న
సాహితీ సుమములెచ్చటను వలచె
సోమరసంబులో జొనిపి పింగళిమంత్రి
సుకవితా రసమునెచ్చోట పంచె
కారు సూర్యప్పన్న గంటంపు గుజ్జియల్
గడుసు పోకడల నెక్కడును మొరసె

# కాకలు తీరిన రాజకీయ యోధుడు 'కాసు'

**(ఆన్‌లైన్, నరసరావుపేట)**

అంచెలంచెలుగా ఎదిగి రాష్ట్ర ముఖ్యమంత్రిగానే కాకుండా కేంద్రంలో సైతం ఎన్నో ప్రతిష్టాత్మక పదవులు అలంకరించారు. కార్యదీక్ష, పట్టుదలలో తనకు తానేసాటి అని నిరూపించు కొన్నారు. ఆయనే రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి. 1909 జులై 28న గుంటూరు జిల్లా, నాదెండ్ల మండలం, తూబాడు గ్రామంలో జన్మించారు. సాధారణ రైతు కుటుంబలో జన్మించిన బ్రహ్మానందరెడ్డి ఆ రోజుల్లోనే(1920లో) బిఎ చదివారు. మద్రాసులో చదివిన ఆయన అక్కడే ప్రథమ శ్రేణిలో బిఎల్ పట్టా పొందారు. విద్యార్థి దశలోనే మహాత్మాగాంధీ బోధనలు, ప్రకాశం పంతులు ధీరోచిత చర్యలకు ప్రభావితులై ఆయన రాజకీయాల్లో ప్రవేశించారు. గాంధేయ తత్వాన్ని పుణికి పుచ్చుకున్న బ్రహ్మానందరెడ్డి ఆయన అలవాట్లనే ఆచరణలో చూపారు. ముఖ్యంగా ఇల్లు వదలి కాలు బయట పెడితే ఆయన తల పై ఖద్దరు టోపీ విధిగా వుటుంది. ఈ ఆచారాన్ని పాటించిన నాయకులు అరుదు. అంతే కాదు బ్రహ్మానందరెడ్డి అప్పుడప్పుడు తన టోపీ తిప్పే రీతిని ఇప్పటికీ ప్రత్యేకంగా చెప్పుకుంటూ వుంటారు. ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు అనుంగు శిష్యుడైన బ్రహ్మానందరెడ్డి తరచూ 'నా నాయకుడు ప్రకాశం పంతులు గారు' అని చెప్పుకొనే వారు. గుంటూరు జిల్లా బోర్డు సభ్యుడిగా, ఆ తర్వాత ఒంగోలు జిల్లా బోర్డు అధ్యక్షుడిగా పని చేశారు. సత్యాగ్రహ ఉద్యమం సందర్భంగా నాలుగు నెలలు కఠిన కారాగార శిక్ష అనుభవించారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో పని చేసి డిటెన్యూగా జైలులో 1945 జనవరి వరకు వున్నారు. ఆంధ్రా ప్రావిన్షియల్ కాంగ్రెస్ కమిటీ, ఎపిసిసిలలో సభ్యుడిగా అనేక సంవత్సరాలు పని చేశారు. కేంద్రంలో కాంగ్రెస్ ఎగ్జిక్యూటివ్‌గా ప్రధాన పాత్ర పోషించి లాల్ బహదూర్ శాస్త్రి ప్రధాని కావటానికి కారకులయ్యారు. మద్రాసు లెజిస్లేటివ్ అసెంబ్లీలో అత్యంత కీలక వ్యక్తిగా వుంటూ, పార్టీ పటిష్టతకు కృషి చేశారు. ఆయనలోని నాయకత్వ లక్షణాలు గుర్తించి రాష్ట్ర కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి పదవిని అప్పగించారు. 1956 నవంబరులో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత ఆర్థిక శాఖ బాధ్యతను వాణిజ్య పన్నుల విభాగంతో పాటు ఆయనకు అప్పగించారు. బ్రహ్మానందరెడ్డి దీక్షా దక్షతలు ఆయనను రాష్ట్ర ముఖ్యమంత్రిని చేశాయి. తన హయాంలో పది కోట్ల రూపాయల హడ్కో రుణాన్ని ఎల్ఐసి ద్వారా పొంది రాష్ట్రంలో మొదటిసారిగా బలహీన వర్గాల వారికి ఇళ్ళ నిర్మాణాన్ని చేపట్టి పేరు తెచ్చుకున్నారు. ఉర్దూ బాషకు తెలుగుతో సమాన ప్రతిపత్తిని కల్పించడంతో పాటు అమలు చేయటంలో ఆయన కృషి ఎంతో వుంది. బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో 1964 జనవరి 18న గ్రామ పంచాయతీ చట్టం అమలయ్యింది. మూడో ముఖ్యమంత్రిగా బ్రహ్మానందరెడ్డి 1964 ఫిబ్రవరి 23న అధికారం స్వీకరించి, 29న ప్రమాణ స్వీకారం చేశారు. 1971 సెప్టెంబరు 23వ తేదీ వరకు ముఖ్యమంత్రిగా కొనసాగారు. 1964 గుంటూరులో అఖిల భారత జాతీయ కాంగ్రెస్ ఎన్నికల కమిటీకి జరిగిన ప్రతిష్టాత్మక మైన ఎన్నికల్లో కాకాని వెంకటరత్నాన్ని గెలిపించి రాష్ట్ర రాజకీయాల్లో బ్రహ్మానందరెడ్డి తనదే పై చేయి అని నిరూపించు కొన్నారు. 1967 మార్చిలో అసెంబ్లీ, పార్లమెంట్ సాధారణ ఎన్నికల్లో కూడా బ్రహ్మానందరెడ్డి అత్యధిక మెజార్టీ సాధించి, తన ఘనతను చాటుకున్నారు. 1969 నవంబరు 12వ తేదీన వచ్చిన పార్టీ చీలికలో సంజీవరెడ్డి ఇందిరాగాంధీకి దూరం కాగా, బ్రహ్మానందరెడ్డి సన్నిహితుడై లౌక్యం ప్రదర్శించారు. 1970 డిసెంబరులో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ముల్కీ నిబంధనలు చెల్లుతాయని తీర్పునివ్వగా, బ్రహ్మానందరెడ్డి తన ముఖ్యమంత్రి పదవిని 1971 సెప్టెంబరు 25న తెలంగాణ నాయకునికి అప్పగించాల్సి వచ్చింది. అనంతరం కేంద్ర మంత్రిగా కమ్యూనికేషన్లు, హోంశాఖ, పరిశ్రమల శాఖలను నిర్వహించారు. కమ్యూనికేషన్ల మంత్రిగా వున్న రోజుల్లో టెలిఫోన్ సౌకర్యాలను ప్రజలకు మరింత చేరువ కావటానికి ప్రయత్నించారు. ఆరవ ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షుడుగా పని చేశారు. 1977లో కేంద్రంలో కాంగ్రెస్ పార్టీ అధికారం కోల్పోయిన తరువాత బ్రహ్మానందరెడ్డికి ఇందిరాగాంధీతో విభేదాలు తలెత్తిన కారణంగా అఖిల భారత కాంగ్రెస్ నిలువున చీలింది. ఒక వర్గానికి ఇందిరా గాంధీ, మరో వర్గానికి బ్రహ్మానందరెడ్డి నాయకత్వం వహించారు. అప్పుడే రెడ్డి కాంగ్రెస్ పార్టీని ఆయన స్థాపించారు. 1980లో తిరిగి కాంగ్రెస్(ఐ)లో చేరి అదే పార్టీ పై నరసరావుపేట నుంచి పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు. 1982లో రాష్ట్ర కాంగ్రెస్ సమన్వయ సంఘ అధ్యక్షుడుగా వున్నారు. మహారాష్ట్ర గవర్నర్‌గా కూడా పని చేశారు. రాష్ట్రపతి, ప్రధాన మంత్రి పదవులు తప్పా, మిగిలిన అనేక పదవులు నిర్వహించి, కీర్తి గడించిన బ్రహ్మానందరెడ్డి 1984 మే 20న హైదరాబాద్‌లో పరమపదించారు. జాతీయ, రాష్ట్ర రాజకీయాల్లోను తనదైన బాణిలో ఉవ్వెత్తున రాజకీయాలను నెరపిన బ్రహ్మానందరెడ్డి వెనుకబడిన ప్రాంతమైన పల్నాడు అభివృద్ధికి నిర్విరామ సేవలు అందించారు. నాగార్జున సాగర్ క్రస్ట్ గేట్ల నిర్మాణాన్ని ప్రోత్సహించారు. ఆయన ముఖ్యమంత్రిగా వున్న రోజుల్లో సాగర్ ప్రారంభం జరిగింది.

# సంస్కరణల బాటలో కార్పొరేషన్‌ను నడిపిస్తున్న 'దువ్వారపు'

(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ)

నగరపాలకసంస్థ పరంగా సంస్కరణల అమలులో ప్రస్తుత కమిషనర్ దువ్వారపు రామారావు దూసుకెళ్తున్నారు. పరిపాలన విషయాలలో పారదర్శకత తీసుకొచ్చేందుకుగాను ఆయన చేపడుతున్న కార్యక్రమాలు కార్పొరేషన్‌కు మంచి పేరు ప్రతిష్టలు తెచ్చి పెట్టే విధంగా ఉంటున్నాయి. ప్రజలకు సేవలందించే అంశాలలో కూడా కమిషనర్‌గా విప్లవాత్మక మార్పులు తీసుకొచ్చి అన్నీ వర్గాల ద్వారా ప్రశంసలు అందుకొంటున్నారు. కొరియర్ ద్వారా పౌరసేవలు అందించే విధానం ఆయన పట్ల ప్రజల్లో విశ్వాసాన్ని మరింత పెంచుతుంది. సిబ్బంది అవినీతికి కళ్ళెం వేసేందుకు వాణిజ్య కుళాయి మీటర్లకు స్పాట్ బిల్లింగ్, రిజర్వాయర్లలో టోకెన్ విధానం



వంటివి కార్పొరేషన్‌కు ప్రయోజనం చేకూరుస్తున్నాయి. మున్ముందు మరిన్ని సంస్కరణలు అమలులోకి తీసుకొచ్చి పారదర్శకమైన పాలన అందించే దిశగా కార్యక్రమాలను రూపొందించడంలో కమిషనర్ నిమగ్నమౌతున్నారు.

నగరపాలకసంస్థ 'వెబ్‌సైట్' కమిషనర్ ప్రవీణ్‌ప్రకాష్ ఉన్న సయమంలోనే తయారైనప్పటికి దానికి సమగ్ర రూపం ఇచ్చింది మాత్రం ప్రస్తుత కమిషనర్ రామారావే. కార్పొరేషన్‌కు సంబంధించిన సంపూర్ణ సమాచారాన్ని వెబ్‌సైట్‌లో పొందుపరిచే కార్యక్రమం దాదాపుగా తుది దశకు చేరుకొన్నది. సిబ్బంది జీతభత్యాలు మొదలుకొని కార్పొరేషన్ ఆస్తులు, ఇంజనీరింగ్ వర్కులు, పాఠశాలల వివరాలు, జనన, మరణాలు, ఆస్థి పన్నుల వివరాలు వంటి ఎన్నో అంశాలు ప్రస్తుతం కార్పొరేషన్ వెబ్‌సైట్ ద్వారా ప్రపంచంలో ఎక్కడి నుంచి అయినా తెలుసుకోవచ్చు. ఫిర్యాదులను కూడా వెబ్‌సైట్ ద్వారా స్వీకరిస్తుండటంతో నగరపాలకసంస్థకు వచ్చి కంప్లయింటులు అందజేయాల్సిన ఇబ్బంది లేకుండా పోయింది.

గతంలో టెండర్ల పరంగా ఎన్నో అవకతవకలు జరుగుతుండేవి. ప్రతీసారి కాంట్రాక్టర్లు రింగ్ అవ్వడం, ఎక్సెస్ మొత్తానికి టెండర్ దక్కించుకొనేవారు. దీని వలన నగరపాలకసంస్థకు నష్టం వాటిల్లుతుండేది. దీనిని నిరోధించేందుకు గాను రూ. లక్ష అంచనా మొత్తం దాటే ప్రతీ వర్కుకు ఇ-ప్రొక్యూర్‌మెంటు ద్వారా టెండర్లు స్వీకరించే విధానానికి శ్రీకారం చుట్టారు. ఈ కారణంగా దేశంలో ఎక్కడి నుంచి అయినా కాంట్రాక్టర్లు టెండర్లలో పాల్గొనే అవకాశం ఏర్పడటంతో 'రింగు' అయ్యే సమస్య తీరిపోయింది. ఫలితంగా టెండర్లన్నీ లెస్‌లకు దాఖలు అవుతుండటంతో కార్పొరేషన్‌కు ఆదాయం కూడా మిగిలి అదనంగా మరికొన్ని పనులు చేయడానికి వెసులుబాటు కలుగుతోంది.

బిల్డింగ్ ప్లాన్‌లు, మంచినీటి కుళాయి కనెక్షన్ల వర్కు ఆర్డర్లు, జనన మరణ సర్టిఫికెట్లు, ఆస్థి పన్ను మదింపు వంటి ఎలాంటి పౌర సేవ పొందాలన్నా గతంలో సంబంధిత సిబ్బంది లంచాలు చెల్లించాల్సి వచ్చేది. గత కమిషనర్లు ఎన్నోసార్లు సిబ్బందిపై చర్యలు తీసుకొన్నప్పటికి కొన్నాళ్ళ తరువాత పరిస్థితి యథాస్థితికి చేరుతుండేది. దీనికి శాశ్వత పరిష్కారం కోసం కమిషనర్ రామారావు ఆలోచన చేసి చివరకు ఏ సేవ అయినా సరే కొరియర్ ద్వారా ప్రజల చెంతకే చేర్చాలని నిర్ణయించారు. పౌర సేవలే కాకుండా కాంట్రాక్టర్ల బిల్లులను కూడా వారి ఇళ్ళకే పంపే విధానాన్ని అమలులోకి తీసుకురావడం ప్రజల్లో కమిషనర్‌కు మంచి పేరు తెచ్చి పెట్టింది.

రిజర్వాయర్ల వద్ద ట్యాంకర్ల ద్వారా మంచినీరు దుర్వినియోగం అవుతుండటం, గాంధీపార్కు, మానససరోవరం గేట్ కలెక్షన్లలో అక్రమాలు జరుగుతుండటం, వాణిజ్య కుళాయిల మీటర్ రీడింగ్‌లలో అవినీతి పెచ్చుమీరడంతో వీటిని అరికట్టేందుకు టెక్నాలజీని ప్రవేశపెట్టి మంచి ఫలితాలు సాధిస్తున్నారు. రిజర్వాయర్ల వద్ద టోకెన్ విధానాన్ని ప్రవేశపెట్టడం ద్వారా ట్యాంకర్ డ్రైవర్లలో జవాబుదారీతనాన్ని పెంచారు. గాంధీపార్కు, మానససరోవరం గేట్ కలెక్షన్లను కంప్యూటరీకరించడం వలన పరిస్థితి చాలా మార్పు వచ్చినట్లు రెవిన్యూ వర్గాల ద్వారా తెలుస్తోంది. అలానే వాణిజ్య కుళాయిలకు స్పాట్ బిల్లింగ్ వలన కూడా కార్పొరేషన్ ఆదాయం గణనీయంగా పెరిగింది. వీటితో పాటుగా డి అండ్ ఒ ట్రేడ్ లైసెన్సులు, మునిసిపల్ ఆస్తులు, అన్నీ షాపింగ్ కాంప్లెక్స్‌ల లీజులు, ఫిర్యాదులను వెబ్‌సైట్‌లో ప్రవేశపెట్టడం ద్వారా సిబ్బంది అవినీతికి అడ్డుకట్ట వేసినట్లు అయింది.

# సమస్యల వలయంలో నిజాంపట్నం హార్బర్

(125వ పేజీ తరువాయి)

గుర్రైనా రెక్కాడితేగాని డొక్కాడని మత్స్యకారులు ధైర్యం కూడగట్టుకొని వేటకు వెళుతున్నారు.

### మొగ నిర్మాణ పనులు

హార్బర్‌లోకి బోట్లు వచ్చిపోయే మార్గాన్ని మొగ అంటారు. గతంలో మొగ నిర్మాణం చేపట్టకపోవడంవల్ల పగటిపూట మాత్రమే బోట్లు రాకపోకలు జరిగేవి. 1990 సంవత్సరం మొగ నిర్మాణం చేపట్టి ఇరువైపుల రివిట్‌మెంటు నిర్మించారు. అప్పటినుంచి అన్నివేళల్లో బోట్లు రాకపోకలు సాగిస్తున్నాయి. 80 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించిన మొగ నిర్మాణం రానురాను పూడికవల్ల సామర్థ్యం తగ్గిపోయింది. మొగ సామర్థ్యం తగ్గటంవల్ల ఒకవైపున మాత్రమే బోట్లు వచ్చి పోతున్నాయి.

### హార్బర్ ఫేజ్–2 నిర్మాణం

1980 సంవత్సరంలో నిర్మించబడిన హార్బర్ ఇప్పటి అవసరాలకు చాలకపోవటంవల్ల హార్బర్ ఫేజ్–2 నిర్మాణంకోసం మత్స్యకారులు ప్రభుత్వానికి వినతిపత్రాలు అందజేశారు. హార్బర్ ఫేజ్–2 నిర్మాణంకోసం 13 కోట్ల రూపాయలు మంజూరైనా, పనులు మాత్రం ప్రారంభంకాలేదు. నిర్మాణ పనుల పరిశీలనలో భాగంగా రాష్ట్ర మత్స్యశాఖ ప్రిన్సిపల్ సెక్రటరీ చెల్లప్ప హార్బర్ ప్రాంతాన్ని సందర్శించారు. నిర్మాణ పనులకోసం స్థలాన్ని పరిశీలించి త్వరలో పనులు చేపట్టనున్నామని ఆయన తెలిపారు. బోట్లువచ్చి నిలుపు స్థలాన్ని జట్టీ అంటారు. 60 మరపడవలకోసం నిర్మించిన జట్టీ ఇప్పటి బోట్లు నిలిపేందుకు తీవ్ర అసౌకర్యంగా వుంది. మత్స్యకారులు జట్టీ సామర్థ్యం పెంచాలని అనేక పర్యాయాలు అధికారులకు, ప్రభుత్వానికి విన్నవించుకున్నారు. జట్టీ సరిపోకపోవటంల్ల హార్బర్‌కు రావాల్సిన బోట్లు కొన్నిరోజులు సముద్రంలోనే వుండిపోతున్నాయి. సునామీ విపత్తు సమయంలో హార్బర్ దరిచేరిన బోట్లు నిలిపేందుకు జట్టీ చాలక ఒకచోటును మరొక బోటు ఢీకొని నష్టం సంభవించింది.



నిజాంపట్నం హార్బర్ జట్టీలో విశ్రాంతి తీసుకుంటున్న బోటు



కాంతి తగ్గిన నిజాంపట్నం హార్బర్ లైట్‌హౌస్

### లైట్‌హౌస్ సామర్థ్యం పెంచాలి

కేంద్ర ప్రభుత్వం నిర్వహిస్తున్న లైట్‌హౌస్ మత్స్యకారులకు దిక్సూచి వంటిది. గతంలో సముద్రం అంచున నిర్మించిన లైట్‌హౌస్ రెండు లేక మూడు కిలోమీటర్లు మాత్రమే కనిపించేది. 1993 సంవత్సరంలో 30 కిలోమీటర్ల వరకు కాంతి వెదజల్లే లైట్‌హౌస్‌ను కేంద్రప్రభుత్వం నిర్మించింది. చెన్నై ప్రధాన కార్యాలయంగా ఈ లైట్‌హౌస్ నిర్వహించబడతుంది. ఇతర ప్రాంతాల నుంచి వచ్చిన కేంద్రప్రభుత్వ అధికారులకోసం ఒక అతిథి గృహం లైట్‌హౌస్‌లో నిర్మించబడింది. లైట్‌హౌస్‌లో 8 దిక్కులకు కాంతిని వెదజల్లేందుకు 8 బల్బులను అమర్చారు. కాలక్రమేణా లైట్‌హౌస్ కాంతి తగ్గిపోతుందని మత్స్యకారులు వాపోతున్నారు. ఇప్పుడున్న లైట్‌హౌస్ 15 కిలోమీటర్లు కూడా కనిపించటంలేదని మత్స్యకారుల వాదన.



శావల్యాపురంలో పాల శీతలీకరణ కేంద్రం

## వినుకొండ ప్రాంతంలో

# క్షీరవిప్లవం

**(ఆన్‌లైన్- వినుకొండ)** వెనుకబడ్డ ప్రాంతమైన వినుకొండ నియోజకవర్గంలో ప్రైవేటు డెయిరీల ప్రవేశంతో పాడిపరిశ్రమ దినదినాభివృద్ధి చెందుతుంది. ప్రధాన పరిశ్రమలు లేని ఈప్రాంతంలో ప్రైవేటు డెయిరీలు రైతుల ఆర్థికాభివృద్ధికి తోడ్పాటు నందిస్తున్నాయి. గత మూడేళ్ళుగా ప్రకృతి సహకరించక, సాగర్‌జలాలు అందక వ్యవసాయంలో అన్నదాతలు ఆటుపోట్లకు గురయ్యారు. ఈనేపథ్యంలో పాడిపశువుల పెంకంపై రైతులు మొగ్గుచూపుతున్నారు. సరళీకృత ఆర్థిక విధానాల మూలంగా దశాబ్దకాలం నుంచి ప్రైవేటు డెయిరీలు పుట్ట గొడుగుల్లా పుట్టుకొచ్చాయి. సంతమాగులూరు అడ్డరోడ్డు నుంచి వినుకొండ మధ్య దాదాపు 20 కి.మీ దూరంలో ఎనిమిది ప్రైవేటు డెయిరీలో నడుస్తున్నాయి. ఇవికాక వినుకొండలో సంగం డెయిరీ పాల శీతలీకరణ కేంద్రం కూడా నడుస్తుంది. త్రిపురాంతకం సమీపంలోని శీతారామడెయిరీ కూడా వినుకొండ ప్రాంతం నుంచి పాలసేకరణ చేస్తుంది. సీజన్‌లో ఈ ప్రాంతం నుంచి రోజుకు దాదాపు 60వేల లీటర్ల పాలసేకరణ జరగవచ్చు. సుమారుగా నెలకు పాలద్వారా రెండుకోట్ల రూపాయలు రైతుల చేతులకు అందుతుంది. అన్నిరంగాల్లో విఫలమవుతున్న గ్రామీణప్రాంత ప్రజానీకానికి పాడిపరిశ్రమ ప్రధాన జీవనాధారంగా మారింది. ప్రైవేటు డెయిరీల నిర్వాహకులు వ్యాపారంలో నెలకొనే పోటీని తట్టుకునేందుకు రైతులకు ధన రూపేణా ఆర్థిక సహాయం అందించేందుకు ముందుకువచ్చాయి. గేదెల కొనుగోలుకు పెద్ద ఎత్తున రుణాలను ఇవ్వచూపారు. మహిళలకు కూడా పాడిపరిశ్రమ స్వయం సమృద్ధికి తోడ్పాటు నందిస్తోంది. భూస్వాములు సైతం పాడిగేదెల పెంపకంపై ఆసక్తిని కనపరుస్తున్నారు. గత మూడేళ్ళుగా సాగర్ నీరు సక్రమంగా సరఫరాకాక, సకాలంలో వర్షాలు లేక పశుగ్రాసం కొరతతో రైతులు అల్లాడిపోయారు. దీంతో పాడిపశువులను సైతం తెగనమ్ముకోవాల్సిన అగత్యం నెలకొంది. ఈపరిస్థితుల్లో గత ఏడాది పాలదిగుబడులు తగ్గిపోయాయి. ఈ ప్రాంతంలో పశువులకు గాలి కుంటువ్యాధి విజృంభించటంతో ఈయేడాది కూడా పాల దిగుబడులు నిరాశాజనకంగా ఉండవచ్చునని భావిస్తున్నారు. డెయిరీలు కూడా నష్టాలను చవి చూడాల్సివస్తుందని యాజమాన్యాలు ఆందోళన వ్యక్తం చేస్తున్నాయి. ఈనేపథ్యంలో పాలసేకరణ పెంచుకునేందుకు డెయిరీలవారు ఒక ప్రత్యేక ప్యాకేజీని ప్రకటించారు. బ్యాంకర్లతో చర్చించి భారీ ఎత్తున గేదెల కొనుగోలుకు రుణాలిచ్చేందుకు ఒప్పించారు. ఇప్పటికే స్కీమ్‌ను అమలుచేయడం ప్రారంభించారు. నెలరోజుల్లో ఈప్రాంతంలో దాదాపు 2కోట్ల మేరకు రైతులకు బ్యాంకుల ద్వారా రుణాలిప్పించారు. ప్రైవేటు వ్యాపారస్తులు పెట్టుబడులు పెట్టేందుకు వెనకడుగు వేసిన తరుణంలో డెయిరీలు రుణాలను ఇవ్వడం అన్నదాతలకు ఊరటగా మారింది. రుణాల ద్వారా రైతులు గేదెలను కొనుగోలు చేస్తే పాల దిగుబడులు పెరిగి రైతులు ఆర్థికంగా అభివృద్ధి సాధించేందుకు వీలు కలుగుతుంది. అదేవిధంగా డెయిరీలు కూడా లాభాలబాటలో పయనించేందుకు వీలు కలుగుతుంది. మొదటినుంచి జిల్లాలోనే నాణ్యమైన పాలసేకరణకు వినుకొండ ప్రాంతం గుర్తింపు తెచ్చుకుంది. అయితే పశుగ్రాసం పౌష్టికాహారం ధరలు ఆకాశన్నంటడంతో పాడిపరిశ్రమ రైతులకు గిట్టుబాటు కావడం లేదు. ప్రత్యామ్నాయమార్గాలు లేక, వ్యవసాయరంగంలో కూడా ఆటుపోట్లకు గురవుతున్న నేపథ్యంలో పాడిపరిశ్రమ వైపే అన్నదాతల చూపు పడింది. పాడిగేదెల పెంపకమే ప్రధాన జీవనాధారంగా మారింది. రైతుల ఇబ్బందుల దృష్ట్యా ప్రభుత్వం పాలకు గిట్టుబాటు ధర కల్పించాలని ఈప్రాంతరైతులు కోరుతున్నారు.

## జిల్లా పరిషత్ చైర్మన్లుగా పని చేసిన వారి వివరాలు

| పేరు | నుంచి | వరకు |
|---|---|---|
| 1.మేడూరి నాగేశ్వరరావు | 1-12-1959 | 28-02-1962 |
| 2.గాలిబ్ సాహెబ్ (ఎంఎల్‌సి ఇన్‌ఛార్జ్) | 1-3-1962 | 29-11-1962 |
| 3.కాసు వెంగళరెడ్డి | 30-11-1962 | 30-6-1964 |
| 4.మేడూరి నాగేశ్వరరావు | 11-9-1964 | 25-3-1971 |
| 5.ఎం సత్యనారాయణ (ఇన్‌ఛార్జ్) | 26-3-1971 | 30-4-1971 |
| 6.కాసు వెంగళరెడ్డి | 1-5-1971 | 9-2-1976 |
| 7.సక్కుర్తు రామయ్య | 12-7-1981 | 11-7-1986 |
| 8.దొడ్డపనేని ఇందిర | 2-5-1987 | 15-9-1987 |
| 9.దొడ్డా బాలకోటిరెడ్డి (ఇన్‌ఛార్జ్) | 16-9-1987 | 9-12-1987 |
| 10.డాక్టర్ రాయపాటి శ్రీనివాస్ | 10-12-1987 | 1-5-1992 |
| 11.దొడ్డా బాలకోటిరెడ్డి(ఇన్‌ఛార్జ్) | 2-5-1992 | 19-5-1992 |
| 12.యడ్లపాటి వెంకట్రావు | 20-3-1995 | 16-4-1998 |
| 13.అవుతు రాజేశ్వరి (ఇన్‌ఛార్జ్) | 16-4-1998 | 10-7-1998 |
| 14.పాతూరి నాగభూషణం | 10-7-1998 | 19-3-2000 |
| 15.పాతూరి నాగభూషణం | 23-07-2001 నుంచి | |

# పల్నాటి సిగలో ఎర్రమందారం

# కారంపూడి

పల్నాటి యుద్ధరణక్షేత్రమైన కారంపూడి నెత్తుటి నేలలో పూదోటగా పూసిన ఎర్రమందారం నేటికి వసివాడని గుబాళింపులను అందిస్తుంది. గత 900 సంవత్సరాలుగా కారంపూడిలో పల్నాటివీరుల ఉత్సవాలను జరుపుకుంటూ మతసామరస్యాన్ని చాటిచెబుతుంది. కత్తిపదును అంచున నడిచిన బాలచంద్రుడు, నాగమ్మ తలగొడుదు, నలగాము బడుతూ దీవించి పంపవే దేవి మాంచాల అన్న బాలచంద్రుని పౌరుష, ప్రతీకారజ్వాలకు ప్రతీక. చాపకూడు సిద్ధాంతం ద్వారా సమాజంలో నేడు కమురువాసన కొడుతున్న కులానికి పారద్రోలేందుకు బ్రహ్మనాయుడు సారథ్యంలో ఆనాడు చేసిన కృషి నేటికి ఆదర్శంగా నిలుస్తుంది. వీరులకు వీరుడు అలరాజు, భర్తకోసం చితినెక్కిన రతనాల పేరందేవి రక్త తిలకంతో భర్తని కదనభూమికి పంపిన మగువ మాంచాల అసమాన ధైర్య సాహసాలతో ప్రజలు రక్షణ కల్పించటంతో పాటు అనేక అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టి నాయకత్వానికే వన్నెతెచ్చిన నాయకురాలు నాగమ్మ వీరభూమిలో విప్తవాగ్నులు రగిలింపజేసిన వీర పడాలు, కన్నమదాసువంటి అనేక మణ్యపువీరులను కన్న క్షేత్రభూమి పల్నాడు. వీరమాతలుగా శీలమ్మ, ఐతాంబ, రేఖాంబ, నాగమ్మ, మాంచాల, పేరందేవులు పల్నాటి చరిత్రలో సుస్థిరస్థానం పొందారు. సాంప్రాదాయవాదుల మతఛాందసత్వాన్ని త్రోసిరాజని అస్పృస్యులుగా పరిగణించబడుతున్న హరిజనులను, దళితులను ఆలయ ప్రవేశం చేయించి రాజ్యాంగంలో సమున్నత పదవులిచ్చి ఆదరించి, సర్వమత సమానత్వమును, కుల మత, వర్ణ వర్గరహిత సమసమాజ స్థాపనకు నాంది వాచకం పలికిన మహామనిషి బ్రహ్మనాయుడే.

( ఆన్‌లైన్, కారంపూడి)

బ్రహ్మనాయుడు చాపకూడు సిద్ధాంతం పేరుతో హరిజన, గిరిజన బడుగు వర్గాల వారిని ఆదరించి సహపంక్తి భోజనం కావించి నేటి తరలావారికి ఆదర్శప్రాయుడయ్యాడు. అందుకే వీరిని ఆరాధించుకోవటం, సంస్మరించుకోవటం ఆచారమైంది. పల్నాట ఈ మతసహనం ఎంతగా వెల్లివిరింసిదో చెప్పటానికి ఇది ఒక ప్రత్యక్ష నిదర్శనం. ఈ వీరారాధన ఉత్సవాలు దళిత జనసంక్షేమానికి, సముద్ధరణకు నాందిపలికి సంఘ సంస్కర్తగా భారతదేశ చరిత్రలోనే ప్రధముడిగా నిలిచాడు. నాడు బ్రహ్మనాయుడు ప్రారంభించిన చాపకూడు సిద్ధాంతం నేటికి పల్నాటి వీరాచార పీఠాధిపతులు కొనసాగించటం గొప్ప విశేషం. హరిజనులకు ఆలయ ప్రవేశం కల్పించుటయే ఓ గొప్ప విప్లవాత్మక సాంఘీక సంస్కరణ అని ప్రశంసిస్తుంటే ఒక హరిజనుడికి (మాల కన్నమదాసు) ఆలయం నిర్మించి ఆరాధానలు నిర్వహించటం ఈ పల్నాటిచరిత్రలో సువర్ణ అక్షరాలతో లిఖింపదగిన విశేషం. వీరుల గుడి నిర్మించిన మహ్మదీయ సోదరుల సమాధులకు కూడా ఈ వీరారాధ ఉత్సవాలు జరిగే సమయంలో పీఠాధిపతివారు మహ్మదీయ పూజారులతో కలిసి సంయుక్తంగా పూజలు

(మిగతా 132వ పేజీలో)

# పల్నాటి సిగలో ఎర్రమందారం కారంపూడి

బ్రహ్మనాయుడు శిలావిగ్రహం

(131వ పేజీ తరువాయి)

నిర్వహించటం ఇక్కడ విశేషం. ఈ ఉత్సవాల్లో హిందువులు, మహ్మదీయులు, హరిజన గిరిజనాది దళిత వర్గాల వారితో పాటు అగ్రవర్ణాల వారు పాల్గొని మత సామరస్యానికి చిహ్నంగా ఈ ఉత్సవాలను నిర్వహించటం మరో విశేషం.

**పల్నాటి రాజ్య ఆవిర్భావం**

క్రీ.శ. 11వ శతాబ్ధం ఉత్తర చెందిన అణుగురాజుకు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకున్నదని, చెన్నకేశవుని అనుగ్రహ ఆదేంశానుసారం తీర్ధయాత్రలు చేయుతూ కృష్ణానదిలో మోటుపల్లి వద్దవారికి శనితీరిన దానికి గుర్తుగా వారు ధరించిన బట్టలు మెరిశాయని, ఆ స్థలం పవిత్రమైనదిగా భావించి వారిక్కడే స్థిర నివాసం ఏర్పరుచుకున్నారని చరిత్ర తెలుపుతుంది. అప్పట్లో ఇక్కడ భీమరాజు అనే

బ్రహ్మనాయుడి నృసింహకుంతం

భాగంలో పాలమాసాపురి (జగల్ సామంతునికి చందోలు రాజుతో పూర్)ను కార్తవీర్యార్జునిని సంతతికి యుద్ధం (మిగతా 133వ పేజీలో)

# పల్నాటి సిగలో ఎర్రమందారం కారంపూడి


దేవాయలంలోని పల్నాటి వీరుల కొణతములు

(132వ పేజీ తరువాయి)

వచ్చిందని, ఆ యుద్ధంలో అణుగురాజు భీమరాజుకు సహాయం చేసి కొన్ని ఊర్లుతో పాటు అతని కుమార్తె భూరమాదేవినిచ్చి వివాహం చేసి అక్కడ స్థిరపడటానికి కావల్సిన వనరులు సమకూరుస్తాడు. అణుగురాజులు జొన్నవిత్తులు ఇవ్వలేదనే సాకుతో చందోలు పేరమరాజు పైకి ఈదులపేర్నేడుని పంపి బందీని చేస్తాడని , అప్పుడు చందోలు రాజు సంధికొచ్చి తన చెల్లెలు మైలమదేవినిచ్చి చందోలు రాజ్యంలో సగభాగం పల్నాడును ఆరణంగా ఇచ్చాడని ఈ విధంగా పల్నాడు రాజ్య ఆవిర్భావం జరిగినట్లు చరిత్రకారులు తెలిపారు. పల్నాడు రాజ్యాల సరిహద్దులు స్పషంగా తెలియరావటం లేదు. నేడు పల్నాడంటే మాచర్ల, గురజాల సెగ్మెంట్లనే భావిస్తున్నారు. నకరికల్లు నుంచి ఈశాన్యమున ధరణికోట, దక్షిణాన నాయకురాలు కనుమ, పచ్చి మోత్తరాలుగా పారుతున్న కృష్ణానది, నాగార్జునకొండ లోయలోని విజయపురి వరకు వ్యాపించివుంది. బెల్లంకొండ, నాగార్జుకొండ, తండెడ అంతడ్చుకున్న గంభీరసీమ పల్నాడు. జైన మత ఉనికిని, నిన్నమొన్నటిదాకా పల్నాడులోబుగ్గవాగు, మాచర్ల, మాదినపాడులోని ఓటిగుళ్ళు సాక్షాలుగా నిలిచాయి.

"వీరుల దివ్యలింగములు
విష్ణువు చెన్నుడు కల్లిపోతురా
జారయగాల భైరవుడు నంకమ
శక్తియు యన్నపూర్ణయన్
గారిడు గంగధారి మడుగే
మణికర్ణిగా జెలంగునే
కారెమపూడి పట్టణముకాశిగదా
పలనాటి వారికిన్"

శ్రీనాధ మహాకవి పల్నాటి రణభూమి కారంపూడిని కాశితో పోల్చటంతోపల్నాటి యుద్ధానంతరం ఇక్కడ జరిగే వీరారాధన ఉత్సవాలకు అత్యంత ప్రాధాన్యత నెలకొని వుంది. పల్నాటి యుద్ధం క్రీ.శ. 1176-1186 మధ్య జరిగిందని చరిత్ర తెలుపుతుంది. సుమారు 900 సంవత్సరాలకు పైగా జరిగిన చరిత్రకు ఈ వీరారాధన ఉత్సవాలు నిదర్శనంగా మిగిలాయి. కార్తీక అమావాస్య నుండి 5 రోజులుపాటు జరిగే ఈ వీరారాధన ఉత్సవాలు రాచ


పల్నాటి యుద్ధచిహ్నాం

సీమలుగా 194 గ్రామాలున్నట్లు అప్పకవీయంలో ఆచార్య బిట్టు వెంకటేశ్వర్లు పల్నాటి భౌగోళిక స్వరూపాన్ని వివరించారు. పల్నాడు గుంటూరు జిల్లా ఒక విశిష్టమైన ప్రదేశం. దండాకారణ్యంలో ఇది ఒక భాగమని, ఘరదూషనాధుడు ఈ ప్రాంతాన్ని పరిపాలించారని, కరుడు ఏలినది కారంపూడిని, మారీచుడు ఏలినది మాచర్లని, దూషణుడు పరిపాలించినది దుర్గి అని పౌరాణికుల ఉవాచ. ఈ పల్నాటివీరుల చరిత్ర కారణంగా ఈ ప్రాంత మరింత వెలుగులోకి వచ్చింది. వివిధ మతాలను, వివిధ ఆచారాలను తమలో ఇముగావు, రాయభారం, మందపోరు, కోడిపోరు, కల్లిపాడు ఈ విధంగా 5 రోజులు ఉత్సవాలు అతివైభవోపేతంగా భక్తి ప్రపత్తులతో అవేశపూరిత వీరాచారవంతులు తమతమ కొణతములతో చేసే విచిత్ర విన్యాసాలతో వైభవోపేతంగా జరుగుతాయి. ఆనాడు బ్రహ్మనాయుడు ఆశించిన సమసమాజ స్థాపన పూర్తి కాకుండా మిగిలి పోవటంతో పల్నాటి వీరాచార పీఠం నెలకొలిపి దీనికి బ్రాహ్మణులైన పిడుగు వంశీయులను పీఠాధిపతులుగా నియమించారు. ప్రస్తుత పీఠాధిపతి పిడుగు వెంకట ఆంజనేయ శివప్రసాద్ (మిగతా136లో)




# కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్

# బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ




బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల

(ఆన్‌లైన్-బాపట్ల)

కళల కాణాచి అపరబాసర, చారిత్రాత్మక సాక్ష్యాలకు ప్రత్యామ్నాయ రూపకం, కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా ప్రాచుర్యం పొందిన భావపురి. సముద్ర తీర ప్రాంతంలో ఇసుక ప్రాంతంగా పేరుండి నిష్ప్రయోజనంగా వున్న భావపురి 1964లో బాపట్లకు చెందిన మేధావులు సాంకేతిక విద్యాప్రపంచానికి సువర్ణ మణిహారంగా, చదువుల తల్లి నుదుటి పైన సిరులొలికే సింధూరంగా బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీని ప్రారంభించారు. సొసైటీ ఏర్పాటు చేసిన కొద్ది కాలంలోనే కర్లపాలెం రోడ్డులో తీరప్రాంత గ్రామాల్లోని ప్రజలను అక్షరాస్యులుగా తీర్చి దిద్దాలనే సంకల్పంతో బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్సెస్ కళాశాలను ప్రారంభించారు. రాజకీయంగా, సామాజికంగా జరుగుతున్న మార్పుల్లో భాగంగా బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడిగా ముప్పలనేని శేషగిరిరావు ఎంపికయ్యారు. ముప్పలనేని రాకతో బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ దినదినాభివృద్ధి చెందుతూ, తన 40సంవత్సరాల జీవితాన్ని ఎడ్యుకేషన్ సొసైటీకి అంకితం చేసి కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్‌గా తీర్చి దిద్దారు. అంతర్జాతీయంగా బాపట్ల ప్రాంతానికి గుర్తింపు తేవడానికి ఇప్పటికీ కృషి చేస్తూనే వున్నారు. అంతర్జాతీయ స్థాయిలో ప్రమాణాలను పాటిస్తూ అద్వితీయ రీతిలో 'గేట్' ర్యాంకులను సాధిస్తూ ఆశించిన విజయాలు అందిస్తూ మహోన్నత లక్ష్యాలతో ముందుకు సాగుతూ ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా నిలిచిన ఏకైక విద్యాసంస్థ బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ. కెజి నుండి పిజి వరకు విద్యాభ్యాస్యాన్ని ఒకచోటే అందించే లక్ష్యాన్ని సాకాం చేస్తూ సాంకేతిక విద్యారంగంలో సాటిలేని ఫలితాలకు,నేటి విద్యాబోధనలకు ప్రతీకగా నిలిచింది. బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల. దేశ విదేశాలలో ఈ కళాశాలలో చదువుకున్న విద్యార్థిని, విద్యార్థులు సాధిస్తున్న ప్రగతి ఎడ్యుకేషన్ సొసైటీకి ప్రశంసలు.

**బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల**

బాపట్ల ఇంజనీరింగ్ కళాశాల 1981లో స్థాపించబడి ఎఐసిటిఇ న్యూఢీల్లీ వారిచే ఆమోదించబడింది. కళాశాలలోని ఆరు కోర్సులు ఎన్‌బిఎ గుర్తింపు స్థాయిని పొందడంతో పాటు ప్రపంచ బ్యాంకు మరియు కేంద్ర ప్రభుత్వ మానవ వనరులశాఖ వారి సాంకేతిక ప్రమాణాల ఉన్నతిని సాధించే కార్యక్రమం ద్వారా అనుసంధాన సంస్థగా ఎంపిక చేయబడింది. ఎఐసిటిఇ, యుజిసి వారి ద్వారా స్వయం ప్రతిపత్తి పొందబోతున్నది. నాలుగు లక్షల చదరపు అడుగులతో సువిశాలమైన ప్రాంగణంతో సిహెచ్‌ఇ, సిఇ, సిఎస్‌ఇ, ఇసిఇ,ఇఇఇ, ఇఐఇ, ఐటి మరియు ఎంఇ, ఎంటెక్‌లో ఇసిఇ మరియు ఎంఇ, క్యాడ్, క్యామ్ పోస్ట్‌గ్రాడ్యుయేషన్ స్థాయిలో ఎంసిఎలతో సహా ఆరు సైన్సు కోర్సులు కలిగి వుంది. సంవత్సరాలుగా ప్రతి సంవత్సరం 150మందికి పైగా విద్యార్థులు 'గేట్'లో అర్హత పొందుతున్నారు. 1997 'గేట్' (మిగతా135 లో)




బాపట్ల ఫార్మసీ కళాశాల

## కేంబ్రిడ్జి ఆఫ్ ఆంధ్రప్రదేశ్

(134వ పేజీ తరువాయి)
సివిల్ ఇంజనీరింగ్ అఖిల భారత స్థాయిలో ప్రథమస్థానం సాధించారు. 2000 నుంచి 2003 సంవత్సరాలలో మాథ్స్ ఒలంపియాడ్‌లో ప్రథమస్థానాన్ని సాధించారు. అంతర్జాతీయ









ముప్పలనేని శేషగిరిరావు, బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ అధ్యక్షుడు

స్థాయిలో సెంట్రలైజ్‌డ్ ఎయిడ్ కండిషన్ లైబ్రరీ, ల్యాబ్ సదుపాయం కలదు. 42,676 సంపుటాలతో 10 విదేశి పత్రికలతో గ్రంథాలయంని నిర్వహిచబడుతున్నది. ఇందులో విద్యార్థులకు 30 టెర్మినల్స్ ద్వారా 250 విదేశీ పత్రికలు చదువుకునే అవకాశం గల డిజిటల్ లైబ్రరీ సౌకర్యం కలదు.

### బాపట్ల ఫార్మసీ కళాశాల

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ మరో ఆణిముత్యం ఫార్మసీకళాశాల , ఈ కళాశాల డిఫార్మాసీ, బిఫార్మసీ, ఎం.పార్మసీతో పాటు ఫార్మాస్యూటికల్‌లో బయోటెక్నాలజీ కోర్సులకు రీసెర్చీ కళాశాలగా గుర్తింపు పొందింది.

### పాలిటెక్నిక్ కళాశాల

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ కలికితురాయి బాపట్ల పాలిటెక్నిక్ కళాశాల. ఈ కళాశాలలో ఇసిఇ, ఇఇఇ, ఎంఇ, సివిఎఇ, డిప్లిమో ఇన్ బయోటెక్నాలజీ కోర్సులను అందిస్తుంది. రాష్ట్రంలోనే కాకుండా ఇతర రాష్ట్రాల నుంచి సైతం ఈ కోర్సుల కోసం విద్యార్థులు కళాశాలలో చేరుతున్నారు.

### ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల

బాపట్ల ఎడ్యుకేషన్ సొసైటీ ఏర్పడడానికి మూలకారణమైంది. బాపట్ల ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల. ఈ కళాశాలలో ఇంటర్మీడియట్ స్థాయిలో ఎంపిసి, బైపిసి, హెచ్ఇసి, హెచ్‌టిసి, సిఇసి, డిగ్రీ స్థాయిలో బి.ఎ,బికాం, బిఎస్సీ విభాగాలలోని పలు కోర్సులను విద్యార్థులకు అందుబాటులో వుంచింది.

### బాపట్ల జూనియర్ కాలేజి

మారుతున్న కాలానికి అనుగుణంగా విద్యార్థులకు సంబంధిత కోర్సులలో శిక్షణ కల్పించాలనే సదుద్దేశ్యంతో బాపట్ల జూనియర్ కళాశాల ఏర్పాటు చేశారు.

రెసిడెన్సియల్ విద్యావిధానంలో వేలకు వేలు రూపాయలు ఫీజులు దుర్వినియోగం కాకుండా ఇంటర్మీడియట్ స్థాయిలో ఎంపిసి,బైపిసి ఇంగ్లీషు మీడియంలో ఏర్పాటు చేశారు.

### బాపట్ల పబ్లిక్ స్కూల్

కేజి నుండి పిజి వరకు విద్యారంగంలో గ్రామీణ స్థాయిలో దశదిశలా విస్తరించాలనే సొసైటీ ఆశయ సాధనకు నిలుటద్దం బాపట్ల పబ్లిక్‌స్కూల్. ఎల్‌కెజి నుంచి 10వ తరగతి వరకు విద్యాబోధన చేయడానికి ఏర్పాటు చేశారు.

# పల్నాటి సిగలో ఎర్రమందారం కారంపూడి



బ్రహ్మనాయుడి రాచగావుమండపం

(135వ పేజీ తరువాయి)

అయ్యవారు వంశపారంపర్యంగా ఆ స్థానాన్ని ఆక్రమించి ఈ ఉత్సవాలను నిరాటంకంగా కొనసాగిస్తున్నారు. 900 సంవత్సరాలుగా కులమత వర్గరహితంగా జరుపుకునే సహజీవన సాంప్రదాయ ఉత్సవాలే ఈ కారంపూడిలోని వీరారాధన ఉత్సవాలు. ప్రపంచంలో ఈ విధమైన ఉత్సవాలు రెండు చోట్లే జరుగుతాయి. రోమ్‌నగరంలో జరిగే వీరారాధన ఉత్సవాలు మొదటిదైతే, భారతదేశంలోని గుంటూరు జిల్లాలోని కారంపూడిలోజరిగే ఈ ఉత్సవాలు రెండవదిగా చెప్పవచ్చు. చరిత్రకారుడు కార్లైలు వీరపూజ గురించి ప్రపంచంలో బహుళ ప్రచారం చేశారు. ఈ వీరులను స్మరిస్తూ దైవాలుగా భావించి పూజించే ఈ వీరాచారం భారతదేశంలో పల్నాడులో ఉండటం ఈ ప్రాంత ప్రజలకు గర్వించదగ్గ విషయం. బ్రహ్మనాయుడు పల్నాటి యుద్ధానంతరం తనతోటి 66 గురు వీరనాయకులతో గుత్తికొండ బిలంలోకి వెళ్ళారని ప్రతీతి. యుద్ధంలో పాల్గొన్న వీరులంతా తమస్మృతి చిహ్నంగా ఒక్కొక్కరు ఒక్కొక్క రాయిని బ్రహ్మనాయుడికిచ్చి యుద్ధంలో రాలిపోయారు. 66 మంది వీరులకు గుర్తుగా వున్న ఆ వీరుగల్లులను సమతావాద సిద్ధాంతాన్ని పాటించే వీరాచారాన్ని అనుసరించే వారి నిమిత్తం ఆ విధానాన్ని బ్రహ్మనాయుడు కారంపూడి యుద్ధక్షేత్రంలోనే సజీవంగా నిలిపే నిమిత్తం దానికి ఒక పీఠాన్ని ఏర్పరిచి ఆ పీఠంలో వీరాచారం పటిష్ఠంగా జరగాలని ఆదేశించి, బ్రాహ్మణులైన పిడుగు వంశంవారిని ఆ పీఠానికి కర్తలుగా నిర్ణయించి బ్రహ్మనాయుడు గుత్తికొండ బిలంలోకి వెళ్ళి తపస్సు చేసుకొని తనువు చాలించాడని చరిత్ర చెబుతోంది. కార్తీక పౌర్ణమి రోజున పోతురోజుకు 'పడిగం' కట్టడంతో వీరోత్సవాలకు అంకురార్పరణ జరుగుతుంది. వీరుల సేవాస్థలంలోనే పీఠాధిపతి ఆనకట్టుకట్టి మరురోజు యుద్ధమునకు సిద్ధమని తెలుపుతూ రెండు పతాకాలను ఎగురవేస్తారు. ఆ తరువాత పీఠాధిపతులు నాలుగు శేషముడుపులు( ఆహ్వాన పత్రికలు) గ్రామపెద్దలకు (తరువాయి 137లో)

పల్నాటి వీరాచార పీఠాధిపతి శివాజి అయ్యవారు



దేవాలయంలో ముస్లింవీరుల సమాధులు



వీర్ల దేవాలయ తూర్పు ముఖద్వారం

# పల్నాటి సిగలో ఎర్రమందారం కారంపూడి

(136వ పేజీ తరువాయి)

అందించి వీరోత్సవాలకు తరలి రావల్సిందిగా, అన్ని గ్రామాలకు ఈ వార్తను అందజేయవలసిందిగా ఆదే శిస్తారు.

కార్తీక అమావాస్య సమీపిస్తుండగా ఆచారవంతులు వివిధ ప్రాంతాల నుంచి తమతమ కొణతములను తీసుకొని కారంపూడికి వస్తారు. కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, ఖమ్మం, ఉభయగోదావరి జిల్లాల నుంచి ఆచారవంతులు వచ్చి ఈ వీరారాధన ఉత్సవాల్లో పాల్గొంటారు. వచ్చిన కొణతాలను కుంతసామంతములు, అరిగెభైరవులు అన్ని కలసి వీరుల సేవాస్థలం వద్దకు తీసుకెళ్ళి నాగులేటిలోని పవిత్ర గంగధారమడుగులో స్నానం చేయించి నూతన వస్త్రాలతో అలంకరించెదురు.

పీఠాధిపతి, కొణతములవారు, ఆచార వంతులు, ప్రధానులు, కన్నమదాసులు, పూజారులు, కంకణాలు ధరించి గ్రామోత్సవానికి బయలుదేరి చెన్నకేశవాలయం, అంకాళమ్మగుడి వద్ద తీర్థం చెల్లించుకొని రాచగావు మండపం ఎదురుగా వుంచి పీఠాధిపతి సమక్షంలో పల్నాటి వీరవిద్యావస్థులు రాచగావు కథ చెబుతారు.

ఈ విధంగా వారు ఆలపాన చేస్తుంటే వీరావేశంతో ఊగిపోతూ కత్తిసేవ చేసుకునే వీరాచారవంతులను చూస్తుంటే ఒళ్ళు గగుర్పాటు కల్పిస్తుంది. నిరాటంకంగా కొనసాగిస్తున్న ఈ ఉత్సవాలు ఈనెల 13వ తేదీ చాపకూటి పేరుతో సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేసినట్లు పీఠాధిపతి తెలియజేశారు.

ఎంతో ఘనమైన చరిత్రకలిగి వీరులకు నీరాజనాలు అర్పించే ఏకైక చరిత్రగా పేరొందినప్పటికీ ఈ ఉత్సవాలకు విచ్చేసే ఆచారవంతులకు కనీస వసతి సౌకర్యాలు లేని కారణంగా అనేక ఇబ్బందులకు గురౌతున్నారు.

ప్రభుత్వం నుంచి సరైన గుర్తింపులేని కారణంగా ఎటువంటి వసతులు ఇక్కడ చోటుచేసుకోలేదు. మతసామరస్యానికి ఏకైక ప్రతీకగా నిలిచిన ఈ ఉత్సవాల చారిత్రక చిహ్నాలు నేటికి సజీవంగా నిలిచినప్పటికీ కాలక్రమేణా అవి కనుమరుగయ్యే ప్రమాదం లేకపోలేదు. పురాతత్వ శాస్త్రవేత్తలు, పండితులు ఈ ఘనమైన సంస్కృతిని, చారిత్రక సంపదను భావితరాలవారికి అందించవలసిన అవసరం ఎంతైనా వుంది.

ఈ ప్రదేశాన్ని పర్యాటక కేంద్రంగా అభివృద్ధిపరచి చరిత్రలో శాశ్వతంగా నిలిచే ఏర్పాటు చేయాలని ప్రభుత్వాన్ని పీఠాధిపతి పిడుగు వెంకట శివప్రసాద అయ్యవార్ కోరారు.

# దీప హాసము

భారతీయ జీవన విధానంలో, తాత్త్వికమార్గంలో దీపానికి అధిక ప్రాధాన్యం ఉన్నది. దీపం జ్ఞానానికి ప్రతీక. దీపం వెలుగునిస్తుంది. వ్యక్తికి జ్ఞానం వెలుగునిస్తుంది. అందుకే 'తమసోమాజ్యోతిర్గమయ'అని ఉపనిషద్వాక్యం. చీకటిలో నుంచి వెలుగులోకి తీసికొనిరా!అని దానిభావం. చీకటి అజ్ఞానానికి సంకేతం. అజ్ఞానంలో నుంచి జ్ఞాన కాంతిలోనికి తీసుకొని పొమ్మని ఆకాంక్ష. జ్యోతి దీపానికి ప్రతిరూపం. అందుకే నీచుట్టూ ఉన్న చీకటిని తిట్టుకొంటూ కూర్చునేకంటే ప్రయత్నించి చిరుదీపం వెలిగించు అనే వాక్యముద్భవించింది. పరమాత్మ సన్నిధిలో దీపం వెలిగిస్తే పరమాత్మ సంతోషిస్తాడు. దీపారాధనకు కూడా ఒక పద్ధతిని శాస్త్రం చెప్పింది. రెండు వత్తులను ముందు భాగంలో కలిపి, వెనుక రెంటిని వేర్వేరుగా విడదీసి వుంచాలి. రెండువత్తులు భార్యాభర్తలు. ఇద్దరి దేహములు వేర్వేరైనా వారి భావములు ఒక్కటిగా ఉండాలని భావన. అందుకే వెనుకభాగంలో రెండు వత్తులను వేర్వేరుగా వుంచి ముందు కలిపి దీపం వెలిగించటం వలన దంపతుల భావ చైతన్యమొక్కటియేయని భావం.



స్నేహం అనే పదానికి చమురు అని అర్థం. రెండు వత్తులు మిత్రులకు సంకేతం. అందులో పోయబడిన చమురుమైత్రికి నిదర్శనం. ఆరెండు కలిసిన చైతన్య స్వరూపమే దీపకళిక. దీపావళి అంటే దీపముల వరుస అని అర్థం. నరకాసురుడు అనే రాక్షసుడుండేవాడు. ఆతడు మూడువేల మంది కన్యలను కారాగృహంలో బంధించాడు. ఆకన్యల తల్లిదండ్రుల ఆవేదనకు అంతంలేదు. వారికి శాంతిని కలిగించటానికే శ్రీకృష్ణుడు నరకుని సంహరించి, ఆకన్యలకు విముక్తిని కలిగించి, వారికోరిక మీద వారిని వివాహమాడినాడు. ఆరోజు మనం నరకచతుర్థి అంటున్నాం. ఆరోజున నరకుని మరణవార్తతో సంతసించిన ప్రజలు బాణసంచా కాల్చి తమ ఆనందాన్ని వ్యక్తంచేశారు. ఆతర్వాత రోజు అమావాస్య. ఆరోజున దీపతోరణాలు ప్రతిగృహ ప్రాంగణంలోవుంచి తమ సంతోషాన్ని వ్యక్తచేస్తూ ప్రజలు పండుగచేసికొన్నారు. దానినే మనం దీపావళి పండుగ అని వ్యవహరిస్తూ కోలాహలంగా జరుపుకుంటున్నాం. ఆజ్ఞానోదయానికి ప్రతీక దీపావళి పండుగ. దీపపువత్తి కాలుతూనే కాంతిని విరాజిల్లచేస్తుంది. నీవు బాధపడినాసరే చుట్టూ ఉన్న సమాజానికి సేవలందించు అనేది దానిసందేశం. ఈ పండుగ ఆశ్వయుజమాస అమావాస్యన్యాడు వస్తుంది. ఆతెల్లవారి నుంచి కార్తీకమాసం. కార్తీకమాసంలో ఆకాశదీపాలు వెలిగిస్తారు. దీపాలు అమావాస్య చీకటులను పారదోలి వెలుగులు ప్రసాదిస్తాయి. (ఈ కార్తీక దీపాలు రాత్రివేళ మార్గదర్శకాలుగా కూడా వుండేవి. పైగాఇవి మాగుడురోజులకు ప్రారంభ దినాలు. దోమలు, పురుగులు అధికంగా ఉద్భవిస్తాయి. మనం కాల్చేబాణాసంచానుంచి విడుదలైన గంధకపు వాసనలతో ఆపురుగులు మరణిస్తాయి. సరిగ్గా రైతుల పొలాన్నీ పైరులు ఏపుగా పెరిగి కళకళలాడుతుండే సమయం. ఈ గంధకాది వాసనలచే దోమలు మొదలైనవి నశించి పైరులకు నష్టం కలిగించకుండా తీసికొనే జాగ్రత్తలలో ఇది ఒకటి. దీపావళికి ఊరిలోని వారంతా ఊరిమధ్యలో ఒకచోట దివిటీలతో మంటలు వేస్తారు. ఆమంటల మీదుగా యువకులు దూకేవారు. వావివరుసలు పెట్టి హాస్యంకోసం, కొన్ని అభూతకల్పనతో కేకలు వేస్తారు. పూర్వం యువకులలో ధైర్యాన్ని, శక్తియుక్తులను కూడగట్టడానికి సామాజికమైన ఐకమత్యాన్ని సాధించటానికి ఈక్రియలెంతో దోహదం చేసేవి. ఉత్తర హిందూదేశంలో లక్ష్మీదేవి క్షీరసముద్రంలో జన్మించిన దినంగా ఈ పండుగను భావిస్తారు. లక్ష్మీదేవి ధనదేవత. 'ధనమూలమిదంజగ'త్తనినాడువాల్మీకి మహర్షి. లోకంలోని సమస్త వ్యవహారాలకు డబ్బే మూలం. అందుకే ఉత్తర హిందూదేశంలో వ్యాపారులంతా ఈరోజున కొత్తగా దస్త్రాలు తెరుస్తారు. పదిమందికీ విందులుచేస్తారు. రాత్రికి బాణసంచా కాలుస్తూ హాయిగా కాలం గడుపుతారు. ఈపండుగ ఆనందానికి ప్రతీక. 'ఆనందోబ్రహ్మ' అని వేదం వచిస్తున్నది. ఆనందస్వరూపమైన భగవంతుని జ్యోతి స్వరూపునిగా దర్శించుటమే దీపావళి.

మొవ్వ వృషాద్రిపతి
సాహితీ వాచస్పతి, రేపల్లె

# మావోయిస్టుల' కేంద్రం.. అడిగొప్పుల

(ఆన్‌లైన్, దుర్గి)
అడిగొప్పుల... ఈ పేరు వింటే ఎవరికైనా గుర్తుకువచ్చేది మావోయిస్టులే... కళ్ళెదుట ప్రత్యక్షమయ్యేది ఎన్‌కౌంటర్లు, ఇన్‌ఫార్మర్ల హత్యలు, ఎక్స్ఛేంజ్‌ల పేల్చివేత, మందుపాతర్లు, బస్సు దగ్ధం దృశ్యాలే. దుర్గి మండల పరిధిలోని అడిగొప్పుల



అడిగొప్పులలోని ప్రధాన వీధి

గ్రామం నక్సలైట్లకు పెట్టని కోట. ఈ గ్రామంతో నక్సలైట్లకు వున్న అవినాభావ సంబంధాన్ని విడదీయడం అంత సులువు కాదు. పల్నాడులో నక్సలైట్ల ప్రభావిత గ్రామాలు ఎన్నో వున్నా అడిగొప్పులే వారికి జీవనాడి. పీపుల్స్‌వార్ ప్రారంభించిన దేవాలయ భూముల పంపిణీ ఉద్యమానికి ఈ గ్రామమే ఊపిరి. పోలీసులకు, నక్సలైట్లకు మధ్య నిరంతరం జరిగే సంఘర్షణలో ఈ గ్రామం రక్తంతో తడిసి ముద్దవుతోంది. ఈ ఇరువర్గాలకు జరుగుతున్న సంకుల సం'గ్రామం'లో వార్ గొప్పలే బహిర్గతం అవుతున్నాయి. ఒకనాడు ఫ్యాక్షన్ వలయంలో మగ్గిన అడిగొప్పుల నేడు మావోయిస్టుల యాక్షన్‌కు నిలయంగా ఎందుకు మారింది? ఈ గ్రామం పై మావోయిస్టుల పట్టు ఇంతలా బిగుసుకుపోవడానికి కారణాలు ఏమిటి అనే సందేహాలు నివృత్తి చేసుకోవాలంటే అడిగొప్పుల 'ఫ్లాష్ బ్యాక్'లోకి తొంగిచూడక తప్పదు.

## ఇక్కడ అత్యాచారాలే సంప్రదాయాలు

సుమారు 8 వేల జనాభా గల అడిగొప్పుల పది సంవత్సరాల క్రితం ఒక ఫ్యాక్షన్ గ్రామం. ఇక్కడ ఒకవైపు ముఠా గొడవలు, హత్యలు జరుగుతుండగా, మరోవైపు బలహీన వర్గాల పై అత్యాచారాలు, దౌర్జన్యాలు కొనసాగేవి. అగ్రవర్ణాలు కుల వివక్ష, అసమానతలు, అంటరానితనం లాంటి దురాచారాలు పాటిస్తూ బలహీనుల పై దౌర్జన్యాలు చేస్తుండేవారు. హోటల్స్‌లో రెండు గ్లాసుల పద్ధతి నిర్బంధంగా అమలు చేస్తుంటారు. హోటల్స్‌లో టీ తాగడానికి వచ్చిన అగ్రవర్ణాలకు, దళిత వర్గాలకు గ్లాసులు వేరువేరుగా వుంచేవారు. అగ్రవర్ణాల వ్యక్తులు బెంచీలపై కూర్చొని టిఫిన్ చేస్తుంటే దళితులు కింద కూర్చోవలసి వచ్చేది. గ్రామ పెత్తందార్లు కొందరు కీచకులై బలహీనవర్గాల మహిళలపై బలవంతంగా అత్యాచారాలు జరపడం నిత్యకృత్యంగా సాగేవి. పొరుగు గ్రామాల నుంచి వివిధ రకాల సరుకులు అమ్ముకోవటానికి వచ్చిన మహిళలు సైతం వీరి కామాగ్నికి సమిధలు అయ్యే వారు. అబలలను బలవంతంగా లొంగ తీసుకోవడం, కాదంటే కాటేసి కాటికి పంపడం వంటి దురాగతాలు చేసే వారు. ఎన్నో రకాల దుర్మార్గాలకు గురైన బాధిత ప్రజలు వీరికి భయపడి పోలీసులకు ఫిర్యాదు చేసేవారు కాదు.

## పీపుల్స్‌వార్ నక్సలైట్ల అరంగేట్రం

అడిగొప్పులలో నిలువెల్లా ఆకృతి దాల్చిన అత్యాచారాల సంస్కృతి, వెర్రి తలలు వేస్తున్న అంటరానితనం పేదలను పీల్చి పిప్పి చేస్తున్న వడ్డీ వ్యాపారుల దౌష్ట్యాల పై 'వార్' దృష్టి పడింది. గ్రామంలోని సామాజిక, ఆర్థిక పరిస్థితులను తమకు అనుకూలంగా మలచుకోవడానికి 'వార్' నక్సల్స్ అడిగొప్పులను తమకు అనువైన ప్రదేశంగా ఎంపిక చేసుకున్నారు. ఈ గ్రామానికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఎత్తైన కొండలు, దట్టమైన అడవి, అక్కడ నీటి వసతి కలిగిన బ్రహ్మదేవుని గుడి ప్రాంతాన్ని తమ స్థావరంగా చేసుకొని నక్సలైట్లు అడిగొప్పులలో తమ కార్యకలాపాలకు శ్రీకారం చుట్టారు. 1995 సెప్టెంబరులో గ్రామంలోని బలహీనవర్గాలు రుణ బాధ నుంచి విముక్తి పొందడానికి 'వార్'ను ఆశ్రయించారు. 'వార్' ఆశీస్సులతో అగ్రవర్ణానికి చెందిన ఒక వ్యక్తి స్థానిక వ్యాపారిని కిడ్నాప్ చేయటం జరిగింది. లక్ష రూపాయల అప్పులను మాఫీ చేసి అదనంగా మరో లక్ష విరాళంగా ఇచ్చే షరతుతో 'వార్' ఆ వ్యాపారిని విడిచిపెట్టింది. ఈ సంఘటనలో వ్యాపారి కిడ్నాప్‌కు కీలక పాత్ర వహించిన వ్యక్తి బలహీనవర్గాల వారికి నాయకుడిగా మారాడు. అతని నాయకత్వంలో గ్రామానికి చెందిన బలహీన వర్గాల ప్రజలు రైతు కూలి సంఘంగా ఏర్పడ్డారు.

ఈ సంఘ నాయకులు గ్రామంలోని భూస్వాములు వ్యాపార వర్గాల నుండి పెద్ద మొత్తంలో సొమ్ము వసూలుకు ఉపక్రమించారు. ఇదే సమయంలో రైతు కూలి సంఘం ఆధ్వర్యంలో గ్రామంలోని దేవాలయ భూములను, ప్రభుత్వ హార్టికల్చర్ భూముల ఆక్రమణ, పంపిణీకి రంగం సిద్ధం చేసింది. 1997 ఏప్రిల్‌లో రైతు కూలి సంఘం గ్రామంలోని 200 ఎకరాల దేవుని మాన్యాలను ఆక్రమించి ఎర్ర జెండాలను పాతింది. మే నెలలో 300 ఎకరాల హార్టికల్చర్ ఫారం భూములను

(మిగతా 140వ పేజీలో)

# మావో'యిస్టుల' కేంద్రం.. అడిగొప్పల


'వార్' ఉద్యమానికి కేంద్ర బిందువైన హార్టికల్చర్ ఫారం భూములు

(139వ పేజీ తరువాయి)

కూడా ఆక్రమించగా పోలీసులు జెండాలను తొలగించి 600 మంది రైతు కూలీల పై కేసులు పెట్టారు. దీంతో 'వార్' భూస్వాముల పై ఆగ్రహం వ్యక్తం చేస్తూ భూ పంపిణీకి అడ్డు తగులుతున్న వారిని శిక్షిస్తామని హిట్‌లిస్ట్‌ను ప్రకటించింది. ఆ హిట్‌లిస్ట్‌లో హార్టికల్చర్ ఫామ్ వాచ్‌మెన్ గాడిపర్తి నరసయ్య, యాగంటి వెంకటేశ్వర్లు, ఆరికట్ల మంగయ్య, లింగా సైదయ్యలు వున్నారు. ఆ పరిస్థితులలో గ్రామ భూస్వాములంతా రైతు సంఘంగా ఏర్పడి రైతు కూలీలను పనులకు పిలవకుండా సమ్మె కట్టారు.

## హత్యలకు శ్రీకారం చుట్టిన వార్

1997 అక్టోబరు 5న పీపుల్స్ వార్ చంద్రవంక దళం గాడిపర్తి నరసయ్యను తీవ్రంగా కొట్టడంతో మృతి చెందాడు. నరసయ్య హత్య కేసులో 11 మందిపై పోలీసులు కేసులు పెట్టి మరో వంద మంది 'వార్' సానుభూతిపరులను అరెస్టు చేశారు. దీంతో గ్రామంలో 'వార్' ప్రాబల్యానికి కొంతకాలం బ్రేక్ పడింది.

1998 ఫిబ్రవరి నెలలో దళితుల పై భూస్వాములు జరిపిన దాడుల్లో రోశయ్య అనే వ్యక్తి తీవ్రంగా గాయపడ్డాడు. ఆగస్టులో 'వార్' నక్సల్స్ కర్లపూడి పిచ్చయ్యను అడిగొప్పులలో కిడ్నాప్ చేసి 75 వేల రూపాయలను డిమాండ్ చేయగా ఒప్పుకున్న సొమ్మును అందించడంలో జాప్యం జరిగింది. ఈ నేపథ్యంలో అక్టోబరు 19 దీపావళి రోజున బలహీనవర్గానికి చెందిన పులి మట్టయ్యపై హత్యా యత్నం జరిగింది. 1999లో యేల్చూరి నారాయణ అనే 'వార్' సానుభూతిపరుని అగ్రవర్ణాల ప్రోద్బలంతో అతని వర్గీయులే రెండు రోజుల పాటు స్తంభానికి కట్టివేసి హింసించారు. ఒక మహిళతో అక్రమ సంబంధం కొనసాగిస్తున్నాడనే నేరం మోపుతూ నారాయణను ఈ హింసకు గురిచేయగా, నారాయణ అక్రమ సంబంధానికి గృహ వసతి కల్పించి సహాయ పడుతుందన్న సాకుతో మరో వృద్ధ మహిళను కూడా కొట్టడం జరిగింది.

2002, ఏప్రిల్ 30న 'వార్' నక్సల్స్ తమ హిట్‌లిస్ట్‌లో వున్న ఆరికట్ల మంగయ్య పై దాడి చేసి తీవ్రంగా కొట్టి వెళ్ళారు. మంగయ్యను కొట్టి అడవుల్లోకి వెళ్ళిన నక్సల్స్ కోసం గ్రేహౌండ్స్ పోలీసులు కూంబింగ్ నిర్వహిస్తుండగా 2002, జూలై 23న క్లైమోర్‌మైన్స్ పేల్చి నలుగురు గ్రేహౌండ్స్ పోలీసులను నక్సలైట్లు హతమార్చారు. అనంతరం నక్సల్స్, పోలీసులకు మధ్య ఎన్నో హత్యా, విధ్వంసక సంఘటనలు చోటు చేసుకున్నాయి. కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే గ్రామంలో కొన్ని నెలల పాటు ప్రశాంత వాతావరణ పరిస్థితులు నెలకొన్నాయి.

ఇందిరాప్రభ పథకం కింద హార్టికల్చర్ భూములలో 163 ఎకరాలను ఇటీవల ఆ గ్రామానికి చెందిన పేదలకు పంపిణీ కూడా చేయటం జరిగింది. అదే విధంగా గ్రామంలోని దేవాలయ భూములను కూడా అంతకుముందే నిరుపేదలకు పంపిణీ చేశారు. అయితే కాంగ్రెస్ ప్రభుత్వం పై కూడా క్రమంగా కసి పెంచుకొని మావోయిస్టులు కయ్యానికి దిగుతున్న నేపథ్యంలో అడిగొప్పుల నుంచి మావోయిస్టులు దుర్గి పోలీస్ స్టేషన్ పై దాడికి పథక రచన చేసి అమలు చేయడంతో పాటు గుట్టపల్లి సత్యంను హతమార్చారు. ఏది ఏమైనప్పటికీ గ్రామంలోని అన్ని వర్గాల నుండి సానుభూతిపరులను కలిగి వున్న మావోయిస్టులు అడిగొప్పులలో తమ ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తున్నారు. ప్రతి నిత్యం అటు పోలీసులు, ఇటు మావోయిస్టుల మధ్య చోటు చేసుకుంటున్న ఎన్‌కౌంటర్లు, ఇన్‌ఫార్మర్ల కాల్చివేత, విధ్వంసక చర్యలతో అడిగొప్పుల పత్రికలకు ఎక్కుతూనే వుంది.

# అడిగొప్పుల 'వార్' చరిత్రలో ప్రధాన సంఘటనలు





ఇటీవల మావోయిస్టుల చేతిలో హతమైన గుట్టపల్లి సత్యం

1. 5-10-1997 : 'వార్' చేతిలో గాడిపర్తి నరసయ్య హతం.

2. 30-4-2002 : ఆరికట్ల మంగయ్య పై దాడి, దేహశుద్ధి

3. 23-7-2002 : క్లైమోర్‌మైన్స్ పేల్చి నలుగురు గ్రేహౌండ్స్ పోలీసుల హత్య

4. 14-10-2002:మాజీ సర్పంచ్ యాగంటి వెంకటేశ్వర్లు కాల్చ వేత

5. 11-12-2002 : గ్రామ కమిటీ సభ్యుడు బరిసె కోటయ్య అరెస్టు

6. 13-12-2002 : కోటయ్య అరెస్టుకు నిరసనగా కంచరగుంట వద్ద ఆర్టిసి బస్సు దగ్ధం.

7. 14-12-2002 : కోటయ్య విడుదలలో జరిగిన జాప్యానికి నిరసనగా అడిగొప్పుల టెలికం ఎక్స్ఛేంజ్ దగ్ధం.

8. 7-1-2003 : గ్రామంలోని హైస్కూల్ వద్ద ఆర్టీసి బస్సు దగ్ధం

9. 10-1-2003 : గ్రామ సమీపంలో మాచవరపు వెంకటేశ్వర్లు ఎన్‌కౌంటర్

10. 3-2-2003 : రాయపాటి అన్నమ్మ, ముత్తయ్యలకు దేహశుద్ధి

11. 15-2-2003 : అడిగొప్పులకు చెందిన బత్తుల రామారావు, మామిడి కోటయ్యలు అనే వార్ మిలిటెంట్లు దావుపల్లి ఎన్‌కౌంటర్‌లో మృతి

12. 15-4-2003 : పమిడిపాడు ఎన్‌కౌంటర్‌కు నిరసనగా గ్రామ సమీపంలో ఆర్టీసి బస్సు దగ్ధం

13. 11-5-2003 : బ్రహ్మదేవుని గుడి వద్ద 14 మందుపాతర్లను స్వాధీనం చేసుకున్న పోలీసులు



'వార్' చేతిలో హత్యకు గురైన డ్వాక్రా లీడర్ రాయపాటి అన్నమ్మ

14. 25-5-2003 : 'వార్'చే నలబోతుల రామాంజనేయులు కాల్చివేత

15. 27-5-2003 : వార్ మిలిటెంట్ యల్లమంద గృహ దగ్ధం

16. 13-6-2003 : గ్రామ సమీపంలో వార్ మిలిటెంట్ గంటెనపల్లి గురవయ్య ఎన్‌కౌంటర్

17. 4-7-2003 : అడిగొప్పులలో భారీ ఎత్తున క్లైమోర్ మైన్స్, మందుపాతర్లు స్వాధీనం చేసుకున్న పోలీసులు.

18. 22-7-2003 : రాయపాటి అన్నమ్మ వార్‌చే కాల్చివేత

19. 10-5-2005 : దుర్గి పోలీస్ స్టేషన్ పై మావోయిస్టుల దాడికి అడిగొప్పుల నుంచే పథక రచన

20. 23-8-2005 : గుట్టపల్లి సత్యంను కాల్చి చంపిన మావోయిస్టులు

# నగరపాలకసంస్థలో కమిషనర్ల శకం


ఎంటి కృష్ణబాబు


జి.రామనారాయణ రెడ్డి


కాంతిలాల్ దండే


దువ్వారపు రామారావు

(ఆన్‌లైన్, గుంటూరు)

గుంటూరు నగరపాలకసంస్థ దశాబ్దకాల చరిత్రలో మొత్తం ఏడుగురు కమిషనర్లు సమర్ధవంతంగా బాధ్యతలు నిర్వర్తించారు. పురపాలకసంఘం నుంచి కార్పొరేషన్ హోదా లభించేనాటికే కమిషనర్‌గా ఉన్న ఎం.రాజేశ్వరరావు ఆ తరువాత కూడా ఏడాది పాటు కొనసాగారు. ఆ ఏడాది అభివృద్ధి అంతంత మాత్రంగానే జరిగింది. కార్పొరేషన్ అయిన మొదటి సంవత్సరంలో రోడ్లు, కాలువల కోసం రూ. 4 కోట్లు వెచ్చించారు. అలానే మంచినీటి సరఫరాకు రూ. 5 లక్షలు, అండర్ గ్రౌండ్ డ్రైనేజీకి రూ. 12 లక్షలు, వీధిలైట్లకు రూ. 75 వేలు వెచ్చించారు. సుందరీకరణకు ఎటువంటి నిధులు వెచ్చించలేదు. ఆ తరువాత నిజమైన పరిపాలన సాగింది.

తొలిసారిగా ఐఏఎస్ అధికారి అయిన జి.సాయిప్రసాద్ కమిషనర్‌గా బాధ్యతలు తీసుకున్నారు. ఆయన రెండు సంవత్సరాల పాటు కమిషనర్‌గా కొనసాగిన ఆయన ఎన్నో సంస్కరణల అమలుకు శ్రీకారం చుట్టారు. ప్రధానంగా నగరపాలకసంస్థకు ఆర్థిక వనరులు చేకూర్చి పెట్టేందుకు అహర్నిశలు శ్రమించారు. అభివృద్ధి కుంటుపడకుండా చూస్తూ రెవెన్యూ వసూళ్లను తీవ్రతరం (మిగతా 143వ పేజీలో)

# నగరపాలకసంస్థలో కమిషనర్‌ల శకం

(142వ పేజీ తరువాయి)

చేశారు. పెండింగ్ బకాయిలు వసూలు చేసి తాను బదిలీ అయ్యేనాటికి కార్పొరేషన్ ఖజానాలో సమృద్ధిగా రూ. 20 కోట్లు నిధులు జమ చేసి పెట్టారు. అలానే రెండు సంవత్సరాలలో సుమారు రూ. 17 కోట్ల అభివృద్ధి పనులు చేసి ప్రజల మన్ననలు అందుకొన్నారు.

కమిషనర్ సాయిప్రసాద్ బదిలీ అయిన తరువాత మరో ఐఏఎస్ అధికారి మొవ్వా తిరుమల కృష్ణబాబు బాధ్యతలు తీసుకున్నారు. పలు రోడ్ల విస్తరణ, అవుట్‌ఫాల్ డ్రెయిన్లు, సెంట్రల్ డివైడర్లు అభివృద్ధి చెందాయి. ప్రధానంగా అరండల్‌పేట నాల్గో లైను, పట్నంబజార్, లీలామహల్‌రోడ్డు, ఓల్డ్ క్లబ్‌రోడ్డు వంటి ఎన్నో అభివృద్ధి పనులు జరిగి నగరానికి కార్పొరేట్ లుక్ వచ్చింది. కృష్ణబాబు హయాంలో రెవెన్యూ వసూళ్ళ కంటే అభివృద్ధికి ఎక్కువ నిధులు ఖర్చు పెట్టడంతో ఆయన బదిలీ అయ్యేనాటికి కార్పొరేషన్ నెత్తిన రూ. 5 కోట్లు బకాయిలు పేరుకుపోయాయి.

కృష్ణబాబు బదిలీ అనంతరం కమిషనర్‌గా ప్రవీణ్‌ప్రకాష్ బాధ్యతలు చేపట్టారు. సాధ్యమైనంత వరకు ప్రజల వద్దకు వెళ్ళి సమస్యలు తెలుసుకొని వాటి పరిష్కారానికి ఎక్కువ ప్రాధాన్యత కనబర్చారు. ప్రవీణ్‌ప్రకాష్ ఉన్న సమయంలో ఏదైనా సమస్య ఆయన దృష్టికి తీసుకెళ్ళినట్లు అయితే తప్పకుండా పరిష్కారమవుతుందన్న భావన ప్రజల్లో కలిగిందంటే ఆయన ఎంతగా ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్నారో అవగతం చేసుకోవచ్చు. మానసరోవరం, ఎన్‌టిఆర్ స్విమింగ్ పూల్, ఎన్.టి.ఆర్.స్టేడియం, వాటర్ స్పోర్ట్స్, రోడ్లు విస్తరణ, చెరువుల అభివృద్ధి, అండర్‌గ్రౌండ్ డ్రైనేజీ, జన్మభూమి పనులు, హైమాస్క్ లైట్లు, సెంట్రల్ లైటింగ్, ఉద్యానవనాలు, మంచినీటి సరఫరా వంటి ఎన్నో ప్రజలకు అవసరమైన పనులు కమిషనర్ ప్రవీణ్‌ప్రకాష్ ఉండగా జరిగాయి. ఇదే సందర్భంలో ఆన్‌లైన్ పద్ధతిలో పన్నుల వసూళ్లు, ఇంటింటికి వెళ్ళి చెత్త సేకరణ, సిటిజన్ ఛార్టర్ వంటి సంస్కరణలను ప్రవేశపెట్టారు. సంస్కరణల అమలును గాడీలో పెడుతున్న సమయంలో ఆయన బదిలీ అయ్యారు. ముగ్గురు ఐఏఎస్‌ల అనంతరం నాన్ ఐఏఎస్ అధికారి అయిన జి.రామనారాయణరెడ్డి బాధ్యతలు తీసుకొన్నారు. అయితే అప్పటికే నగరపాలకసంస్థ రూ. 20 కోట్లు అప్పుల ఊబిలో కూరుకుపోయింది. ఆ స్థితిలో ఒక్క అభివృద్ధి పని కూడా మంజూరు చేయలేని పరిస్థితి ఏర్పడింది. అయినప్పటికి కమిషనర్ రామనారాయణరెడ్డి రెవిన్యూ వసూళ్ళను ముమ్మరం చేసి అభివృద్ధి పనులను బాగా తగ్గించేశారు. ఫలితంగా బకాయిలు రూ. 5 కోట్లకు చేరుకున్నాయి. రామనారాయణరెడ్డి హయాంలో చెప్పుకోదగ్గ అభివృద్ధి జరగలేదనే చెప్పొచ్చు. రామనారాయణరెడ్డి బదిలీ అయ్యే ముందుగా ఆయనకు ఐఏఎస్ హోదా లభించడం విశేషం.

రామనారాయణరెడ్డి తరువాత కమిషనర్ దువ్వారపు రామారావు బాధ్యతలు చేపట్టారు. ఆయన ఎక్కువగా సుందరీకరణకు ప్రాధాన్యత కనబర్చారు. డివైడర్ల బ్యూటిఫికేషన్, డిజిటల్ లైట్లుతో పాటు విరివిగా సిమెంటు రోడ్లు, కాలువలు, అండర్‌గ్రౌండ్ డ్రైనేజీ సదుపాయాలకు నిధులు కేటాయించారు. కార్పొరేషన్‌కు ఆదాయం తెచ్చిపెట్టే పలు ప్రాజెక్టులు చేపట్టిన తరుణంలో బదిలీ అయ్యారు. ఆ తరువాత ఏడో కమిషనర్‌గా ఐఏఎస్ అధికారి అయిన కాంతిలాల్ దండే మూడు నెలలు మాత్రమే పని చేసి పదోన్నతిపై కడప జిల్లాకు జాయింట్ కలెక్టర్‌గా బదిలీ అయ్యారు. దాంతో మరలా ప్రభుత్వం ఆలోచన చేసి దువ్వారపు రామారావునే తిరిగి కమిషనర్‌గా నియమించింది. ఫలితంగా వెన్‌లాక్, రెడ్ ట్యాంక్ షాపింగ్ కాంప్లెక్స్‌ల నిర్మాణాలు వేగవంతంగా జరుగుతూ చివరి దశకు చేరుకున్నాయి. ఇదే సమయంలో కమిషనర్ రామారావు ఎన్నో సంస్కరణ అమలుకు నాంది పలికారు. కార్పొరేషన్ సిబ్బంది అవినీతిని తగ్గించేందుకు కొరియర్ సేవలు, సిటిజన్ ఛార్టర్ అమలు, కుళాయి మీటర్ల స్పాట్ బిల్లింగ్, రిజర్వాయర్లలో టోకెన్ విధానం వంటి సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రజల ప్రశంసలను పొందుతున్నారు.

## దశాబ్ద కాలంలో కార్పొరేషన్ చేపట్టిన అభివృద్ధి పనులు

| సంవత్సరం | రోడ్లు | మంచినీరు | యుజిడి | వీధిలైట్లు | పార్కులు (కోట్లలో) |
|---|---|---|---|---|---|
| 1994-95 | 4.05 | 0.05 | 0.12 | 0.075 | --- |
| 1995-96 | 5.48 | 1.87 | 0.13 | -- | --- |
| 1996-97 | 8.36 | 1.77 | 0.34 | 0.02 | --- |
| 1997-98 | 10.64 | 1.90 | 0.42 | 0.46 | 0.01 |
| 1998-99 | 17.73 | 2.93 | 0.53 | 1.67 | 0.03 |
| 1999-00 | 8.09 | 2.55 | 0.28 | 1.09 | 0.05 |
| 2000-01 | 8.68 | 1.54 | 0.50 | 0.94 | 0.09 |
| 2001-02 | 23.80 | 3.85 | 0.36 | 1.29 | 0.70 |
| 2002-03 | 14.97 | 2.44 | 0.36 | 0.54 | 0.30 |
| 2003-04 | 21.84 | 4.44 | 1.01 | 0.83 | 0.44 |
| 2004-05 | 6.10 | 1.89 | 0.24 | 0.56 | 0.001 |
| మొత్తం | **129.32** | **25.27** | **4.34** | **7.44** | **1.65** |



## ఆంధ్రజ్యోతికి అభినందనలు

గ్రామపంచాయతి, చెరుకుపల్లి

చెరుకుపలి (మండలము), గుంటూరు (జిల్లా)

### ప్రగతి పనులకే అంకితమైన పాలకవర్గము

శ్రీ పంచుమర్తి చిన్నవెంకట సుబ్బారావు, సర్పంచి, చెరుకుపల్లి

శ్రీ కూరేటి వెంకటేశ్వర్లు, పంచాయితి కార్యదర్శి

1. శ్రీ పంచుమర్తి చిన్నవెంకట సుబ్బారావు - సర్పంచి
2. శ్రీమతి నాగుల సులోచన - ఉపసర్పంచి
3. శ్రీమతి మామిళ్ళ రాజకుమారి - 1వ వార్డు మెంబరు
4. శ్రీ కుంభా వెంకటేశ్వర్లు - 2వ వార్డు మెంబరు
5. శ్రీ గుద్దంటి సురేష్ బాబు - 3వ వార్డు మెంబరు
6. శ్రీమతి శొంఠి వెంకటేశ్వరమ్మ - 4వ వార్డు మెంబరు
7. శ్రీ కూరేటి చంద్రయ్య - 5వ వార్డు మెంబరు
8. శ్రీ చింతా శ్రీనివాసరావు - 6వ వార్డు మెంబరు
9. శ్రీ మొగిలిపువ్వు నాగేశ్వరరావు - 7వ వార్డు మెంబరు
10. శ్రీ లచ్చి శ్రీనివాసరావు - 8వ వార్డు మెంబరు
11. శ్రీ పువ్వాడ వెంకటసుబ్రహ్మణ్యం - 9వ వార్డు మెంబరు
12. శ్రీ చీమకుర్తి నాగరాజకుమారి - 10వ వార్డు మెంబరు
13. శ్రీమతి గద్దం దుర్గా కుమారి - 12వ వార్డు మెంబరు
14. శ్రీ మువ్వలకుమార రాజా - 13వ వార్డు మెంబరు
15. శ్రీమతి తూనుగుంట్ల వాణి - 14వ వార్డు మెంబరు

### 2005-06 సం॥లో చేపట్టి పూర్తిచేసిన మరియు ప్రొగ్రెస్‌లో యున్న అభివృద్ధి పనులు

| | అంచనా విలువ |
|---|---|
| 1. నేరేళ్ళ ఉపేంద్ర ఇంటినుండి హైవేసురోడ్డు వరకు మరియు అవ్వారు మోహనరావు ఇంటివద్ద పక్కాడ్రెయిన్ నిర్మాణము (V.P.F) | - 52000/- |
| 2. పారిశుద్ధ్య సమసంమ నివారణకు ప్రదాన మురుగు కాలువలలో సిల్లు తొలగింపు(V.P.F) | - 52000/- |
| 3. (S.G.R.Y -50%) కాలనీలో బొడ్డు శ్రీను ఇంటి నుండి కేసనసత్యం ఇంటివరకు మెటలురోడ్డు నిర్మాణము | - 55,000/- |
| 4. (50 %) శాంతినగర్ లో చెరుకుపల్లి శ్రీరామమూర్తి ఇంటినుండి కొరేటి సాంబశివరావు ఇంటి వరకు మెటలురోడ్డు | - 1,00,000/- |
| 5. యెల్లెల భాస్కరరావు ఇంటినుండి అసంపూర్తి సి.సిరోడ్డు నిర్మాణము (S.G.R.Y 50%)- | 36,000/- |
| 6. శ్రీ పతిస్టుడియో నుండి చిట్రా సుబ్బారావు ఇంటి వరకురోడ్డు నిర్మాణము(E.F.Cనిధులు)- | 1,40,000/- |
| 7. నాగుల వెంకటేశ్వరరావు ఇంటినుండి కటకంరంగారావు ఇంటి వరకు రోడ్డు నిర్మాణము (E.F.C నిధులు) | - 1,70,000/- |
| 8. యస్.సి కాలనీలోని మండలపరిషత్ L.E పాఠశాల అవరణలో బాలబాలికల మధ్యాహ్నభోజనము కొరకు కిచెన్ షెడ్డు నిర్మాణము ( S.G.R.Y స్పెషల్ కాంపొనెంటు) | - 50,000/- |
| 9. అభ్యుదయపాఠశాల అవరణలో బాలబాలికల మధ్యాహ్న భోజనము కొరకు కిచెన్ షెడ్డు నిర్మాణము (S.G.R.Y స్పెషల్ కాంపొనెంటు) | - 50,000/- |
| 10. అభ్యుదయపాఠశాల అవరణలో బాలబాలికల సౌకర్యము కొరకు నీటి తొట్టి నిర్మాణము (S.G.R.Y స్పెషల్ కాంపొనెంటు) | - 2,000/- |
| 11. శ్మశానమును సౌకర్యవంతముగా అభివృద్ధిచేయుట కర్మవాండల భవనము మరియు దహనవేదికల నిర్మాణము (S.G.R.Y స్పెషల్ కాంపొనెంటు) | - 2,40,000/- |
| 12. P.W.S. చెఱువునకు బ్రాంచీకాలువ నుండి సప్లై ఛానల్ త్రవ్వకము వగైరా | - 45,000/- |

ఇవే గ్రామములోని పేద, బలహీన వర్గముల వారికి డ్వాక్రా మహిళలకు ఆర్థికాభ్యున్నతకి సంక్షేమమునకు జాతీయ బ్యాంకుల ద్వారా మరియు ప్రభుత్వ పథకముల ద్వారా లబ్ధిచేకూర్చే కార్యక్రమములు పెద్ద ఎత్తున అమలు జరుగుచున్నవి.

**కూరేటి వెంకటేశ్వర్లు**, కార్యదర్శి
గ్రామపంచాయితి, చెరుకుపల్లి

# మురికివాడలకు ఏపియూఎస్‌పితో మహర్దశ

(ఆన్‌లైన్, గుంటూరు)

గుంటూరు పురపాలక సంఘం నుంచి కార్పొరేషన్ హోదాకు ఎదిగిన తరువాత మురికివాడలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. శివారు కాలనీలు స్వల్ప వ్యవధిలోనే విస్తరించాయి. ఒకటి కాదు రెండు కాదు ఏకంగా 150కి పైగా మురికివాడలు పదేళ్ళలో వెలిశాయి. అయితే ఆయా మురికివాడల్లో మౌలిక సదుపాయాలు కల్పించడంలో మొదట్లో నగరపాలకసంస్థ వైఫల్యం చెందింది. కమిషనర్ ప్రవీణ్ ప్రకాష్ బాధ్యతలు చేపట్టేనాటికి మురికివాడలలో నామమాత్రంగా కూడా అభివృద్ధి పనులు నోచుకోలేదు. స్లమ్ డెవలప్‌మెంట్ కోసం ప్రవీణ్‌ప్రకాష్ తపించేవారు. అయితే నిధుల కొరత సమస్య ఆయనకు అడ్డుపడింది. అయినప్పటికి శ్రమదానం వంటి కార్యక్రమాలతో మురికివాడలలో గ్రావెల్‌రోడ్లు, కచ్చాడ్రెయిన్లు ఏర్పాటు చేయించారు.



ఏపియూఎస్‌పి నిధులతో నిర్మాణం చేసిన సిమెంటు రోడ్డు

ఈ నేపథ్యంలో మురికివాడల అభివృద్ధి కోసం నిధులు ఇవ్వడానికి 'డిపార్టుమెంటు ఫర్ ఇంటర్నేషనల్ డెవలప్‌మెంట్ సంస్థ' ముందుకొచ్చింది. సంస్థ ప్రతినిధులను మెప్పించడంలో అప్పటి నగర మేయర్ చుక్కా ఏసురత్నం, కమిషనర్ ప్రవీణ్‌ప్రకాష్ ఎంతో కృషి చేశారు. డిఎఫ్ఐడి బృందాన్ని మురికివాడలకు తీసుకెళ్ళి వాస్తవ పరిస్థితులను విడమరచి చెప్పారు. బృందం ప్రతిస్పందించేలా చేశారు. ఆ కృషి ఫలితమే ప్రస్తుతం నగరంలోని పలు మురికివాడలు అనుభవిస్తున్నాయి. ప్రవీణ్ ప్రకాష్ బదిలీ అయ్యేనాటికి ఏపియూఎస్‌పి బేసిక్ మ్యాప్ ప్రతిపాదనలు ఒక కొలిక్కి వచ్చాయి. నిధులు మంజూరు అయ్యే సమయంలో ఆయన బదిలీ అయ్యారు. ఆ తరువాత బాధ్యతలు తీసుకొన్న కమిషనర్ రామనారాయణ రెడ్డి ఏపియూఎస్‌పి పనులను వేగవంతంగా అమలు చేయించేందుకు గాను ఇంజనీర్లతో ప్రత్యేక విభాగాన్ని ఏర్పాటు చేశారు. బేసిక్ మ్యాప్ కింద తొలి విడతగా ఆన్‌సైట్ వర్క్సులకు రూ. 3.40 కోట్లు, ఆఫ్‌సైట్ వర్క్సులకు రూ. 2.70 కోట్లు నిధులు మంజూరు అయ్యాయి. ఆన్‌సైట్ నిధులతో మొత్తం 12 మురికివాడల్లో సిమెంటు రోడ్లు, కాలువలు, మంచినీటి సదుపాయాలు, వీధిలైట్లు వంటి సౌకర్యాలు సమకూర్చిపెట్టి ప్రజల జీవితాలలో నిజమైన వెలుగులను ప్రసరింప చేశారు.

ఆఫ్‌సైట్ కింద నిలిచిపోయిన పీకలవాగు అవుట్‌ఫాల్ డ్రెయిన్‌లో కొంత భాగం, తక్కెళ్ళపాడు హెడ్ వాటర్ వర్క్స్ నుంచి 1200 ఎం.ఎం ప్రీస్ట్రెస్ట్ ఎడ్ కాంక్రీట్ పైపులైను నిర్మాణాన్ని పూర్తి చేశారు. వీటి వలన నగరంలోని సుమారు రెండున్నర లక్షల మందికి ప్రయోజనం చేకూరింది. పుష్కలంగా మంచినీరు సరఫరా చేసేందుకు వెసులుబాటు కలిగింది. అవుట్‌ఫాల్ డ్రెయిన్ నిర్మాణం వలన కోబాల్‌పేట, దేవాపురం తదితర ప్రాంతాలలో పీకలవాగు ముంపు ప్రమాదం తప్పింది. బేసిక్ మ్యాప్‌ను సమర్థవంతంగా అమలు చేసి రాష్ట్రంలోనే గుంటూరు కార్పొరేషన్ ప్రథమ స్థానంలో నిలిచింది. అదే స్ఫూర్తితో సి-మ్యాప్ ప్రతిపాదనలు సిద్ధం చేసిన కార్పొరేషన్ ప్రస్తుతం ఆ మ్యాప్‌లో కూడా ముప్పావు శాతం పనులను పూర్తి చేసింది. సి-మ్యాప్ కింద ఆన్‌సైట్ గ్రాంటు రూ. 5.90 కోట్లు, ఆఫ్‌సైట్ గ్రాంటు రూ. 2.10 కోట్లు మంజూరు అయ్యాయి.

ఆన్‌సైట్ గ్రాంటుతో మురికివాడలు అయిన జోసఫ్‌నగర్, మహాత్మా గాంధీనగర్, సుబ్బారెడ్డినగర్, రామ్‌రహీమ్ కాలని, గొర్రెల మండి, నల్లకుంట వంటి కాలనీలు సమూలంగా అభివృద్ధి చెందాయి. ఆఫ్‌సైట్ కింద పీకలవాగు అవుట్‌ఫాల్‌డ్రెయిన్‌లో కొంతభాగం, సంగం జాగర్లమూడి వాటర్‌వర్క్స్‌లో యంత్రాల మార్పులను చేశారు. వీటివల్ల సుమారు రెండు లక్షల మంది ప్రజలకు ప్రయోజనం కలుగుతుందని అంచనా వేశారు. ఏపియూఎస్‌పి మూడో దశ కింద రూ. 14 కోట్ల నిధులు ఇప్పటికే మంజూరు అయ్యాయి. వీటిలో రూ. 8 కోట్ల నిధులను ఆన్‌సైట్ వర్క్సులకు, రూ. 6 కోట్ల నిధులను ఆఫ్‌సైట్ వర్క్సులకు వినియోగించాలని నిర్ణయించారు. ఆయా పనులకు శంకుస్థాపన కార్యక్రమాలు కూడా జరిగాయి. ఈ దఫా మొత్తం 20 కాలనీలకు లబ్ధి చేకూరుతుంది. నిధుల కొరతతో సతమతమవుతున్న నగరపాలక సంస్థకు ఏపియూఎస్‌పి నిధులు ఎంతగానో ఆదుకున్నాయి.












# ప్రగతి పథంలో పది వసంతాలు పూర్తిచేసుకున్న నగరపాలక సంస్థ

(ఆన్‌లైన్, గుంటూరు)

గుంటూరు నగరపాలకసంస్థ దిన దినం ప్రవర్ధమానం చెందుతూ ప్రగతి పథంలోకి దూసుకెళ్తోంది. అభివృద్ధిని ఒక ప్రాంతానికే పరిమితం కానీయకుండా నగరాన్ని సమూలంగా అభివృద్ధి పరచడంలో అటు అధికార, ఇటు పాలకవర్గాలు నిర్మాణాత్మక పాత్రను పోషిస్తున్నాయి. స్థానిక వనరులతో పాటు జాతీయ, అంతర్జాతీయ సంస్థల ద్వారా నిధులు సమకూర్చుకుంటూ రాష్ట్రంలోని ఇతర కార్పొరేషన్‌లకు ఆదర్శప్రాయంగా నిలుస్తోంది. ఏటా రూ. 120 కోట్ల అంచనా బడ్జెట్‌తో అభివృద్ధితో పాటు ఎన్నో సంస్కరణలను ప్రజల చెంతకు చేరుస్తోంది. అభివృద్ధే కాకుండా విలువైన ఆస్థులను సమకూర్చుకుంటూ నగర ప్రజలు ఆశించిన విధంగా పాలనను అందజేస్తూ మెప్పు పొందుతోంది. కార్పొరేషన్‌గా ఆవిర్భవించి దశాబ్దకాలాన్ని పూర్తి చేసుకున్న గుంటూరు నగరం ఈ పదేళ్ళ కాలంలో ఏకంగా రూ. 300 కోట్ల నిధులను రోడ్లు, మంచినీరు, కాలువలు, వీధి లైట్లు, పార్కులు, అండర్‌గ్రౌండ్ డ్రైనేజీ, క్రీడా ప్రాంగణాలు వంటి మౌలిక సదుపాయాలను ప్రజలకు కల్పించింది.



కార్పొరేషన్ కార్యాలయం

గుంటూరు పట్టణ ఘనచరిత్ర ప్రస్తుతం నగరంలో నివాసం ఉంటున్న చాలామందికి అంతగా అవగాహన ఉండదు.

అంతెందుకు పురపాలక సంఘం నుంచి కార్పొరేషన్ హోదాకు ఎదిగి పది సంవత్సరాలు అయిన విషయం పాలకులకే తెలియదంటే ఆశ్చర్యం కలగకమానదు. గుంటూరు 1866వ సంవత్సరంలో పురపాలక సంఘంగా ఆవిర్భవించింది. దేశ స్వాతంత్ర్యం వచ్చిన 30 సంవత్సరాలకు పట్టణాన్ని కార్పొరేషన్‌గా మార్చాలన్న ప్రతిపాదన తొలి సారిగా ప్రభుత్వానికి చేరింది. సుమారు ఇరవై సంవత్సరాల పాటు ఆ ప్రతిపాదన ప్రభుత్వం వద్ద నలిగిన తరువాత 1994 ఆగస్టు 18వ తేదీన గుంటూరు పట్టణానికి నగరపాలక సంస్థ హోదాను కల్పిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఆ మరుసటి రోజు నుంచే ప్రభుత్వ ఉత్తర్వులు అమలులోకి వచ్చాయి. అంటే పురపాలక సంఘం నుంచి కార్పొరేషన్ స్థాయికి ఎదగడానికి 128 సంవత్సరాల వ్యవధి పట్టింది. కార్పొరేషన్ ఆవిర్భావం అనంతరం ఏడు నెలలకు తొలిసారిగా పాలక వర్గానికి ఎన్నికలు జరిగాయి. తొలి మేయర్‌గా డాక్టర్ కొల్లి శారద, డిప్యూటీ మేయర్‌గా మద్దిరాల రాజేశ్వరరావు ఎన్నికయ్యారు. అనంతరం 2000లో తిరిగి రెండో పాలకవర్గ ఎన్నికలు జరగగా మేయర్‌గా చుక్కా ఏసురత్నం, డిప్యూటీ మేయర్‌గా సూర్యదేవర రాజేంద్రప్రసాద్ ఎన్నుకోబడ్డారు. 2005 సెప్టెంబరులో జరిగిన మూడో పాలకవర్గ ఎన్నికలు పరోక్ష పద్ధతిలో జరిగాయి. మేయర్‌గా 23వ వార్డు నుంచి కార్పొరేటర్‌గా ఎన్నికైన రాష్ట్ర సహకార శాఖ మంత్రి కన్నా లక్ష్మీనారాయణ తనయుడు నాగరాజు మేయర్ పీఠాన్ని అతి చిన్న వయస్సు(26)లోనే అధిరోహించారు. డిప్యూటీ మేయర్‌గా గుంటూరు-2 ఎమ్మెల్యే తాడిశెట్టి వెంకటరావు సోదరుడు మురళీమోహన్ ఎన్నికయ్యారు. పాలకవర్గ సభ్యునిగా రావుల వెంకట సత్యనారాయణ మూడు పాలకవర్గాలకు ఎన్నికవ్వడం విశేషం.


డాక్టర్ కొల్లి శారద | చుక్కా ఏసురత్నం | కన్నా నాగరాజు

## కార్పొరేషన్ ఆస్తులు

గత పదేళ్ళలో నగరపాలకసంస్థ ప్రజలకు ఉపయోగపడే ఎన్నో ఆస్థులను సమకూర్చుకోగలిగింది. అందులో ప్రధానంగా ఎన్‌టిఆర్ మానస సరోవరం, ఎన్‌టిఆర్ క్రీడాప్రాంగణం, స్విమ్మింగ్ పూల్‌లను ప్రధానంగా ప్రస్తావించవచ్చు. ప్రజలకు ఆహ్లాదాన్ని పంచిచ్చే ఈ మూడింటి కోసం సుమారు రూ. మూడు కోట్ల నిధులను కార్పొరేషన్ వెచ్చించింది.

ఉడా ఆధీనంలో ఉన్న మానస సరోవరంను స్వాధీనం చేసుకొనేందుకు రూ. 1.50 కోట్లు నిధులను నగరపాలక సంస్థ ఖర్చు చేసింది. సందర్శకులకు పలు విధాల ఆహ్లాదాన్ని పంచిస్తున్న మానససరోవరం ఇతర జిల్లాల ప్రజలకు సందర్శక ప్రదేశంగా మారుతోంది. క్రీడా సదుపాయాలు లేక సుదూర ప్రాంతాలకు వెళ్తున్న క్రీడాకారుల కోసం గత ఐదు సంవత్సరాల క్రితం ఎన్‌టిఆర్ క్రీడా ప్రాంగణాన్ని పాలకవర్గం అభివృద్ధి పరచింది. నగరంలోని అన్ని ప్రాంతాల ప్రజలకు ఇది ఎంతగానో దోహద పడుతోంది. వాకింగ్, రన్నింగ్, బాస్కెట్ బాల్, స్కేటింగ్, వెయిట్ లిఫ్టింగ్, షటిల్ బ్యాడ్మింటన్, జిమ్, స్టీం బాత్ వంటి అత్యాధునిక క్రీడా సదుపాయాలను స్టేడియంలో సమకూర్చారు. ఇంత పెద్ద నగరంలో స్విమ్మింగ్ పూల్ సదుపాయం గతంలో ఉండేది కాదు. దీనిని దృష్టిలో పెట్టుకున్న పాలకవర్గం పట్టాభిపురంలో అధునాతన సదుపాయాలతో స్విమ్మింగ్ పూల్‌ను ఆదర్శవంతంగా అభివృద్ధి చేసి తీర్చిదిద్దింది. తాజాగా వెన్‌లాక్ మార్కెట్, రెడ్ ట్యాంక్ షాపింగ్ కాంప్లెక్స్‌లు కూడా కార్పొరేషన్‌కు విలువైన ఆస్తులుగా మారనున్నాయి.

# సీసాల్లో వ్యవసాయ పనిముట్లు అమర్చడంలో నేర్పరి.. శ్రీరాములు

(ఆన్‌లైన్, వినుకొండ రూరల్)
కృషి, పట్టుదల ఉంటే వయస్సు, విద్యతో సంబంధం లేకుండా ఏరంగం లోనైనా నైపుణ్యం సాధించవచ్చని నిరూపిస్తున్న వృద్ధుని ఉదంతమిది. వినుకొండ మండలం వేల్పూరు గ్రామానికి చెందిన గుత్తా శ్రీరాములు (80) అనే వృద్ధుడు అక్షరజ్ఞానం లేకుండా గాజుసీసాల్లో వ్యవసాయపని ముట్లు అద్భుతంగా సృష్టిస్తున్నాడు. నూలు అల్లకంతో దేవుడు బొమ్మలు తయారుచేయడంలో సిద్ధహస్తుడు. సీసాల్లో నాగలి, ఆరుచెక్క, నాలుగు, మూడుచెక్కల గొర్రులను, మెట్ట,మా గాణిభూముల్లో దున్నే రెండురకాల నాగళ్ళను చెక్కతో తయారుచేసి అమ రుస్తాడు. సున్నంతో ఎద్దులను, నాలు


తానుసేసిన చర్నాకోలాతో శ్రీరాములు

గు గానుల రథం అచ్చం టైరుబండిని పోలిన విధంగా కళాత్మకంగా ఉండి చూసేవారిని ఇట్టే ఆకట్టుకుంటుంది. అన్నిటికంటే క్లిష్టతరమైన శరాబండి చిక్కు (నిలువు కడ్డీకి ఆరు అడ్డుపుల్లలు ఉండడం)ను సీసాలో అమర్చిన తీరు చూసి ఆ వృద్ధుడి పనితనానికి అబ్బుర పడాల్సిందే. గణితంలో ఆయన వేసే నోటి లెక్కలకు సంబంధిత సబ్జెక్టుల్లో డిగ్రీలు చేసినవారు సైతం తగిన సమాధానం ఇవ్వలేదనడంలో అతిశయోక్తి లేదు. తాను తయారుచేసిన వస్తువులను పదిమందికి తెలియపర్చడం అంటే ఆయనకు ఎంతో సరదా. వృద్ధుడు తన కళాఖండాలను గతంలో జరిగిన పలు జన్మభూమి సదస్సుల్లో ప్రదర్శించాడు. తనకు ప్రభుత్వం వృద్ధాప్యపు పెన్షన్‌ను మంజూరు చేసిందని, తనను కళాకారుడిగా గుర్తించి కళాకారుల కోటాలో పెన్షన్ వచ్చేలా ప్రజాప్రతినిధులు, అధికారులు చేస్తే తన విద్యను పదిమందికి తెలియపరిచే విధంగా ఏర్పాటుచేస్తానని ఆయన తన మనోభావాన్ని తెలిపారు.


సీసాల్లో పరికరాలతో శ్రీరాములు

# పేదవారికి నీడ కల్పించడమే గృహ నిర్మాణ సంస్థ ధ్యేయం



డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
సహకార శాఖామంత్రి



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి



పారిశుద్ధ్య పనివారికి నిర్మించిన పట్టణ గృహ సముదాయం



శ్రీ కె. జానారెడ్డి
రాష్ట్ర గృహనిర్మాణ శాఖా మంత్రి



శ్రీ రాజేశ్వరరావు
రాష్ట్ర గృహనిర్మాణ సంస్థ ఛైర్మన్



శ్రీమతి జి. జయలక్ష్మి
జిల్లా కలెక్టర్



రాజీవ్ గృహకల్ప సముదాయం

మన గుంటూరు జిల్లా వంద సంవత్సరములు పూర్తి చేసుకున్న శుభసందర్భంగా గుంటూరు జిల్లా ప్రజలకు శుభాభివందనములు. ఈ సుదీర్ఘ పయనంలో జిల్లా అన్ని రంగాలలో ఎంతో అభివృద్ధి సాధించింది. ఈ అభివృద్ధికి పాటుపడిన ప్రతి ఒక్కరి కృషి అభినందనీయం.

**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ, గుంటూరుజిల్లా 2005-2006 ఆర్థిక సంవత్సరములో యిప్పటి వరకు కేటాయించిన గృహముల వివరములు**

| వరుస సంఖ్య | పథకము పేరు | కేటాయించిన గృహములు | గృహముల విలువ (రూ॥లలో) | | | | మొత్తము గృహముల విలువ (లక్షల్లో) |
|---|---|---|---|---|---|---|---|
| | | | సబ్సిడీ | ఋణము | లబ్ధిదారుని వాటా | మొత్తం | |
| 1. | గ్రామీణ శాశ్వత గృహ నిర్మాణ పథకము | 19,703 | 7,000 | 17,500 | 500 | 25,000 | 4925.75 |
| 2. | ఇందిరా ఆవాస్ యోజన | 12397 | 25,000 | - | - | 25,000 | 3099.25 |
| 3. | సునామి | 3209 | 20,000 | 17,500 | 2,500 | 40,000 | 1283.60 |
| 4. | మత్యకారుల గృహనిర్మాణం | 800 | 7,000 | 17,500 | 500 | 25,000 | 200.00 |
| 5. | పట్టణ శాశ్వత గృహ నిర్మాణ పథకము | 12870 | 3,000 | 35,000 | 2,000 | 40,000 | 5148.00 |
| 4. | రాజీవ్ గృహ కల్ప | 9460 | - | 67,500 | 7,500 | 75,000 | 7095.00 |
| | | 58,439 | | | | | 21751.60 |

జిల్లాలో దారిద్ర్య రేఖకు దిగువున వున్న పేదవారందరికీ నీడ కల్పించడమే గృహనిర్మాణ సంస్థ ధ్యేయం. దానిలో భాగంగానే జిల్లాలో ప్రతి సంవత్సరం సుమారు 50 వేల మందికి నీడ కల్పిస్తున్నది. ఈ సంవత్సరం జిల్లాలో గృహ నిర్మాణ సంస్థ చేపట్టిన గృహ నిర్మాణ పథకాలు ఈ విధంగా ఉన్నాయి.



**వి. శరత్‌బాబు**
జిల్లా మేనేజర్
ఆం.ప్ర. రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ, గుంటూరు

# వేదవేదాంగ కోవిదుడు 'ఆచార్య నాగార్జునుడు'

(ఆన్‌లైన్, ఆచార్య నాగార్జున యూనివర్శిటీ)

ఆచార్య నాగార్జునుడు బహుముఖ ప్రజ్ఞాశాలి, వేదవేదాంగ విదుడని సుప్రసిద్ధ చైనా యాత్రీకుడైన హ్యూయాన్‌సాంగ్ పేర్కొంటూ అతడు ప్రపంచానికి వెలుగు ప్రసాదించిన నాలుగు జ్యోతుల్లో ఒకడని అభివర్ణించాడు. అగాధమైన ఆలోచనకు, ఆధ్యాత్మిక అంతర్దృష్టికి అద్వైత ధర్మప్రవక్తయైన శంకరుడికి సాటియైనవాడు నాగార్జునుడు.




ప్రపంచంలో ప్రఖ్యాతులైన మహా మేధావులు చాలా మందికి వలె నాగార్జునుని పుట్టు పూర్వోత్తరాలు కాని, తల్లిదండ్రుల వివరాలు కాని బాగా తెలియవు. తెలియవచ్చే వివరాలు అస్తవ్యస్తంగా వున్నాయి.

దక్షిణాపథంలోని ఒకానొక బ్రాహ్మణ కుటుంబంలో అతడు జన్మించాడనవచ్చు. కొందరు పండితులు అతడు 'వేదవి'లో జన్మించాడంటున్నారు. ఆ వేదవిని కొందరు 'విదేహ' అని, కొందరు 'విదర్భ' అని అన్నట్లు కొన్ని టిబెట్టు గ్రంథాలద్వారా తెలుస్తున్నది.

ఆచార్యుని తల్లి అర్జున వృక్షం (మద్ది చెట్టు) కింద ప్రసవించటం వల్లనూ, అటు తర్వాత నాగుల ఆదరణ పొంది (జయించి) మహాయాన సాహిత్యమందుకోవటం వల్లనూ 'నాగార్జును'డయ్యాడని చైనీయుల అభిప్రాయం. శాపవశాన మద్దిచెట్టు తొర్రలో సర్పరూపంలో వున్న నరేంద్రజిత్తు 'నాగార్జును'డయ్యాడంటుంది నవనాథ చరిత్ర.

గుంటూరు జిల్లాలో నేటి ప్రపంచ ప్రసిద్ధిగాంచిన నాగార్జున కొండ బౌద్ధ కేంద్రానికి పూర్వము శ్రీపర్వతమనే పేరుండేది. ఆచార్య నాగార్జునుడు క్రీ.శ. రెండవ శతాబ్దంలో ఇక్కడ నివసించడం వలన దీనికి నాగార్జున కొండనే పేరు వచ్చింది. భారతదేశ బౌద్ధ క్షేత్రాలలోకెల్లా నాగార్జున కొండ ప్రపంచ ప్రఖ్యాత విజ్ఞాన కేంద్ర నిధిగా ప్రఖ్యాతి గాంచింది. ఆచార్య నాగార్జునుడు ఇచట బౌద్ధ విశ్వవిద్యాలయాన్ని స్థాపించి మహోన్నత దశకు తీసుకువచ్చాడు. ఈ విద్యాలయంలో ఆంధ్ర శిల్పకళ, తర్కము, విదేశ భాషలు, భౌగోళిక శాస్త్రము, ఆయుర్వేద వైద్యము, రసవాదం, జీవం పోసుకున్నాయి. ఈయన మహాయాన మాధ్యమిక వాదాన్ని సూచించాడు. భారతదేశ నలు దిక్కుల నుంచి ఆచార్యుని సన్నిధిని తత్వ రహస్యాన్ని గ్రహించడానికి జిజ్ఞాసువులు ఇక్కడకు వచ్చారు. ఇతర దేశాల వారు కూడా తమ విద్యార్థుల కొరకు విహారాలను కట్టించి పోషించారు.

క్రీస్తు శకం 5వ శతాబ్దంలో కుమార జీవుడు నాగార్జునుని జీవిత చరిత్ర చైనా భాషలోకి అనువదించాడు. నాగార్జునుడు పుట్టుకతో దాక్షిణాత్య బ్రాహ్మణుడు. ఈతడు నాల్గు వేదాలు, సర్వశాస్త్రాలు క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. అణిమాది, అష్టసిద్ధులు సంపాదించాడు. శ్రీపర్వతంలో నివాసమేర్పరుచుకుని అక్కడ బౌద్ధ విశ్వవిద్యాలయం నెలకొల్పి ధరణికోట మహాస్తూప ప్రాకారాలు జీర్ణస్థితిలో వుంటే పునర్నించాడంటారు. నాగార్జునుడు వైద్యశాస్త్ర పారంగతుడు. ఆ నైపుణ్యంతోనే ప్రజలకు సేవ చేసి వారి అనురాగం పొందాడు. ఈయన కాలంనాటికి మహాయానం తీవ్ర విమర్శకు గురైంది. ధర్మానికి తప్ప మరొక లౌకిక శక్తికి తలొగ్గే స్వభావం నాగార్జునునికి లేదని రత్నావళి స్పష్టంగా తెలిపింది. ప్రపంచ చరిత్రలో మొట్టమొదటిసారిగా శిక్షాస్మృతి నుంచి మరణదండనను తొలగించాలని ఆచార్య నాగార్జునుడు ప్రచారం చేశాడు. మత ప్రసక్తి లేని పరిపాలనను అతడు ప్రచారం చేశాడు. ఈయన సంస్కృత వాఙ్మయంలో కూడా కొత్త పద్ధతులను ప్రవేశపెట్టాడు. ఇక్కడ బౌద్ధ నిర్మాణమునందు బౌద్ధ భిక్షువులకు విరామ స్థలాలను ఏర్పరచి, విద్యాభ్యాసానికి వసతులను అభివృద్ధి పరిచారు. ఇది నిరాడంబర జీవితానికి, మహోన్నత జ్ఞానానికి నెలవైంది. దక్షిణ భారతదేశంలోనే ప్రఖ్యాతిగాంచిన విశ్వవిద్యాలయం. ఉత్తర భారతదేశంలోనే ప్రఖ్యాతిగాంచిన నలంద విశ్వవిద్యాలయం వలె ఇది కూడా ప్రఖ్యాతిగాంచింది. ఇక్కడకు చైనా, టిబెట్, కాశ్మీర్, గాంధర, సిలోన్ మొదలగు ప్రాంతాల నుంచి పండితులు వచ్చినట్టు ఇక్ష్వాకుల కాలంనాటి శాసనాధారాలున్నాయి. ఆచార్య నాగార్జునుడు జీవిత, ధర్మసందేశాన్ని ఇచ్చి ఆత్మవికాసాన్ని పెంపొందించాడు.

ఆనాటి విశ్వవిద్యాలయపు కట్టడాలను నాగార్జునసాగర్ సరస్సు కింద మునిగిపోకుండా రక్షించే నిమిత్తం వాటిని అనువు ప్రాంతానికి తరలించి రక్షితప్రాంతంగా ప్రకటించడం జరిగింది.

మహాయాన శాఖ ఔన్నత్యానికి ఎంతో కృషిసల్పిన నాగార్జున మహోదయుని జీవితం ద్విముఖాలుగా గోచరిస్తుంది. అందులో ఒకటి నాగార్జునుడు గొప్ప తాత్త్వికుడు, మహిమోపేతుడు. ఇతనిలో హిందూ బౌద్ధధర్మాల సమన్వయ స్వరూపం ప్రస్ఫూటమౌతుంది. భారతీయ పరిమిత తత్త్వశాస్త్ర పరిమితులన్నింటిలో ఇతడు మహోత్వ పటుత్వంగల ప్రజ్ఞామూర్తిగా ప్రత్యక్షమవుతాడు. రెండవది మహాయాన కార్యకలాపాలన్నింటికి మారుపేరు నాగార్జునుడు. తచ్ఛాఖాభ్యుదయ భాస్కరుడితడు. ఇటువంటి బహుముఖ ప్రజ్ఞాశాలి పేరున 'ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం' రూపొందటం అభినందనీయమే!.

### నందమూరి

\--------

సీ. పుణ్యపుర్షుల గన్న పురిటాంధ్ర తల్లికి
నటరత్న యొక్కడే నందమూరి
సకలాంధ్ర జనులకై నిఖిలాంధ్ర నటకుడై
తెనుగు తెరలనింపె దిశల కెగసి
భవితాంధ్ర బాగుకై బంగారుబాటల
తీర్చిదిద్దెను రాజ తీర్పునిచ్చి
ఆంధ్రనాల్గు చెరగులణగారి బ్రతికెడు
పేద హృదయులకు ప్రియతముండు
తెలుగుభాషకు పూర్తితేజాన్ని సమకూర్చి
గడపలెక్కించిన ఘనుడితండు.
పూర్వజన్మఫలము భువనైక సొగసుల
వసుధ కేతెంచిన- వరప్రసాది.

తే.గీ. తెలిసి కలియుగ నటులందు కలిసి మెలిసి
సకల పాత్రలరూపాల శకలుజూపి
ఆడిపాడిన సుజనాంధ్ర అందగాడు
రమ్యగుణధామ తారక రామనామ.

### రైతన్న

\----

సీ: దున్నరా రైతన్న దున్నరా యీదుక్కి
డొక్కలెండిన దున్నలెక్కగట్టి
దులపరా యెరువును తొలకరి జల్లొచ్చె
చెత్తాచెదారము. చేను నిండ.
పన్నరానాగలి పగ్గాలు సరిజేసి
తడిసి యెండిన తాళ్ళముడులు గట్టి
కదలరా నీభూమి కండ్లార నినుగాంచ
మరులతో పిలిచింది. మమత కదిలి.

ఆ.వె. రైతుభూమి దున్ని రాజాన్న పంటను
దేశ ప్రజల కొరకు దాచిపంచు
తనకు తిండిలేదు. దైవమే దయ్యమై
తరుముచుండె నేడు. పరమపురికి

-దుబ్బలదాసు

# రైతు ఉద్యమ నేత ఆచార్య రంగా

(ఆన్‌లైన్-పొన్నూరు)

ప్రపంచరైతు ఉద్యమ నిర్మాతల్లో ప్రముఖుడు, పార్లమెంటు పితామహుడు, రాజనీతి కోవిధుడుగా గణతికెక్కిన గిన్నీస్ బుక్ రికార్డు హోల్డర్ ఆచార్య ఎన్.జి.రంగా, రాష్ట్ర ప్రజలకే గాక, భారత దేశానికి గర్వకారకులని చెప్పవచ్చు... గుంటూరుజిల్లా నిడుబ్రోలు గ్రామంలో 1900 సంవత్సరం నవంబరు ఏడవ తేదీన గోగినేని నాగయ్య, అచ్చమాంబ దంపతులకు జన్మించిన రంగనాయకులు కాలక్రమంలో ఆచార్య రంగాగా పేరు ప్రఖ్యాతులు నొందారు. ప్రాథమిక విద్యాభ్యాసం నుండి చురుకైన విద్యార్థిగా పేరొందిన రంగా 20సంవత్సరాల వయస్సులో పై చదువుల కోసం ఇంగ్లాండుకు వెళ్ళి ప్రతిష్టాత్మకమైన ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో చేరాడు. యూనివర్సిటీ తరపున భారతదేశ ఆర్థిక పరిస్థితులపై పరిశోధనలు సాగించారు. 1923లో స్వదేశానికి తిరిగివచ్చి చేనేత కార్మికుల జీవితాలు, రంగు జాతుల(వలసదేశాలు) ప్రజల సాంఘీక, ఆర్థిక, రాజకీయ సమస్యలపై పరిశోధనాత్మక గ్రంథాలను రచించారు. ఆ తదుపరి కాంగ్రెస్‌పార్టీ వైపు ఆకర్షితులై పార్టీ కార్యక్రమాల్లో చురుకుగా పాత్రను పోషించారు. 1924లో భారతీదేవితో వివాహం అనంతరం మద్రాసు పచ్చయప్ప కళాశాలలో అధ్యాపకునిగా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించారు. ఆతర్వాత మద్రాసు ఆర్థిక సలహాదారునిగా పనిచేశారు. ఆ సమయంలో దేశంలో ఉధృతంగా వున్న స్వాతంత్రోద్యమ పవనాలు రంగాజీని తాకాయి. ఈ నేపథ్యంలో ఉద్యోగాన్ని తృణప్రాయంగా త్యజించిన రంగా స్వాతంత్రోద్యమంలోకి దూకారు. జవహర్‌లాల్ నెహ్రూ, నేతాజీ సుభాష్ చంద్రబోసలతో సన్నిహితంగా మెలుగుతూ స్వాతంత్ర సంగ్రామంలో విజృంభించిన రంగాజీని 1930లో బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేయించింది. అరెస్టుకు బెదరని రంగా ఆనాడు రైతులు ఎదుర్కొంటున్న దుర్భర ఆర్థిక మాంద్య పరిస్థితులకు వ్యతిరేకంగా రైతు రుణ విముక్తి ఉద్యమాన్ని ప్రారంభించి జిల్లా కలెక్టర్ కార్యాలయాలను రైతులచే ముట్టడింపజేశారు. ఆ ఉద్యమం ఫలితంగానే బ్రిటిష్ ప్రభుత్వం రైతుల రుణాల పై 'మారటోరియాన్ని' ప్రకటించింది. ఆ ఉద్యమం విజయం ఇచ్చిన స్ఫూర్తితో రైతు సమస్యలు ఎక్కడ వుంటే రంగా అక్కడ ప్రత్యక్షమై ఉద్యమాలను నిర్వహించనారంభించారు. ఈ నేపథ్యంలోనే 1934లో ఆచార్య ఎన్.జి.రంగా రైతుల ప్రతినిధిగా పార్లమెంటుకు ఎన్నికయ్యారు. ప్రపంచంలో కెల్లా సుదీర్ఘకాలం పార్లమెంటు సభ్యునిగా కొనసాగిన ఘనతను పొందిన ఎన్.జి.రంగా ప్రపంచ రాజకీయ చరిత్రలో తనదైన రికార్డును సాధించి గిన్నీస్ బుక్‌లోనికి ఎక్కారు. 1942లో జరిగిన క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో కొన్నేళ్ళు జైలు జీవితాన్ని, మరికొన్నేళ్ళు అజ్ఞాత జీవితాన్ని ఆయన గడిపారు. 1947లో దేశానికి స్వాతంత్ర్యం లభించిన తదుపరి కాంగ్రెస్ నాయకులతో విభేదించిన రంగా కాంగ్రెస్‌పార్టీకి రాజీనామా చేసి 1950లో టంగుటూరి ప్రకాశం పంతులుతో కలసి కృషికార్‌లోక్ పార్టీని స్థాపించారు. దేశ ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ జోక్యంతో 1955లో తిరిగి కాంగ్రెస్ చేరిన రంగా మళ్ళీ 1958లో కాంగ్రెస్ నుండి విడిపోయారు. కొంత కాలం స్వతంత్రపార్టీలో కొనసాగిన రంగాజీ ఇందిరాగాంధీ ప్రకటించిన గరీబీ హఠావో నినాదానికి ఉత్తేజితులై తిరిగి కాంగ్రెస్‌పార్టీలో చేరారు. మొదటి నుండి పార్లమెంటు సభ్యునిగా ఎన్నికవుతూ వచ్చిన రంగా 1977లో రాజ్యసభ సభ్యునిగా ఎంపికయ్యారు. సుదీర్ఘమైన రాజకీయ జీవితంలో రంగాజీ ఏనాడూ పదవులను ఆశించలేదు. అత్యున్నతమైన పదవులను చేపట్టే అవకాశాలు వచ్చినా తృణప్రాయంగా త్యజించారు. 1982లో పార్లమెంటరీ జీవిత మహోత్సవాలు (డైమండ్ జూబ్లీ సెలబ్రేషన్స్)ను పార్లమెంటు హాలులో ఘనంగా జరిపించుకొన్న రంగా, భారత ప్రభుత్వం నుండి పద్మవిభూషణ, జపాన్ ప్రభుత్వం నుండి 'ఒసాకా' అవార్డులను అందుకొన్నారు. 95సంవత్సరాల వయస్సు వరకు జీవించిన ఆచార్య ఎన్.జి.రంగా 1995వ సంవత్సరం జూన్ ఎనిమిదవ తేదీన నిడుబ్రోలులోని స్వగృహం 'గోభూమి'లో తుదిశ్వాస విడిచారు. రంగాజీ మృతితో భారతదేశం మహోన్నత నాయకుని కోల్పోయిందని జాతీయ, అంతర్జాతీయ స్థాయి నాయకులు తమ సందేశాల్లో పేర్కొన్నారు.నిడుబ్రోలులో జన్మించి అంతర్జాతీయ స్థాయిలో పేరెన్నికగన్న ఆచార్య ఎన్.జి.రంగా సదాస్మరణీయుడు.





## ఆంధ్రరాష్ట్ర అవతరణ శుభాకాంక్షలతో

# సర్వశిక్షా అభియాన్, గుంటూరు జిల్లా

## వివిధ కార్యక్రమాల నిర్వహణ - సాధించిన ప్రగతి

### రేడియో కార్యక్రమాలు :

విందాం నేర్చుకుందాం ద్వారా 3, 4, తరగతుల బాలికలు మరియు విందాం చదువుకుందాం ద్వారా బడి బయట పిల్లలకు రేడియో ద్వారా పాఠ్యాంశముల బోధన.

### ప్రత్యేక విద్యా అవసరాల బాలల విద్య :

- 5 రెసిడెన్షియల్ క్యాంపుల ఏర్పాటు ద్వారా ఉచిత ప్రత్యేక విద్య, వసతి కల్పించుట.
- 30 మంది ప్రత్యేక రిసోర్స్ పర్సన్ల నియామకం ద్వారా ప్రత్యేక విద్యా బోధన.
- 10 ఎసెస్ మెంట్ క్యాంపుల నిర్వహణ. అర్హులైన బాలకు ఉచితంగా ట్రైసైకిల్స్, వీల్ ఛైర్స్ కాలిపర్స్, క్లచ్చస్ మరియు వినికిడి పరికరములు అందించి వారిని పాఠశాలల్లో కొనసాగేలా చేయుటం.

### బాలిక విద్య :

- బాలికల కొరకు 5 రెసిడెన్షియల్ బ్రిడ్జి క్యాంపు నిర్వహణ.
- బాలికా స్వశక్తి కార్యక్రమాల అమలు.
- 16 మండలాలు, 9 మున్సిపాలిటీల్లో జాతీయబాలికా విద్య కార్యక్రమం నిర్వహణ.
- 380 కేంద్రాలకు రూ. 5,000/-ల చొప్పున ఆట వస్తువులు పంపిణీ.
- 5 మండలాల్లో 17000 బాల బాలికలకు ఉచిత యూనిఫారముల పంపిణీ.
- 83 మోడల్ క్లస్టర్ పాఠశాలల్లో 7111 మందికి ఉచిత యూనిఫారముల పంపిణీ.
- 83 మోడల్ క్లస్టర్ పాఠశాలల్లో బాలికలకు ఆత్మస్థైర్యము పెంచటం కొరకు 249 సైకిళ్ల పంపిణీ

### పూర్వక ప్రాథమిక విద్యా కేంద్రాలు :

-30 మండలాల్లో 380 కేంద్రలను ఏర్పాటు చేసి వాటికి బోధన సామాగ్రి అందించటం.

### రెసిడెన్షియల్ బ్రిడ్జి క్యాంపులు :

-25 రెసిడెన్షియల్ బ్రిడ్జి క్యాంపుల ఏర్పాటు ద్వారా బడి బయట పిల్లలకు ఉచిత విద్య, భోజన వసతి కల్పించి వారిని రెగ్యులర్ పాఠశాలలలో వారిని చేర్పించటం.



రెసిడెన్షియల్ బ్రిడ్జిక్యాంపు నందు విద్యాబోధన



ఎన్ఆర్‌బిసి వృత్తివిద్యా కేంద్రం నందు విద్యతో శిక్షణ పొందుతున్న బాలికలు




మెడికల్ క్యాంపు నందు వైద్యపరీక్షలు నిర్వహిస్తున్న వైద్యులు



పచ్చ ప్రాథమిక విద్యాకేంద్రంలో బాలలు

### నాన్ రెసిడెన్షియల్ బ్రిడ్జి క్యాంపులు :

- బడి బయట బాలికల కొరకు 90 యన్.ఆర్.బి.సి కేంద్రాల ఏర్పాటు ద్వారా 1800 మందికి ప్రయోజనం..

### నాన్ రెసిడెన్షియల్ వృత్తి విద్య కేంద్రాలు :

- బడి బయట బాలల కొరకు 30 యన్.ఆర్.బి.సి వృత్తి విద్యా కేంద్రాల ఏర్పాటు ద్వారా 608 మందికి చదువుతో పాటు వివిధ వృత్తులలో శిక్షణ అందించటం.

### మదరసా కేంద్రాలు :

- 10 మదరసా కేంద్రాల ఏర్పాటు ద్వారా 273 మంది మైనారిటీ బాల బాలికలకు ప్రయోజనం
- ప్రత్యామ్నాయ పాఠశాలలు :
- 15 మండలాల్లో ఒక కిలోమీటరు దూరములో బడి లేని ఆవాస ప్రాంతల్లో 43 ప్రత్యామ్నాయ పాఠశాలల ఏర్పాటు ద్వారా 1195 మందికి ప్రయోజనం.
- ఆదర్శ పాఠశాలలు :
- 57 మండలాల్లో 957 పాఠశాలలకు మౌలిక సదుపాయాలు, వనరులు కల్పించి ఆదర్శ పాఠశాలలుగా అభివృద్ధి పరచుటం.
- బాలల భాషాభివృద్ధి కార్యక్రమము :
- ఈ కార్యక్రమము ద్వారా భాషా గణితములో బాలలకు ప్రత్యేక విద్యాబోధన ద్వారా ప్రగతిని సాధించటం.
- సంచార గ్రంథాలయాలు :
- ప్రయోగాత్మకంగా 5 మండలాల్లో సంచార గ్రంథాలయాలు నిర్వహణ 100 పాఠశాలల విద్యార్థులకు ప్రయోజనం.
- నిర్మాణపు పనులు :
- అవసరమైన పాఠశాలలకు వసతి సౌకర్యం కల్పించుట.

**శ్రీమతి జి.జయలక్ష్మి, IAS**
జిల్లా కలెక్టర్ & ఛైర్‌పర్సన్,
సర్వశిక్షా అభియాన్, గుంటూరు జిల్లా.

**లక్ష్యాలు :** 2006 నాటికి పిల్లలందరిని బడిలో చేర్పించటం. ★ 2007 నాటికి పిల్లలందరు 5 సంవత్సరాల ప్రాథమిక విద్య పూర్తిచేయటం. ★ 2010 నాటికి పిల్లలందరు 8 సంవత్సరాల ఎలిమెంటరీ విద్య పూర్తి చేయటం, ★ సార్వత్రిక నిలకడను సాధించటం

# కాలచక్రకు ముస్తాబవుతున్న అమరావతి

(ఆన్‌లైన్-అమరావతి)

జనవరినెలలో అత్యంత ప్రతిష్టాత్మకంగా అమరావతిలో జరగనున్న 2006 కాలచక్ర మహాసభలకు ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రంగా విరాజిల్లుతున్న అమరావతి-ధరణికోట గ్రామాలు అభివృద్ధి కార్యక్రమాల పనిలో నిమగ్నమై ఉన్నాయి. కాలచక్రకు సంబంధించి మొత్తం వందసీట్లలో అభివృద్ధి జరుగుతుండగా అమరావతిలో సుమారు నలభై కోట్లలో పనులు జరుగుతున్నాయి. అమరావతికి వచ్చే రహదారులు అభివృద్ధికి 24 కోట్లు మంజూరు కాగా రహదారుల పనులు వేగవంతంగా జరుగుతున్నాయి. బౌద్ధులు అత్యంత భక్తి శ్రద్ధతో



కాలచక్ర పూజకు సిద్ధమవుతున్న ధ్యానబుద్ధ నమూనా

జరుపుకునే ఈ కాలచక్ర పూజకు దేశ దేశాలనుంచి సుమారు 15వేల మంది బౌద్ధ బిక్షవులు 1.5 లక్షల మంది యాత్రికులు హాజరవుతారని అధికారుల అంచనా. బౌద్ధుల మతగురువు దలైలామా పర్యవేక్షణలో జరిగే 30వ కాలచక్ర పూజ అమరావతిలో జరుగుతోంది. క్రితంసారి హాంకాంగ్‌లో జరగగా, ఈ సారి అమరావతిని ఎంచుకున్నారు. బౌద్ధమతంలోని వజ్రావన శాఖ ఆధ్వర్యంలో బుద్ధుడు అమరావతిలో కాలచక్ర పూజ ప్రవచించినట్లు బౌద్ధుల నమ్మకం. మేగతంత్రం పంచిన బౌద్ధతంత్రాన్ని కాలచక్ర పూజలో మతపెద్దలు ప్రసంగిస్తారు. ఈ కార్యక్రమానికి సంబంధించి అమరావతిలోని పాద మ్యూజియంలో గల మహాచైత్రము సర్వాంగ సుందరంగా రూపుదిద్దుకోనుంది. దానితో పాటు ఆర్‌డబ్ల్యుఎస్ శాఖ ఆధ్వర్యంలో తాగునీటికి సుమారు 2.5 కోట్లతో సౌకర్యాలు ఏర్పాటు చేస్తున్నారు. పంచాయితీ రాజ్ శాఖ నుంచి కోటి రూపాయలతో గ్రామంలోని అంతర్గత రహదారులు అభివృద్ధి చెందుతున్నాయి. మొత్తం పర్యవేక్షణ దలైలామా ప్రతినిధి బృందం నిర్వహిస్తోంది. కాలచక్రకు ముస్తాబవుతున్న మరో ప్రసిద్ధి కట్టడం ధ్యానబుద్ధ సుమారు 180 అడుగుల ఎత్తులో నిర్మాణం జరుగుతున్న బుద్ధుని విగ్రహం అమలాపురంకు చెందిన శిల్పులు నిర్మిస్తున్నారు.



బౌర్ధులు పూజించే కాలచక్ర మండలం



బౌద్ధమత గురువు దలైలామా

అంతేగాక బౌద్ధమతానికి అమరావతికి ఉన్న ప్రాధాన్యతను బట్టి టూరిజం శాఖవారు కూడా బౌద్ధ మ్యూజియంను, రెస్టారెంట్‌ను నిర్మిస్తున్నారు. కాలచక్రకు హాజరయ్యే యాత్రికులకు మెరుగైన వసతులు కల్పించేందుకు జిల్లాస్థాయి వివిధ శాఖల అధికారులు కృషి చేస్తున్నారు. జనవరిలో రెండు 18 వరకు జరిగే కాలచక్ర పూజ వల్ల ప్రపంచ దేశాల్లో అమరావతి, ధరణికోటల వైభవాన్ని చాటనున్నది.

# ఖాదీ గ్రామీణ పరిశ్రమలను ప్రోత్సహిస్తున్న రాష్ట్ర ప్రభుత్వం


డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి


శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణాశాఖామాత్యులు


శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జిమంత్రి


శ్రీమతి జి. జయలక్ష్మి I.A.S.
గుంటూరుజిల్లా కలెక్టర్


శ్రీ ఎం. శివన్నాయుడు
రాష్ట్ర ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి ఛైర్మన్


తేనె పరిశ్రమ


వరి కంపోస్ట్ తయారి


వేపపిండి తయారి

## రాష్ట్రప్రభుత్వం ఖాధీ గ్రామీణ పరిశ్రమలను ప్రోత్సహించడానికి అనేక రాయితీలను కల్పిస్తోంది



### ప్రభుత్వం ఇస్తున్న రాయితీలు :



- గ్రామీణ ప్రాంతములోని నిరుద్యోగ యువతీ, యువకులకు ఉపాధికల్పన నిమిత్తము కుటీర పరిశ్రమలను ప్రోత్సహించుచూ 25 నుండి 30 శాతము వరకు మధ్యంతర సబ్సిడిని ఏర్పాటు చేయుచున్నారు.
- పరిశ్రమ స్థాపించు వారికి విద్య, వయస్సు, ఆదాయము, మగ & ఆడవారు అను నిబంధనలు లేవు. ఎవరైనను అర్హులే. గాంధీ సిద్ధాంతమునకు వ్యతిరేకమయిన (1) పొగాకు (2)మద్యము (3) మాంసము సంబంధిత పరిశ్రమలకు ఈ పథకము వర్తించదు.
- కలుషితమైన ఎరువులు, పురుగుమందులు వాడకము తగ్గించి చౌవుడు బారిన భూములు సారవంతము చేసి మంచి పోషకములతో దిగుబడు లు పెంచు ఉద్దేశ్యముతో రైతులను ప్రోత్సహించుచూ ప్రత్యేక బడ్జెట్ కేటాయించి వారు స్థాపించుటకు అను కూల పరిశ్రమలు ప్రవేశపెట్టనున్నారు.
  - వర్మి కంపోస్ట్ (Bio Fotoliser)
  - వేపపిండి & వేపనూనె (Bio Pesticid)
  - తేనెటీగల పరిశ్రమ.
  - అరటి నార పరిశ్రమలు .


సి హెచ్. సూర్యనారాయణ మూర్తి
అసిస్టెంట్ డైరెక్టర్
ఆంధ్రప్రదేశ్ ఖాదీ గ్రామీణ పరిశ్రమల మండలి
గుంటూరు జిల్లా



నరసరావుపేట పట్టణంలోని పిఎన్‌సి, కెఆర్ కళాశాల భవనం సముదాయం

## అత్యున్నత విద్యాబోధన అందిస్తున్న...

# పిఎన్‌సి, కెఆర్ కళాశాలలు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

హైటెక్ కోర్సులు నిర్వహిస్తూ, జిల్లాలోనే అత్యున్నత విద్యాబోధన అందిస్తున్న విద్యాసంస్థలుగా నరసరావుపేటలోని పిఎన్‌సి, కెఆర్ కళాశాలలు ప్రత్యేక గుర్తింపు పొందాయి. పల్నాడు ప్రాంత విద్యాభివృద్ధికి విశేష కృషి చేస్తూ, వేలాది మంది విద్యార్థుల భవిష్యత్‌కు బంగారు బాటలు వేస్తున్నాయి. డిగ్రీ కళాశాలకు జాతీయ అంచనాలు, గుర్తింపు మండలి (నాక్) నుంచి బి++ గ్రేడ్ లభించింది. రాష్ట్రంలో 34 కళాశాలలను మాత్రమే నాక్ గుర్తించగా, దీనిలో ఈ కళాశాల కూడా వుండడం విశేషం. పాలడుగు నాగయ్య చౌదరి, కొత్త రఘు రామయ్య డిగ్రీ, పిజి కళాశాలలు యూనివర్శిటిలోనే ప్రముఖ స్థానంలో నిలిచాయి. శ్రీ వెంకటేశ్వర పాలడుగు నాగయ్య చౌదరి, కొత్త రఘు రామయ్య ఎడ్యుకేషన్ సొసైటీ ఆధ్వర్యంలో ఒకే క్యాంపస్‌లో ఎల్‌కెజి నుంచి పిజి వరకు విద్యాసంస్థలను నిర్వహిస్తున్నారు. వీటితో పాటు నర్సింగ్ స్కూల్, కాలేజిలను కూడా ఇదే క్యాంపస్‌లో నిర్వహిస్తున్నారు. సుమారు 14 ఏళ్ళ కాలంలో డిగ్రీ, పిజి విద్యాసంస్థలు అసాధారణ ప్రగతి సాధించాయి.

పాలకవర్గం కార్యదర్శి, కరస్పాండెంట్ డాక్టర్ ఎం.శివలింగప్రసాదరావు దీక్ష, దక్షతలతో ఈ విద్యాసంస్థలు దినదినాభివృద్ధి చెందుతున్నాయి. కొత్త రఘు రామయ్య జూనియర్ కళాశాల, పాలడుగు నాగయ్య చౌదరి, కొత్త రఘు రామయ్య డిగ్రీ, పిజి కళాశాలలు, పాలడుగు నాగయ్య చౌదరి పబ్లిక్ స్కూల్, పిఎన్‌సి అండ్ కెఆర్ నర్సింగ్ స్కూల్, కళాశాలను సొసైటీ ఆధ్వర్యంలో నిర్వహిస్తున్నారు. యూనివర్శిటీ పరిధిలోనే అరుదైన లైబ్రరీని ఈ కళాశాలలో నిర్వహిస్తున్నారు. దాదాపు రూ 50 కోట్ల వ్యయంతో భవనాలు, లాబోరేటరీలు, ఆడిటోరియం నిర్మాణాలను పూర్తిచేశారు. జాతీయ ప్రమాణాలతో కళాశాలలో లాబోరేటరీలు ఏర్పాటు చేశారు. ప్రభుత్వ నిధుల సపోర్టు లేకుండా అన్ ఎయిడెడ్ డిగ్రీ, పిజి కళాశాలలో అభివృద్ధి చెందిన కళాశాలలో రాష్ట్రంలోనే పిఎన్‌సికి ప్రత్యేక స్థానం లభించింది. బయోటెక్నాలజీ కోర్సును జిల్లాలోనే ప్రప్రథమంగా ఈ కళాశాలలో ప్రారంభించారు. ఎన్‌ఎస్‌ఎస్, ఎన్‌సిసి విభాగాల ద్వారా వివిధ సేవా కార్యక్రమాలను అమలు చేస్తున్నారు. విద్యార్థుల వ్యాయామం కోసం ప్రత్యేక జిమ్‌ను ఏర్పాటు చేశారు. క్రీడాభివృద్ధిలో భాగంగా వివిధ క్రీడల కోర్టులను నిర్మించారు.

తమ విద్యా సంస్థలను జిల్లాలోనే నంబరువన్‌గా తీర్చిదిద్దే లక్ష్యంతో పని చేస్తున్నట్లు కళాశాల కరస్పాండెంట్ డాక్టర్ మేదరమెట్ల శివలింగ ప్రసాదరావు పేర్కొన్నారు. పేద విద్యార్థులకు ప్రోత్సాహకాలతో పాటు, క్రీడాకారులను ప్రోత్సహించేందుకు ఫీజుల్లో రాయితీలు కల్పిస్తున్నట్లు ఆయన వివరించారు. 1994-1995 సంవత్సరం విద్యా సంవత్సరంలో బెస్ట్ ఒకేషనల్ కోర్సు అవార్డు కళాశాలకు లభించిందని తెలిపారు. గత ఏడాది కళాశాలలో అత్యుత్తమ మార్కులు సాధించిన వారిని ప్రోత్సహించేందుకు ప్రతిభా పురస్కారాలు అందిస్తున్నామని ఆయన తెలిపారు.



డాక్టర్ ఎం.శివలింగ ప్రసాదరావు



నరసరావుపేట ఇంజనీరింగ్ కళాశాల భవన సముదాయం

# ఎన్ఇసి అనతికాలంలోనే అసాధారణ ప్రతిభ



కళాశాల చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు

(ఆన్‌లైన్, నరసరావుపేట)

అత్యుత్తమ విద్యా ప్రమాణాలతో ఇంజనీరింగ్ విద్యలో తన కంటూ ఒక ప్రత్యేకత చాటుకున్న సంస్థ నరసరావుపేట ఇంజనీరింగ్ కళాశాల. ఎఐసిటిఇ గుర్తింపు పొందిన ఈ ఇంజనీరింగ్ కళాశాల జెఎన్‌టియుకు అనుబంధంగా పనిచేస్తున్నది. నరసరావుపేట పట్టణానికి నాలుగు కిలోమీటర్ల కోటప్పకొండ రహదారిలో, ఆహ్లాదకరమైన క్యాంపస్‌లో కళాశాల నిర్వహిస్తున్నారు. స్థాపించిన అనతికాలంలోనే జెఎన్‌టియులో ఉత్తమ ఫలితాలు సాధించడంలో ఎన్ఇసి ప్రత్యేక స్థానాన్ని సాధించింది. ఎఐసిటిఇ దేశ వ్యాప్తంగా ఇచ్చిన రేటింగ్‌లో మొదటి 32 కళాశాలలో ఎన్ఇసి స్థానం సాధించింది. రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న జవహర్ నాలెడ్జి సెంటర్ కేంద్రాలను రాష్ట్ర వ్యాప్తంగా ప్రారంభించింది. ఈ కేంద్రాన్ని కూడా ఎన్ఇసిలో ఏర్పాటు చేశారు. 2004లో ఎబివిపి నిర్వహించిన రాష్ట్రవ్యాప్త సర్వేలో ఈ కళాశాలకు ఎక్సలెంట్ అవార్డు లభించింది. అలాగే జవహర్ నాలెడ్జి కేంద్రం నిర్వహణలో సెంటర్ ఆఫ్ ఎక్సలెన్స్ గుర్తింపు ఎన్ఇసి పొందింది.

ప్రతి ఏటా గేట్ పరీక్షల్లో కళాశాల విద్యార్థులు అత్యుత్తమ ర్యాంకులు సాధిస్తున్నారు. 2003వ సంవత్సరంలో 22, 2004లో 24, 2005లో 23 మంది కళాశాల విద్యార్థులు గేట్ ర్యాంకులు సాధించారు. అత్యుత్తమ అనుభవం కలిగిన అధ్యాపక వర్గం కళాశాలలో విద్యార్థులు మంచి ఫలితాలు సాధించేందుకు కృషి చేస్తున్నది. కళాశాల సగటు పరీక్షా ఫలితాలు 97 శాతంగా వున్నాయి. 1998లో గాయత్రి ఎడ్యుకేషనల్ సొసైటీ ఆధ్వర్యంలో ఎన్ఇసిని నాలుగు బిటెక్ బ్రాంచ్‌లతో ప్రారంభించారు. ప్రస్తుతం కళాశాలలో బిటెక్ ఆరు బ్రాంచ్‌లు, పిజి కోర్సులు, ఎంసిఎలను నిర్వహిస్తున్నారు. 2005 ఎంసిఎ పరీక్షల్లో కళాశాల విద్యార్థులు 92 శాతం పరీక్షా ఫలితాలను సాధించారు. వీరందరూ ఫస్ట్ క్లాస్ డిస్టెన్షన్‌లో ఉత్తీర్ణులయ్యారు. గేట్, జిఆర్ఇ టోఫెల్, క్యాట్ తదితర పోటీ పరీక్షల కోసం ప్రత్యేక శిక్షణ ఇస్తున్నారు. 122 జర్నల్స్‌తో 19 వేల పుస్తకాలతో అన్ని హంగులతో లైబ్రరీని ఏర్పాటు చేశారు.

క్యాంపస్ ఇంటర్వ్యూలు నిర్వహణ కోసం ప్రత్యేక సెల్ ఏర్పాటు చేశారు. ఇప్పటి వరకు క్యాంపస్ ఇంటర్వ్యూల ద్వారా 78 మంది విద్యార్థులు వివిధ ప్రముఖ సాఫ్ట్‌వేర్ కంపెనీల్లో ఉద్యోగాలు సాధించారు. పల్నాడు ప్రాంతంలో ఇంజనీరింగ్ విద్యను అందుబాటులోకి తేవాలనే ఉద్దేశంతో కళాశాలను స్థాపించామని కళాశాల చైర్మన్, అభివృద్ధి రథ సారథి మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు తెలిపారు.

విద్యార్థులకు అవసరమైన అన్ని సౌకర్యాలు కల్పించామని కోటేశ్వరరావు అన్నారు. కళాశాలలో చదివే విద్యార్థుల కోసం ప్లేస్‌మెంట్ సెల్ ఏర్పాటు చేసి, వివిధ కంపెనీల నిర్వాహకులచే సెమినార్‌లు నిర్వహిస్తూ, విద్యార్థులకు అవగాహన కలిగిస్తున్నట్లు ఆయన తెలిపారు. ఈ ప్రాంత విద్యాభివృద్ధికి ఎన్ఇసి ద్వారా తమ వంతు కృషి చేస్తున్నామని ఇంజనీరింగ్ కళాశాల చైర్మన్ మిట్టపల్లి వెంకట కోటేశ్వరరావు తెలిపారు.

# సమగ్ర భూ అభివృద్ధే ధ్యేయంగా ముందుకు దూసుకు వెళ్తున్న జిల్లా నీటి యాజమాన్య సంస్థ - గుంటూరు



శ్రీ. వై. యస్. రాజశేఖర్ రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి



శ్రీ. కన్నా లక్ష్మన్నారాయణ
రాష్ట్రసహకార శాఖామంత్రి



శ్రీ. ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జ్ మంత్రి



శ్రీ. డి. శ్రీనివాసు
గ్రామీణాభివృద్ధి శాఖామంత్రి



శ్రీమతి జి. జయలక్ష్మి
జిల్లా కలెక్టర్




ఏ దేశ అభివృద్ధైనా సరే ఆ దేశ భౌగోళిక, స్వరూప స్వభావాల పై ఆధారపడి వుంటుంది. ముఖ్యంగా ఆ దేశంలో గల సహజ వనరుల సక్రమ వినియేగం పై ఆధారపడి వుంటుంది. భారతదేశం సువిశాల దేశం. సహజ వనరులకు నిలయం. అయినా మన దేశంలో పేదరికం తాండవిస్తూనే వుంది. దానికి కారణం మనం సహజ వనరులను సక్రమంగా వినియేగించుకోలేకపోవడమే! స్వాతంత్ర్యం సాధించి 58 సం॥ లు పూర్తైనప్పటికీ ఇప్పటికి మనం అన్ని రంగాల్లో పురోభివృద్ధి సాధించలేదు. ముఖ్యంగా మన దేశంలో గల సహజ వనరులను అంతంత మాత్రమే వినియేగిస్తున్నాం. మనకు నీటి వనరులు పుష్కలంగా వున్నప్పటికి వాటిని సక్రమంగా వినియేగించుకోలేక సముద్రాల పాలు చేస్తున్నాం. నీటిని పొదుపు చేయకుండా అవసరమైన మేరకు బోర్లు వేయకుండా, విపరీతంగా బోర్లు వేస్తూ భుగర్భ జలాలు తగ్గుటకు కారకులౌతున్నాం. పేదలను అభివృద్ధి పథంలో నడుపుటకు వారికి మిగులు భుములను, బంజరు భుములను పంపిణీ చేయడం జరిగింది. అయితే వాటిలో ఇప్పటి వరకు అరకొర అభివృద్ధి మాత్రమే సాధించామే గానీ, సమగ్ర అభివృద్ధి సాధించలేదు. ఇలాంటి పరిస్థితులలో ప్రభుత్వం రూపొందించిన పథకమే సమగ్ర భూ అభివృద్ధి పథకం. మన రాష్ట్ర ప్రభుత్వం "ఇందిర ప్రభ" అనే క్రొత్త కార్యక్రమాన్ని మన జిల్లాలోని వినుకొండ సమీపంలో గల సరికొండపాలెంలో ది. 19-11-2004వ తేదీల ప్రారంభించిన విషయం మనందరికి విదితమే! ఇందిర ప్రభ పేదల పథకం. పేదల అభివృద్ధి కోసం రూపొందించిన పథకం.గత కొంత కాలంగా ప్రభుత్వం వివిధ సంక్షేమ శాఖల ద్వారా భూ అభివృద్ధి కార్యక్రమాలు అమలు చేయుచున్నప్పటికీ, పేదల బ్రతుకుల్లో ఆశించినంత మార్పు రాలేదు. ఆ దిశగా ఆలోచించి ప్రభుత్వం సమగ్ర భూమి అభివృద్ధికి ప్రాధాన్యతనిచ్చింది. సమగ్ర భూమి అభివృద్ధి అంటే అన్ని రకాల వసతులతో ఆ భూమిని సస్యశ్యామలం చేయడమే పేదలకు ప్రభుత్వం పంచిన భూములకు సంబంధించిన కంప చెట్లను తొలగించి, భూమిని చదును చేయించి, రాళ్లు తొలగించి, నీటి వసతి కల్పించి, ఆహార, వాణిజ్య పంటలు, పండ్లు తోటలు మరియు పశుగ్రాసానికి అనువుగా భూమిని తయారు చేసి సాటి రైతులతో సమానంగా తీర్చి దిద్దడమే సమగ్ర అభివృద్ధి. పేదల భూములను పేదలే అభివృద్ధి చేసుకోవడం ఈ పథకంలోని ప్రధాన అంశం. దళారుల చెంతకు చేరకుండా వారే కూలీలుగా వారే రైతులుగా భూమిని అభివృద్ధి చేసుకోవడానికి అవకాశాలు విరివిగా వున్న పథకం ఇది. మచ్చుకు ఒక గ్రామాన్ని తీసుకుందాం. గుంటూరు జిల్లాలోని బొల్లాపల్లి మండలం దట్టమైన అడవితో నిండిన మండలం. అక్కడ పేదల బ్రతుకులు అత్యంత దుర్భరం. తినడానికి తిండి, పండించడానికి సరిపడ భూమి లేనటువంటి మండలం. అలాగే పారిశ్రామికంగా ఎలాంటి ఉపాధి అవకాశాలు లేని ప్రాంతం. ఇంతకు ముందు ఒకే ఒక మైనింగ్ పరిశ్రమ వున్నప్పటికీ అనివార్య కారణాల వల్ల అది కూడా మూతపడింది. ఈ మండలములో సాగులోకి రాని పేదల భూములు వందల ఎకరాలు వున్నాయి. ఈ భూములన్నింటిని ఇందిరప్రభ క్రింద సమగ్ర భూమి అభివృద్ధి చేపట్టుటకు చర్యలు తీసకోవడమైనది. వాటి మార్పును గమనిస్తే ఊహించని తేడా కన్పిస్తుంది. సారవంతమైన పేదల భూములు ఆర్థిక స్థోమత లేక నిర్వీర్యమైన భూములు ఇందిర ప్రభతో వికసించాయి. ఎర్ర మట్టితో కలిగిన జిగట నేలలు పండ్ల తోటలకు అనువైననేలలు. ఈ భూములలో పొదలను తొలగించి, ఎగుడుదిగుడు భూములను చదును చేసి, మెట్ట పంటలకు సిద్ధం చేయడం జరిగింది. ప్రభుత్వం ఆ భూముల్లో ఆముదాలు, కంది మొదలైన మెట్ట పంటలు వేయడం జరిగింది. సరికొండపాలెంలోని భూములకు నీటి వసతి కూడా కల్పించడంతో ఆ భూములు ఇంకా వ్యవసాయానికి అనువుగా తయారైయాయి. జయంతి రాయపురం నేలలు నిమ్మ, మామిడి తోటలు పండించుటకు సిద్ధంగా వున్నాయి. ఇలా మూడు సంవత్సరాల కాలంలో సమగ్రంగా భూమిని అభివృద్ధి చేయడమే ఈ పథకం లక్ష్యం ఇంకా జిల్లా నీటి యాజమాన్య సంస్థ ఆధ్వర్యంలో వాటర్ షెడ్ పథకాలు, మైక్రో ఇరిగేషన్ కార్యక్రమాలు విరివిగా జరుగుచున్నాయి. చిన్న చిన్న నీటికుంటలు, చెక్‌డ్యాములు, తక్కువ నిధులతో చేపట్టి భూములకు సారవంతంగా తక్కువ స్థాయిలో గల భూగర్భ జాలాలు అందుబాటులోకి తేవడమై ఈ పథకం ముఖ్యోద్దేశం. గుంటూరు జిల్లాలో IWDP-I&II క్రింది ఈ సం. రు. 358-40 లక్షల లక్ష్యంతో పనులు చేపట్టడం జరిగింది. ఇప్పటి వరకు రు. 216-64 లక్షల నిధులు, ఖర్చు చేసి పనులు చేపట్టడం జరిగింది. మిగతా లక్ష్యాలను కూడా త్వరత్వరగా పూర్తి చేయుటకు శ్రీ బొమ్మిరెడ్డి రాజశేఖరరెడ్డి, ప్రాజెక్టు డైరెక్టర్ ఆధ్వర్యంలో ప్రణాళికలు రూపొందించి అమలు చేయబడుచున్నాయి. ఇంకా ఆంధ్రప్రదేశ్ మైక్రో ఇరిగేషన్ ప్రాజెక్టుకు సంబంధించి 2005-06 సం. రానికి 1700 హెక్టార్లను ఏర్పాటు చేసుకొని సాధించుటకు ప్రణాళికలు సిద్ధం చేయబడ్డాయి ఇప్పటి వరకు జైన్ మరియు ప్లాస్టో కంపెనీల ఆధ్వర్యంలో 355-68 హెక్టార్లలో స్ప్రింక్లర్లను, డ్రిప్పులను ఏర్పాటు చేసి రు. 28-96 లక్షలను ఖర్చు చేయడం జరిగింది. జిల్లా కలెక్టరు గారి పర్యవేక్షణలో మండల వ్యవసాయ అధికారులు మరియు వ్యవసాయ ప్రణాళికలు సిద్ధపరచి అమలు చేయబడుచున్నాయి. ఇవే కాకుండా సదరు పైన పేర్కొన్న మూడు పథకాలకు సంబంధించి అవగాహన కల్గించుటకు శిక్షణా కార్యక్రమాలు ఏర్పాటు చేయబడుచున్నాయి. ముఖ్యంగా అందిర ప్రభ, వాటర్‌షెడ్ పథకాలు అమలు చేయుటలో మండల టెక్నికల్ అసిస్టెంట్లకు వేలుగు సి.సీ. లకు, మండల మహిళా మాఖ్య గ్రామైక్య సంఘాలకు, కామన్ ఇంటరెస్ట్ గ్రూపు సభ్యులకు, పారా వర్కర్లకు, వాటర్ షెడ్ కమిటీలకు, గ్రామ పంచాయితీలకు, P. I. A. లకు W. D. T. మరియు ఇతరలకు సంవత్సరిక ప్రణాళికల పై అవగాహన కల్గించ నిధులు సమగ్ర వినియోగంలో వారి పాత్రను తెలియచేస్తూ శిక్షణలు చేపట్టడం జరుగుతుంది. ఈ బృహత్తర కార్యక్రమాలను ఎప్పటికప్పుడు సరిచూసుకుంటూ ప్రాజెక్టు డైరెక్టర్ మరియు జిల్లా కలెక్టర్ గారి ఆధ్వర్యంలో గుంటూరు జిల్లా ముందుకు దూసుకు వెళుతుంది.



బొమ్మిరెడ్డి రాజశేఖర రెడ్డి, పి.డి, జిల్లా నీటియాజమాన్య సంస్థ

# రైతు జన క్షేమమే ధ్యేయంగా

# బాయర్ క్రాప్ సైన్స్ వారి సరికొత్త ఉత్పత్తులు



ప్రపంచంలోనే పురుగుమందుల తయారీ కంపెనీలలో నిరంతర పరిశోధన, అభివృద్ధి, విస్తరణ విభాగాలలో అగ్రస్థానంలో ఉన్న బాయర్ క్రాప్ సైన్స్, ఒక్క పురుగుమందులు అమ్మడమే లక్ష్యంగా కాకుండా, రైతు సేవలో నిత్యం నిమగ్నం అవుతూ, వివిధ పంటలను ఆశించే పురుగులను, తెగుళ్ళను నివారించడంలో ఎన్నో విశిష్ట ఉత్పాదనలను అందజేస్తూ రైతుల ప్రశంసలు పొందింది.

రైతు సదస్సులు : వ్యవసాయ విధానంలో వస్తున్న నూతన సాంకేతిక పద్ధతులను, పరిజ్ఞానాన్ని ఎప్పటికప్పుడు పంటలపై వస్తున్న చీడపీడలను తమ విస్తరణ విభాగం ద్వారా, ముందుగానే గుర్తించి, వాటికి తగిన నివారణోపాయాలను రైతుకు అర్ధమయ్యే భాషలో స్లైడ్స్ ప్రెజెంటేషన్ రూపంలో రైతులకు చూపిస్తూ, వారిని ఉత్తేజపరచడం, ఇంతేకాకుండా క్రిమి సంహారక మందుల వాడకంలో తీసుకోవలసిన జాగ్రత్తల గురించి కూడా వివరిస్తూ, వారి ఆరోగ్యాన్ని కాపాడడం, పర్యావరణాన్ని కూడా రక్షించే విధానాలను ఈ రైతు సదస్సుల ద్వారా వివరించడంలో బాయర్ సఫలీకృతం అయింది. అంతేకాకుండా ప్రతి రైతు సదస్సులో అభ్యుదయ రైతులను స్ప్రే చేసేటప్పుడు వాడిన రక్షణ దుస్తులను కూడా ఈ సదస్సులలో ఇస్తున్నారు.

రైతు ప్రదర్శనా క్షేత్రాలు : ప్రతి గ్రామంలో రైతు ప్రదర్శన క్షేత్రాలను ఏర్పాటుచేసి ఈ క్షేత్రాల ద్వారా ఆ గ్రామంలో పత్తి, మిరప, వరిపై వచ్చే పురుగులు, తెగుళ్ళను వివరిస్తూ, అతి తక్కువ ఖర్చుతో అధిక దిగుబడులను సాధించే మెళకువలను కూడా రైతులకు వివరిస్తున్నారు.




ప్రొటెగా




కాలిప్సో

ఇంతేకాకుండా ఎప్పటికప్పుడు వ్యవసాయ శాస్త్రజ్ఞులు, వ్యవసాయాధికారులతో పొలాలను సందర్శించి పురుగుల నష్ట పరిమితి స్థాయి ప్రకారం రైతులకు తగిన మందులను, సిఫారసు చేయడం, వ్యవసాయ పరిశోధన స్థానాల సిఫారసులను అమలుపరచడంలో బాయర్ క్రాప్ సైన్స్ తమ వంతు సహకారాన్ని అందిస్తుంది.

రైతులకు తమ మందుల గురించి వివరించడమే కాకుండా, వ్యవసాయంలో వస్తున్న నూతన విషయాలను కూడా రైతులకు ముందుగానే తమ విస్తరణ విభాగాల ద్వారా తెలియపరిచి రైతులు తగు జాగ్రత్తలు తీసుకునేటట్లు చేస్తున్నారు. దీనికి ఉదాహరణగా ఈ మధ్యకాలంలో బిటి పత్తిపై కొత్తగా వచ్చే టొబాకో స్ట్రీక్ వైరస్ తెగులు గురించి ప్రతి గ్రామంలో సదస్సుల ద్వారా రైతులకు తెలియజేసి, ముందు జాగ్రత్త చర్యలను కూడా చేపట్టి, చాలా వరకు ఈ తెగులు రాకుండా అరికట్టి బాయర్ రైతులను ఆదుకున్నది. ఒక్క రైతు సేవలోనే కాకుండా ఈ మధ్య కాలంలో వచ్చే సునామీ వంటి ప్రకృతి విలయ తాండవంతో నిరాశ్రయులైన ప్రజల కోసం కోటి రూపాయలు తమిళనాడు ప్రభుత్వానికి విరాళమిచ్చి బాయర్ తన మానవతా దృక్పథాన్ని చాటుకుంది.

బాయర్ క్రాప్ కేర్ ప్రాజెక్టు : ఈ ప్రాజెక్టు ద్వారా సుమారు ఆరు వేల ఎకరాల పత్తి, 1500 ఎకరాల మిర్చి ఏనుగుపాలెం, కావూరు, లింగంగుంట్ల, జీజీపాలెం, రావిపాడు , గోగులమూడి పెదనందిపాడు మండలాలలో దత్తత తీసుకుని ఈ పంటలలో వచ్చే చీడ పీడల గురించి సవివరంగా రైతులకు విత్తన శుద్ధి నుంచి పత్తి, మిర్చి కోత కోసే వరకు సలహాలు ఇస్తూ రైతులకు సేవలందిస్తోంది.

(మిగతా 155వ పేజీలో...)

# రైతు జన క్షేమమే ధ్యేయంగా...

(ఆన్‌లైన్,గుంటూరు)

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన బాయర్ క్రాప్ సైన్స్ అంతర్జాతీయ ప్రమాణాలకు ధీటుగా అధునాతన సాంకేతిక పరిశోధనతో రూపొందించిన 'ప్రొటెగా, 'కాలిప్సో' ఉత్పత్తులను ఇటీవల విడుదల చేశారు. ఇప్పటికి 140 సంవత్సరాలుగా ఎన్నో విశిష్ట ఉత్పాదనలను సుమారు 165 దేశాలకు పైగా ఉన్న కోట్లాదిమంది రైతులకు అందిస్తూ గత సంవత్సరం ప్రపంచంలో అతి పెద్ద కంపెనీలలో ఒకటైన 'అవంటిస్ క్రాప్ సైన్స్'ను విలీనం చేసుకుంది.

ప్రపంచంలో 400 కంపెనీల మొత్తం మార్కెట్ షేర్ 78 శాతం కాగా బాయర్ ఒక్కటే 22 శాతం మార్కెట్ షేర్‌తో అగ్ర స్థానంలో ప్రతి ఏటా పరిశోధనలు, అభివృద్ధి నిమిత్తం 13,300 కోట్ల రూపాయలు వ్యయం చేస్తోంది. నూతనంగా ప్రవేశపెట్టిన ఉత్పత్తులలో ఒకటైన 'ప్రొటెగా' ఒక అద్భుతమైన అగ్గితెగులు నివారణి. దీని ప్రభావం వరిపై ఎక్కువకాలం ఉండడం వల్ల వరిని అధికంగా పండించే అభివృద్ధి చెందిన దేశాలైన జపాన్, కొరియా రైతులు ఇప్పటికే విరివిగా వాడుతున్నారు. దీనిని భారతదేశంలోని ప్రభుత్వ వ్యవసాయ విశ్వ విద్యాలయాలు, వరి పరిశోధనా మండలి (డిడిఆర్) వారి వివిధ ప్రాంతీయ పరిశోధనా శాలల్లో క్షుణ్ణంగా పరిశీలించి మన దేశంలో వరిపై వచ్చే అగ్గి తెగులు నిర్మూలనకు లభ్యమౌతున్న వివిధ ఉత్పత్తులలో అత్యుత్తమ శ్రేణికి చెందినదిగా సిఫారసు చేశారు.

నూతన ఉత్పత్తులలో మరొకటైన 'కాలిప్సో' పత్తి పంటను ప్రత్యేకంగా బిటి పత్తిని ఆశించి నాశనం చేసే పచ్చదోమ, పేనుబంక, ఆకుముడతలను అతి ప్రభావవంతంగా అరికడుతుందని, తద్వారా పూర్తి దిగుబడి సామర్థ్యాన్ని కలిగిస్తుంది.

ప్రస్తుత తరుణంలో పాత పద్ధతులలో కాక ఇటువంటి సరికొత్త సాంకేతిక విలువలతో కూడిన మందులను వాడడం రైతులకు క్షేమదాయకమని బేయర్ సౌత్ ఇండియా జనరల్ మేనేజర్ ఎం.రామారావు, జోనల్ మార్కెటింగ్ మేనేజర్ కె మాపతిరెడ్డిలు తెలిపారు. వ్యవసాయంతో నిష్ణాతులైన డాక్టరేట్స్‌తో ఒక ప్రత్యేకమైన 'బయోలాజికల్ డిపార్టుమెంట్' లను స్థాపించి ఎప్పటికప్పుడు చీడపీడల ఉధృతిని పర్యవేక్షించడం, వాటి నిరోధక శక్తి పెంపుదలను గమనించడంతో పాటు వాటిని నియంత్రించడానికి తగు సలహాలు, సూచనలు ఇస్తారని, రైతుల్లో ఎంతో ప్రాచుర్యం పొందిన ఈ బాయర్ కంపెనీ విత్తన శుద్ధి దగ్గర నుంచి పంట కోతకు వచ్చినంతవరకు అవసరమయ్యే కలుపు, పురుగు, తెగుళ్ళు నివారించే ప్రత్యేక తరహాలో పనిచేసే ఉత్పాదనలను రైతులకు అందిస్తారని వారు వివరించారు.



వ్యవసాయ క్షేత్రంలో పంటల స్థితి గతుల గురించి రైతులతో చర్చిస్తున్న దృశ్యం


సొసైటీ అధ్యక్షురాలు హుస్నే జహాన్


ఎస్ఎస్‌బిటి బియిడి కళాశాల భవన సముదాయం

# విద్యా సుగంధ పరిమళాలను గుబాళింపజేస్తున్న
# మదీనా ఎడ్యుకేషన్ సొసైటీ

**(ఆన్‌లైన్, రేపల్లె)**
గ్రామీణ ప్రాంతాల్లోని మహిళలకు విద్యాసుగంధ పరిమళాలను గుబాళింపజేస్తూ రెండు దశాబ్దాలకు పైగా రేపల్లె మదీనా ఎడ్యుకేషన్ సొసైటీ నిరూపమాన సేవలు అందిస్తూ ప్రజల ప్రశంసలు అందుకుంటోంది. మొదటిలో రేపల్లె పరిసర ప్రాంతాల్లోని మహిళలకు విద్యను అందించాలని 1983లో మదీనా ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించారు. ఎడ్యుకేషన్ సొసైటీ వ్యవస్థాపక అధ్యక్షురాలిగా హుస్నేజహాన్, సెక్రటరీ అండ్ కరస్పాండెంట్‌గా హాజి ఖాదర్ షరీఫ్‌లు వ్యవహరిస్తున్నారు.

1984లో 14 మంది విద్యార్థినిలతో ప్రారంభించిన మదీనా ఎడ్యుకేషనల్ సొసైటీ మహోన్నత లక్ష్యాలతో ముందుకు సాగుతున్నది. సత్వర ఉపాధికి స్వాగతం పలికే విద్యాప్రమాణాలతో ప్రతిభను మెరుగుపరిచే విశిష్టమైన వృత్తివిద్య కోర్సులలో శిక్షణనిస్తూ విద్యార్థినిల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుతూ వారి బంగారు భవిష్యత్‌కు బాటలు వేసే రేపల్లె మదీనా ఎడ్యుకేషనల్ సొసైటీ నిర్వాహకులు (మిగతా 158లో)


సెక్రటరీ అండ్ కరస్పాండెంట్ హాజీ ఖాదర్ షరీఫ్

# భూస్వామ్య వ్యవస్థపై పోరాటంలో అమరులైన పాలపర్రు వీరులు

(ఆన్‌లైన్ - పెదనందిపాడు)

1950 ప్రాంతంలో నైజాం పాలన అంతం కావాలని దున్నేవానికే భూమిపై హక్కు వుండాలని కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో పాత బాపట్ల తాలూకా ప్రస్తుత పెదనందిపాడు మండలం పాలపర్రు ప్రాంతంలో జరిగిన ఉద్యమం చరిత్ర ప్రసిద్ధిచెందింది. స్వాతంత్ర్య పోరాట కాలంలో తమ ప్రాణాలను సైతం లెక్కచేయకుండా అహర్నిశలు పోరాటాలు సాగించి రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యవాదులను పారద్రోలి స్వాతంత్ర్యం సాధించుకోవడం జరిగింది. అయితే అర్థరాత్రి స్వాతంత్ర్యం మేకవన్నె పులుల కబంధ హస్తాల్లో చిక్కిందే తప్ప దారిద్ర్య రేఖకు దిగువన ఉన్న పేద, బడుగు, బలహీనవర్గాలకు ఎలాంటి లాభం చేకూరలేదని ఉద్యమకారులు అభిప్రాయపడ్డారు. ఈ నేపథ్యంలో నైజాం పాలనలో ఘనీభవించి అమలు జరుగుతున్న పటేల్, పట్వారీల నియంతృత్వాన్ని, జెట్టి, నాగు తదితర పేర్లతో సాగుతున్న అక్రమ వడ్డీ విధానాలకు, వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా ఆంధ్ర మహాసభ నాయకత్వాన ప్రారంభమైన పోరాటం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన అభివృద్ధి చెందింది. భూస్వామ్య వ్యవస్థకు వ్యతిరేకంగా సాగిన సాయుధ రైతాంగ పోరాటంలో పాలపర్రు ప్రాంత ప్రజానీకం చూపిన ఆదరణ ప్రశంసనీయం. నాటి ప్రభుత్వం గుంటూరు జిల్లా పెదనందిపాడు మండలం పాలపర్రు సమీపంలో, తుమ్మలపాలెం కొండల దగ్గర తెనాలి, గుర్తు తెలియని ఇతర ప్రదేశాల్లో 1950లో 14 మందిని కాల్చి చంపింది. పోపూరి రంగారావు (పాలపర్రు), నాగభైరవ వీరయ్య (పాలపర్రు), కరణం శ్రీరాములు (పాలపర్రు), బండారు వెంకటప్పయ్య (పాలపర్రు), బత్తుల ధనుంజయ (పాలపర్రు), పెద్దిపాగ ప్రకాశం (పాలపర్రు), సజ్జా సూర్యబాలనందం (వేటపాలెం), కస్తూరి కుటుంబరావు (వేటపాలెం), చివుకుల శేషశాస్త్రి (బాపట్ల), జెట్టి సుబ్బారావు (మాచవరం), బండారు వెంకటేశ్వర్లు (పందిళ్ళపల్లి), ముక్తినూతన లక్ష్మీనారాయణ (బికెపాలెం), అమరవీరులు జాబితాలో చోటు చేసుకున్నారు. వీరు 1948వ సంవత్సరం నుంచి తెలంగాణా సాయుధ పోరాటాలు, వ్యవసాయ కూలీలు, పాలేర్లు తదితర వృత్తి సంఘాలు ఏర్పరచి వారిని చైతన్యపరచి పోరాటాలు నిర్వహించి వ్యవసాయ కూలీలకు అనుకూలంగా కూలి రేట్లు కోసం దాదాపు రెండు సంవత్సరాలు తిరుగబాటు పంథాలో ఉద్యమం చేశారు. ఈ నేపథ్యంలో వ్యవసాయ కూలీలు ఐకమత్యంగాసమ్మె చేస్తుండగా భూస్వాములు దూర ప్రాంతాల నుంచి కూలీల్ని రప్పించి వ్యవసాయ పనులు చేయించుకొనుటకు పూనుకున్నారు. అయితే ఉద్యమకారులు వారికి నచ్చజెప్పి పంపివేయడంతో భూస్వాముల పక్షాన ఉన్న అప్పటి ప్రభుత్వం పాలపర్రు గ్రామానికి చెందిన ఎనిమిది మందిని తమ తుపాకీ తూటాలకు బలి చేసింది.

## అమర వీరుల జీవిత విశేషాలు

**బొందలపాటి అమ్మయ్య (26)** : పాలపర్రు గ్రామంలో జన్మించి వ్యవసాయ కూలీలకు అండగా వుంటూ మంచి తెలివైన వాడిగా వ్యవసాయరంగంలో పలు బహుమతులు పొందారు.

**పోతూరి రంగారావు (18)**: పాలపర్రులో జన్మించి విద్యార్థి దశ నుంచి వ్యవసాయ కూలీలకు తన మద్దతునిస్తూ 13-5-1950లో ప్రభుత్వ తుపాకీ తూటాలకు బలయ్యారు.

**నాగభైరు వీరయ్య (28)** : పాలపర్రులో జన్మించి సామాన్య వ్యవసాయ కూలీగా జీవిస్తూ సాయుధ పోరాటంలో 19-4-1950లో చనిపోయారు.

**కరణం శ్రీరాములు (24)**: పాలపర్రులో సామాన్య రైతు కుటుంబంలో జన్మించి 19-4-1950లో ఉద్యమంలో చని పోయారు.

**బండారు వెంకటేశ్వర్లు (20)**: పాలపర్రు చేనేత కార్మికునిగా వుంటూ ఉద్యమంలో 13-4-1950లో ప్రాణాలు విడిచారు.

**నరికొండ అప్పలరాజు (24)**: పాలపర్రులో జన్మించి పేదల పక్షాన నిలిచి పాలేరుగా జీవితాన్ని సాగిస్తూ పాలకుల చేతిలో 13-5-1950లో అమరుడయ్యారు.

**బత్తుల ధనుంజయుడు (24)**: పాలపర్రులో జన్మించి కార్పెంటరుగా జీవితాన్ని సాగిస్తూ పెత్తందారీ విధానాలను అడ్డుకొంటూ 19-4-1950లో ప్రభుత్వ తూటాలకు బలయ్యారు.

**పెద్దిపాగ ప్రకాశం (20)**: పాలపర్రులో జన్మించి వ్యవసాయ కార్మికుడుగా జీవిస్తూ కార్మికుల న్యాయం కోసం విప్లవ పోరాటాల్లో ముఖ్య పాత్ర పోషిస్తూ 19-4-1950లో పోలీసుల తూటాలకు బలయ్యారు.

**జెట్టి సుబ్బారావు (32)**: మాచవరం గ్రామంలో జన్మించి మిలటరీలో పని చేసి పదవీ విరమణ తర్వాత కమ్యూనిస్టు సిద్ధాంతాలకు ఆకర్షితుడై చివరకు పోలీసు కాల్పులలో మృతి చెందారు.

**ముక్తినూతల లక్ష్మీనారాయణ (36)**: 12-5-1950లో పోలీసు తూటాలకు బలయ్యారు.

**సజ్జా సూర్యబాలానందం (32)**: భూస్వాములను గడగడలాడించి 12-5-1950 ఉద్యమంలో మృతి చెందారు.

**చివుకుల శేషశాస్త్రి (33)**: బాపట్లలో జన్మించి కమ్యూనిస్టు పార్టీకి ఆకర్షితుడై పార్టీ ఉద్యమాల్లో పాల్గొంటూ 12-5-1950లో పోలీసు తూటాలకు బలయ్యారు.

**బండారు వెంకటేశ్వర్లు (22)**: పందిళ్ళపల్లిలో జన్మించి నిరుపేదల పక్షాన పోరాడుతూ 12-5-1950లో అమరుడయ్యాడు.

**కస్తూరి కుటుంబరావు (43)**: వేటపాలంలో జన్మించి రేపల్లె పాత బాపట్ల తాలూకాలో చేనేత కార్మికులను సమీకరించి ఒకే తాటిపై నడిపించి 19-5-1950లో పోలీసు చేతుల్లో చనిపోయారు.

ఈ ఉద్యమకారుల స్ఫూర్తిగా నేటికి ఈ ప్రాంతంలో పలు ప్రజా కార్యక్రమాల్లో యువత ఉద్యమాలు నిర్వహిస్తూ న్యాయ పోరాటాలు చేయటం స్ఫూర్తిదాయకం. ప్రతి సంవత్సరం పాలపర్రులో అమరవీరుల స్మారక సభలు నిర్వహించి కమ్యూనిస్టు ఉద్యమాలపై ఉపన్యాసాలు జరుపుట పరిపాటి అయింది.

## విద్యా సుగంధ పరిమళాలను గుబాళింపజేస్తున్న

# మదీనా ఎడ్యుకేషన్ సొసైటీ

(156వ పేజీ తరువాయి)

చేస్తున్న కృషి ఆంధ్రావనికే గర్వ కారణం. సామాన్య గ్రామీణ వాతావరణంలో నెలకొని అసామాన్యమైన అభివృద్ధి శిఖరాలను అధిరోహిస్తూ దశదిశలా తనకీర్తి చంద్రికలను విస్తరింపచేస్తున్నది. ప్రస్తుతం జెఎల్‌బి జూనియర్ బాలికల కళాశాల, ఎస్‌ఎన్‌బిటి మహిళా డిగ్రీ కళాశాల,ఎస్‌ఎన్‌బిటి బియిడి కళాశాల, ఎస్‌ఎన్‌బిటి ఎంసిఎ పిజి సెంటర్ విద్యాసంస్థలలో సుమారు మూడువేలమంది విద్యార్థినీలు విద్యాభ్యాసం చేస్తున్నారు. వారికి ఆధునాతన ప్రయోగశాలలు, విశాలమైన భవన సముదాయాలు, కంప్యూటర్ సెంటరు, లైబ్రరీ వసతులు, వనరులను కల్పిస్తున్నారు.



ఎంసిఎ పిజి సెంటర్ కంప్యూటర్ ల్యాబ్

జెఎల్‌బి జూనియర్ బాలికల కళాశాలలో హెచ్‌ఇసి, ఎంపిసి, బైపిసి, ఎంఇసి, హెచ్‌ఇసి గ్రూపులతోపాటు వృత్తి విద్య కింద నర్సింగ్ కోర్సులను నడుపుతున్నారు. ఎస్‌ఎన్‌బిటి డిగ్రీ కళాశాలలో బిఎస్సీలో ఎంపిసి, సిబిజడ్, ఇండస్ట్రీయల్ మైక్రోబయాలజి, కంప్యూటర్స్, బయోటెక్నాలజి తెలుగు, ఇంగ్లీషు మీడియంలలో బోధిస్తున్నారు. బిఏలో హెచ్‌ఇపి, ఇపిపి, బికాంలో కోర్సులను తెలుగు మీడియంలో బోధన చేస్తున్నారు.

సెకండ్ లాంగ్వేజ్‌ను ఉర్దూ పాఠ్యాంశాన్ని తప్పనిసరిగా ఈవిద్యాసంస్థలలో బోధిస్తున్నారు. ఎస్‌ఎన్‌బిటి బియిడి మహిళా కళాశాలలో సోషల్, ఫిజికల్ సైన్స్, బయోసైన్స్, మ్యాథ్స్ సబ్జెక్టులలో వృతివిద్యా కోర్సులు ఉన్నాయి. ఎంసిఎ పిజి సెంటరులో విద్యార్థులకు ప్రత్యేక విద్యాబోధన సౌకర్యాలు కల్పిస్తున్నారు. ఆన్‌లైన్ ప్రొజెక్టర్‌తో స్లైడ్స్, స్పోకెన్ ఇంగ్లీషు కోచింగ్, విద్యార్థుల భవిష్యత్‌ను దృష్టిలో ఉంచుకొని వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేయటం, ఉద్యోగవకాశాలు రూపొందించటానికి మార్గాలను అన్వేషించటానికి విద్యాసంస్థల ప్రిన్సిపాల్స్, అధ్యాపకులు, పాలకవర్గం అవిరళ కృషి చేస్తున్నారు. జెఎల్‌బి జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా హాజి ఖాదర్ షరీఫ్, ఇన్‌చార్జి ప్రిన్సిపాల్ మౌలా సాహెబ్, డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్‌గా హుస్నే జహాన్, బియిడి కళాశాల ప్రిన్సిపాల్ దిన్నా బాబు, ఎంసిఎ కళాశాల ప్రిన్సిపాల్ నసీర్ అహ్మద్‌లు వ్యవహరిస్తున్నారు. ఈసందర్భంగా మదీనా ఎడ్యుకేషనల్ సొసైటీ సెక్రటరీ అండ్ కరస్పాండెంట్ హాజి ఖాదర్ షరీఫ్ 'ఆన్‌లైన్'తో మాట్లాడుతూ టిటిసి కోర్సు ప్రారంభించటానికి 2005 సంవత్సరంలో ప్రభుత్వం అనుమతినిచ్చిందని చెప్పారు. అదేవిధంగా బయోటెక్నాలజీ, బయో మెడికల్ కోర్సులు, కిండర్ గార్డెన్ నుంచి పదవ తరగతివరకు ఇంగ్లీషు మీడియంలో పబ్లిక్ స్కూల్ ఏర్పాటు చేయాలని ఆదిశగా లక్ష్యంగా పెట్టుకొని కృషి చేస్తున్నామని చెప్పారు.

## మతాతీత దైవం పుట్ట నాగేంద్రస్వామి

(ఆన్‌లైన్, మంగళగిరి)

హిందూ, ముస్లిం ఐక్యతకు, మత సామరస్యానికి నవులూరు గ్రామపరిధిలో గల శ్రీ పుట్ట నాగేంద్రస్వామి వారి ఆలయం అద్దం పడుతోంది. మంగళగిరి రైల్వే స్టేషన్ నుంచి కేవలం కిలోమీటర్ దూరంలో సుమారు ఒకటిన్నర ఎకరాల విశాలమైన మామిడితోటలో వున్న శ్రీనాగేంద్రస్వామి వారి ఆలయం కృష్ణాజిల్లా మోపిదేవిలో వేంచేసియున్న శ్రీసుబ్రహ్మణ్యేస్వరస్వామి ఆలయం మాదిరి చాలా ప్రసిద్ధి చెందింది. గుంటూరు, కృష్ణా, ప్రకాశం జిల్లాలలో 'నవులూరు పుట్ట తోట'గా ఈ ఆలయం ఖ్యాతి గాంచింది. పదహారు గజాల విస్తీర్ణంలో వున్న శ్రీ నాగేంద్రస్వామి వారి ఆలయ ప్రాంగణంలో ప్రధాన ఆలయం పుట్ట కాగా, ఈ గర్భగుడికి బయట వైపున జెండా చెట్టు వుంది. ఈ ఆలయాన్ని హిందువులతో పాటు ముస్లింలు కూడా దూర ప్రాంతాల నుంచి వచ్చి సందర్శించి మొక్కుబడులను తీర్చుకుంటుంటారు. ఈ ఆలయాన్ని హిందువులు శ్రీ నాగేంద్రస్వామి పేరుతోను, ముస్లింలు నాగుల్‌మీరా పేరుతోను సందర్శించి శ్రీ స్వామిని సేవిస్తూ వుంటారు.

### ఆలయ ఆవిర్భావ చరిత్ర

స్థానిక పార్కురోడ్డును దాటి రైల్వే ట్రాక్‌కు ఆవలివైపు కల ప్రాంతం సుమారు 53 ఏళ్ళ కిందట కీకారణ్యంగా వుండేది. ఈ ప్రదేశంలోని మామిడి, మర్రి, ఇతర జాతులకు చెందిన వట వృక్షాలపై వివిధ పక్షులు పెద్ద సంఖ్యలో ఆవాసముండేవి. అలాగే కింద నేలపై బహుళ సంఖ్యలో వున్న పుట్టలలో సర్పజాతులు పెద్ద సంఖ్యలో నివసించేవి. ఈ రకమైన ఈ ప్రాంతాన్ని దేవుడితోటగా పిలిచేవారు. ఇందుకు కారణమేమంటే... మంగళగిరి శ్రీలక్ష్మీనృసింహస్వామి వారిని అభిషేకించేందుకు అవసరమైన నీటిని ప్రాచీన కాలంలో ఈ దట్టమైన అడవిలో గల చీకటి కోనేరు నుంచి అర్చకులు ప్రతి నిత్యం తీసుకువచ్చేవారట. ఈ కారణంగానే దీనికి దేవుడి తోట అనే పేరు స్థిరపడిందంటారు. అయితే ఈ ప్రాంతానికి యజమాని అయిన చక్కా చెన్నయ్య అనే వ్యక్తి ఏ కారణం చేతనో కాని 1943 - 44 ప్రాంతంలో అక్కడి వృక్షాలను విచక్షణా రహితంగా నరికించి వేయడంతో వేలాది పక్షులు ఆశ్రయాన్ని కోల్పోయి అలమటించాయంటారు. అలాగే వివిధ సర్పాలు సైతం ఆ సమయంలో పని వారల చేత చంపబడ్డాయని చెబుతుంటారు. ఈ నేపథ్యంలో ఒక సర్పరాజేంద్రుడు ఈ ప్రాంతం నుంచి బయటపడి ఉత్తర దిశగా సుమారు అర కిలోమీటరు దూరం వెళ్ళి అక్కడి మామిడితోట మధ్య వెలసినట్టు చెబుతున్నారు. అనంతరం శ్రీనాగేంద్రస్వామి ఒక వ్యక్తిని పూని తాను అక్కడి పుట్టలో వేంచేసియున్నట్టు చెప్పడంతో ఆ తోట యజమాని తొండెపు సుబ్బారావు ఆనందపారవశ్యం చెంది శ్రీస్వామి వారి పుట్టకు అప్పట్లో నీడను కల్పించే విధంగా పందిరిని ఏర్పాటు చేయించారట. ఆ తరువాతి కాలంలో ఈ పుట్ట ప్రాముఖ్యత దిన దిన ప్రవర్ధమానమై, దూరప్రాంతాల భక్తులను కూడా పెద్ద సంఖ్యలో ఆకర్షించింది. దీనితో తొండెపు సుబ్బారావు కుమారుడు పూర్ణచంద్రరావు ఆలయాన్ని అభివృద్ధి చేసే నిమిత్తం ప్రస్తుత రూపంలో కనిపిస్తున్న ఆలయాన్ని నిర్మించారు. అనంతరం ప్రహరీగోడ నిర్మాణం, ముస్లిం భక్తుల సౌకర్యార్థం జెండా చెట్టు, మొక్కుబడులను తీర్చుకునేందుకు, వంటలు చేసుకునేందుకు వీలుగా షెడ్లను ఏర్పాటు చేయించి ఆలయాన్ని అభివృద్ధి చేశారు.



(ఆన్‌లైన్ - క్రోసూరు)

# కవులలో మేటి... కొండవీటి కవి

కవి అన్న పదానికి వన్నెతెచ్చి క్రోసూరు మండల గడ్డకే కాక గుంటూరు జిల్లాకే జాతీయ ఖ్యాతి తెచ్చిన కవి రాజు, కళాప్రపూర్ణ, స్వర్గీయ డాక్టర్ కొండవీటి వెంకటకవి. సినీ మాట రచయితగా, గ్రంథ రచయితగా, హేతువాదిగా బ్రహ్మనాదిపత్యాన్ని ఎదిరించి పెళ్ళిళ్ళు జరిపించిన పురోహితునిగా, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత వాదిగా చివరకు మంత్రతంత్రాలు నేర్చిన భూత మాంత్రికునిగా, జ్యోతిష్యునిగా, బెట్టకవిగా కొండవీటి వెంకటకవి సుప్రసిద్ధుడు. 1918వ సంవత్సరం జనవరి నెలలో క్రోసూరు మండలం విప్పర్ల గ్రామంలో కొండవీటి నారాయణయ్య, శేషమ్మ దంపతులకు వెంకటకవి జన్మించారు. తర్వాత ఆయన తన పినతండ్రి రామచంద్రయ్యకు దత్త కుమారుడయ్యారు. సరికొండ నమ్మాలరాజు వద్ద ఆయన విద్యాభ్యాసం చేశారు. తర్వాత ఆయన ఉభయభాషా ప్రవీణుడయ్యారు. కవిరాజు త్రిపురనేని రామస్వామి ప్రభావం వల్ల అప్పుడే ఆయనతో హేతువాద భీజాలు నాటుకున్నాయి. 1947వ సంవత్సరంలో ఆయన సత్తెనపల్లి శరభయ్య హైస్కూల్‌లో గ్రేడ్-2 తెలుగు పండితునిగా ప్రవేశించారు. తర్వాత ఆయన మాచర్ల జిల్లా పరిషత్ హైస్కూల్‌లో గ్రేడ్-1 పండితుడిగా ప్రవేశించారు. ఆ క్రమంలో ఆయన మాచర్ల చెన్నకేశవస్వామి గురించి చెన్నకేశవ అనే పద్యకావ్యాన్ని రచించారు. తర్వాత ఆయన 1975 వరకు పొన్నూరు భావన్నారాయణ సంస్కృత కళాశాలలో ఆంధ్రోపన్యాసకునిగా పని చేశారు. అక్కడే ఆయన ఉద్యోగ విరమణ గావించారు. ఆయన పొన్నూరులో పని చేసే కాలంలోనే ఎన్నో గ్రంథాలను రచించారు. రవీంద్రనాథ్ ఠాగూర్ రాసిన 'శాక్రిఫైజ్' గ్రంథాన్ని మూలంగా తీసుకొని రాజర్షి పద్యకావ్యాన్ని రచించారు. నాగార్జునుడు, శ్రీకృష్ణదేవరాయలు, మూర్తికవి, చిన్నయసూరి, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, త్రిపురనేని రామస్వామి, కట్టమంచి రామలింగారెడ్డి, పొట్టి శ్రీరాములు వంటి మహామహుల స్మృతి చిహ్నంగా వారి సంస్కరణ ఫలాలను ఉటంకిస్తూ దివ్య స్మృతులు అనే గ్రంథాన్ని రచించారు. బుద్ధుడు, కవి వేమన, మహాత్మాగాంధీలను సంభోదిస్తూ అల్పాక్షరాలతో అనల్పార్థాన్ని ఘటిస్తూ 'త్రిశతి' గ్రంథ రచన చేశారు. తర్వాత ఆయన జవహర్‌లాల్ నెహ్రూ ఆత్మకథనం తెలుగులోకి అనువదించారు. దానికి ఆయనకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం పురస్కారం లభించింది. 1963లో అప్పటి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జీవిత చరిత్రను గ్రంథంగా రచించి నెహ్రూకు తెలియపర్చినప్పుడు ఆయన వెంకటకవిని ఢిల్లీని పిలిపించుకున్నారు. వెంకటకవి, నెహ్రూకు మధ్య అప్పటి కేంద్ర మంత్రి శంకర్‌దయాల్ శర్మ అనువాదకునిగా వ్యవహరించారు. నెహ్రూ, వెంకటకవి పట్ల అంతులేని ప్రేమాభిమానాలు చూపి ఆయనతో ఆప్యాయతగా ఫోటోలు తీయించుకున్నారు. తర్వాత నెహ్రూ వెంకటకవిని జమ్ముకాశ్మీర్, శ్రీనగర్‌లలో హిందూ, ముస్లింల మధ్య మతసామరస్యాన్ని ప్రబోధించటానికి పర్యటించాల్సిందిగా కోరారు. వెంకటకవి, నెహ్రూ ఆదేశాన్ని శిరసావహించి తన కర్తవ్యాన్ని నిర్వహించారు. 1975లో వెంకటకవి ఉద్యోగ పదవీ విరమణ చేసిన తర్వాత సినీరంగం వైపు ఆకర్షితులయ్యారు. ఆ సమయంలో నటరత్న నందమూరి తారక రామారావు తాను నిర్మించ తలచిన దాన వీర సూర కర్ణ చిత్రానికి సంభాషణల రచియిత కోసం గాలిస్తున్నారు. ఎన్టీ రామారావుకు సన్నిహితుడైన సినీ గేయ రచయిత మోదుకూరి జాన్సన్, వెంకటకవి పేరును ఆయనకు సిఫార్సు చేశారు. అంతకుముందే వెంకటకవితో కొద్దిపాటి పరిచయం వున్న ఎన్టీఆర్ వెంకటకవిని తన మనసులో వున్న కొన్ని సూచనల ప్రకారం దాన వీర శూర కర్ణ చిత్రానికి సంభాషణలు రాయాల్సిందిగా కోరారు. ఎన్టీఆర్ సూచనల్లో ముఖ్యాంశాలు ఏమంటే చిత్రంలో స్నేహ ధర్మానికి, స్వామి ధర్మానికి ప్రాధాన్యం ఇవ్వాలన్నది. దుర్యోధనుడు దుర్మార్గుడు కాడు, కర్ణుడు నీచుడుకాడు అన్న నిజాన్ని సమాజానికి తెలియజేయాలన్నది కూడా ఒక అంశం. ఎన్టీఆర్ భావాలను తూచ తప్పక పాటిస్తూ కేవలం 20 రోజుల వ్యవధిలోనే దానవీర శూర కర్ణ చిత్రానికి అద్భుతమైన సంభాషణలు అందించారు వెంకటకవి. ఆ చిత్రం 1977 జనవరి 14న విడుదలై ఎంతో అమోఘ విజయాన్ని సాధించటం తెలియందికాదు. తర్వాత వెంకటకవి అనేక పౌరాణిక, జానపద, చారిత్రాత్మక చిత్రాలకు సంభాషణలు అందించారు. సీతారామ కళ్యాణం, తాండ్రపాపారాయుడు, ఏకలవ్య, వీరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర, మద్విరాట్‌పర్వం మొదలైన చిత్రాలతోపాటు హరిశ్చంద్రుడు అనే సాంఘిక చిత్రానికి కూడా వెంకటకవి సంభాషణ అందించారు. ఎన్నో సాహితీ పురస్కారాలు పొందారు.

మరెన్నో ఘన సన్మానాలు అందుకున్నారు. వెంకటకవి సాంఘిక దురాచారాలను నిరసిస్తూ తన చేతుల మీదుగా ఎటువంటి ఆర్భాటాలు లేకుండా సుమారు 400 వివాహాలకు పురోహితుడై జరిపించారు. వెంకటకవి తన గురువులుగా వరదాచారి, వెంకటరామశాస్త్రి, త్రిపురనేని రామస్వామిలను చెప్పుకునేవారు. వెంకటకవి 1991 ఏప్రిల్ 7వ తేదీన హైదరాబాద్ నిమ్స్‌లో కన్నుమూశారు. ఎందరో ఎందరెందరో సిద్ధుల శ్రద్ధాంజలుల మధ్య వెంకటకవి కోరిక ప్రకారం ఆయన అంత్యక్రియలు ఆయన జన్మస్థానమైన 'విప్పర్ల' గ్రామంలోనే నిర్వహించారు.

# రూ. 30 కోట్లతో రేపల్లె నియోజకవర్గ అభివృద్ధి


రేపల్లె ఎమ్మెల్యే దేవినేని మల్లికార్జునరావు

( ఆన్‌లైన్, రేపల్లె)

రేపల్లె నియోజకవర్గ సర్వతోముఖాభివృద్ధికి ఏడాదిన్నర కాలంలో 30 కోట్ల 15 లక్షల 50 వేల రూపాయలు వివిధ శాఖల నిధులు మంజూరు చేయించానని ఎమ్మెల్యే దేవినేని మల్లికార్జునరావు తెలిపారు. ఈ సందర్భంగా దేవినేని 'ఆన్‌లైన్'తో మాట్లాడుతూ పట్టణ ప్రజలకు మౌలిక సదుపాయాలు కల్పిస్తూ కనీస అవసరాలు తీర్చేందుకు ప్రత్యేక నిధులు మంజూరు చేసేందుకు కృషిచేస్తున్నానని తెలిపారు. అదేవిధంగా లంక గ్రామాలకు రవాణా సౌకర్యాన్ని మెరుగుపరిచేందుకు భట్టిప్రోలు మండలం వెల్లటూరు సమీపంలోని చినరేవు, కొల్లూరు మండలం దోనేపూడి రేవు వద్ద హైలెవల్ వంతెన నిర్మాణం చేసేందుకు కృషి జరుగుతోందన్నారు. లంక గ్రామాలలో మెట్టపైరు సాగుకు 5 కోట్ల రూపాయలతో పోతార్లంక ఎత్తిపోతల పథకం నిర్మాణానికి త్వరలో టెండర్లు పిలవనున్నారని చెప్పారు. ఎత్తిపోతల పథకం నిర్మాణం వల్ల నియోజకవర్గంలోని పోతార్లంక, తిప్పలకట్ట, తోకలవారిపాలెం, తడికలపూడి, పెదలంక, పెసర్లంక, కిష్కిందపాలెం, జువ్వలపాలెం, చింతమోటు గ్రామాలలోని ఏడు వేల ఎకరాల్లో మెట్ట సాగవుతోంది. పట్టణంలో నిర్మిస్తున్న రెండవ రక్షిత మంచినీటి పథకానికి నిధుల లేమి వల్ల పనులు ఆగిపోవడంతో ఇందుకు అవసరమైన మరో ఏడు కోట్ల రూపాయలు నిధులు మంజూరు చేశామన్నారు. ప్రస్తుతం పట్టణ ప్రజలకు పది లక్షల లీటర్ల తాగునీటిని సరఫరా చేస్తున్నారని, రెండవ రక్షిత మంచినీటి పథకం నిర్మాణం పూర్తయితే 30 లక్షల లీటర్ల నీటిని సరఫరా చేయవచ్చునన్నారు. తెనాలి పార్లమెంటు సభ్యుడు వల్లభనేని బాలశౌరి మరుగుదొడ్ల నిర్మాణానికి నిధులు మంజూరు చేసినట్టు చెప్పారు.

## రోడ్ల అభివృద్ధికి...

నియోజకవర్గంలోని రోడ్ల అభివృద్ధికి అర్ అండ్ బి శాఖ ద్వారా ఏడు కోట్ల 16 లక్షల 50 వేల రూపాయల నిధులు మంజూరయ్యాయి. తొమ్మిది రోడ్ల నిర్మాణం పూర్తికాగా, నాబార్డు నిధులు కోటీ ఆరు లక్షలతో చింతమోటు-గాజుల్లంక రోడ్డు నిర్మాణం జరుగుతోంది. వెల్లటూరు వద్ద వంతెన నిర్మాణం చేపట్టేందుకు కోటీ 37 లక్షలతో టెండర్లు పిలవనున్నారు. భట్టిప్రోలు, ఆ మండలంలోని మరో నాలుగు రోడ్ల నిర్మాణానికి టెండర్లు పిలవనున్నారు. పంచాయతీరాజ్ శాఖ ద్వారా అయిదు కోట్ల 38 లక్షల 50 వేల రూపాయలతో రోడ్లు, పాఠశాల భవనాల నిర్మాణం పనులు జరుగుతున్నాయి. మరో నాలుగు రోడ్ల నిర్మాణానికి టెండర్లు పిలవనున్నారు.

విద్యుత్‌శాఖ ద్వారా ఎనిమిది కోట్ల 20 లక్షల రూపాయలు నిధులు మంజూరయ్యాయి. జువ్వలపాలెం సబ్ స్టేషన్ నిర్మాణానికి రెండు కోట్లు, ఇంప్లిమెంటేషన్ పనులకు 20 లక్షలు, హెచ్‌విడిసి సిస్టమ్‌కు ఆరు కోట్ల రూపాయలు వెచ్చించారు. నియోజకవర్గంలో కాల్వల మరమ్మతులకు 62 లక్షలు, పంట కాల్వల రివిట్‌మెంట్లు, ర్యాంపులు, కోటిపల్లి వద్ద బ్రిడ్జి నిర్మాణానికి 43 లక్షల నిధులు వ్యయం చేశారు. ఆర్‌డబ్ల్యుఎస్ నిధులు 50 లక్షల 50 వేల రూపాయలతో జొన్నలగడ్డవారిపాలెం, పొన్నపల్లిలలో ఓవర్‌హెడ్ ట్యాంకుల నిర్మాణంతో పాటు పేటేరు, గొరిగపూడి, పొన్నపల్లి, ఉప్పూడి, ఓలేరు, పెదపులివర్రు గ్రామాలలో పైపులైన్ల విస్తరణ పనులు చేపట్టారు.

## పుష్కరాల నిధులతో...

రేపల్లె పట్టణంలో పుష్కరాల నిధులు రెండు కోట్ల రూపాయలతో అభివృద్ధి పనులు చేపట్టారు. ఎన్‌ఎస్‌డిపి నిధులు 33 లక్షలతో మురికివాడల్లో రోడ్లు, డ్రెయిన్ల నిర్మాణం చేశారు. పట్టణాభివృద్ధికి ప్రత్యేక నిధులు మూడు కోట్ల రూపాయలు మంజూరయ్యాయి. మున్సిపల్ కార్యాలయం భవన నిర్మాణానికి 35 లక్షలు, ఎంపి నిధులు 20 లక్షలతో అభివృద్ధి పనులు జరుగుతున్నాయి. ఆర్ అండ్ బి రోడ్డుకు ఇరువైపులా డ్రెయిన్ నిర్మాణానికి కోటీ 35 లక్షలు నిధులు మంజూరు చేయించారు. 20 లక్షల రూపాయలతో పట్టణ పరిధిలో రోడ్ల నిర్మాణం జరుగుతున్నదని ఎమ్మెల్యే దేవినేని మల్లికార్జునరావు స్పష్టం చేశారు. ఈ సందర్భంగా నియోజకవర్గ ప్రజలకు దేవినేని దీపావళి, రంజాన్ శుభాకాంక్షలు తెలియజేశారు.












స్వర్గీయ నందమూరి తారక రామారావు
తెలుగుదేశం పార్టీ వ్యవస్థాపకులు


శ్రీ నారా చంద్రబాబు నాయుడు
తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు


శ్రీ మాకినేని పెదరత్తయ్య
జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు


శ్రీ యరపతినేని శ్రీనివాసరావు
మాజీ ఎమ్మెల్యే - గురజాల


వేముల శివపార్వతి
3వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ


తురకా వీరాస్వామి
4వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ


బాదిశ రవికుమార్
7వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ


చల్లగుండ్ల సంతోషరావు
10వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ


కాండ్రకుంట కన్నయ్య
11వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ


మందా డానియేల్
13వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ


కొదమగుండ్ల లెనిన్‌కుమారి శ్రీనివాసరావు
15వ వార్డు కౌన్సిలర్, పిడుగురాళ్ళ


జాలకంటి సుబ్రహ్మణ్యం
16వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ


నాళం శకుంతల
18వ వార్డు కౌన్సిలర్
పిడుగురాళ్ళ

# గుంటూరు చానల్ లైనింగ్ జీఓ విడుదల

## * నెరవేరిన నగర ప్రజల చిరకాల స్వప్నం

(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ)

నగర ప్రజల మంచినీటి అవసరాలకు శాశ్వత పరిష్కారం లభించింది. ప్రస్తుతం సరఫరా అవుతున్న తాగునీటి కంటే రెట్టింపు మోతాదులో నీటి సరఫరా చేసేందుకు అవకాశం ఏర్పడింది. దశాబ్దాల తరబడి ఎదురు చూస్తున్న గుంటూరు చానల్ లైనింగ్ ప్రతిపాదనను ఆమోదిస్తూ రాష్ట్ర ప్రభుత్వం శుక్రవారం సాయంత్రం ఉత్తర్వులు విడుదల చేసింది. దాదాపుగా రూ. 29 కోట్ల విలువ చేసే ప్రాజెక్టు మంజూరు అవ్వడం కీ గుంటూరు-2 ఎమ్మెల్యే తాడిశెట్టి వెంకటరావు కృషే అని చెప్పొచ్చు. ఐదు లక్షల మంది ప్రజల అవసరాలకు ఉపయోగపడే ఈ ప్రాజెక్టు మంజూరైన విషయాన్ని రాష్ట్ర భారీ నీటిపారుదల శాఖ మంత్రి పొన్నాల లక్ష్మయ్య అధికారికంగా ప్రకటించారు. అంతేకాకుండా ఇటీవలే లైనింగ్ పనులకు శంకుస్థాపన చేసి శిలాఫలకం కూడా ఆవిష్కరించారు.

గుంటూరు చానల్‌కు సున్నా కిలోమీటర్ నుంచి తక్కెళ్ళపాడు గ్రామపరిధిలో ఉండే 25.6 కిలోమీటర్ వరకూ సిమెంటు కాంక్రీట్ లైనింగ్ ప్రతిపాదనను ఆమోదిస్తూ జీవో నెంబరు 109ని శుక్రవారం సాయంత్రం రాష్ట్ర భారీ నీటిపారుదల శాఖ విడుదల చేసింది. ఈ సమాచారం నిమిషాల వ్యవధిలో జిల్లా, కార్పొరేషన్ వర్గాలకు తెలిసిపోయింది. చిరకాల వాంఛ నెరవేరడంతో అటు అధికార, ఇటు పాలకపక్షాల్లో పండుగ వాతావరణం ఏర్పడింది. ముఖ్యంగా ప్రాజెక్టును ప్రతిపాదించిన ఎమ్మెల్యే తాడిశెట్టి వెంకటరావు, నగర పాలకసంస్థ కమిషనర్ దువ్వూరపు రామారావులు ఆనందోత్సాహాలకు గురయ్యారు. ప్రాజెక్టును ఆమోదించినందుకు మంత్రి పొన్నాలకు ఫోన్‌లో కృతజ్ఞతలు వ్యక్తం చేస్తూ గుంటూరు నగర ప్రజలు జీవితాంతం మీకు రుణపడి ఉంటారని వెల్లడించారు.



గుంటూరు చానల్ లైనింగ్ పనులకు సంబంధించిన ఫైలుపై ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డితో సంతకం చేయిస్తున్న రెండవ నియోజకవర్గం ఎమ్మెల్యే టి.వెంకటరావు

నిజానికి చానల్ లైనింగ్ ప్రతిపాదన ఇప్పటిది కాదు. గత ప్రభుత్వాల హయాంలోనే ఇది తెరపైకి రాగా ప్రతిపాదన దశలో నిలిచిపోయిందే తప్ప ఒక్క అడుగు కూడా ముందుకు కదలలేదు. సాగునీటి అవసరాలు తీర్చేందుకు ఉద్దేశించబడిన గుంటూరు చానల్ నుంచి నగరపాలకసంస్థ పెద్ద మొత్తంలో తాగునీరు తీసుకుంటుందని ప్రత్తిపాడు నియోజకవర్గ ప్రజాప్రతినిధులు గొడవ చేస్తూ వస్తున్నారు. గత ఏడాది ఒక సందర్భంలో కార్పొరేషన్‌ను కొన్నాళ్ళ పాటు నీటిని తీసుకోనీయకుండా కూడా చేశారు. ఆ సందర్భంలో నగర ప్రజలు తాగునీటి కోసం కొంత ఇబ్బందులు పడాల్సి వచ్చింది.

ఈ విషయం గ్రహించిన ఎమ్మెల్యే వెంకటరావు చానల్ లైనింగ్ ప్రతిపాదనను తీసుకుని నేరుగా రాష్ట్ర ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖర రెడ్డి వద్దకు తీసుకెళ్ళారు. పలు దఫాలు వెంటపడి చానల్ లైనింగ్ ఆవశ్యకతను సిఎంకు వివరించి చెప్పడంతో ఆయన కూడా సంతృప్తికి గురయ్యారు. ఇదే సమయంలో ఎమ్మెల్యేకు సన్నిహితుడైన మంత్రి పొన్నాల లక్ష్మయ్య కూడా చానల్ లైనింగ్ ప్రతిపాదన పట్ల సానుకూలంగా స్పందించారు. రెండు, మూడు దఫాలు సెక్రెటేరియట్ స్థాయి అధికారులతో ప్రత్యేకించి సమావేశమై చర్చించడంతో ఫైలు వేగంగా కదలింది. ప్రభుత్వానికి ప్రతిపాదించిన ఐదు నెలల వ్యవధిలోనే జీవో విడుదలవ్వడం విశేషం. రూ. 28.29 కోట్ల అంచనా విలువ కాగల ఈ ప్రాజెక్టులో నగరపాలకసంస్థ తన వాటాగా 1/5వ వంతు అంటే సుమారు రూ. 5 కోట్ల నిధులు భరిస్తుంది. మిగతా నిధులను జిల్లా నీటిపారుదల శాఖ సమకూర్చుకుంటుంది.

కార్పొరేషన్ వెచ్చించాల్సిన నిధులకు సంబంధించి 'హడ్కో' నుంచి రుణం తీసుకోనున్నట్లు కమిషనర్ రామారావు వెల్లడించారు. తక్కెళ్ళపాడులో కొత్తగా 10 ఎంజిడి ఫిల్టరేషన్ ప్లాంటు పూర్తి అయినందున చానల్ ఎంతో ఆవశ్యకమని, లైనింగ్‌తో ఇక చానల్‌లో నిరంతరం నీరు ప్రవహిస్తుంటుందని చెప్పారు. ఏడాదిలోగా లైనింగ్ పనులు పూర్తి అయితే ఈలోగా పైపులైన్లకు సంబంధించి ప్రపంచ బ్యాంకు నిధులతో పనులు పూర్తి చేస్తామని, దాంతో ఇక వచ్చే 50 సంవత్సరాల వరకూ గుంటూరు నగరానికి ఎలాంటి మంచినీటి సమస్య ఉండబోదని వివరించారు.



# మాధవపెద్దికి నటనే శ్వాస.. ధ్యాస..





మాధవపెద్ది వెంకట్రామయ్య, పక్కన దుర్యోధన పాత్రలో

(ఆన్‌లైన్, చిలకలూరిపేట రూరల్)

కళాతత్త్వాన్ని అణువణువునా జీర్ణించుకున్న స్థితప్రజ్ఞుడు... నటనే ధ్యానంగా... ధ్యాసగా... శ్వాసగా మార్చుకున్న నటనా కళాప్రపూర్ణుడు... దయాగుణం మూర్తీభవించిన పరోపకార పరాయణుడు.. మానవతారాగాలు అడుగడుగునా ధ్వనించే అమృత హృదయుడు మాధవపెద్ది భావప్రకటనా వైవిధ్యం - నటనా విధానం - అనంతరకాలంలోని నటులకు అడుగుజాడలు.. తరగని ఆస్తిపాస్తులు. రామవిలససభలో ప్రతినాయక, నాయక పాత్రల్లో మాధవపెద్ది, స్త్రీ పాత్రల్లో స్థానం వారి పతాకస్థాయి పోటాపోటీ నటనతో తెలుగు ప్రేక్షకులు పరవశించిపోయారు.

గుంటూరు జిల్లా తెనాలి తాలూకా బ్రాహ్మణకోడూరులో జన్మించిన మాధవపెద్ది తెనాలి తాలూకా హైస్కూలులో ఎస్ఎస్ఎల్‌సి వరకు విద్యను అభ్యసించారు. రసపుత్ర విజయం నాటకంతో గులాం పాత్రను పోషించడంతో రంగప్రవేశం చేసిన మాధవపెద్ది తెనాలి పూర్వ విద్యార్థిసంఘంలో సభ్యులై పలునాటకాలను ప్రదర్శించారు. మిలటరీ డిసిప్లెన్‌గా పేరుపొందిన మాధవపెద్ది రామవిలాససభలో సభ్యులుగా చేరి క్రమశిక్షణలో అందరికీ మార్గదర్శకులయ్యారు. రంగస్థలాన్ని ఆరాధ్యదైవంగా నటన ఒక తపస్సుగా భావించిన ఈ కళాతపస్వి పద్యపఠనంలో సరికొత్త బాణీని ప్రవేశపెట్టారు. మహానటులంతా కమ్మని కంఠంతో గొంతెత్తి పాటలూ, పద్యాలనూ పాడి రాగఝురిలో ఓలలాడిస్తుంటే మాధవపెద్ది భావయుక్తమైన సంభాషణా శైలిలో పద్యాన్ని పఠిస్తూ అర్థవంతమైన విరుపులతో, నేత్రాభినయంతో, సమయోచితమైన ఆంగిక చలనాలతో ప్రేక్షకులను ఆకర్షించేవారు. నటుడు పాఠం వల్లించడమే కాదు పాఠం వెనుక దాగి ఉన్న భావాన్ని... భావోద్రేకాన్ని కూడా వల్లించాలనే నాట్యశాస్త్ర భాష్యాన్ని, సంభాషణల్లోని భావాలను పిండి ప్రేక్షకులకు అందించడం ద్వారా మాధవపెద్ది తనదైన శైలిని ప్రదర్శించారు.

ప్రతాపరుద్రీయం, పాండవోద్యోగ విజయాలు, పాండవ విజయం, కురుక్షేత్రం, బొబ్బిలి యుద్ధం వంటి నాటకాలలో ప్రముఖ పాత్రలను పోషించారు. పాండవోద్యోగ విజయాలలో దుర్యోధనుడు, బొబ్బిలి యుద్ధంలో రంగారాయుడు, ప్రతాపరుద్రీయంలో ప్రతాపరుద్రుడు, వల్లీఖాన్, షోరాబు, రోషనారలో శివాజీ పాత్రలను పోషించి ప్రజాహృదయాలలో చెరగని ముద్ర వేశారు. మాధవపెద్ది రంగస్థలంపై ప్రవేశిస్తే ప్రేక్షకులు తన్మయత్వం చెందేవారు. దుర్యోధన పాత్రకు ప్రాణప్రతిష్ఠ చేసిన మాధవపెద్ది ఆ పాత్ర పట్ల ప్రేక్షకులకు స్పష్టమైన అభిప్రాయాన్ని కలిగించా రు. రాజకీయ దురంధరత్వం, స్వాభిమానం, కుటిలత్వం వంటి లక్షణాలను అసాధారణంగా ఆ పాత్రలో పోషించే వారు.

దుర్యోధనుని పాత్రను మాధవపెద్దితోపాటు యడవల్లి సూర్యనారాయణ కూడా పోషించేవారు. యడవల్లి ద్రౌపదీ వస్త్రాపహరణంలో, మాధవపెద్ది పాండవోద్యోగాలులో దుర్యోధన పాత్రను పోషించటం ద్వారా తీవ్రమైన పోటీ పడ్డారు. ఒకరిని మించి మరొకరు ప్రజాభిమానం పొందడానికి అహరహం కృషి చేశారు. రోషనార నాటకంలో శివాజీ పాత్రను బళ్లారి రాఘవ, మాధవపెద్ది పోషించారు. వీరిలో ఎవరు గొప్ప అనే విషయంపై ఆనాడు ఆంధ్రప్రదేశ్‌లో తర్జనభర్జనలు జరిగాయి. ఇరువురి శైలి ఎవరికి వారిదే అనే నిర్ణయాన్ని పండితులు ప్రకటించారు. 'రవివర్మ చిత్రించిన శివాజీ పూరం వీరి ముఖమందు సర్వాంగవిస్ఫూర్తి, ధీరోదాత్తగుణం, పవిత్రస్వాంతం, మాధవపెద్ది తన నటనలో ప్రతిబింబించారు' అని పురాణం సూరిశాస్త్రి నాట్యాంబుజం గ్రంథంలో పేర్కొన్నారు. బొబ్బిలి యుద్ధం నాటకంలో రంగారాయుడి పాత్ర మాధవపెద్ది కొరకే సృష్టించబడింది అన్నట్లు ఉండేది. ఎత్తైన భుజాలు, విశాల వక్షస్థలం, తెల్లని అంగరఖా, తెల్లని తలపాగా, నడుమున పొడవైన ఖడ్గం వేలాడుతూ వీరరస ప్రధానమైన రంగారాయుడి పాత్రను చూసి ఆశ్చర్యపడిన వెలమదొరలు పౌరుషానికి ప్రతీకగా ఖడ్గాన్ని వెండిఒరతో మాధవపెద్దికి బహూకరించారు.

ఎక్కువగా ఆంగిక చలనం లేకుండా తన మాగన్ను చూపుతో శృంగార రసాన్ని విరజిమ్మచేసే అపర మన్మథునిగా మాధవపెద్ది భాసించేవారని స్థానం వారు అభిప్రాయపడ్డారు. నాటక ప్రదర్శనలో సహజత్వం కోసం మాధవపెద్ది తాపత్రయ పడేవారు. 60 సంవత్సరాల వృద్ధాప్యంలో తెనాలి తాలూకా హైస్కూలు ఆవరణలో ప్రతాపరుద్రీయం నాటకంలో విద్యానాథుని పాత్రను పోషిస్తూ సహజత్వం కోసం అనారోగాన్ని సైతం లెక్కచేయకుండా రెండు బిందెల నీళ్లను గుమ్మరించుకొని రంగస్థలం పైకి ప్రవేశించారు. నాటకరంగంలో విశేష ఖ్యాతిని పొందిన మాధవపెద్ది చలనచిత్ర రంగంలో ప్రవేశించి ద్రౌపదీ మానసంరక్షణంలో శిశుపాలుడు, సతీతులసిలో శివుడు, విజయదశమిలో కీచకుడు, నలదమయంతిలో నలుడు, చంద్రహాసలో దుష్టబుద్ధి పార్వతీకళ్యాణంలో శివుడు పాత్రలను పోషించారు.

వేలకు వేలు నాటకాలను ప్రదర్శించినా ధనార్జనకు ఏనాడు ఆశపడక కళారంగానికే జీవితాన్ని అంకితం చేశారు. ఆంధ్రనాటక కళాపరిషత్ కార్యవర్గ సభ్యులుగా వ్యవహరించారు. గుంటూరు జిల్లాలో ఎందరో ఔత్సాహికులకు అండగా నిలిచి ఎన్నో నాటకాల ప్రదర్శనలకు వెన్నెముకగా నిలిచారు. దాదాపు 60 సంవత్సరాలు వయస్సు వరకూ ప్రతిరోజూ వ్యాయామం చేసి శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకునేవారు. తన శిష్యులను సైతం క్రమశిక్షణ బాటలో నడిపించడానికి కృషి చేశారు. మాధవపెద్దికి ఆంధ్రదేశంలో వందలాది సన్మానాలు జరిగాయి.

వృద్ధాప్యంలో ఆర్థికంగా చితికిపోయి న మాధవపెద్ది 1959 మార్చి 19న తెనాలిలో మృతి చెం దారు. తెనాలి పట్టణానికి విశేషఖ్యాతిని ఆర్జించిన మాధవపెద్ది స్మారకార్థం శాశ్వత స్మారక చిహ్నం ఏర్పాటుచేయడానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. డాక్టర్ రావి రవీంద్రనాథ్ చైర్మన్‌గా వ్యవహరించిన కాలంలో తెనాలి పట్టణం స్వరాజ్‌టాకీస్ ఎదురుగా నిర్మించిన మున్సిపల్ షాపింగ్ కాంప్లెక్స్‌కు మాధవపెద్ది షాపింగ్ కాంప్లెక్స్‌గా నామకరణం చేశారు.

# ప్రభుత్వ ఆమోదం కోసం కొత్త ఆర్‌ఒబి ప్రతిపాదన

(ఆన్‌లైన్ - గుంటూరు సిటీ) గుంటూరు-1, 2 నియోజకవర్గాలకు వారధిగా ఉన్న పాత రైల్వే ఓవర్ బ్రిడ్జి స్థానంలో కొత్త ఫోర్‌లైన్ ఆర్‌ఒబి ప్రతిపాదన ఫైలు వేగంగా కదులుతోంది. ఇప్పటికే నగరపాలకసంస్థపరంగా పరిపాలన ఆమోదం పొంది ప్రభుత్వం వద్దకు వెళ్ళి ఫైలుపై త్వరితగతిన జీవో విడుదల కావచ్చని అధికారవర్గాలు పేర్కొంటున్నాయి. రూ. 48 కోట్ల అంచనా విలువ కాగల ఆర్‌ఒబి ప్రతిపాదనను కూడా గుంటూరు-2 ఎమ్మెల్యే తాడిశెట్టి వెంకటరావు ప్రభుత్వం దృష్టికి తీసుకెళ్ళి సంప్రదింపులు జరుపుతున్నారు. ఆర్‌ఒబి విషయమై ఇప్పటికే రోడ్లు, భవనాల శాఖ మంత్రి జక్కంపూడి రామ్మోహన్‌రావుతో చర్చలు కూడా జరిపారు. సాధ్యమైనంత త్వరగా ఆర్‌ఒబి మంజూరు కాగలదని ఎమ్మెల్యే వెంకటరావు ధీమా వ్యక్తం చేస్తున్నారు. నిజానికి నగరానికి కేంద్రబిందువుగా ఉండే రైల్వేస్టేషన్ వద్ద ప్రస్తుతం 7.3మీటర్ల వెడల్పుగల ఆర్‌ఒబి ఉన్నది. 1958-59 సంవత్సరంలో అప్పటి జనాభాను దృష్టిలో పెట్టుకుని ఈ బ్రిడ్జిని చాలా తక్కువ ఖర్చుతో నిర్మించారు. అయితే ప్రస్తుతం జనాభా అప్పటికీ ఇప్పటికీ ఎన్నో రెట్లు పెరిగిపోవడంతో నిత్యం ఆర్‌ఒబిపై ట్రాఫిక్ స్తంభించిపోతుంది. అప్పట్లో నగర జనాభా 1.25 లక్షలు కాగా ప్రస్తుతం 5.14 లక్షలుగా ఉన్నది. దీనిని బట్టి పరిస్థితి అంచనా వేయొచ్చు. ఇది ప్రజలకు ఎంతో అసౌకర్యాన్ని (మిగతా 162లో)

# ప్రభుత్వ ఆమోదం కోసం కొత్త ఆర్ఓబి ప్రతిపాదన

(161వ పేజీ తరువాయి)

కలగజేస్తోంది. ఇదే సమయంలో బ్రిడ్జి జీవితకాలం కూడా పూర్తి అయింది. ప్రస్తుత పరిస్థితుల్లో బ్రిడ్జికి అత్యవసరంగా మరమ్మతులు చేయాలి. బ్రిడ్జిని విస్తరణ చేయడం కుదరదు కాబట్టి కొత్త ఆర్ఓబి ఆవశ్యకంగా మారింది.

దీనిని దృష్టిలో పెట్టుకుని హిందూ కళాశాల కూడలి వద్ద నుంచి లాడ్జీ సెంటర్ వరకూ 1.7 కిలోమీటర్ల పొడవునా ఉండే ఫోర్‌లైన్ ఆర్ఓబిని ఎమ్మెల్యే వెంకటరావు ప్రతిపాదించారు.

ప్రతిపాదిత బ్రిడ్జి పైకి హిందూ కళాశాల, కాంగ్రెస్ పార్టీ కార్యాలయం రోడ్లలో నుంచి మార్గాలు ఏర్పాటు చేస్తారు.

అలానే అమరావతి రోడ్డు, లక్ష్మీపురం రోడ్డులలోకి కూడా మార్గాలు పెడతారు.

రూ. 48 కోట్లలో కార్పొరేషన్ తన వాటాగా సగం శాతం నిధులు భరించడానికి ప్రతిపాదనతో ముందుకు రావడంతో ప్రభుత్వం ఆమోదించ వచ్చని తెలుస్తోంది. ఈ ఆర్ఓబి కనుక పూర్తి అయితే గుంటూరు నగరం రూపురేఖలే మారిపోతాయని ఎమ్మెల్యే వెంకటరావు చెబుతున్నారు.

# ప్రగతి పథంలో ఇందిరా క్రాంతి పథం - గుంటూరు జిల్లా

డా.వై.యస్.రాజశేఖర్ రెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి వర్యులు

శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్రసహకార, రవాణా శాఖామాత్యులు

శ్రీ ధర్మాను ప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జ్ మంత్రివర్యులు

శ్రీ డి. శ్రీనివాస్
రాష్ట్రగ్రామీణ అభివృద్ధి శాఖామాత్యులు

శ్రీమతి జి. జయలక్ష్మి
జిల్లా కలెక్టర్

## పేదల గుర్తింపు సంఘటిత వివరాలు :

జిల్లాలోని పేద, నిరుపేద కుటుంబాల సంఖ్య : 1,61,078
సంఘాలలో చేరిన కుటుంబాల సంఖ్య : 1,40,130
సంఘటితం ఐన వారి శాతం : 87
సంఘటితం కావాల్సిన కుటుంబాల సంఖ్య : 20,948
జిల్లాలోని మండల సమాఖ్యల సంఖ్య : 25
జిల్లాలోని గ్రామ సమాఖ్యల సంఖ్య : 576
జిల్లాలోని స్వయం సహాయక సంఘాల సంఖ్య : 13,988

## 2004 - 05 సంవత్సరానికి ఎస్. హెచ్. జి. బ్యాంకు లింకేజి :

లక్ష్యము :
భౌతికం : 5934
ఆర్థికం : 30 కోట్ల 74 లక్షల రూపాయలు

లక్ష్య సాధన :
భౌతికం : 4886
ఆర్థికం : 24 కోట్ల 27 లక్షల రూపాయలు

## శిక్షణలు :

నిరుపేదల ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి గాను వారి ఆలోచనలలో మౌలిక మార్పులను కలిగించడం శిక్షణ యొకక ప్రధాన ఉద్దేశం. ఇందుకు అవసరమైన శిక్షకులను, శిక్షణా పద్ధతులను, శిక్షణా సామాగ్రిని వెలుగు ప్రాజెక్టు పూర్తిస్థాయిలో ఏర్పాటు చేసింది. వెలుగు ప్రాజెక్టులో పనిచేస్తున్న క్షేత్ర సిబ్బందికి ఈ క్రిందివిషయాలలో శిక్షణ యివ్వడం జరిగింది.

| క్రమ సంఖ్య | కేటగిరి | శిక్షణా విషయం | శిక్షణా దినాలు | శిక్షణ పొందిన వారి సంఖ్య | మొత్తం శిక్షణా దినాలు |
|---|---|---|---|---|---|
| 1 | సి.సి.లు | ఓరియంటేషన్, పిటియం, స్వయం సహాయక సంఘాలు, ఐ.పి., లీప్, బుక్ కీపింగ్, ఆరోగ్యం పౌష్టికాహారం, వికలాంగుల సంక్షేమం | 167 | 87 | 2812 |
| 2 | | | | | |
| 3 | | | | | |
| 4 | | | | | |
| 5 | | | | | |
| 6 | ఏ.పి.యమ్‌లు | ఓరియంటేషన్, పిటియం, స్వయం సహాయక సంఘాలు, ఐ.పి., లీప్, బుక్ కీపింగ్ మరియు యస్‌హెచ్.జి, గ్రౌండింగ్, బ్యాంక్ లింకేజి | 47 | 4 | 188 |
| 7 | డి.పియమ్‌లు | | 47 | 4 | 188 |
| 8 | యం.బి.కేలు | | 39 | 22 | 858 |
| 9 | యం.టిసి.లు | ఓరియంటేషన్, పిటియం, స్వయం సహాయక సంఘాలు, ఐ.పి., లీప్, బుక్ కీపింగ్ మరియు మండల సమాఖ్య నిర్వహణకు మార్గదర్శక సూత్రాలు | 39 | 22 | 858 |
| 10 | ఎస్.ఎస్.ఎమ్.లు | | 30 | 22 | 660 |
| 11 | యాక్టివిస్టులు | | 32 | 432 | 13824 |
| 12 | యానిమేటర్లు | | 32 | 311 | 9952 |
| 13 | మండల సమాఖ్య ఆఫీస్ బేరర్లు | | 3 | 110 | 330 |
| 14 | గ్రామ సమాఖ్య ఆఫీస్ బేరర్లు | ఓరియంటేషన్,స్వయం సహాయక సంఘాలు, గ్రామ సమాఖ్య నిర్వాహణకు మార్గదర్శక సూత్రాలు, భావనలు, లీప్ | 3 | 2535 | 7605 |
| 15 | యాక్టివిస్టులు | | 3 | 1014 | 3042 |
| 16 | సి.ఆర్.పి.లు (హెచ్.ఎస్.డి.) | వినసహాయత | 3 | 60 | 180 |
| 17 | స్వయం సహాయక సంఘాలు | పదరికం, వెలుగు, స్వయం సహాయక సంఘ భావనలు, సాధనలు, కట్టుబాట్లు, నాయకత్వం, సమావేశాలు, పుస్తకాలు, పొదుపులు, నిర్ణయాలు, తగవులు | 2 | 51810 | 103620 |
| మొత్తం | | | 447 | 56433 | 144117 |

## సామాజిక పెట్టుబడి నిధి (ఆదాయం అభివృద్ధి సబ్ (ప్రాజెక్టులు) :

| క్రమ సంఖ్య | పథకం | భౌతికం (కుటుంబాల సంఖ్య) | ఆర్థికం(లక్షలలో) |
|---|---|---|---|
| 1 | ఆదాయం అభివృద్ధి (ఐ.జి.ఏ) | 10,188 | 779.47 |
| 2 | బియ్యం పరపతి విధానం | 67,000 | 177.48 |
| 3 | భూమి అభివృద్ధి మరియు కొనుగోలు | 95 | 40.49 |
| 4 | సాంఘిక అభివృద్ధి | 67 | 1.41 |
| 5 | మౌలిక వనరుల కల్పన | 500 | 0.75 |
| 6 | నిస్సహాయత | 547 | 71.18 |
| 7 | ఆరోగ్యం, పౌష్టికాహారం | 19 | 25.10 |

# విజయగాథలు

- బెల్లంకొండ మండలంలోని నాలుగు గ్రామాలలో సారా అమ్మకాలను నిషేధించడం జరిగింది.
- దాచేపల్లి మండలంలోని దాచేపల్లిలో చలి వేంద్రం ఏర్పాటు చేయడం జరిగింది.
- మాచర్ల మండలంలోని రాయవరం గ్రామంలో మంచినీటి బోరును బాగుచేయించడం జరిగింది.
- దుర్గి మండలంబిని యస్.సి కాలనీలో ఒక నిరుపేదను గుప్పెడు బియ్యం పథకం ద్వారా ఆదుకోవడం జరిగింది
- నిజాంపట్నం మండలంలో ఒక అనాథ మహిళ మరణించగా ఆమె ఇద్దరు పిల్లలకు తక్షణ సహాయంగా ఒక బస్తా బియ్యం మరియు రు.300/- నగదు అదించడం జరిగింది. ఆ పిల్లల భవిష్యత్తు కొరకు వారిని విద్యావంతులను చేయడం కోసం తగు ప్రయత్నాలు చేయడం జరుగుతోంది. అదే గ్రామంలో మంచినీటి బావిని పూడిక తీయించడానికి శ్రమదానం చేసి, పంతాయితీ వారు అందజేసిన వరలను బావిలో అమర్చడం కోసం ఆర్థిక సాయం కూడా అందించడం జరిగింది.
- గురజాల మండలంలోని మాడుగుల గ్రామంలో స్థానికంగా ఉన్న అడ్డంకులను అధిగమిస్తూ ఆర్.టి.సి బస్సు సౌకర్యం ఏర్పాటు చేయడం జరిగింది.
- మాచవరం మండలంలోని గాంధినగర్ గ్రామంలో ముగ్గురు బాలికా కార్మికులను ప్రభుత్వ హాస్టలులో చేర్చి చదువు కొనసాగించేలా చేయడం జరిగింది.
- వినుకొండ మండలంలోని శివాపురం, ఏనుగుపాలెం గ్రామాల్లో 15 మంది బాలబాలికలను స్కూళ్లలో చేర్పించడం జరిగింది. బడి మానేసిన 5 గురు బాలికలను గుర్తించి వారిని తిరిగి బడిలో చేర్పించడం జరిగింది.
- రెంటచింతల మండలంలోని పాల్వాయిగేటు గ్రామంలో నిరుపేదలైన ముగ్గురు నిస్సహాయులకు ఆర్థిక సహాయంతో పాటు, బియ్యం కూడా ఇవ్వడం జరుగుతోంది.
- అమరావతి గ్రామంలో స్థిరనివాసం ఏర్పరుచుకొన్న సంచారజాతులైన 20 కుటుంబాల గిరిజనులకు స్థానిక మండలాధికారులతో మాట్లాడి ఇళ్లస్థలాలను ఇప్పించడం జరిగింది.
- అమరావతి మండలంలోని ఉంగుటూరు గ్రామంలో బడిమానేసిన 6 గురు పిల్లలను తిరిగి స్థానిక గురుకుల పాఠశాలలో చేర్పించడం జరిగింది. అదే గ్రామంలో గ్రామసమాఖ్య భవనం కోసం సభ్యులందరూ కలసి సంఘానికి వెయ్యి రూపాయల చొప్పున చందా వేసుకొని రు.20,000/- లతో రెండు సెంట్ల స్థలం కొనుగోలు చేయడం జరిగింది.
- నూజెండ్ల మండలంలోని జె.సి.నగర్ గ్రామంలో పూర్వం పేదవారికి పంపిణీ చేసిన య.16-00 భూములకు పట్టాలు లేనందున స్థానిక మండల రెవెన్యూ అధికారి వారికి తెలియజేసి సదరు భూములకు పట్టాలు మరియు పట్టాదారు పాసు పుస్తకాలను అందించడం జరిగింది
- ఈపూరు మండలంలోని బొమ్మరాజు పల్లి గ్రామంలో తలపెట్టిన బాల్యవివాహాన్ని సంబంధిత పెద్దలతో మాట్లాడి ఒప్పించి ఆపివేయడం జరిగింది.
- కాకుమాను మండలంలోని అప్పాపురం గ్రామంలో జరిగిన అగ్ని ప్రమాదంలో ఇళ్ళు కోల్పోయిన ఇద్దరు పేద మహిళలకు ఒకరికి రు.3,000/- ఆర్థిక సహాయాన్ని మరొకరికి వంటపాత్రలను అందజేయడం జరిగింది.
- చిలుకలూరిపేట మండలంలోని కట్టుబడివారిపాలెం గ్రామంలో ఒక పేదమహిళకు గుండె ఆపరేషను గ్రామసంఘాల ఆర్థిక సాయంతో (రు.50,000/-) చేయించడం జరిగింది.

పోలా భాస్కర్
ప్రాజెక్టు డైరక్టర్ డి.ఆర్.డి.ఎ
ఇందిరా క్రాంతి పథకం

# పాపములను దహింపచేసేది 'రంజాన్'

(ఆన్‌లైన్ - వేమూరు)

**యావత్ ప్రపంచ ముస్లిం ప్రజలు రంజాన్ నెలను అతి పవిత్రమైనదిగా, పుణ్యప్రదంగా భావిస్తారు. 'రమ్జ్' అనగా దహించునది. 'రంజాన్' భక్తుల సర్వపాపములను దహించునని భావము.**

ఇస్లాం తొమ్మిదవ మాసమును రంజాన్ అంటారు. ఈ మాసమందు ప్రతి వయోజనులైన ముస్లిం స్త్రీ పురుషులు విధిగా (ఫర్జ్) పూర్తి మాసము నెల పొడుపు రాత్రి నుంచి మరల నెల పొడుపు రాత్రి వరకు 29 లేదా 30 రోజులు ఉపవాసం (రోజా) ఉంటారు. ఉపవాస దీక్ష సూర్యోదయానికి ఒకటిన్నర నిమిషాల నుంచి ప్రారంభమై సూర్యాస్తమయానికి పది నిమిషాల వరకు ఉంటారు. దీక్ష ప్రారంభమందు భుజించడాన్ని 'సహరి' అని, దీక్ష ముగించు సమయాన్ని 'ఇఫ్తార్' అని అంటారు. లౌకికతత్వం కలిగిన మన భారత హిందూ సోదరులు, ప్రభుత్వ పాలకులు, అధికారులు తమ ముస్లిం సోదరులకు ఇఫ్తార్ విందు ఇస్తూ ముస్లింల ఎడ తమ సోదర భావాన్ని, ఇస్లాం మతంపై గౌరవాన్ని చాటి చెబుతారు. రోజా అల్లా కోసమని, అల్లాయే ఉపవాస పుణ్య ఫలాన్ని స్వయంగా తన భక్తులకు ప్రసాదిస్తాడని, సర్వ ప్రాణులు 'రోజాదారు' కోసం ప్రార్థిస్తాయని, 'రోజా' సర్వ పాపములను దహిస్తుందని ముస్లింల నమ్మకం. ఉపవాసకులను ఆదరించిన, సేవ చేసినా, ఇఫ్తార్ విందు చేసినవారికి కూడా భగవంతుడు పుణ్య ఫలాన్ని ప్రసాదిస్తాడని నమ్మకం. ఉపవాసమందు ఆహార పానీయాల నిషేధంతోపాటు సర్వేంద్రియ నిగ్రహం, మనో నిగ్రహం, పాప భీతి, పేదల, అనాథల, వితంతువుల ఎడ సద్భావన కలిగి ఉంటారు. రంజాన్ మాసమందు ఖురాన్ పఠనం, శ్రవణం అతి ప్రధానం.

రాత్రి ఎనిమిది గంటల 'ఇషా' ప్రార్థనలో 'తరావిహ్' ప్రార్థనలో 'హాఫెజ్' (సంపూర్ణ ఖురాన్ గ్రంథాన్ని కంఠస్తం చేసిన వారు) నాయకత్వంలో ప్రతిరోజూ ఒక కాండము ఖురాన్ పఠనం, శ్రవణం చేస్తూ 30 దినములలో 30 కాండముల ఖురాన్ పూర్తి చేస్తారు. 'తరావిహ్' నమాజు రంజాన్ నెల ప్రారంభం నుంచి నెల అంతమయ్యే వరకు చేస్తారు. అందరు వయోజన పురుషులు ఈ 'తరావిహ్' నందు పాల్గొని ఖురాన్ పఠనాన్ని వినటం ఎంతో పుణ్యప్రదంగా భావిస్తారు.

**జకాతు :-** ముస్లింలు ఈ పవిత్రమాసమందు తమ పేద బంధువులకు, ఇరుగు పొరుగువారికి, పేదలు, వితంతువులు, అనాథలకు ధనం, ధాన్యం, వస్త్రాలు దానం చేయడం ఆనవాయితీ. 'జకాతు' అంటే కుటుంబంలోని సంవత్సర కాలం మొత్తం సంపాదనలో ఖర్చులు పోను, నిల్వ ఉన్న ఆదాయంలో 2.5 శాతం తన మనస్సాక్షిగా గుణించుకుని దానం చేయడం. ఇది ఆదాయం కలిగిన ప్రతి ముస్లిం యొక్క విధి. 'ఫర్జ్' ఈ దానము చేయనివాని ధనము అతనిని సమాధియందు విషనాగుయై భయంకర దావాగ్నియై దహించునని, బాధించునని నమ్మకము.

## అతి పవిత్రమైన 27వ రోజు

రంజాన్ నెల ఉపవాసాల సందర్భంలో 27వ రాత్రి అతి పవిత్రమైన 'షబేఖదర్' పండుగగా జరుపుకుంటారు. ఆ రాత్రి అంతా ముస్లింలు మసీదులో జాగారం చేసి ఖురాన్ పఠనం, శ్రవణం, భగవంతుని ధ్యానం, 'నఫిల్' నమాజులతో గడుపుతారు. ఈ నెలలో చేయవలసిన దాన ధర్మాలను కూడా ఈ రోజునే ఎక్కువగా చేస్తారు. 'హఫిజ్'ను, మత పెద్దలను, 'ఇమామ్'లను ఈ రోజే సత్కరించి వారి ఎడ శ్రద్ధా శక్తులను ప్రకటిస్తారు. ఈ ఒక్క రాత్రి ప్రార్థన వేయి మాసముల ప్రార్థన కంటే అధికమని ప్రవక్త మహమ్మద్ ప్రవచించారు. ఈ రాత్రి ప్రార్థనలో పాల్గొన్నవారికి దేవతలు తోడుండి భక్తులకు 'దువాకు' ఆమీన్ ఉంటారని, భక్తులతో దేవతలు కరచాలనం చేస్తారని ప్రతీతి. మాసం అంతమైన వెంటనే అనగా ఇస్లాం పదవ నెల షవ్వాల్ నెల మొదటి రోజున ఈదుల్ ఫితర్ పండుగను ముస్లింలంతా శ్రద్ధాభక్తులతో 'ఈద్గా'ల వద్ద జరుపుతారు. భగవన్నామ జపంతో వెళ్లి సామూహిక ప్రార్థన చేసి ఇస్లాం మత ఐక్యతను ప్రపంచానికి చాటి చెబుతారు. ముస్లింలంతా ఒకటేనని, అందరూ భాయి - భాయి అని నిరూపిస్తారు.



ఈ ప్రార్థనకు ప్రతి ముస్లిం కుటుంబ యజమాని తన కుటుంబ సభ్యులందరి పేరా (సేవకులతో సహా) 'ఫిత్‌రా' దానం చేస్తారు.

'ఫిత్‌రా' అనగా ఒకటి ముప్పాతిక సేర్లు. అనగా సుమారు రెండు కిలో గ్రాముల గోధుమల ధరను పేదలకు దానం చేస్తారు. 'ఫిత్‌రా'ను ధనిక, పేద అందరు ముస్లిం కుటుంబ యజమానులు విధిగా చేయాలి. ఈ 'ఫిత్‌రా' దానము చేయనిచో రంజాన్ నెల ఉపవాసాల పుణ్యం ప్రాప్తించదని అంటారు. అనగా ప్రార్థన దైవ సన్నిధానానికి చేరదని అర్థం. ఈ విధంగా ముస్లిం సోదరులు రంజాన్ మాసాన్ని గడుపుతారు. 'ఈదుల్ ఫితర్' పండుగ సంతోషంగా గడుపుతారు. ధనవంతులు పేదలకు దానం చేసి సంతోషిస్తారు. దానం పొందిన పేదలు అమితానంద భరితులై ధనవంతులతో పాటుగా సంతోషంగా పండుగ జరుపుకుంటారు.

# జాతీయ క్రికెట్‌లో జిల్లా కాంతులు

(ఆన్‌లైన్, క్రీడాప్రతినిధి - గుంటూరు)

నిరంతర కృషి, పట్టుదల, క్రమశిక్షణ వుంటే ఎంతటి కార్యాన్నయినా సాధించవచ్చని గుంటూరు జిల్లా క్రికెట్ అసోసియేషన్ క్రీడాకారులు వివిబి సరస్వతిరెడ్డి, వి.మనోజ్‌సాయి, జివి శరత్‌బాబు, మహబూబ్ భాషాలు నిరూపించారు.

శరత్‌బాబు

మహబూబ్ బాషా

మనోజ్ సాయి

సరస్వతి రెడ్డి

**సరస్వతిరెడ్డి** : 1994-95 సంవత్సరంలో అండర్-16 రాష్ట్ర జట్టుకు ఎంపికై కేరళలలో జరిగిన అంతర్ రాష్ట్ర మ్యాచ్‌లలో విశేష ప్రతిభ చూపారు. 1995-96 జమ్ములో జరిగిన సికె నాయుడు స్మారక అఖిల భారత స్కూలు గేమ్స్ క్రికెట్ పోటీల్లో పాల్గొన్నారు. 1998-99, 2000-01లలో అండర్ 16, 19, 22 రాష్ట్ర జట్టుకు ఎంపికై కర్ణాటక, గోవాలలో జరిగిన అంతర్ రాష్ట్ర క్రికెట్ పోటీల్లో వికెట్ కీపింగ్, బ్యాటింగ్‌లలో అద్భుత ప్రతిభ చూపారు. 2001 విజయవాడలో జరిగిన సౌత్ జోన్ ఇంటర్ యూనివర్శిటీ క్రికెట్ పోటీల్లో ఆచార్య నాగార్జున యూనివర్శిటీ క్రికెట్ జట్టుకు ప్రాతినిధ్యం వహించారు. 2002లో సౌత్ ఇండియన్ యూనివర్శిటీ క్రికెట్ జట్టుకు ఎంపికై అఖిల భారత అంతర్ విశ్వవిద్యాలయాల క్రికెట్ పోటీల్లో పాల్గొని నాగార్జున జట్టు గెలవటానికి తోడ్పడ్డారు. 2004వ సంవత్సరం ఆంధ్రా రంజి జట్టుకు ఎంపికై అనంతపూర్, విశాఖపట్నంలో జరిగిన మ్యాచ్‌లలో పాల్గొన్నారు.

**మనోజ్‌సాయి** : 1994లో క్రికెట్ రంగంలోకి ప్రవేశించి తనకంటూ ఒక స్థానాన్ని ఆంధ్రా క్రికెట్‌లో కల్పించుకున్నారు. 1994-95లో తొలిసారిగా అండర్-13 విభాగంలో ఆంధ్రా జట్టుకు ప్రాతినిధ్యం వహించారు. 1998-99, 2000-01 సంవత్సరాలలో అండర్-16, 19, 22 రాష్ట్ర జట్టుకు ఎంపికై గోవా, కర్ణాటక రాష్ట్రాల్లో జరిగిన అంతర్ రాష్ట్ర క్రికెట్ పోటీల్లో వికెట్ కీపింగ్, బ్యాటింగ్‌లలో ప్రతిభ చూపారు. 2002లో ఆచార్య నాగార్జున యూనివర్శిటీ క్రికెట్ జట్టుకు ఎంపికై సౌత్ జోన్ ఇంటర్ యూనివర్శిటీ పోటీలలో పాల్గొన్నారు. ఆంధ్రా ఇంటర్ జోనల్ రంజీ టీమ్ సెలక్షన్ మ్యాచ్‌లలో చూపిన ప్రతిభ కారణంగా రంజి ప్రాబబుల్స్ జట్టుకు ఎంపికై కోచింగ్ క్యాంప్‌లలో పాల్గొన్నారు. 1995లో క్రికెట్ ఆడటం ప్రారంభించిన మనోజ్‌సాయి అంచెలంచెలుగా ఎదిగి అంతర్ రాష్ట్రాల పోటీలలో బ్యాటింగ్‌లో అద్భుత ప్రతిభ చూపుతున్నారు.

**మహబూబ్ బాషా** : 2002-03లో డాక్టర్ కోడెల శివప్రసాదరావు స్టేడియం (నరసరావుపేట)లో కోచ్ మస్తాన్‌రెడ్డి వద్ద శిక్షణ ప్రారంభించి అంచెలంచెలుగా ఎదుగుతున్నారు. 2002-03, 2003-04 సంవత్సరాల్లో అండర్-13, 15 విభాగాల్లో జిల్లా జట్టుకు ఎంపికై సెంట్రల్ జోన్ పోటీల్లో పాల్గొన్నారు. విజయవాడలో జరిగిన ఇంటర్ జోనల్ మ్యాచ్‌లలో సెంట్రల్ జోన్ జట్టుకు ప్రాతినిధ్యం వహించి బ్యాటింగ్, బౌలింగ్‌లలో అద్భుత ప్రతిభ చూపి 'బెస్టు బౌలర్' అవార్డు పొందారు. బెంగుళూరులో జరిగిన సౌత్ జోన్ ఇంటర్ స్టేట్ పోటీలలో పాల్గొని బ్యాటింగ్‌లో విశేష ప్రతిభ ప్రదర్శించారు. ఆఫ్ స్పిన్నర్ బౌలర్ బాషా ఇప్పటివరకు తాను ఆడిన మ్యాచ్‌లలో దాదాపు 110 వికెట్లు తీసుకున్నారు. ఆంధ్రా జూనియర్ జట్టుకు ఎంపికై శ్రీలంకలో జరిగిన మ్యాచ్‌లో పాల్గొన్నారు.

**జివి శరత్‌బాబు** : 1998-99, 99-2000లలో అండర్-16 సెంట్రల్ జోన్ జట్టుకు ఎంపికై విశేష నైపుణ్యం ప్రదర్శించి రాష్ట్ర జట్టుకు ప్రాతినిధ్యం వహించారు. 2002-03, 2003-04లలో అండర్-19 రాష్ట్ర జట్టుకు ఎంపికై సౌత్ జోన్ జట్టుపై రెండు ఇన్నింగ్‌లలో ఎనిమిది వికెట్లు తీసుకొని తమ జట్టు విజయానికి తోడ్పడ్డారు. 2004-05 సంవత్సరంలో ఇంటర్ జోనల్ పోటీలలో సెంట్రల్ జోన్ జట్టుకు ప్రాతినిధ్యం వహించి అండర్-22 రాష్ట్ర జట్టుకు ఎంపికయ్యారు.

# పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం

(ఆన్‌లైన్-పెదనందిపాడు)

భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో బ్రిటిష్ పాలకులను గడగడలాడించిన ఉద్యమాల్లో ప్రధానమైనది పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం. భారదేశ చరిత్ర పుటల్లోనే కాక లండన్‌లో సైతం సువర్ణాక్షరాలతో లిఖితమైన ఈ ఉద్యమ రథసారథి స్వర్గీయ పర్వతనేని వీర్యయచౌదరి, జాతిపిత మహాత్మాగాంధీ పర్యవేక్షణలో వల్లాబాయ్‌పటేల్ నాయకత్వాన గుజరాత్‌లోని బార్టోలిలో, రాజేంద్రప్రసాద్ నాయకత్వంలో బీహారులోని చంపారాణ్‌లో జరిగిన పన్నుల నిరాకరణ ఉద్యమాలకన్న మిన్నగా ఒక మధ్యతరగతి రైతు కుటుంబీకుడు కూడా విద్యాభ్యాసంతో నడపడం భారత ప్రజలు గర్వించదగిన విషయం.

మన్యం ప్రాంతంలో అల్లూరి సీతా రామరాజు సాగించిన పోరాటం క్షేత్ర పూరితం కాగా, పెదనందిపాడు ఫిర్కాలో పర్వతమేని వీరయ్యచౌదరి కొనసాగించిన ఉద్యమం శాంతియుతం. వీరయ్యచౌదరి నాయకత్వంలో పెదనందిపాడు ప్రాతంలోని వంద గ్రామాల ప్రజల్లో ధీరులైన కార్యదీక్షా తత్పరులైన యువకులను ఎంపిక చేసి వీరయ్యచౌదరి 1921లో ఆరువేల మంది శాంతి సైనికులను సమీకరించారు. వీరితో ఆయన బ్రిటిష్ సైన్యాన్ని, పాలనా వ్యవస్థను స్తంభింపజేశారు. అప్పట్లో ఆయన్ని 'ఆంధ్ర శివాజీ' అని పిలిచే వారని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు బెజవాడ గోపాలరెడ్డి పెదనందిపాడు సందర్శించిన సందర్భంగా ఇక్కడి ప్రజలకు తెలియజెప్పారు. .వీరయ్యచౌదరి జిల్లా కేంద్రమైన గుంటూరుకు 30 కిలోమీటర్ల దూరాన గల అప్పటి ఫిర్కా కేంద్రం ప్రస్తుత మండల కేంద్రమైన పెదనందిపాడులో స్వర్గీయ పర్వతనేని అంకమ్మ, శ్రీమతి లక్ష్మమ్మ దంపతులకు 1886 అక్టోబరు నాలుగున జన్మించారు. చదువుతోనే చిన్నతనం నుంచి సంగీతం అభ్యసించి గాన విద్యలో సుప్రసిద్ధులయ్యారు.

ఆ ప్రావీణ్యంతో హరికథ లు చెబుతూ నాటకాలు వేస్తుండేవా రు. చిన్నతనం నుంచి ప్రజాసేవ యెడ ల ఎక్కువ మక్కువ కలిగి సంఘసేవ, సాంఘిక కార్యక్రమాలలో ఎక్కువ పాల్గొంటూ తన మిత్ర బృందంతో కలసి పోస్టాఫీసు, గ్రామపాఠశాల స్థాపనకు కృషి చేశారు. మహాత్మాగాంధీ సహాయ నిరాకరణోద్యమాన్ని పూరించి శాసనసభల ఎన్నికలు బహిష్కరించాలని ఆదేశించడంతో తన గానవిద్య, నాటక సంఘాల ద్వారా ఎన్నికలను బహిష్కరించే విధంగా ప్రజలను ఆయన ప్రభావితం చేశారు.

1921 జనవరిలో జిల్లా కాంగ్రెస్ సంఘం వీరయ్యచౌదరిని పెదనందిపాడు ఫిర్కా ప్రచారకునిగా నియమించింది. ఆయన 100 గ్రామాలలో సంఘాలు స్థాపించి అశ్వరూడుడై గ్రామాలలో తిరుగుతూ అప్పటి కాంగ్రెస్ ఆదేశాలను ప్రచారం చేసేవారు. 1936లో జాతిపిత మహాత్మాగాంధీ ప్రకాశం జిల్లా పర్చూరు వచ్చిన సందర్భంగా పర్వతనేని వీరయ్యచౌదరి సతీమణి బొల్లమ్మ తన బంగారు ఆభరణాలను అక్కడికక్కడే ఉద్యమం కోసం త్యాగం చేసి తమ తోటివారికి మార్గదర్శకురాలు అయ్యారు. 1921లో గాంధీ మహాత్ముడు శాసనోల్లంఘనాన్ని ప్రారంభించడానికి సంకల్పించారు.

ఆ సమయంలో ప్రజా హృదయాలలో రగులుతున్న స్వాతంత్ర సముపార్జన తృష్ణ పన్నుల నిరాకరణోద్యమానికి పురిగొల్పాయి. మహాత్ముడు అప్పటిలో వైస్రాయికి పంపిన లేఖలో బార్డోలితోపాటు పెదనందిపాడు ఫిర్కా నూరు గ్రామాల సమిష్టి శాసనోల్లంఘనాన్ని తాను అంగీకరించినట్లు తెలిపారు. గ్రామోద్యోగుల సహకారం లేనిది పన్నులు వసూలు చేయడం ప్రభుత్వానికి సాధ్యపడదని గ్రహించిన వీరయ్యచౌదరి ఉద్యమం ఆశించిన విధంగా సఫలీకృతం కావడానికి గ్రామోద్యోగుల సహాయ సహకారాలను కోరారు.

అప్పటి బ్రిటిష్ ప్రభుత్వంతో ఎడముఖం పెడముఖంగా ఉన్న గ్రామోద్యోగులు 1921 డిసెంబరు 26న శాంతి సైన్యంతో ఉద్యమరథసారథి సభకు వెళ్ళి వారితో సంప్రదించారు. గ్రామోద్యోగులు రాజీనామా చేసిన అనంతరం వారి పదవులు గ్రామాల్లోని వేరొకరు చేయడానికి ప్రయత్నించకుండా చూడగలనని ఆయన వారికి హామీ ఇవ్వడంతో గ్రామోద్యోగులు తమ ఉద్యోగులకు రాజీనామా చేయడానికి నిర్ణయం జరిగింది. అంతటితో అప్పటికప్పుడే సమావేశానికి విచ్చేసిన 20మంది గ్రామోద్యోగులు తమ రాజీనామాలను సమర్పించారు.

రాజీమానాలు చేసిన గ్రామోద్యోగుల స్థానంలో ఎవరైనా కొత్తవారు వచ్చి చేరిన పక్షంలో వారిని వెలివేయాలని ఆయన కట్టడి చేశారు. గ్రామాల్లో శిస్తు కట్టని వారి ఆస్తులు ప్రభుత్వం జప్తు చేసిన పక్షంలో ఆ ఆస్తులు ఎవరు కొనుగోలు చేయకుండా వీరయ్యచౌదరి గ్రామస్థులను చైతన్య పరిచారు. ఈ నేపథ్యంలో సమీపంలోని ప్రస్తుత మండల కేంద్రమైన కాకుమాను గ్రామంలో పట్టా కింద ఒకరి ఎద్దుల బండి జప్తు చేశారు.

కాకుమాను గ్రామస్థులు ఆ బండి యజమానికి పొలం లేదని చెప్పినా వినకుండా బలవంతం గా బండి తీసుకునే ప్రయత్నం చేయడంతో బ్రిటిష్ సైన్యానికి రైతులకు మధ్య ఘర్షణ జరిగింది. కాల్పుల జ రిపే పరిస్థితి ఏర్పడింది. ఈ విషయా న్ని తెలుసుకున్న వీరయ్యచౌదరి ఇరు వర్గాలను శాంతింప చేసి సమస్యను ప రిష్కరించారే తప్ప శిస్తు చెల్లించలేదు.

ముమ్మరంగా కొనసాగుతున్న ఉద్యమాన్ని నీరుగార్చడానికి స్థానిక పరిస్థితులు తెలిసిన సహకార శాఖ సూపర్‌వైజర్ జంపాల వెంకటేశంను డిప్యూటీ కలెక్టరుగా ప్రమోషన్ ఇచ్చి బ్రిటిష్ ప్రభుత్వం పెదనందిపాడు పంపారు. ఆయన పర్వతనేనికి మిత్రుడు. మిత్రుడు నిర్వహిస్తున్న ఉద్యమాన్ని అణచవలసిన బాధ్యత మరొక మిత్రుని భుజస్కంధాలపై పెట్టి బ్రిటిష్ ప్రభుత్వం తమ రాజనీతిని చాటుకున్నది. అయినప్పటికీ గ్రామాల్లో ఉద్యమంలో మార్పురాలేదు. ఉద్యమం ఇసుమంతా కూడా ఆగలేదు.

మరఫిరంగులు సమీపంలోని ప్రకాశంజిల్లా పర్చూరు (అప్పటి గుంటూరుజిల్లా)లో మొహరించినట్లు కబురు అందింది. అయినా రైతుల మనస్సులో దృఢ సంకల్పం చెక్కు చెదరలేదు. మాజీ గ్రామోద్యోగుల బ్రిటిష్ ప్రభుత్వం పుస్తకాలు స్వాధీనం చేసుకుని పన్నుల వసూలుకు కొత్తవారికి నియమించారు. ఈ విషయం తెలిసిన వెంటనే గ్రామస్థులు తమ తమ ఇంటి నెంబర్లు, గుర్తులు చెరిపివేయవలసిందిగా వీరయ్యచౌదరి ఆదేశించారు. దీనితో ఎవరి ఆస్తి ఏదో ఏ ఆస్తిని జప్తు చేయాలో అర్థం కాక బ్రిటిష్ ప్రభుత్వానికి అయోమయ పరిస్థితి ఏర్పడింది.

శిస్తు దమ్మిడి కూడా వసూలు కాలేదు. రోజు రోజుకి ఉద్యమం ఉధృతం కావడంతో 1922 జనవరి మొదటి వారంలో రోడ్లు బాగా లేనందున మరఫిరంగులు పర్చూరు గ్రామాల్లో నిలిపి కొందరు బ్రిటిష్ సిపాయిల సాయుధ పోలీసులతో నర్గీసు అనే అధికారి ఆధ్వర్యంలో సైన్యాన్ని పెదనందిపాడు పక్కన గల నాగులపాడు చింతలతోపులో దించారు. వీరిపై అధికారాన్ని జంపాల వెంకటేశంకు అప్పగించారు. సైన్యం ఉద్యమ పరిస్థితిని పరిశీలించేందుకు రూథర్‌పర్డు అను జిల్లా కలెక్టరు పెదనందిపాడు వచ్చారు. అయితే ఎలాంటి గుర్తులు కానరానందున ఇది పెదనందిపాడు గ్రామమేనా కనిపించిన వారి నల్లా అడిగి ఎలాంటి సమాచారం రాక విసిగి వేసారి పోయాడు. సమాచారం కోసం ఒక బాలుని బెదిరించినప్పటికీ అక్షరం కూడా సమచారం రాకపోవడంతో సిగ్గు చెందిన రూథర్‌పర్డ్ వెనుతిరిగి వెళ్ళిపోయారు. దీనితో భగ్గుమన్న రూథర్‌పర్డ్ పెదనందిపాడు ఉద్యమాన్ని అణచడానికి జప్తు ప్రారంభించాలని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వ చట్టసభలలో పట్టుపట్టి రెవెన్యూ రికవరీ చట్టాన్ని అమలు పెట్టారు.

ఈ నేపథ్యంలో పెదనందిపాడు పన్నులు నిరాకరణ ఉద్యమం లండన్‌లోని బ్రిటిష్ పార్లమెంటులో చర్చనీయాంశమైంది. సైనికులు గ్రామాల్లో కనబడిన ఆస్తులను జప్తు చేయసాగారు. అయితే వాటిని తీసుకొని పోవుటకు కూలీలు దొరక్క వారు భంగపడ్డారు. తమ పన్నాగాలు సాగని బ్రిటిష్ సైన్యం గ్రామాల్లో దౌర్జన్యాలకు దిగడంతో ప్రజల్లో ఉద్రేకం పెరిగింది. బ్రిటిష్ సైనికుల వల్ల హాని జరగకుండా స్త్రీలను గ్రామాల్లో ప్రతి వంద గజాలకు ఒకరి చొప్పున నిలబడి శాంతి సైన్యం కాపలా కాశారు. బ్రిటిష్ సిపాయిలు ఎలాంటి నీతిమాలిన పనులు చేసినా శాంతిసైన్యం ఓర్పు అనే తమ సాధనాన్ని ఉపయోగించి వారి ఎత్తులు సాగనివ్వలేదు. కొందరు శాంతిసైనికులు చెట్లపై నుంచి బ్రిటిష్ సైన్యం రాకపోకలను సంకేతాల ద్వారా ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి తెలిపేవారు.

వెంటనే ఆ గ్రామాల్లోని వారు అప్రమత్తులై మెలిగేవారు. బ్రిటిష్ సైన్యానికి ఎటువంటి నిత్యావసర వస్తువులు గ్రామాలలో సరఫరా కాకుండా శాంతిసైన్యం చర్యలు గొకొనడంతో వారు ఆకలికి అలమటించి పోయారు. ఆకలిబాధ తాళలేక సిపాయిలు పంటపొలాలు, కనిపించిన మొక్కజొన్న కండెలు చిలగడదుంపలు తినసాగారు. ఈ నేపథ్యంలో పండిన మిర్చిని కూడా తినే వస్తువుగా భావించి తిని మంటతో చిందులు తొక్కారు. బ్రిటిష్ సైన్యానికి ఏ వస్తువు కావాలన్న జిల్లా కేంద్రమైన గుంటూరు నుంచి తెచ్చుకోవలసిన పరిస్థితులను గ్రామస్థులు కల్పించారు. 1934 జనవరి 24న డిప్యూటీ కలెక్టరు వెంకటేశం ఉద్యమ సారథి మిత్రుడు అయిన వీరయ్యచౌదరితో సమావేశమయ్యారు. మిత్రులు వారివారి విధి నిర్వహణలో చెరొక పక్క వున్న పట్టు విడవకుండా వ్యవహరించారు. ఈ సమావేశంలో పన్నులు చెల్లించనందుకు ఆస్తులు వదులుకోవడానికి సిద్ధమేనా? అని అన్న కలెక్టరు ప్రశ్నకు బదులుగా బ్రిటిష్ తుపాకి తూటాలకు ఎదురొడ్డి నిలవడానికి కూడా సిద్ధమేనని పర్వతనేని సింహగర్జన చేసినట్లు గ్రామస్థులు చెబుతారు.

## ఉద్యమం ఆగిన తీరు

ఇంత ఉధృతంగా నిరాటంకంగా సాగిపోయిన ఉద్యమం కొందరి పెద్దల స్వార్థాలతో ఆగిపోయింది. అప్పటి కాంగ్రెస్ పార్టీ పెద్దలు పూర్తిగా సహకరించనందున ఉద్యమానికి ఎదురు దెబ్బతగిలిందని ఈ ప్రాంత ప్రజలు అభిప్రాయం ఉద్యమ రోజులలో నడింపల్లి నరసింహరావు, గొల్లపూడి సీతామ శాస్త్రి వంటి పెద్దలు సహకరించ లేదని నేటికి ఈ ప్రాంతంలో విమర్శ వున్నది. ఈ పరిస్థితుల్లో 1922 జనవరి 26న గుంటూరులోని కొండా వెంకటప్పయ్య ఇంట్లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సమావేశం జరిగింది.

ఈ సమావేశానికి ఢిల్లీ షరతులతో కూడిన విధంగా ఉద్యమాన్ని జయప్రదంగా సాగించే అవకాశం ఉన్నదని మీరు నమ్మితే నేడు అడ్డురాను అని గాంధీజీ సమావేశానికి సందేశం పంపడం జరిగింది.

అప్పుడు ఢిల్లీ షరతులతో పన్నులు నిరాకరణ ఉద్యమం సాగించడానికి అవకాశం వున్నదోలేదో విచారించి నివేదించడానికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సమావేశంలో ఒక కమిటీని నియమించింది. 1922 జనవరి 31న కాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గం బార్డోలి

( మిగతా 167వ పేజీలో)

# లోక్‌సభ సభ్యుల వివరాలు

| | | |
|---|---|---|
| **1952 లోక్‌సభ** | | |
| గుంటూరు | ఎస్‌విఎల్ నరసింహం | స్వతంత్ర |
| నరసరావుపేట | జి రామయ్యచౌదరి | స్వతంత్ర |
| ఒంగోలు | పివి రాఘవయ్య | స్వతంత్ర |
| తెనాలి | కె.రఘురామయ్య | కాంగ్రెస్ |
| **1957 లోక్‌సభ** | | |
| తెనాలి | ఎన్‌జి రంగా | కాంగ్రెస్ |
| గుంటూరు | కె.రఘురామయ్య | కాంగ్రెస్ |
| ఒంగోలు | ఆర్.నారపరెడ్డి | కాంగ్రెస్ |
| మార్కాపురం | సి.బాలిరెడ్డి | కాంగ్రెస్ |
| **1962 లోక్‌సభ** | | |
| గుంటూరు | కె.రఘురామయ్య | కాంగ్రెస్ |
| మార్కాపురం | జి.యలమందారెడ్డి | కమ్యూనిస్టు |
| ఒంగోలు | ఎం.నారాయణస్వామి | కమ్యూనిస్టు |
| తెనాలి | కొల్లా వెంకయ్య | కమ్యూనిస్టు |
| **1967 లోక్‌సభ** | | |
| ఒంగోలు | కొంగర జగ్గయ్య | కాంగ్రెస్ |
| గుంటూరు | కె.రఘురామయ్య | కాంగ్రెస్ |
| నరసరావుపేట | మద్ది సుదర్శనం | కాంగ్రెస్ |
| **1971 లోక్‌సభ** | | |
| గుంటూరు | కె.రఘురామయ్య | కాంగ్రెస్ |
| నరసరావుపేట | మద్ది సుదర్శనం | కాంగ్రెస్ |
| **1977 లోక్‌సభ** | | |
| గుంటూరు | కె.రఘురామయ్య | కాంగ్రెస్ |
| తెనాలి | ఎం.నాగేశ్వరరావు | కాంగ్రెస్ |
| బాపట్ల | పి.అంకినీడు ప్రసాదరావు | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కె.బ్రహ్మానందరెడ్డి | కాంగ్రెస్ |
| **1980 లోక్‌సభ** | | |
| గుంటూరు | ఎన్‌జి రంగా | కాంగ్రెస్ |
| తెనాలి | ఎం.నాగేశ్వరరావు | కాంగ్రెస్ |
| బాపట్ల | పి.అంకినీడు ప్రసాదరావు | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కె.బ్రహ్మానందరెడ్డి | కాంగ్రెస్ |
| **1984 లోక్‌సభ** | | |
| గుంటూరు | ఎన్‌జి రంగా | కాంగ్రెస్ |
| తెనాలి | ఎస్.వెంకటరత్నం | తెలుగుదేశం |
| బాపట్ల | చిమటా సాంబు | |
| నరసరావుపేట | కె.నారాయణస్వామి | తెలుగుదేశం |
| **1989 లోక్‌సభ** | | |
| గుంటూరు | ఎన్‌జి రంగా | కాంగ్రెస్ |
| తెనాలి | ఎస్.బసవపున్నయ్య | కాంగ్రెస్ |
| బాపట్ల | ఎస్.బెంజిమన్ | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కెవి కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |
| **1991 లోక్‌సభ** | | |
| గుంటూరు | లాల్‌జాన్‌భాషా | తెలుగుదేశం |
| తెనాలి | డాక్టర్ యు.వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| బాపట్ల | డాక్టర్ డి.వెంకటేశ్వరరావు | తెలుగుదేశం |
| నరసరావుపేట | కెవి కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |
| **1996 లోక్‌సభ** | | |
| గుంటూరు | రాయపాటి సాంబశివరావు | కాంగ్రెస్ |
| తెనాలి | టి.శారద | తెలుగుదేశం |
| బాపట్ల | డాక్టర్ యు.వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| నరసరావుపేట | కోట సైదయ్య | తెలుగుదేశం |
| **1998 లోక్‌సభ** | | |
| గుంటూరు | ఆర్.సాంబశివరావు | కాంగ్రెస్ |
| తెనాలి | పి.శివశంకర్ | కాంగ్రెస్ |
| బాపట్ల | ఎన్.జనార్ధన్‌రెడ్డి | కాంగ్రెస్ |
| నరసరావుపేట | కె.రోశయ్య | కాంగ్రెస్ |
| **1999 లోక్‌సభ** | | |
| గుంటూరు | యంపరాల వెంకటేశ్వరరావు | తెలుగుదేశం |
| బాపట్ల | దగ్గుబాటి రామానాయుడు | తెలుగుదేశం |
| నరసరావుపేట | నేదురుమల్లి జనార్ధనరెడ్డి | కాంగ్రెస్ |
| తెనాలి | డాక్టర్ ఉమ్మారెడ్డి వెంకటేశ్వరు | తెలుగుదేశం |
| **2004 లోక్‌సభ** | | |
| గుంటూరు | రాయపాటి సాంబశివరావు | కాంగ్రెస్ |
| బాపట్ల | దగ్గుబాటి పురంధరేశ్వరి | కాంగ్రెస్ |
| నరసరావుపేట | మేకపాటి రాజమోహనరెడ్డి | కాంగ్రెస్ |
| తెనాలి | వల్లభనేని బాలశౌరి | కాంగ్రెస్ |

# పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం

(166వ పేజీ తరువాయి...)

తాలూకాలో సమిష్టి శాసనోల్లంఘనకు గాంధీ మహాత్ముడు ఉద్యమం ప్రా రంభించబోతున్నందున ఆయన అనుమతి లేనిదే ఏ ఇతర ప్రాంతాల్లో అట్టి ఉద్యమం జరగకూడదని ఆదేశించారు. 1922 ఫిబ్రవరి 11న ఆంధ్రరాష్ట్ర కాం గ్రెస్ గుంటూరులో సమావేశమై కాంగ్రె స్ వర్కింగ్ కమిటీ ఆదేశం దృష్ట్యా పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని విరమించాలని తీర్మానించారు.

దీనితో ఈ ప్రాంత ప్రజలు హతాశులయ్యారు. గ్రామోద్యోగులు తమ విధుల కు హాజరయ్యారు. ప్రజలు పన్నులు యథావిధిగా చెల్లించారు. ఆంధ్ర శివా జీ పర్వతనేనిని అరెస్టు చేసి బ్రిటిష్ పా లకులు గుంటూరు తరలించారు.

అనంతరం వీరయ్యచౌదరి ఉద్యమాల జోలికి పోకుండా గాన సభలతో సంగీత కచ్చేరీలతో ప్రజలను ఉత్తేజ పరుస్తూ కాలం గడుపుతూ 1970 ఫిబ్రవరి ఆరున పరమదించారు.

స్వాతంత్ర్యం సిద్ధించిన అనంతరం జరిగిన కమ్యూనిస్టు ఉద్యమాల్లో కూడా పెదనందిపాడు తన ప్రత్యేకతను చాటుకొన్నది. కమ్యూనిస్టు ఉద్యమానికి పెదనందిపాడుకు చెందిన మాజీ పార్లమెంటు సభ్యులు స్వర్గీయ కొల్లా వెంకయ్య ప్రధాన పాత్ర నిర్వహించారు. భారతదేశ స్వాతంత్ర్య స ముపార్జనలో ఒక గ్రామం కరుడుగట్టిన బ్రిటిష్ పాలకులను సైతం వణికించిన చరిత్ర పెదనందిపాడుకు ఉన్నప్పటికీ ఈ ప్రాంత అభివృద్ధికి అనంతరం వచ్చిన ప్రభుత్వాలు చేసిన కృషి శూ న్యం అని చెప్పాలి.

నేటికీ వరదలు ముంపు నివారణకు రైతాంగం నల్లమ డ వాగు అభివృద్ధికై ఉద్యమాలు చేపట్టి ప్రభుత్వాల దృష్టిలో సమస్య తీవ్రతను తెలియచెప్పాల్సిన దుస్థితి నెలకొన్నది.

# కృష్ణా తీరం వెళితే ఆధ్యాత్మిక భావనే...

(ఆన్‌లైన్, తాడేపల్లి)

గుంటూరు జిల్లా ముఖద్వారమైన సీతానగరం అనగానే పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరు స్వామి వారు, ఆయన పర్యవేక్షణలో నడుపబడుతున్న జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ వారి వేద విశ్వవిద్యాలయం తప్పక జ్ఞప్తికి వస్తుంది. జీయర్ స్వామి వారి ఆశీస్సులతో, వేద నాదాలతో కృష్ణాతీరం పులకిస్తుందనుట అతిశయోక్తి కాదేమో!

మనం భగవతావతారాల గురించి దివ్య పురుషుల ఆచార్యుల గురించి, వెనుకటి కథలు, పురాణాలు ఎన్నో విని వున్నాము. కాని వాస్తవంగా మన కన్నుల ముందు కదులాడుతున్న జీయరు స్వామి వారి వంటి దివ్య మూర్తుల అనుభవానికి చాలా అరుదుగా రాగలుగుతాము. శ్రీ స్వామి వారు వైదిక ధర్మకు వివిధ శాఖలలో నిష్ణాతులైన భారతీయ ఆచార్యులలో ఒకరు.

1956లో దీపావళిన తూర్పుగోదావరి జిల్లా ఆర్తమూరులో జన్మించిన శ్రీస్వామి వారు చాలా స్వల్ప కాలంలోనే వేదాంతం అధ్యయనం చేశారు. నడిగడ్డ పాలెంలో పరమహంస పరివ్రాజకులు శ్రీశ్రీశ్రీ పెదజీయరు స్వామి వారు, శ్రీ ఉ. వే. శ్రీమాన్ తె. కం. గోపాలాచార్య స్వామి వార్ల పర్యవేక్షణలో వేదాంతాన్ని అధికరించి అనంతరం ఉభయ వేదాంత ఆచరాయ పీఠాన్ని అధిరోహించారు.

1980లో శ్రీశ్రీశ్రీ పెదజీయరు స్వామి వారు సిద్ధిపొందిన తరువాత ఆధ్యాత్మికా చర్య పరంపరలో అనంతర ప్రాతినిధ్యాన్ని స్వీకరించారు. 1981లో శ్రీస్వామి నడిగడ్డపాలెంలో మధుభయ వేదాంతాచారి పీఠానికి సంపూర్ణోత్తరాధికారులైనారు. శ్రీస్వామి బదరీ క్షేత్రాన్ని చేరి నారాయణుని సన్నిధిలో అష్టాక్షరీ మహామంత్రాన్ని అనుష్టానం చేశారు. అప్పటి నుంచి సర్వతోముఖంగా తమ ఆధ్యాత్మిక ప్రచార కార్యక్రమాలను రూపొందించుకున్నారు. అన్ని పుష్కరాల సమయంలో శ్రీస్వామి వారు బ్రహ్మయజ్ఞాలు, యాత్రికులకు వసతి, అన్నదాన కార్యక్రమాలు చేయటం ఆయన సేవా భావానికి నిదర్శనం.

ఇటీవల కృష్ణానదిలో జీయరు స్వామి వారి ఆధ్వర్యంలో కృష్ణా వసంతోత్సవ కార్యక్రమం ఘనంగా జరిగింది. దేశ సుభిక్షతకు, వర్షాభావ పరిస్థితులను ఎదుర్కొనేందుకు, శాంతి కోసం గోపూజ, నదీ పూజ వంటి కార్యక్రమాలు, యజ్ఞాలు వేలాది మంది భక్తులు, పండితుల సమక్షంలో నిర్వహించారు.

## వేద విశ్వవిద్యాలయ ఆవిర్భావం(జెట్)

జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో 1984లో వైదిక విజ్ఞానాన్ని విశ్వతోముఖం చేసే లక్ష్యంతో వేద శాస్త్ర అభివృద్ధి ధ్యేయంగా సీతానగరం వద్ద కృష్ణానదీ తీరంలో గల జీయరు స్వామి వారి ఆశ్రమం ప్రాంగణంలో స్వామి పర్యవేక్షణలో వేద విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయబడింది.

అనేక మంది పిల్లలు ఈ వేద విశ్వవిద్యాలయంలో చేరి ఉపనిషత్తులు, వేదాంగాలు, ఇతిహాస పురాణాలు, బ్రహ్మసూత్రాలు, రామాయణం, వేదాంతశాస్త్రాలు నేర్చుకుంటారు. తర తమ బేధం లేకుండా ట్రైబల్స్‌కు సైతం విద్యనందించాలనే ధ్యేయంతో ఆదిలాబాద్ జిల్లాలోని అల్లంపల్లిలో స్వామి వారి పర్యవేక్షణలో జీయరు గురుకులం సైతం స్థాపించబడింది.

విజయనగరంలో అంధ విద్యార్థులకోసమై నేత్ర విద్యాలయాన్ని జెట్ ఆధ్వర్యంలో స్థాపించారు. వేద విశ్వవిద్యాలయం ఇప్పటి వరకు 7 శాఖలను రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో విస్తరింపజేసింది. గుంటూరు జిల్లాలోని సీతానగరం, నడిగడ్డపాలెం, నెల్లూరు జిల్లాలోని సోమశిల, నర్శింహులుకొండ, కృష్ణా జిల్లాలోని జగ్గయ్యపేట, నల్గొండ జిల్లాలోని మేళ్ళ చెరువు, ఖమ్మం జిల్లాలోని కల్లూరు, ఉత్తరప్రదేశ్‌లోని ఋషికేష్‌లోను శాఖలను ఏర్పాటు చేసి వేద విజ్ఞాన అభివృద్ధికి విశ్వవిద్యాలయం కృషిచేస్తుంది. విద్యార్థుల సంపూర్ణ నివాస, భోజన వసతి బాధ్యతలు విశ్వవిద్యాలయమే స్వీకరిస్తుంది. అంతేకాకుండా వేద విద్య అధ్యయనం పూర్తి అయిన తరువాత విద్యార్థులకు సర్వతోభద్రమైన జీవనాన్ని సైతం ఈ విశ్వవిద్యాలయం అందిస్తుంది.

కాగా సీతానగరంలోని వేద విశ్వవిద్యాలయంలో వేదాలను నిక్షిప్తం చేసేందుకై కంప్యూటర్ సెంటర్‌ను ప్రారంభించారు. వేదాలను రికార్డు చేసే రీసెర్చ్ ప్రాజక్టు 'ఆలోక్'ను, వేదాలను గురించి పరిశోధన చేసే పరిశోధనాలయాన్ని, ప్రేయర్ హాల్, తీర్థసదనంలను ఏర్పాటు చేశారు.

## విద్యార్థుల ప్రతిభ

వేద సంస్కృతి ఎంతో పురాతనమైనది. విజ్ఞాన సంపద కలదనే విషయం తెలిసినదే. నిజానికి వేదం 1130 శాఖలను కలిగి వుండగా విదేశీ పాలన కాలంలో మనలోని అశక్తత, నిర్లక్ష్యం వలన వేదంలో 99 శాతం అంతరించిపోయింది. మిగిలిన వేద శాఖలను రక్షించుకోవలసిన బాధ్యత మనకుండగా అందుబాటులో వున్న 11 శాఖలలో ఆరు శాఖలను వేద విశ్వ విద్యాలయం భద్ర పరచడం విశేషంగా పేర్కొనవచ్చు.

యజుర్వేదంలో ఎంతో అరుదైన మైత్రాయిని శాఖను వేద విశ్వవిద్యాలయం నుంచే నలుగురు విద్యార్థులు అధ్యయనం చేయడం విశేషం. ఈ శాఖలో నిష్ణాతులైన వేద పండితులు ఇంత వరకు మన దేశంలో కేవలం ఇద్దరు మాత్రమే వున్నారు. ఒకరు మహారాష్ట్రలోని నాసిక్‌లోను, మరొకరు తమిళనాడులోని చిదంబరంలో వున్నారు. పై నలుగురికి కృష్ణ యజుర్వేద మూలంను ఇక్కడే పూర్తి చేయించి చిదంబరంకు పంపగా, అక్కడ మైత్రాయిని వేద పండితులై ఇక్కడికి వారు తిరిగివచ్చారు. దీనితో ఆ శాఖ విస్తరించేందుకు మరో నాలుగు నూతన పుష్పాలు వికసించాయి.

విద్యార్థులందరూ ఉపాహారం, సంధ్యావందనం వంటివి చేస్తూ వేదాలను నేర్చుకుంటూ కృష్ణాతీరాన్ని వేదనాదాలతో పులకింపజేస్తున్నారు. వేద విశ్వవిద్యాలయం అభివృద్ధికి జెట్ కమిటీ వారు కూడా మంచి చేయూతనిస్తున్నారు.

శ్రీ స్వామి వారి మంగళాశాసనాలు వినేందుకు రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుంచి భక్తులు సీతానగరం విచ్చేస్తుంటారు.

అంతేగాకుండా కృష్ణా పుష్కరాల సందర్భంగా కరకట్ట వద్ద కృష్ణా నదీ తీరంలో ఏర్పాటు చేసిన బ్రహ్మ యజ్ఞ ప్రాంగణంలో చినజీయరు స్వామి వారు 12 రోజులు చెప్పిన మంగళాశాసనాలు వినేందుకు పలు ప్రాంతాల నుంచి అశేషంగా భక్తులు విచ్చేశారు. ఏది ఏమైనా వేద విద్యార్థుల వేదనాదాలతో కృష్ణాతీరం పులకిస్తుందనుటలో అతిశయోక్తి లేదు.

శ్రీనాథకవి శిరస్సీమ నట్టువ ద్రొక్కు
దీనారములకు మదింపు గట్టి
బాలచంద్రుని లేత పచ్చలపడిబాకు
మొలిపించు యశము గాదెలకు బోసి
యెఱగడ్డపాటిలో నొఱిగిన తెలుగు
మన్నీల శార్యంబు మానికల గొలిచి
వేమన్న యోగి గుపిన్న జాలువాకైతే
తులము వేయి వరాలు విలువసెప్పి

భాస్కరుని దానధారా ప్రవాహసమితి
నబ్దినానధున కిడి వివాహం బొనర్చి
పేరు మోసిన వీర గుంటూరు క్షితికి
సతులోనర్పని యాంధ్ర మానసముగలదె

ఏసకొంచెములేని హృద్యంగమంబైన సిసలైన తెనుగు రంజిల్లు చోటు
కట్టులో బొట్టులో కడప్మసీమల యందు
నగ్రతాంబూలంబు నందగు చోటు
ఆజానుబాహువులై కోరమీసాల
మగవారు దండిగా మసలుచోటు
కంటికింపైన చక్కని అందగత్తియ
లింటింట విద్యుత్తులీనుచోటు

ఆవల పల్నాడు కొండవీడివల నిలిచి
జనన మెత్తిన చిరుత బాలునకు కూడ
గురువులై వీరగాథలు గరపుచోటు
వీర భాషాభిరామ గుంటూరు సీమ

– గుర్రం జాషువా

ఏనుగులే గుంపులుగా
తానమాడు పెనుగుంటలు
పెక్కులున్న ఊరుగాన
పేరువచ్చె గుంటూరే !
తెలుగుచోళ మన్నెరికము
వెలుగుచున్న కాలమందు
దండ నాథుడధివసించు
స్థావరమీ గుంటూరే.

తనవైపున గతమందున
కొనసాగిన చరితనుండి
వివిధ రాజ్య గాథలెన్నో
వినిపించును గుంటూరే
తన ముంగిట నదిగట్టున
మునుపెన్నడో విలసిల్లిన
విశ్వకళాక్షేత్రమ్మును
వీక్షించెను గుంటూరే

– ధనేకుల







# ప్రగతి పథంలో గుంటూరు జిల్లా సహకార కేంద్రబ్యాంకు

## రైతన్నకు బాసట - జిల్లా అభివృద్ధికి బంగారు బాట





డా॥ వై.యస్.రాజశేఖరరెడ్డి
ముఖ్యమంత్రివర్యులు



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణా శాఖామాత్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జి మంత్రి



## 167 సహకార సంఘముల ద్వారా రైతన్నకు సహాయ సహకారాలు

### బ్యాంకు ప్రగతి వివరములు

| వివరములు | 2003-04 సం॥ (రూ లక్షలు) | 2004-05సం॥ (రూ లక్షలు) |
|---|---|---|
| 1. షేరు ధనము | 3589.26 | 3659.40 |
| 2. రిజర్వులు | 1090.24 | 1120.95 |
| 3. స్వంత నిధులు | 4680.10 | 4780.35 |
| 4. డిపాజిట్లు | 17173.18 | 15413.94 |
| 5. అప్పులు మంజూరు | 42053.24 | 42816.12 |
| 6. నికర లాభము | 111.31 | 128.03 |

### రైతున్నకు ఋణ సహాయం

2004-05 ఖరీప్ సీజన్‌కు 63071 మందికి రూ 10500 లక్షలు ఋణములు మంజూరు చేయడమైనది.

తీసుకొన్న అప్పులు సక్రమముగా వాయిదా లోపల చెల్లించిన ప్రతి రైతునకు ప్రోత్సాహకము రూ 5000 అదనపు అప్పుగా 38425 మందికి రూ 1684 లక్షలు మంజూరు చేయడమైనది.

ఇంకను 10000 మంది కొత్త సభ్యులకు రూ 500 లక్షలు అప్పు మంజూరు చేయుటకు ప్రణాళికలు సిద్ధం చేయబడినది. రైతుమిత్ర గ్రూపులకు రూ 600 లక్షలు, స్వయం సహాయక బృందాలకు రూ 600 లక్షలు మంజూరు చేయుటకు నిర్ణయం తీసుకొనడమైనది. అంతేకాక దీర్ఘకాలిక ఋణముల క్రింద, ట్రాక్టరు కొనుగోలు, సెకండ్ హ్యాండ్ ట్రాక్టరు కొనుగోలు, ట్రాక్టరు రిపేర్లు, పండ్లతోటల పెంపకము, డ్రిప్ ఇరిగేషన్, ఆయిల్ యింజన్లు, ఎలక్ట్రిక్ మోటార్లు పైపులైన్ల నిమిత్తం రూ 3200 లక్షలు మంజూరు చేయుటకు నిర్ణయించడమైనది.

### కరువు రైతుకు బ్యాంకు ఊరట

కరువు రక్కసితో అల్లాడిన రైతన్నకు బ్యాంకు 30319 మందికి రూ 696868372 దీర్ఘ కాలిక ఋణములను రీ షెడ్యూలు చేయడం జరిగినది. అంతేకాక స్వల్పకాలిక ఋణముల క్రింద 95333 మందికి రూ 1489218461 రీ షెడ్యూలు చేయడం జరిగినది.

### రైతన్నకు ప్రభుత్వ వడ్డీ రాయితీ

| | | |
|---|---|---|
| 2003-04 | 5% రిబేట్ | 76670 మందికి రూ 45885327 |
| 2004-05 | 6% రిబేట్ | 71752 మందికి రూ 48499155 |

అందించడం జరిగినది.

### రైతన్నలకు ఎరువుల విక్రయం

32 సంఘముల ద్వారా 3900 మెట్రిక్ టన్నుల ఎరువులు సరఫరా చేయడమైనది.

### జిల్లా కేంద్ర సహకార బ్యాంకులో పొదుపు - బంగారు భవితకు మదుపు

ఆకర్షణీయమైన వడ్డీ, ఇన్సూరెన్స్ రూ 100000 వరకు

| | | |
|---|---|---|
| 15 రోజుల నుండి | 45 రోజుల వరకు | 4.50% |
| 46 రోజుల నుండి | 90 రోజుల వరకు | 5.00% |
| 91 రోజుల నుండి | 179 రోజుల వరకు | 5.50% |
| 180 రోజుల నుండి | 1 సం॥లోపు | 6.00% |
| 1 సం॥ ఆపైన | 2 సం॥ల లోపు | 6.50% |
| 2 సం॥ | మరియు | ఆపైన బడిన |
| కాలమునకు | 7.00% | |

**రూ. 15 లక్షల ఏకమొత్తము డిపాజిటునకు**

| | |
|---|---|
| 1 సం॥ ఆపైబడిన కాలమునకు | 0.50% |
| 2 సం॥ ఆపైబడిన కాలమును | 0.75% |

అధిక వడ్డీ చెల్లించబడును



శ్రీమతి జి.జయలక్ష్మి
కలెక్టర్, గంటూరు జిల్లా



శ్రీ జె.నారాయణ
జనరల్ మేనేజర్








కొండపై నుండి బెల్లంకొండ ఏరియల్ వ్యూ

# నాటి బిలంకొండే... నేటి బెల్లంకొండ

(ఆన్‌లైన్, పిడుగురాళ్ళ)

ప్రతి ఊరికి ఒక చరిత్ర ఉంటుంది. వింటూ పోతే చాలా విచిత్రమనిపిస్తుంది. ఈ ధరా మండలంలో గడిచిపోయిన చరిత్ర అంతరిస్తూనే దాని గుర్తులను విడిచిపెట్టి వెళ్ళిపోతుంది. గతకాలపు పొరల కిందదాగిన చారిత్రక ఆధారాలను పట్టుకుంటే ఆ ఊరి పుట్టు, పూర్వోత్రాలు ఇట్టే తెలిసిపోతాయి. గ్రామాల చరిత్రను, వాటినామాల నేపథ్యాన్ని వివరించే చిన్న ప్రయత్నమే ఈ 'గ్రామనామం'.

గుంటూరు జిల్లాలోని చారిత్రాత్మక ప్రదేశాల్లో పెదకూరపాడు నియోజకవర్గంలోని బెల్లంకొండ ఒకటి. కృష్ణానది దక్షిణతీరంలో విస్తరించుకున్న ప్రాంతమిది. చుట్టూ చిట్టడివి. నల్లని కోటగోడల్లా పొడవుగా నిలిచివున్న కొండలు. దుప్పు చెట్లు. రాతిమయమైన నేలతో బెల్లంకొండ చూడటానికి చాలా ఆహ్లాద భరితంగా ఉంటుంది. దీని చరిత్ర చాలా పురాతనమైనది. ఇతిహాస కథలతో ముడిపడి రాచరిక పాలనతో కళకళలాడిన ప్రదేశమిది.



రాజులకు తాగునీరిచ్చిన రాతి కొలను

## నాడు 'బిలం'కొండ

ప్రస్తుతం బెల్లంకొండగా పిలవబడుతున్న గ్రామం నాడు బిలంకొండగా పిలవబడింది. ఇక్కడి కొండమీది భౌగోళిక స్థితిని బట్టి, బిలం, దొన, ఎత్తయిన శిఖరాలతో నింపి దుర్గమారణ్యంగా ఉండేది. వీటన్నింటితో నిండిన కొండ కాబట్టే దీనిని 'బిలం'కొండగా పిలిచారు. కొండమీద నుండి చూస్తే కనుచూపుమేర కృష్ణానది ప్రవాహ దశ కనులకు విందుచేస్తుంది. ఆనందంతో మనిషిని తన్మయత్వంలో పడేసే పచ్చనిచెట్లు, ఆహ్లాదకరమైన వాతావరణం, బండలోనుండి ఊరే స్వచ్ఛమైన నీరు, తేనకంటే తీపిని కలిగిన నీరు ఇక్కడ ఇప్పటికీ కనపడతాయి. ఏకాగ్రతకు, ప్రశాంతతకు నిలయంగా ఉన్న ఈ ప్రదేశంలో భృగుమహర్షి ఆశ్రమాన్ని నెలకొల్పి తపస్సును ఆచరించినట్లు చరిత్ర చెబుతోంది. ఆయనతోపాటు మరెందరో ఋషులు, తపస్సంపన్నులు ఈ కొండమీది గుహల్లో, బిలంలో తపస్సు చేసుకుంటూ ఆత్మానందం, చైతన్యం పొందినట్లు చరిత్ర చెబుతోంది. క్రీ.శ. 1050 నుంచి క్రీ.శ.1290 వరకు వెల్లనాడు, పల్లవనాడులలోని ఈ బిలంకొండ రెండవ గొంకరాజు సామంత రాజ్యంగా ఉంటూ వచ్చిందని తెలుస్తుంది.



కొండపై కోటలోకి స్వాగతం పలికే రాతి దర్గా

## ఇతిహాసాలలో ఇది ఏకచక్రపుర అగ్రహారం !

బిలంకొండ నుండి బెల్లంకొండగా పిలవబడుతున్న ఈ ప్రదేశం ఇతిహాసాల్లో కూడా స్థానాన్ని దక్కించుకుంది. ఇతిహాసాల్లో ఈ బిలంకొండను ఏకచక్రపుర అగ్రహారంగా వ్యవహరించారు. మహాభారత కాలంనాటి పుటలను తిరగేస్తే ఈ బిలంకొండలో పంచపాండవులు నివశించినట్లు తెలుస్తోంది. పంచపాండవులు అరణ్యవాసం చేస్తూ కొంతకాలం ఇక్కడ నివశించారని, అప్పట్లో బ్రాహ్మణ వేషధారులై ఒక బ్రాహ్మణోత్తముని ఇంట ఆశ్రయం పొందారని చెప్పబడుతోంది. ఇక్కడే కొండమీద బకాసురుడు అనే రాక్షసుడు ఉండి అగ్రహారీకులను బాధిస్తుండగా భీమసేనుడు అతనిని సంహరించినట్లు ఇక్కడి ప్రజలు నమ్ముతారు. ఈ నమ్మకానికి గుర్తుగా బిలంకొండకు అతి సమీపంలో బకాసురుని గుట్ట, భీముని తిప్ప అనే ప్రదేశాలు సాక్షాత్కరిస్తాయి.

## బెల్లంకొండ నామ నేపథ్యం

బిలంకొండ, ఏకచక్రపుర అగ్రహారంగా పిలవబడిన బెల్లంకొండను క్రీ.శ. 1420 ప్రాంతంలో కొండవీడును పాలించిన రెడ్డిరాజులు హస్తగతం చేసుకున్నారు. ఉచ్ఛరణలో మార్పునొంది బిలంకొండ బెల్లంకొండగా వ్యవహరించబడుతుందని గ్రామానికి చెందిన పలువురు తెలిపారు. రెడ్డిరాజుల హయాంలో బెల్లంకొండపైన పెద్దకోట నిర్మాణం జరిగినట్లు ప్రస్తుతం ఉన్న శిథిలాల ద్వారా తెలియవస్తోంది. ఇక్కడి కొండకు అటూ ఇటూ కనిపించే రెండు బురుజులు, లోపలికి స్వాగతం పలికే రాతి కట్టడమైన దర్గా, కొండపైన విశాలమైన ప్రదేశం ఉన్నాయి. వీటితోపాటు సర్వమత సామరస్యానికి దర్పణం పట్టే హైందవ, ముస్లిం ప్రార్థనా మందిరాలు ఉన్నాయి. రాజులు పాలించిన కాలంలో నడిపిన రథచక్ర గుర్తులు బండలపై ఇప్పటికీ కన్పిస్తున్నాయి. విశాలమైన కోనేర్లు, నేతి గదులు, రాజులకు చల్లటి నీటినిచ్చే రాతి బండలు, ఏనుగులు నడిచిన ద్వారాలు బెల్లంకొండ గత చరిత్రకు సాక్షీభూతాలవుతున్నాయి.





రాజుల నేతి గదులు, ఇతిహాసానికి ఊతం... ఈ బకాసురుని గుట్ట

## ప్రస్తుతం చిన్న పంచాయతీ

ఎంతో చారిత్రక నేపథ్యాన్ని కలిగిన బెల్లంకొండ 1952లో పంచాయతీగా ఏర్పడింది. అతి తక్కువమంది జనాభావున్న ఈ పంచాయతీకి సయ్యద్ సైదా ఆదాం, బద్దూరి పున్నారెడ్డి, దేవరశెట్టి శ్రీనివాసరావు, చావలి ఏసు, గోపయ్య, ఆలా సుబ్బయ్య, బెల్లంకొండ షరీఫ్, ప్రస్తుతం పి. ఎస్.కె. మస్తాన్‌షరీఫ్‌లు సర్పంచులుగా ఎన్నికయ్యారు. పంచాయతీలోని మొత్తం జనాభా సంఖ్య 5వేలు కాగా, మహిళలు 2,400, పురుషులు 2600 మంది ఉన్నారు. వీరిలో ఓటర్లు 2,780 మంది ఉన్నారు. గ్రామంలో సుమారు 100 కుటుంబాల్లో 300 మంది ఎస్‌సి జనాభా, 30 కుటుంబాల్లో 200 మంది ఎస్‌టి జనాభా, 150 కుటుంబాల్లో 700 మంది బిసి జనాభా, 400 కుటుంబాల్లో 4 వేలమంది ఓసి జనాభా నివాసముంటున్నారు.

పంచాయతీకి ఏటా ఇంటిపన్ను, నీటిపన్ను, గ్రాంట్లుపై వచ్చే శిస్తు రూపేణా సుమారు 3 లక్షల రూపాయలు ఆదాయం లభిస్తుంది. గ్రామానికి తూర్పున కొత్తపాలెం, ఉత్తరాన బెల్లంకొండ కొండ, దక్షిణాన నందిరాజుపాలెం, పడమరన మాచాయపాలెం సరిహద్దులుగా ఉన్నాయి.

ఈ గ్రామంలో నివాసముంటున్న ప్రజల ప్రధాన జీవనాధారం వ్యవసాయం. గ్రామ పరిధిలోని సాగుభూముల్లో వరి, పత్తి, మిరప పంటలు పండుతున్నాయి. కాలక్రమేణా ఎంతో చారిత్రక నేపథ్యమున్న బెల్లంకొండ చిన్న పంచాయతీగానే మిగిలినప్పటికీ గత చరిత్రకు గుర్తులుగా నిలిచిన కట్టడాలు మాత్రం ఇప్పటికీ కనువిందు చేస్తాయి. ఎంతో పెద్దవిగా ఉండే పురాతన దేవాలయాలు, పీర్లచావిడిలు పలువురిని ఆకట్టుకుంటాయి.



బెల్లంకొండ కొండపై రాజులు నివాసమున్న రాతిస్తంభం మేడలు



రాజులు ఏలిన కొండపై కొలువున్న నాగేంద్రుడు





సర్వమత సమానం... రాజుల కొండపైని హైందవ, ముస్లింల దేవాలయం



ఏనుగులు నడిచినట్లు చెప్పబడుతున్న ద్వారాలివి




తిరుమల ప్లాంట్

# అనతికాలంలోనే అసాధారణ ప్రగతి

# పాల ఉత్పత్తిదారులకు వెన్నుదన్ను 'తిరుమల'

**(ఆన్‌లైన్, నరసరావుపేట)**

కృషి, పట్టుదల, సంకల్పం వుంటే ఎంతటి ఉన్నత శిఖరాలనైనా అధిరోహించ వచ్చు అన్న నానుడికి నిదర్శనం తిరుమల మిల్క్ ప్రొడక్ట్స్ ప్రైవేట్ లిమిటెడ్. స్థాపించిన అనతి కాలంలోనే తిరుమల అసాధారణ అభివృద్ధిని సాధించింది. ఒక వైపు వేలాది మందికి ఉపాధి కల్పిస్తూ, మరో వైపు పాల ఉత్పత్తి దారులకు 'తిరుమల' వెన్నుదన్నుగా నిలుస్తున్నది.

రాష్ట్రంలోనే కాక, ఇతర రాష్ట్రాలు తమిళనాడు, కర్నాటకలలో కూడా ఈ సంస్థ విస్తరించింది. క్షీర విప్లవంలో తన వంతు పాత్రను తిరుమల నిర్వహిస్తున్నది. అక్టోబరు నెలాఖరున తిరుమల సంస్థ పది వసంతాల వార్షికోత్సవాలను ఘనంగా జరుపుకుంటుంది.

ఒక పాల శీతలీకరణ కేంద్రంతో ప్రారంభమైన తిరుమల డెయిరీ నేడు 18 కేంద్రాలకు విస్తరించి, పాలు, పాల పదార్థాల తయారీ, విక్రయాల్లో మార్కెట్‌లో తన కంటు ఒక స్థానాన్ని సాధించగలిగింది. పాలు, పాల పదార్థాల విక్రయాలలో రాష్ట్రంలో 50 శాతం మార్కెట్‌ను చేజిక్కించు కోవడంలో ఈ సంస్థ విజయం సాధించింది. అసలైన స్వచ్ఛతకు పేరెన్నిక గన్నవి తిరుమల ఉత్పత్తులు.

మంచి పాల సరఫరాతో ఆరంభమై, మరిన్ని నాణ్యమైన పాల ఉత్పత్తులతో నారీ జన నీరాజనాలను ఆ సంస్థ ఉత్పత్తులు అందుకుంటున్నాయి. పాల పౌడర్, నెయ్యి, దూద్‌పెడ, ఫ్లావర్డ్ మిల్క్, మజ్జిగ, పెరుగు తిరుమల నుంచి వెలువడుతున్న తదితర ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి ఆదరణ లభిస్తున్నది.

1995లో ప్రకాశం జిల్లా, వెల్లల చెరువులో పది వేల లీటర్ల సామర్థ్యంతో పాల శీతలీ కరణ కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. సంస్థ పది వేలు లీటర్లు పాల సేకరణతో ప్రారంభమై, నేడు ఆరు లక్షల లీటర్ల పాల సేకరణ చేస్తున్నది. ప్రతి రోజు నాలుగున్నర నుంచి ఐదు లక్షల లీటర్ల పాల విక్రయాలను ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలలో జరుపుతున్నది. అగ్‌మార్క్ ప్రమాణాలతో పాలు, పాల పదార్థాలను తయారు చేస్తున్నది.

తిరుమల ఉత్పత్తులకు ఐఎస్‌ఓ 9001-2000 గుర్తింపు లభించింది. ప్రైవేట్ డెయిరీల రంగంలో తిరుమల ద్వితీయ స్థానాన్ని ఆక్రమించింది. అత్యున్నత సాంకేతిక ప్రమాణాలతో నెల్లూరు జిల్లా, గూడూరులో పాలు, పాల పదార్థాల తయారీ ఫ్యాక్టరీని భారీ స్థాయిలో నిర్మించారు. ఇక్కడి నుంచి నెయ్యి, పాలు, పెరుగు, ఫ్లావర్డ్ మిల్క్, దూద్‌పెడ, పాల పొడి తయారీ జరుగుతున్నది. గూడూరులో, పలమనేరులో, వెల్లల చెరువులో పాల ప్యాకెట్ల తయారీ ప్లాంట్లను నెలకొల్పింది. గూడూరు నుంచి తమిళనాడులోని చెన్నయ్, తదితర ప్రాంతాలకు పాల ప్యాకెట్లు సరఫరా అవుతున్నాయి. వెల్లల చెరువులో



బొల్లా బ్రహ్మనాయుడు

తయారు చేసే పాల ప్యాకెట్లు రాష్ట్రంలో, పలమనేరులో తయారు చేసే పాల ప్యాకెట్లు బెంగుళూరులో విక్రయాలు జరుపుతున్నారు.

చెన్నయ్, బెంగుళూరు, హైదరాబాద్ పట్టణాల్లో తిరుమల ఉత్పత్తులకు వినియోగ దారుల నుంచి విశేష ఆదరణ లభిస్తున్నది. గూడూరులోని తిరుమల ఫ్యాక్టరీలో ఎక్స్‌ఫోర్ట్ క్వాలిటీతో తయారవుతున్న ఈ పాల పొడికి మార్కెట్‌లో మంచి డిమాండ్ వుంది. అలాగే బంగ్లాదేశ్, శ్రీలంకల నుంచి కూడా తిరుమల పాల పొడికి ఆర్డర్లు వస్తున్నాయి.

ఈ సంస్థ ద్వారా సుమారు ఏడు వేల మంది వివిధ విభాగాల్లో ఉపాధి పొందుతున్నారు. మరో వైపు పాల ఉత్పత్తి దారులకు కూడా వివిధ రకాలుగా సేవలు అందిస్తున్నది. వారి శ్రేయస్సు కోసం విభిన్న పథకాలను అమలు చేస్తూ, వారి ఆదరణ తిరుమల చూరగొన్నది.

అలాగే తిరుమల కోల్డ్ స్టోరేజిని గుంటూరులో నిర్మింపచేశారు. వ్యవసాయ ఉత్పత్తుల రంగం ఆధారంగా తిరుమల సంస్థ విస్తరణ జరుగుతున్నది. ఈ నేపథ్యంలో రైతాంగ మిర్చి నిల్వల కోసం గుంటూరులో కోల్డ్ స్టోరేజిని నిర్మించారు. దీని ద్వారా రైతాంగానికి విశేష సేవలందిస్తున్నారు.

డిమాండ్ వున్న సందర్భంలో కోల్డ్ స్టోరేజిలో టిక్కీకి రూ 60 నుంచి రూ 150 వరకు రేటు వసూలు చేస్తుంటారు. అయితే రైతాంగానికి సేవలు అందించే దానిలో భాగంగా లాభార్జన ధ్యేయంగా కాకుండా, మిర్చి టిక్కీకి కేవలం రూ 60 మాత్రమే వసూలు చేస్తున్నారు. అలాగే కేవలం రైతులకు సంబంధించిన నిల్వలలను మాత్రమే ఈ స్టోరేజిలో అనుమతిస్తున్నారు.

ఈ ఏడాది కోల్డ్ స్టోరేజిలలో నిల్వ చేసిన మిర్చి రైతులకు రూ రెండు కోట్లు వరకు రుణాలు కూడా అందించారు. కాగా, సంస్థ విస్తరణలో భాగంగా స్పిన్నింగ్ మిల్లు ఏర్పాటు చేయాలనే దిశగా పయనిస్తున్నట్లు యాజమాన్యం తెలిపింది.

దీని ద్వారా 2,500 మంది వరకు ఉపాధి కల్పించే అవకాశం వుంటుందని చెపుతున్నారు. ఈ సంస్థకు మేనేజింగ్ డైరెక్టరుగా బొల్లా బ్రహ్మనాయుడు వున్నారు. డైరెక్టర్లుగా దండా బ్రహ్మోనందం, బత్తిన నాగేశ్వరరావు, నలబోతుల వెంకట్రావులు వున్నారు.

## వినియోగదారుల స్ఫూర్తి మా విజయం

ఎండి బ్రహ్మనాయుడు

తిరుమల సంస్థ విజయాలకు పాల ఉత్పత్తి దారులు, పాల వినియోగ దారుల ఆదరణే మాకు స్ఫూర్తి అని ఎండి బొల్లా బ్రహ్మనాయుడు తెలిపారు. రైతాంగం శ్రేయస్సు కోసం సంస్థ పని చేస్తుందని పేర్కొన్నారు.

పాల ఉత్పత్తి దారులకు పశువుల కోసం బ్యాంకులతో పాటు, తమ సంస్థ కూడా సబ్సిడీ సదుపాయాన్ని, రుణ సౌకర్యాన్ని కల్పిస్తున్నట్లు తెలిపారు. ఉత్పత్తి దారులకు, గేదెలకు ఇన్సూరెన్స్ సౌకర్యాన్ని అమలు చేస్తున్నామన్నారు.

ఉచిత పశు వైద్య శిబిరాలు ఏర్పాటు చేస్తూ, అవసరమైన మందులు ఉచితంగా పంపిణీ చేస్తున్నట్లు తెలిపారు. గాలి కుంటు వ్యాధి వ్యాక్సిన్‌ను ఉచితంగా అందజేస్తున్నట్లు వివరించారు. తిరుమల బలం పాల ఉత్పత్తి దారులేనని అభిప్రాయం వ్యక్తం చేశారు. నాణ్యత ప్రమాణాలు కలిగిన పాలు, పాల పదార్థాలు, నెయ్యి, పాల పొడి ఉత్పత్తులను వినియోగ దారులకు అందజేస్తూ, వారి ఆదరణ పొంద గలిగామని హర్షం వ్యక్తం చేశారు.

# 1952 నుంచి ఎన్నికైన ప్రజాప్రతినిధులు




## 1952 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | అమృతలూరు | జి.జోసఫ్ | కమ్యూనిస్టు |
| 2. | బాపట్ల | వేములపల్లి శ్రీకృష్ణ | కమ్యూనిస్టు |
| 3. | బెల్లంకొండ | ఎం.బాపయ్యచౌదరి | స్వతంత్ర |
| 4. | చిలకలూరిపేట | కె.రంగారావు | కమ్యూనిస్టు |
| 5. | చీరాల | ప్రగడ కోటయ్య | కిసాన్‌మజ్దూర్ |
| 6. | దుగ్గిరాల | ఎ.రామిరెడ్డి | కాంగ్రెస్ |
| 7. | గుంటూరు | ఎన్‌వీఎల్ నరసింహారావు | కిసాన్ మజ్దూర్, ప్రజాపార్టీ |
| 8. | మంగళగిరి | డి.లక్ష్మయ్య | కమ్యూనిస్టు |
| 9. | నరసరావుపేట | నల్లపాటి వెంకటరామయ్య | కిసాన్‌మజ్దూర్ |
| 10. | ఒంగోలు | కె.కొండయ్య (ఎస్‌సి) | కమ్యూనిస్టు |
| | | ఎం.నారాయణస్వామి(జనరల్) | కమ్యూనిస్టు |
| 11. | పల్నాడు | కె.సుబ్బారెడ్డి | కమ్యూనిస్టు |
| 12. | ప్రత్తిపాడు | టి.కోటమ్మరెడ్డి | కాంగ్రెస్ |
| 13. | పొన్నూరు | కె.వెంకయ్య | కమ్యూనిస్టు |
| 14. | రేపల్లె | ఎన్.హనుమంతరావు | కమ్యూనిస్టు |
| 15. | సత్తెనపల్లి | వావిలాల గోపాలకృష్ణయ్య | స్వతంత్ర |
| 16. | తెనాలి | ఆలపాటి వెంకట్రామయ్య | కాంగ్రెస్ |
| 17. | వినుకొండ | పులుపుల వెంకటశివయ్య | కమ్యూనిస్టు |

## 1955 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | అద్దంకి | ఎన్.వెంకయ్య | కృషికార్ లోక్‌పార్టీ |
| 2. | అమ్మనబ్రోలు | జె.చంద్రమౌళి | కాంగ్రెస్ |
| 3. | బాపట్ల | ఎం.వెంకట్రాజు | కాంగ్రెస్ |
| 4. | చీరాల | ప్రగడ కోటయ్య | కాంగ్రెస్ |
| 5. | దుగ్గిరాల | పి.శ్రీరాములు | కాంగ్రెస్ |
| 6. | గుంటూరు-1 | టి.జాలయ్య | కాంగ్రెస్ |
| 7. | గుంటూరు-2 | ఎం.నాగేశ్వరరావు | కాంగ్రెస్ |
| 8. | గురజాల | ఎం.బాపయ్యచౌదరి | కృషికార్ లోక్‌పార్టీ |
| 9. | కూచినపూడి | అనగాని భగవంతరావు | కృషికార్ లోక్‌పార్టీ |
| 10. | మంగళగిరి | కోటిరెడ్డి | కాంగ్రెస్ |
| 11. | మాచర్ల | ఎం.నాగిరెడ్డి | కమ్యూనిస్టు |
| 12. | మార్టూరు | బి.వెంకటశివయ్య | కృషికార్ లోక్‌పార్టీ |
| 13. | నరసరావుపేట | ఎన్.వెంకటరామయ్య | కాంగ్రెస్ |
| 14. | ఒంగోలు | టి.జియ్యర్‌దాస్ (ఎస్‌సి) | కాంగ్రెస్ |
| | | టి.ప్రకాశం (జనరల్) | కాంగ్రెస్ |
| 15. | పర్చూరు | కె.రామయ్య | కాంగ్రెస్ |
| 16. | పెదకాకాని | జి.బాపయ్య | కృషికార్ లోక్ |
| 17. | పెదకూరపాడు | జి.రామస్వామిరెడ్డి | కృషికార్‌లోక్ |
| 18. | ఫిరంగిపురం | కాసు బ్రహ్మానందరెడ్డి | కాంగ్రెస్ |
| 19. | పొన్నూరు | జి.పరంధామయ్య | కృషికార్‌లోక్ |
| 20. | రేపల్లె | వై.చెన్నయ్య | కాంగ్రెస్ |
| 21. | సత్తెనపల్లి | వావిలాల గోపాలకృష్ణయ్య | కమ్యూనిస్టు |
| 22. | తెనాలి | ఎ.వెంకట్రామయ్య | కాంగ్రెస్ |
| 23. | వేమూరు | కె.చంద్రమౌళి | కాంగ్రెస్ |
| 24. | వినుకొండ | ఎన్.గోవిందరాజులు | కాంగ్రెస్ |

**(ఆన్‌లైన్ - గుంటూరు)**

అన్ని రంగాలలో ముందంజవేస్తూ జాతీయ స్థాయిలో ఒక విశిష్టస్థానాన్ని పొందిన గుంటూరు జిల్లా నుంచి ఎన్నికైన ఎందరో మేథావులు, ఉద్దండులు, దేశ, రాష్ట్ర రాజకీయాలలో కీలకపాత్ర వహించారు. ఎందరో ప్రజాప్రతినిధులు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో కీలక పదవులు అలంకరించారు. రాష్ట్ర రాజకీయాలను శాసించిన నేతలు పలువురు గుంటూరు జిల్లా వాసులే కావడం విశేషం.

1952లో ప్రస్తుతం ప్రకాశం జిల్లాలో వున్న ఒంగోలు, చీరాలతో కలుపుకొని మొత్తం 17 నియోజకవర్గాలు గుంటూరు జిల్లాలో ఉండేవి. 1955 శాసనసభ ఎన్నికల నాటికి వాటి సంఖ్య 24కు పెరిగింది. 1962 ఎన్నికలలో సంతనూతలపాడుకు నియోజకవర్గ హోదా కల్పించడంతో జిల్లాలోని శాసనసభ నియోజకవర్గాల సంఖ్య 25కు పెరిగింది. 1967లో జరిగిన ఎన్నికలలో సంతనూతలపాడు నియోజకవర్గంను రద్దు చేశారు. ప్రకాశం జిల్లా ఏర్పాటు చేయడంతో 1972 శాసనసభ ఎన్నికలలో గుంటూరు జిల్లాలో 19 శాసనసభ నియోజకవర్గాలు ఏర్పాటు అయ్యాయి. నాటి నుంచి నేటి వరకు జిల్లాలో 19 నియోజకవర్గాలు కొనసాగుతున్నాయి. 1952 నుంచి నేటి వరకు శాసనసభకు ఎన్నికైన ఎమ్మెల్యేల వివరాలు.



## అంబేద్కర్

తే.గీ. ఎంత సుందర రూపము
ఎంతతెలివి.
ఎంత నిండు విగ్రహమది
విద్యబలము.
ఎంత యోచించి గాలించ
వివరపడని.
పేదజాతుల రారాజు భీమరావు.

సీ. దీనుల దళితుల,
హీనసీమల నేల,
కంకనంబును దాల్చె, కర్మయోగి
కులతత్వభూతాన్ని, కూలార్చ
దలపెట్టి,
సకల శాస్త్రములను, చదివెతాను.
రాజ్యాంగమనెడింత
రమనీయ కావ్యాన్ని,
చిత్తశుద్ధిన తాను, సృష్టి జరిపె.
హరిజనోద్ధరణకై, అరివీర్ల నెదిరించ,
బరిగీసి నిల్చిన, భారతీడు.

తే.గీ. అంటరాని కులము,
నంటరాదను ప్రజ,
లూరదూరాల, నొదుగుచూ
దూరి బ్రతికె,
దళితజాతులు బలహీన
తలపులూడ్చ,
అవదరిం" చెనం భేద్కరు"
యెవరి వరమొ.

- దుబ్బల దాసు

## 1962 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | అద్దంకి | పి.రంగనాయకులు | కమ్యూనిస్టు |
| 2. | అమ్మనబ్రోలు | ఎస్.సింగయ్య | కమ్యూనిస్టు |
| 3. | బాపట్ల | కె.వెంకటేశ్వరరావు | స్వతంత్ర |
| 4. | చీరాల | జె.లక్ష్మీనారాయణచౌదరి | కమ్యూనిస్టు |
| 5. | దుగ్గిరాల | ఎల్.లక్ష్మారెడ్డి | కాంగ్రెస్ |
| 6. | గుంటూరు-1 | కె.నాగయ్య | కమ్యూనిస్టు |
| 7. | గుంటూరు-2 | చేబ్రోలు హనుమయ్య | కాంగ్రెస్ |
| 8. | గురజాల | కె.వెంకటేశ్వర్లు | కాంగ్రెస్ |
| 9. | కూచినపూడి | ఇ.సుబ్బారావు | స్వతంత్ర |
| 10. | మంగళగిరి | వేములపల్లి శ్రీకృష్ణ | కమ్యూనిస్టు |
| 11. | మాచర్ల (ఎస్‌టి) | ఎం.కేశవనాయుడు | కాంగ్రెస్ |
| 12. | మార్టూరు | ఎస్.వెంకటేశ్వర్లు | కాంగ్రెస్ |
| 13. | నరసరావుపేట | సి.రామయ్యచౌదరి | కాంగ్రెస్ |
| 14. | ఒంగోలు | బివిలక్ష్మీనారాయణ | స్వతంత్ర |
| 15. | పర్చూరు | ఎన్.వెంకటస్వామి | కమ్యూనిస్టు |
| 16. | పెదకాకాని | పి.కోటేశ్వరరావు | కమ్యూనిస్టు |
| 17. | పెదకూరపాడు | జి.రామస్వామిరెడ్డి | కాంగ్రెస్ |
| 18. | ఫిరంగిపురం | కాసు బ్రహ్మానందరెడ్డి | కాంగ్రెస్ |
| 19. | పొన్నూరు | ఎన్.వెంకటరావు | కాంగ్రెస్ |
| 20. | రేపల్లె | కె.సత్యనారాయణ | కాంగ్రెస్ |
| 21. | సత్తెనపల్లి | వావిలాల గోపాలకృష్ణయ్య | స్వతంత్ర |
| 22. | సంతనూతలపాడు | (ఎస్‌సి)చెంచయ్య | కమ్యూనిస్టు |
| 23. | తెనాలి | ఎ.వెంకటరామయ్య | కాంగ్రెస్ |
| 24. | వేమూరు | కె.చంద్రమౌళి | కాంగ్రెస్ |
| 25. | వినుకొండ | పి.వెంకటశివయ్య | కమ్యూనిస్టు |

## 1967 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | అవగాని భగవంతరావు | కాంగ్రెస్ |
| 2. | రేపల్లె | వై.చెన్నయ్య | కాంగ్రెస్ |
| 3. | వేమూరు | యడ్లపాటి వెంకటరావు | స్వతంత్ర |
| 4. | దుగ్గిరాల | ఎ.రామిరెడ్డి | స్వతంత్ర |
| 5. | తెనాలి | దొడ్డపనేని ఇందిర | కాంగ్రెస్ |
| 6. | పొన్నూరు | పి.అంకినీడు ప్రసాదరావు | కాంగ్రెస్ |
| 7. | బాపట్ల | కోన ప్రభాకరరావు | కాంగ్రెస్ |
| 8. | చీరాల | ప్రగడ కోటయ్య | కాంగ్రెస్ |
| 9. | పర్చూరు | గాదె వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 10. | ఒంగోలు | చింతా రామచంద్రారెడ్డి | కాంగ్రెస్ |
| 11. | సంతనూతలపాడు | విసి కేశవరావు | కాంగ్రెస్ |
| 12. | అద్దంకి | దాసరి ప్రకాశం | కాంగ్రెస్ |
| 13. | చిలకలూరిపేట | కె.బుచ్చయ్య | స్వతంత్ర |
| 14. | నరసరావుపేట | కె.బ్రహ్మానందరెడ్డి | కాంగ్రెస్ |
| 15. | ప్రత్తిపాడు | ఎం.చిననాగయ్య | స్వతంత్ర |
| 16. | గుంటూరు-1 | ఎస్.అంకమ్మనాయుడు | కాంగ్రెస్ |
| 17. | గుంటూరు-2 | చేబ్రోలు హనుమయ్య | కాంగ్రెస్ |
| 18. | మంగళగిరి | టి.నాగేశ్వరరావు | కాంగ్రెస్ |
| 19. | తాడికొండ | జివి రత్తయ్య | కాంగ్రెస్ |
| 20. | సత్తెనపల్లి | వావిలాల గోపాలకృష్ణయ్య | స్వాతంత్ర |
| 21. | పెదకూరపాడు | జి.రామస్వామిరెడ్డి | కాంగ్రెస్ |
| 22. | గురజాల | కె.వెంకటేశ్వర్లు | కాంగ్రెస్ |
| 23. | మాచర్ల | వి.లింగారెడ్డి | కాంగ్రెస్ |
| 24. | వినుకొండ | భవనం జయప్రద | కాంగ్రెస్ |

## 1972 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఎ.భగవంతరావు | కాంగ్రెస్ |
| 2. | రేపల్లె | వై.చెన్నయ్య | కాంగ్రెస్ |
| 3. | వేమూరు | వై.వెంకటరావు | స్వతంత్ర |
| 4. | దుగ్గిరాల | బి.గోపాలరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | డి.ఇందిర | స్వతంత్ర |
| 6. | పొన్నూరు | డి.రంగారావు | స్వతంత్ర |
| 7. | బాపట్ల | కోన ప్రభాకరరావు | కాంగ్రెస్ |
| 8. | ప్రత్తిపాడు | చుక్కా పీటర్‌పాల్ | కాంగ్రెస్ |
| 9. | గుంటూరు-1 | విజయరామానుజం | కాంగ్రెస్ |
| 10. | గుంటూరు-2 | ఎన్.వెంకటరత్నం | కాంగ్రెస్ |
| 11. | మంగళగిరి | వేములపల్లి శ్రీకృష్ణ | సిపిఐ |
| 12. | తాడికొండ | జివి రత్తయ్య | కాంగ్రెస్ |
| 13. | సత్తెనపల్లి | గాదె వీరాంజనేయశర్మ | కాంగ్రెస్ |
| 14. | పెదకూరపాడు | ఫాతిమున్నిసాబేగం | కాంగ్రెస్ |
| 15. | గురజాల | ఎం.నాగిరెడ్డి | సిపిఐ |
| 16. | మాచర్ల | జె.నాగిరెడ్డి | స్వతంత్ర |
| 17. | వినుకొండ | భవనం జయప్రద | కాంగ్రెస్ |
| 18. | చిలకలూరిపేట | బి.సత్యనారాయణ | కాంగ్రెస్ |

(మిగతా 173వ పేజీలో)

# 1952 నుంచి ఎన్నికైన ప్రజాప్రతినిధులు

(172వ పేజీ తరువాయి)

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 19. | నరసరావుపేట | డి.కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |

## 1978 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఇ.సుబ్బారావు | జనతా |
| 2. | రేపల్లె | కె.సత్యనారాయణ | సిపిఎం |
| 3. | వేమూరు | వై.వెంకటరావు | కాంగ్రెస్ |
| 4. | దుగ్గిరాల | జి.వేదాంతరావు | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | డి.ఇందిర | జనత |
| 6. | పొన్నూరు | జి.నాగేశ్వరరావు | కాంగ్రెస్ |
| 7. | బాపట్ల | కోన ప్రభాకరరావు | కాంగ్రెస్ |
| 8. | ప్రత్తిపాడు | కె.లక్ష్మీనారాయణరెడ్డి | కాంగ్రెస్ |
| 9. | గుంటూరు-1 | ఎల్.ఈశ్వరరావు | కాంగ్రెస్ |
| 10. | గుంటూరు-2 | జి.వీరాంజనేయశర్మ | కాంగ్రెస్ |
| 11. | మంగళగిరి | జివి రత్తయ్య | జనత |
| 12. | తాడికొండ (ఎస్‌సి) | అమృతరావు | కాంగ్రెస్ |
| 13. | సత్తెనపల్లి | పి.వెంకటరావు | కాంగ్రెస్ |
| 14. | పెదకూరపాడు | జి.రామస్వామిరెడ్డి | జనత |
| 15. | గురజాల | జి.మల్లిఖార్జునరావు | కాంగ్రెస్ |
| 16. | మాచర్ల | చల్లా గౌరపరెడ్డి | కాంగ్రెస్ |
| 17. | వినుకొండ | ఎ.వెంకటేశ్వర్లు | స్వతంత్ర |
| 18. | నరసరావుపేట | కెవి కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |
| 19. | చిలకలూరిపేట | ఎస్.సాంబయ్య | కాంగ్రెస్ |

## 1983 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఎం.నాగభూషణం | తెలుగుదేశం |
| 2. | రేపల్లె | డాక్టర్ వై.వెంకటరావు | తెలుగుదేశం |
| 3. | వేమూరు | నాదెండ్ల భాస్కరరావు | తెలుగుదేశం |
| 4. | దుగ్గిరాల | ఎంవిఎస్ కృష్ణారెడ్డి | తెలుగుదేశం |
| 5. | తెనాలి | ఎ.సత్యనారాయణ | తెలుగుదేశం |
| 6. | పొన్నూరు | డి.వీరయ్యచౌదరి | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | సిహెచ్ విజయరామరాజు | తెలుగుదేశం |
| 8. | ప్రత్తిపాడు | డాక్టర్ ఎంపి రత్తయ్య | తెలుగుదేశం |
| 9. | గుంటూరు-1 | ఉమర్ పఠాన్‌ఖాన్ | తెలుగుదేశం |
| 10. | గుంటూరు-2 | ఎస్.వెంకటరత్నం | తెలుగుదేశం |
| 11. | మంగళగిరి | డాక్టర్ ఎంఎస్ఎస్ కోటేశ్వరరావు | తెలుగుదేశం |
| 12. | తాడికొండ (ఎస్‌సి) | జెఆర్ పుష్పరాజ్ | తెలుగుదేశం |
| 13. | సత్తెనపల్లి | ఎస్.రాజకుమారి | తెలుగుదేశం |
| 14. | పెదకూరపాడు | ఎ.విశ్వేశ్వరరావు | తెలుగుదేశం |
| 15. | గురజాల | జె.నాగిరెడ్డి | తెలుగుదేశం |
| 16. | మాచర్ల | కె.సుబ్బారావు | తెలుగుదేశం |
| 17. | వినుకొండ | జి.వెంకటేశ్వర్లు | స్వతంత్ర |
| 18. | చిలకలూరిపేట | డాక్టర్ కె.కృష్ణమూర్తి | తెలుగుదేశం |
| 19. | నరసరావుపేట | డాక్టర్ కె.శివప్రసాదరావు | తెలుగుదేశం |

## 1985 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఇ.సీతారావమ్మ | తెలుగుదేశం |
| 2. | రేపల్లె | నాగమునీంద్రరావు | తెలుగుదేశం |
| 3. | వేమూరు | కె.వీరయ్య | తెలుగుదేశం |
| 4. | దుగ్గిరాల | ఎ.ధర్మారావు | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | ఎ.సత్యనారాయణ | తెలుగుదేశం |
| 6. | పొన్నూరు | డి.వీరయ్యచౌదరి | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | డాక్టర్ యు.వెంకటేశ్వర్లు | తెలుగుదేశం |
| 8. | ప్రత్తిపాడు | డాక్టర్ ఎం.పెదరత్తయ్య | తెలుగుదేశం |
| 9. | గుంటూరు-1 | మహమ్మద్ జానీ | కాంగ్రెస్ |
| 10. | గుంటూరు-2 | సిహెచ్ జయరాంబాబు | కాంగ్రెస్ |
| 11. | మంగళగిరి | డాక్టర్ ఎంఎస్ఎస్ కోటేశ్వరరావు | తెలుగుదేశం |
| 12. | తాడికొండ (ఎస్‌సి) | జెఆర్ పుష్పరాజ్ | తెలుగుదేశం |
| 13. | సత్తెనపల్లి | పి.వెంకటపతి | సిపిఎం |
| 14. | పెదకూరపాడు | డాక్టర్ కె.సదాశివరావు | తెలుగుదేశం |
| 15. | గురజాల | ఎం.అంకిరెడ్డి | తెలుగుదేశం |
| 16. | మాచర్ల | ఎస్.కృష్ణమూర్తి | కాంగ్రెస్ |
| 17. | వినుకొండ | జి.వెంకటేశ్వర్లు | సిపిఐ |
| 18. | నరసరావుపేట | డాక్టర్ కె.శివప్రసాదరావు | తెలుగుదేశం |
| 19. | చిలకలూరిపేట | ఎస్.సాంబయ్య | కాంగ్రెస్ |

## 1989 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఇ.సీతారావమ్మ | తెలుగుదేశం |
| 2. | రేపల్లె | ఎ.రాంబాబు | కాంగ్రెస్ |
| 3. | వేమూరు | ఎ.ధర్మారావు | కాంగ్రెస్ |
| 4. | దుగ్గిరాల | జి.వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | ఎస్.భాస్కరరావు | కాంగ్రెస్ |
| 6. | పొన్నూరు | సిహెచ్‌వెంకట్రావు | కాంగ్రెస్ |
| 7. | బాపట్ల | సిహెచ్ గోవర్ధన్‌రెడ్డి | కాంగ్రెస్ |
| 8. | ప్రత్తిపాడు | డాక్టర్ ఎం.పెదరత్తయ్య | తెలుగుదేశం |
| 9. | గుంటూరు-1 | మహమ్మద్ జానీ | కాంగ్రెస్ |
| 10. | గుంటూరు-2 | సిహెచ్ జయరాంబాబు | కాంగ్రెస్ |
| 11. | మంగళగిరి | జి.వీరాంజనేయులు | కాంగ్రెస్ |
| 12. | తాడికొండ (ఎస్‌సి) | డాక్టర్ టి.వెంకయ్య | కాంగ్రెస్ |
| 13. | సత్తెనపల్లి | డి.బాలకోటిరెడ్డి | కాంగ్రెస్ |
| 14. | పెదకూరపాడు | కె.లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | కెవి నర్సిరెడ్డి | కాంగ్రెస్ |
| 16. | మాచర్ల | ఎస్.శివరామకృష్ణప్రసాద్ | తెలుగుదేశం |
| 17. | వినుకొండ | ఎస్.రాజకుమారి | కాంగ్రెస్ |
| 18. | నరసరావుపేట | డాక్టర్ కె.శివప్రసాదరావు | తెలుగుదేశం |
| 19. | చిలకలూరిపేట | డాక్టర్ కె.జయమ్మ | తెలుగుదేశం |

## 1994 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఇ.సీతారావమ్మ | తెలుగుదేశం |
| 2. | రేపల్లె | ఎంవి సుబ్బయ్య | తెలుగుదేశం |
| 3. | వేమూరు | ఎ.రాజేంద్రప్రసాద్ | తెలుగుదేశం |
| 4. | దుగ్గిరాల | జి.వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | డాక్టర్ ఆర్.రవీంద్రనాథ్‌చౌదరి | తెలుగుదేశం |
| 6. | పొన్నూరు | డి.నరేంద్రకుమార్ | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | ఎం.శేషగిరిరావు | తెలుగుదేశం |
| 8. | ప్రత్తిపాడు | డాక్టర్ ఎం.పెదరత్తయ్య | తెలుగుదేశం |
| 9. | గుంటూరు-1 | ఎస్ఎం జియావుద్దీన్ | తెలుగుదేశం |
| 10. | గుంటూరు-2 | చల్లా వెంకటకృష్ణారెడ్డి | తెలుగుదేశం |
| 11. | మంగళగిరి | ఎస్.రామమోహనరావు | సిపిఎం |
| 12. | తాడికొండ(ఎస్‌సి) | జెఎంఎస్‌వి ప్రసాద్ | సిపిఐ |
| 13. | సత్తెనపల్లి | పి.భారతి | సిపిఎం |
| 14. | పెదకూరపాడు | కె.లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | వై.శ్రీనివాసరావు | తెలుగుదేశం |
| 16. | మాచర్ల | కె.పున్నారెడ్డి | తెలుగుదేశం |
| 17. | వినుకొండ | డాక్టర్ వి.యలమందరావు | తెలుగుదేశం |
| 18. | నరసరావుపేట | డాక్టర్ కె.శివప్రసాదరావు | తెలుగుదేశం |
| 19. | చిలకలూరిపేట | ఎస్.సాంబయ్య | కాంగ్రెస్ |

## 1999 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఎం.వెంకటరమణారావు | కాంగ్రెస్ |
| 2. | రేపల్లె | ఎం.వెంకటసుబ్బయ్య | తెలుగుదేశం |
| 3. | వేమూరు | ఆలపాటి రాజేంద్రప్రసాద్ | తెలుగుదేశం |
| 4. | దుగ్గిరాల | గుదిబండి వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | డాక్టర్ గోగినేని ఉమ | తెలుగుదేశం |
| 6. | పొన్నూరు | ధూళిపాళ్ళ నరేంద్రకుమార్ | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | మంతెన అనంతవర్మరాజు | తెలుగుదేశం |
| 8. | ప్రత్తిపాడు | డాక్టర్ మాకినేని పెదరత్తయ్య | తెలుగుదేశం |
| 9. | గుంటూరు-1 | ఎస్ఎం జియావుద్దీన్ | తెలుగుదేశం |
| 10. | గుంటూరు-2 | డాక్టర్ శనక్కాయల అరుణ | తెలుగుదేశం |
| 11. | మంగళగిరి | మురుగుడు హనుమంతరావు | కాంగ్రెస్ |
| 12. | తాడికొండ | జెఆర్ పుష్పరాజ్ | తెలుగుదేశం |
| 13. | సత్తెనపల్లి | వైవి ఆంజనేయులు | తెలుగుదేశం |
| 14. | పెదకూరపాడు | కన్నా లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | జంగా కృష్ణమూర్తి | కాంగ్రెస్ |
| 16. | మాచర్ల | జూలకంటి దుర్గాంబ | తెలుగుదేశం |
| 17. | వినుకొండ | వీరపనేని యల్లమందరావు | తెలుగుదేశం |
| 18. | నరసరావుపేట | డాక్టర్ కోడెల శివప్రసాద్ | తెలుగుదేశం |
| 19. | చిలకలూరిపేట | ప్రత్తిపాటి పుల్లారావు | తెలుగుదేశం |

## 2004 శాసనసభ

| | నియోజకవర్గం | గెలుపొందిన అభ్యర్థి | పార్టీ |
|---|---|---|---|
| 1. | కూచినపూడి | ఎంవి రమణారావు | కాంగ్రెస్ |
| 2. | రేపల్లె | దేవినేని మల్లిఖార్జునరావు | కాంగ్రెస్ |
| 3. | వేమూరు | సతీష్‌పాల్‌రాజ్ | కాంగ్రెస్ |
| 4. | దుగ్గిరాల | గుదిబండి వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 5. | తెనాలి | నాదెండ్ల మనోహర్ | కాంగ్రెస్ |
| 6. | పొన్నూరు | ధూళిపాళ్ళ నరేంద్రకుమార్ | తెలుగుదేశం |
| 7. | బాపట్ల | గాదె వెంకటరెడ్డి | కాంగ్రెస్ |
| 8. | ప్రత్తిపాడు | రావి వెంకటరమణ | కాంగ్రెస్ |
| 9. | గుంటూరు-1 | నంబూరు సుభాని | కాంగ్రెస్ |
| 10. | గుంటూరు-2 | తాడిశెట్టి వెంకట్రావు | కాంగ్రెస్ |
| 11. | మంగళగిరి | మురుగుడు హనుమంతరావు | కాంగ్రెస్ |
| 12. | తాడికొండ | డి.మాణిక్యవరప్రసాద్ | కాంగ్రెస్ |
| 13. | సత్తెనపల్లి | యర్రం వెంకటేశ్వరరెడ్డి | కాంగ్రెస్ |
| 14. | పెదకూరపాడు | కన్నా లక్ష్మీనారాయణ | కాంగ్రెస్ |
| 15. | గురజాల | జంగా కృష్ణమూర్తి | కాంగ్రెస్ |
| 16. | మాచర్ల | పిన్నెల్లి లక్ష్మారెడ్డి | కాంగ్రెస్ |
| 17. | వినుకొండ | మక్కెన మల్లిఖార్జునరావు | కాంగ్రెస్ |
| 18. | నరసరావుపేట | కాసు కృష్ణారెడ్డి | కాంగ్రెస్ |
| 19. | చిలకలూరిపేట | మర్రి రాజశేఖర్ | కాంగ్రెస్ |

## ఆరోగ్యానికి ఆలంబనం యోగా

(ఆన్‌లైన్, గుంటూరు)

''ఆరోగ్యమే మహాభాగ్యం''. మానవునికి ఎంత సంపద వున్నా ఆరోగ్యం లేనిదే ఎందుకూ పనికి రాదు. దీనిని గుర్తించినందు వల్లనే యోగ విద్యకు ప్రాధాన్యం పెరుగుతున్నది.

భారతదేశంలో పుట్టిన యోగ ప్రపంచవ్యాప్తంగా ప్రాధాన్యతను సంతరించుకున్నది. ప్రధానంగా క్రీడా రంగంలో యోగ విద్య ఆవశ్యకతను వివరించి, ప్రతిరోజూ యోగా చేయించాలి. అప్పుడే విద్యార్థులు క్రీడల్లో వత్తిడికి లోనుకాకుండా వుంటారు. జపాన్, కొరియా పాశ్చాత్య దేశాల్లో క్రీడాకారులు తప్పనిసరిగా యోగ సాధన చేస్తున్నారు. అందువలనే వారు క్రీడా రంగంలో సత్ఫలితాలను సాధిస్తున్నారు. యోగ ప్రాముఖ్యత గతంలో కంటే ఇప్పుడు భారతావనిలో కూడా బాగా పెరిగింది. అనేకమంది ఆరోగ్యం కోసం యోగాలో శిక్షణ పొందడానికి ఆసక్తిచూపుతున్నారు.

యోగాకి మూలపురుషుడు హిరణ్యగర్భుడు. ఇంతవరకు లభ్యమైన గ్రంథాలలో ముఖ్యమైనది పతంజలి యోగం. పతంజలి మహర్షి రాసిన గ్రంథానికి అష్టాంగ యోగమని పేరు. దీనిలో ప్రధానంగా ఎనిమిదిభాగాలు వున్నాయి. అవి యమ, నియమ, ఆసనం, ప్రాణాయామం, ప్రత్యాహార, ధారణ, ధ్యానం, సమాధి.

వీటిలో మొదటి పద్ధతులైన యోగ ఆసనముల ద్వారా ఆరోగ్యకరమైన ఆయుఃవృద్ధిని పొందవచ్చు.

# విద్యావ్యవస్థలో లోపం ఎక్కడ?

(ఆన్‌లైన్, గుంటూరు)

మనదేశంలో ఇప్పటి వరకు విద్యాప్రణాళికలను, వాటి ప్రమాణాలను పరిశీలించడానికి ప్రభుత్వం ఎన్నో కమిషన్లను, కమిటీలను నియమించింది. ఆ రంగానికి ప్రతి రాష్ట్రం ప్రతి సంవత్సరం కొన్ని వందల కోట్ల రూపాయలను ఖర్చు చేస్తున్నది. కేంద్రంలో చాలా పెద్దదైన మానవ వనరుల శాఖకు మంత్రి వున్నారు. ప్రతి రాష్ట్రంలో విద్యాశాఖ మంత్రులు వున్నారు. అయినా బహుకొద్ది రాష్ట్రాల్లో తప్ప మిగిలిన అన్ని రాష్ట్రాల్లోను అక్షరాస్యత 50 శాతాన్నిదాటలేదు. ప్రాథమిక సెకండరీ స్థాయిలో స్కూళ్లకు వెళ్లే బాలల కంటే వెళ్లనివారి సంఖ్యే అనేక రెట్లు ఎక్కువ. గ్రాడ్యుయేషన్, పోస్టు గ్రాడ్యుయేషన్ స్థాయిలో బోధించే చదువుకు, ఈ దేశంలో వున్న పరిశ్రమలు, వ్యవసాయ రంగాల అవసరాలకు సంబంధమే లేదు. అదే విధంగా రీసెర్చి స్థాయిలో కూడా చాలా లేబరేటరీలలో దశాబ్దానికి కనీసం ఒక్క కొత్త ఫార్ములా కూడా రావడం లేదు. అన్నీ కాపీ ఫార్ములాలే.

ఇంత అస్తవ్యస్తంగా, అగమ్యగోచరంగా వున్న విద్యావ్యవస్థను మరోసారి ప్రతిస్థాయిలోను తీవ్రంగా పరిశీలించాల్సిన సమయం ఆసన్నమైంది. ఎందుకుంటే గాట్ ఒప్పందం గురించి అందరికి తెలిసిందే. అంటే మన యువత అన్ని రంగాల్లోను ఏ దేశంతోనైనా పోటీ పడడానికి సిద్ధంగా వుండాలని స్పష్టంగా తేలింది. అయితే ఈ పోటీకి సరిపడే నైపుణ్యం, తెలివితేటలు మనకున్న విద్యావ్యవస్థపైనే ఆధారపడి వుంటుంది. ఈ నేపథ్యంలో ఇటువంటి దారుణ స్థితి నుంచి కనీసం సాధారణ స్థితికైనా వస్తేగాని మనం మన కాళ్లమీద నిలబడలేనటువంటి పరిస్థితి ఏర్పడింది. ప్రతి స్థాయిలోను ప్రస్తుత వ్యవస్థలోని లోపాలను కూలంకుషంగా పరిశీలించి రాబోయే 50 సంవత్సరాలలో ఏ దేశానికీ తీసిపోని విధంగా మనం ప్రజలను కూడా సమాన స్థాయిలో తీర్చిదిద్దగల విద్యావ్యవస్థను నిర్మించాలి. నిశితంగా పరిశీలిస్తే ముఖ్యంగా ఆలోచించాల్సిన విషయాలు...

## ప్రాథమిక విద్య

ప్రాథమిక, సెకండరీ విద్య ఆస్తవ్యస్తం, అయోమయం, అగమ్యగోచరం. ప్రజాస్వామ్యం పది కాలాలపాటు నిలవాలన్నా ప్రతి పౌరుడూ తమ పౌరహక్కును వినియోగించాలంటే పౌరులందరికీ ప్రాథమిక విద్య తప్పనిసరని ఎంతో మంది ఎన్నోసార్లు ఉద్ఘాటించారు. రాజ్యాంగపరంగా కూడా ఈ విషయమై హామీ వుంది. అయితే 47, 48 సంవత్సరాలపాటు ఎంతో కృషి చేసినా కనీసం 50 శాతం ప్రజలకు కూడా అక్షరాస్యత తీసుకురాలేకపోయాం. దీనికి పేదరికం, లేక విద్య అవసరంగూర్చితెలియజేయలేకపోవడం, లేదా చిన్న పిల్లలకు ఇది అనాకర్షణీయమైనదిగా వుండటం అనేవి కారణాలు కావచ్చు. ఈ స్థూలమైన కారణాలపై పూర్తి అవగాహన లేకుండా అనేక ప్రణాళికలను రూపొందించారు. అన్నీ దాదాపు విఫలమైనట్లేనని చెప్పాలి. గతంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ప్రొఫెసర్ రామకృష్ణారావు నిర్బంధ ప్రాథమిక విద్య కోసం ఒక నివేదికను సమర్పించారు. ఇదివరకటి నివేదికల వలే ఈ నివేదిక కూడా చాలా లోపభూయిష్టంగా వుందని కొందరు విద్యావేత్తలు, ఉపాధ్యాయులు తూర్పారబట్టారు. దీంట్లో ప్రధానంగా చదువుకోకపోతే శిక్ష విధిస్తాం అనిపించేలాగా సబ్సిడీ బియ్యానికీ పిల్లలను బడికి పంపించడానికి లంకెవేశారు. దీనివలన పిల్లలకు, తల్లిదండ్రులకు చదువుల పట్ల ఆకర్షణ కలుగకపోగా భయం కలిగేలా చేశారు. ఇదే నివేదికలో స్కూళ్లనిర్వహణ స్థానిక సంస్థలు నిర్వహించాలనేది మరో ప్రాధానాంశం. ఇది నేల విడిచి సాము చేయడం వంటిది. ఎప్పుడైతే స్థానిక సంస్థలు నిర్వహణ చేపడతాయో మరుక్షణంలో రాజకీయాలు తలెత్తి స్కూళ్ల రాజకీయ కేంద్రాలుగా తయారవుతాయనేది నిర్వివిదాంశం. ఏ రాజకీయ ప్రమేయం లేని కమిటీలు వేస్తామంటే అది రాతలకు, వినడానికి బాగుంటుందేగాని వాస్తవానికి అది ఎంత దూరంలో వుంటుందో అందరికి తెలిసిందే. ఇప్పుడైనా ప్రధానమైన ప్రాథమిక విద్యను పటిష్టపరిచేందుకు సమగ్రమైన వ్యూహాన్ని రూపొందించాల్సిన అవసరం వుంది. ఈ వ్యూహాన్ని రూపొందించేటప్పుడు కొన్నిముఖ్యమైన విషయాలను ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. అవి...

* విద్య అవసరాన్ని, దానివల్ల వారి పిల్లల భవిష్యత్తుకు జరిగేమేలు గురించి ప్రచారంచేయాలి
* సంచార విద్యాలయాలు ఏర్పాటుచేయడం
* విద్యావ్యాప్తికి టెలివిజన్ మీడియాను ఉపయోగించడం
* మరీ పేదరికంలోమగ్గుతున్న వారికి భోజన వసతులను కల్పించి విద్య చెప్పించడం
* చాలా డిపార్టుమెంట్లలోవలే ఎడ్యుకేషనల్ డిపార్టుమెంట్‌లో ఉపాధ్యాయులకు బాధ్యతను నిర్వహించడం
* వీటన్నింటికీ అయ్యే ఖర్చులకు ప్రత్యేక బడ్జెట్ మన ప్రభుత్వాలు కేటాయించడం

ఈ కార్యక్రమాలన్నీ ఒక వైపు ప్రభుత్వం నిర్వహిస్తూనే మరోవైపు ధనవంతులకు లభ్యమయ్యే ప్రైవేటు స్కూళ్లకు నిర్దిష్టమైన మార్గదర్శక సూత్రాలను తయారుచేయడం కూడా ప్రభుత్వ విధిగా పరిగణించాలి. సెకండరీ స్థాయిలో ప్రస్తుత పరిస్థితి ఇంకా దారుణంగా వుందనే చెప్పాలి. చదువు చెప్పకపోయినా ఫర్వాలేదు. కనీసం పుస్తకాలు లభ్యమయ్యేలా చూడమని వాపోతున్న ప్రజలకునిరాశ ఎదురయ్యే పరిస్థితి ఏదోరకంగా చదువుకున్నా కనీసం సంవత్సరానికి ఒక్కసారి పరీక్షలను సరిగా నిర్వహించలేని దయనీయమైన స్థితి. ఇంత ఆధునిక యుగంలో కూడా పరీక్ష పేపర్లు లీక్ కాకుండా నిర్వహించడం చేతకావడం లేదు.

## ఇంటర్మీడియట్ స్థాయి

సుమారు 20 సంవత్సరాల కిందట ఆంధ్రప్రదేశ్ +2 స్థాయిలో విద్య కోసం ప్రత్యేకంగా ఇంటర్మీడియట్ బోర్డును స్థాపించింది. పరీక్షల నిర్వహణలోను, ఫలితాల ప్రకటనలోను కొంతవరకు శాస్త్రీయ విధానాలను రూపొందించినప్పటికీ అనేకసార్లు ఎన్నో అవకతవకలు జరిగాయని అందరికి తెలిసిన విషయమే. మార్కులను కంప్యూటరైజ్డ్ చేసినంత పకడ్బందీగా వేల్యూయేషన్ నిర్వహించలేకపోతున్నారనేది నిర్వివాదాంశం. 40 మార్కులు రావలసిన విద్యార్థులకు 80 మార్కులు, 90 రావలసినవారు పరీక్ష తప్పడం అనేవి సర్వ సాధారణ విషయాలుగా మారాయి. మరీ గత ఐదు, ఆరు సంవత్సరాల నుంచి ప్రైవేటు రెసిడెన్షియల్స్ వచ్చిన తరువాత వాటికుండే సాధారణ వ్యాపార ధోరణితో పరీక్షలు నిర్వహణ విషయంలో కూడా బోర్డు అభాసుపాలైంది. వీటన్నింటి గురించి తీవ్రంగా ఆలోచించి పరీక్షా విధానాన్ని పటిష్టపరచాలి.

## ప్రైవేటీకరణ

ఇటీవలి కాలంలో అన్ని రంగాల్లో వలే విద్యారంగంలో కూడా ప్రైవేటీకరణ చాలా వేగంగా జరుగుతోంది. ప్రైవేటు యూనివర్శిటీలు ఏర్పాటుచేస్తామనే కేంద్రం ఒక వైపు చాలా వరకు ముఖ్యంగా ఉన్నత విద్యను ప్రైవేటు సంస్థలకు అప్పజెబుతామని రాష్ట్రాలు ఒకదానికి ఒకటి పోటీ పడి నిర్ణయాలు తీసుకుంటున్నాయి. దీనికి ముఖ్యంగా ఆర్థిక స్తోమతను పరిగణలోకి తీసుకోకుండా విద్యలో అందరికి సబ్సిడీ ఇవ్వడం కారణం. దాంతో ఎంత బడ్జెట్ కేటాయించినప్పటికీ సరిపోని పరిస్థితి ఏర్పడింది. నిజమే.. ధనవంతులకిచ్చే సబ్సిడీ విద్య తప్పే. ధనవంతులు తమ పిల్లలకు విద్యకు తామే ఖర్చు భరించాల్సిందే. వారు ప్రైవేటు స్కూళ్ల మీద ఆధారపడవలసిందే. అయితే మరోవైపు ప్రభుత్వ ధనంలో ఎక్కువ భాగం పేద వర్గాలకు ఉపయోగించాల్సిందే. కానీ ప్రభుత్వ విద్యా సంస్థల విద్యా తీరును మెరుగుపర్చనట్లయితే కొంతకాలానికి పేదవాడు ఉన్నత విద్య అభ్యసించే అవకాశమే కోల్పోతాడు. ఇటువంటి తరుణంలో తగుజాగ్రత్తలు తీసుకోకపోతే వున్న, లేని వారి మధ్యతేడా ఇప్పుడున్నదానికంటే కొన్ని వందల రెట్లు పెరిగి సమాజం అస్తవ్యస్థంగా తయారవ్వడానిక దారితీయవచ్చు.

# నాణాలు, స్టాంపుల సేకరణలో దిట్ట



విదేశీ కరెన్సీ పురాతన నాణేలు

(ఆన్‌లైన్, వినుకొండ రూరల్)

ఈయనపేరు వామరాజు రామారావు తండ్రి హనుమంతరావు అచ్చమాంబకు పుట్టిన ద్వితీయ సంతానం. ఊరు వినుకొండ. రామారావు విద్యాభ్యాసం 'డిగ్రీ' పూర్తిచేసి 'లా' చదువుతూ మధ్యలోనే ఆపివేశారు. చిన్నతనం నుండే సామాజిక స్పృహ, కళలపై ఆసక్తిని పెంపొందించుకున్న రామారావు వృత్తిపరంగా చేసేది గ్రామ పంచాయతీ కార్యదర్శిగానైనా ప్రవృత్తిగా మలచుకున్నది గేయాలు పాడడం, చరిత్రలోని అరుదైన నాణెములను, స్టాంపులను సేకరించడం. వినుకొండలో ఇప్పుడు ఏ కళాసంస్థలు, కార్యక్రమములు నిర్వహించినా దాని ప్రారంభం రామారావు గానంతోనే ప్రారంభం కావల్సిందే.



వామరాజు రామారావు

జన్మభూమి కార్యక్రమాలలో కాని, స్వాతంత్ర్య దినోత్సవ సంబరాలలో కాని అధికారులు రామారావు గాన పరవశములో మునిగి కాని కార్యక్రమాన్ని ముగించరు. ఈయన పాడే శైలి ప్రజలను ఉత్తేజపర్చి చైతన్యవంతుల్ని చేస్తుంది. ఇక రామారావు సేకరించిన నాణెములు, స్టాంపులు విలువైనవి. ఇవి అరుదుగా మాత్రమే లభిస్తాయి. క్రీస్తుకు పూర్వం నాటి రాగి నాణెముల నుంచి గుప్తుల కాలం నాటి సీసపు నాణెములు, ఈస్ట్ ఇండియా కంపెనీ వారి నాణెములు, గ్వాలియర్, ట్రావెన్‌కూర్, ఇండోర్, నైజాం కాలంనాటి నాణెములతో సహా నేటివరకు చలామణిలో ఉన్న ఎన్నోరకాల నాణెములు, కరెన్సీ నోట్లు శ్రమకోర్చి సేకరించారు.

సుమారు 15 సంవత్సరాల నుంచి అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, చైనా, జపాన్, ఆస్ట్రేలియా, సింగపూర్, కెనడా, ఇరాన్, ఇరాక్, ఇజ్రాయిల్, కువైట్, ఈజిప్టు మొదలైన అనేక దేశముల స్టాంపులు, నాణెములు సేకరించినారు. ఇంత శ్రమ దేనికని ఎవరైనా ప్రశ్నిస్తే ఇదంతా మానసిక తృప్తికొరకే కానీ, కాసులకోసం కాదని బదులిస్తారు రామారావు. సేకరించిన నాణెములు, స్టాంపులు ఏ దేశమునకు చెందినవో, ఏ కాలమునకు చెందినవో వివిధ పుస్తకముల ద్వారా, సంబంధించిన నిపుణుల ద్వారా తెలుసుకొన్నట్లుగా, ప్రదర్శనల ద్వారా అందరి ముందుంచుతానని వివరించారు. రామారావు తొలుత ఉద్యోగంలో వినుకొండ గ్రామాధికారిగా 1982లో చేరారు. 1992లో గ్రామ పరిపాలనాధికారిగా, 2002 నుంచి శావల్యాపురం గ్రామపంచాయతీ కార్యదర్శిగా చేస్తున్నారు. రామారావు మృదుభాషి, సౌమ్యత, నమ్రత కలినవారు.



విదేశీ స్టాంపులు

జీవితంలో ఏదో ఒకటి సాధించాలన్న తపన ఉన్న రామారావు తనకున్న ప్రతిభతో గాయకునిగాను, చారిత్రాత్మకంగా ఉపయోగపడే అరుదైన నాణేలు, స్టాంపుల సేకరణ కర్తగాను, గ్రామ పంచాయతీ కార్యదర్శిగాను త్రిపాత్రాభినయం చేస్తూ తనదైన తరహాలో కొనసాగుతున్నారు. ఆయన భార్య విఘ్నేశ్వరి, కుమార్తెలు కావ్య, కీర్తి సైతం కళాభిరుచి కలిగినవారే. వీరి కుమార్తెలు గానమాధుర్యంతో బాల్యంలోనే అనేకచోట్ల బహుమతులు పొందినారు.

# రైతులకు గిట్టుబాటు ధర కల్పించడమే మార్కెటింగ్ శాఖ లక్ష్యం



డా॥ వై.ఎస్. రాజశేఖరరెడ్డి
రాష్ట్ర ముఖ్యమంత్రి



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
రాష్ట్ర సహకార, రవాణాశాఖామాత్యులు



శ్రీ ధర్మాన ప్రసాదరావు
జిల్లా ఇన్‌చార్జిమంత్రి



శ్రీ బొత్స సత్యనారాయణ
రాష్ట్ర మార్కెటింగ్ శాఖమంత్రి



శ్రీమతి జి. జయలక్ష్మి I.A.S.
గుంటూరుజిల్లా కలెక్టర్

## రైతుల ఆత్మబంధు 'రైతు బంధు' పథకము

ఈ పథకం ద్వారా రైతులకు కలిగే లాభాలు.

★ మార్కెట్లో ధర తక్కువగా వున్నప్పుడు పంటలు అమ్ముకొని నష్టపోకుండా కొంత కాలం నిల్వవుంచి, ఆశించిన ధర వచ్చినపుడు అమ్ముకొని లాభం పొందవచ్చు.

★ మార్కెట్ కమిటీ గోదాములో పంటలను నిల్వవుంచి వాటి విలువలో 75శాతం మొత్తాన్ని, 50,000 రూపాయల గరిష్ట పరిమితికి లోబడి రుణం పొందవచ్చు.

★ రైతులు నిల్వవుంచిన పంటలకు పూర్తి భద్రతతోపాటు భీమా సౌకర్యం కూడా కల్పిస్తారు. పంటలను 90 రోజులదాకా నిల్వవుంచుకోవచ్చు. అప్పటికీ సరైన ధర రాకపోతే రైతుల అభ్యర్థన మేరకు మరో 90 రోజుల దాకా నిల్వవుంచుకొనే సదుపాయం వుంది.

★ ఈ పథకం ద్వారా తీసుకొనే రుణాలకు మొదటి 90 రోజుల వరకు వడ్డీలేదు. ఆ తర్వాత రోజులకు నామమాత్రపు వడ్డీ వసూలు చేస్తారు.

★ మార్కెట్ కమిటీల్లో ఈ పథకం ద్వారా ఇచ్చే రుణాలకు బడ్జెట్ ఆంక్షలు లేవు.

ఇప్పటికే ఈ పథకం ద్వారా వేలాది మంది రైతులు లాభం పొందారు. ఇక ఆలస్యం దేనికి? మీ సమీపంలోని వ్యవసాయ మార్కెట్ కమిటీని సంప్రదించి, మీరు కూడా రైతు బంధు పథకం ద్వారా వెంటనే లాభం పొందండి.

★ ఈ సంవత్సరం జిల్లాలోని వివిధ మార్కెట్ యార్డుల ద్వారా 3 కోట్ల 37 లక్షల రూపాయలను రైతుబంధు పథకం ద్వారా 889 మంది రైతులకు బకాయిలు ఇవ్వడమైంది.

▲▲▲

★ జిల్లాలోని వివిధమార్కెట్ యార్డుల ద్వారా 4000 మెట్రిక్ టన్నుల ఎరువులను రైతులకు ప్రభుత్వం నిర్ణయించిన ధరల ప్రకారం పంపిణీ చేయడమైనది.

▲▲▲

★ రైతు బజారులు మరియు చౌకడిపోల ద్వారా 41 లారీల ఉల్లిగడ్డలను కిలో 7 రూపాయలకు ప్రజలకు పంపిణీ చేయడమైంది.

## గ్రామాల్లో కాటా తూకాల మోసాలు పదివేలు-ఖచ్చితమైన తూకాలకు యార్డులోని ఎలక్ట్రానిక్ యంత్రాలే మేలు

★ సరుకులు అమ్ముకోవడంలో మోసాలు జరగకుండా కాపాడాలంటే మార్కెట్ యార్డు అమ్మకాలే శరణ్యం.

★ బహిరంగ వేలంకాని, టెండరు పద్ధతిలోగాని, అమ్ముకోవచ్చు. పోటీధర రాబట్టుకోవచ్చు.

★ తూకాల్లో రైతులు దగా పడకుండా చట్టరీత్యా అన్ని చర్యలు లభ్యం.

## కనీస మద్దతు ధర

★ సంవత్సరమంతా కష్టపడి పండించిన పంటకు ధర రాకపోతే చింతలేదు!

★ ప్రభుత్వం ప్రకటించిన కనీస మద్దతు ధర వుందిగా మీ చెంత!

★ యార్డులో అమ్మని పంటలకు ధరలు పడిపోయినపుడు కనీస మద్దతు ధరల ద్వారా రైతులను ఆదుకోవటం జరుగుతుంది.

★ గ్రామాల్లో అమ్మితే దళారులు అందినంత దోచుకుంటారు.

★ పంటలనమ్ముకోవడానికి మార్కెట్ యార్డులుండగా గ్రామాల్లో అమ్ముకోవడం శుద్ధదండగ.

★ నాణ్యమైన సరుకు తీసుకురండి మంచి ధర పొందండి.

★ సంవత్సరమంతా కష్టపడితే ధర పలకనపుడు గోదాములలో నిల్వ సదుపాయాలు ఉపయోగించుకోవచ్చు.



వి.డి. గాంధీ
అసిస్టెంట్ డైరక్టర్, మార్కెటింగ్ శాఖ


హొయలొలుకుతున్న వాటర్ ఫౌంటైన్


పచ్చని తివాచీ మయం

# గుంటూరుకే వన్నె తెస్తున్న గాంధీ పార్కు

(ఆన్‌లైన్ - కార్పొరేషన్)

గాంధీపార్కును 'హరిత వనం'గా నగరపాలకసంస్థ తీర్చి దిద్దింది. పార్కు ఆవరణలో ఎటు చూసినా పచ్చని ఆహ్లాదకరమైన వాతావరణాన్ని ఏర్పరచింది. అంతేకాకుండా రాత్రి వేళల్లో కళ్ళు మిరుమిట్లు గొలిపే రీతిలో అధునాతన విద్యుత్ కాంతులు, వాటర్ ఫౌంటైన్లు, పిల్లలను అలరారించేందుకు ఎన్నో క్రీడా పరికరాలు వంటి అనేక సదుపాయాలను కొత్తగా కల్పించింది. ఐదేళ్ళ క్రితం పార్కు పునఃనిర్మాణం అనంతరం ఏ విధంగా సందర్శకులను ఆకర్షించిందో అంతకంటే ఆకట్టుకునే విధంగా పాలకులు సింగారించారు. నిర్వహణ కొంచెం భారం అవుతున్నప్పటికీ ప్రైవేటుపరం చేయకుండానే సందర్శకులను ఆకట్టుకునే విధంగా అభివృద్ధిపరచి గేట్ కలెక్షన్లను పెంచి నష్టాలు లేకుండా చేస్తున్నారు. అందుకోసం రూ. **20** లక్షలకు పైగా నిధులు ఖర్చు చేశారు.

నగరంలోని ఉద్యానవనాలలో ఏకైక పర్యాటక ప్రదేశమైన గాంధీపార్కును కార్పొరేషన్ యంత్రాంగం ప్రతిష్టాత్మకంగా తీసుకుని వన్నెలద్దింది. వారాంతపు సెలవుదినంలోనే కాకుండా నిత్యం పార్కును ఎక్కువమంది సందర్శించే విధంగా ఆకర్షణీయంగా తీర్చిదిద్దారు. సందర్శకుల మనస్సులను ఆహ్లాదపరిచేందుకు అనేక సదుపాయాలు కల్పించారు. ముఖద్వారాన్ని వాటర్ ఫాల్స్‌తో కూడిన రాక్ స్ట్రక్చర్‌ను పునః నిర్మాణం చేసి ఆకర్షించేలా చేశారు.


సందర్శకుల కళ్ళు వీటితో జిగేల్

ఎంట్రన్స్ గేటు చూస్తూనే లోపల ఏ విధమైన వాతావరణం ఉంటుందో పర్యాటకుడు అంచనా వేసే రీతిలో నగిషీలు అద్దారు. సందర్శకులను మంత్రముగ్ధులను చేసేందుకు శిథిలావస్థ స్థితిలో ఉన్న పక్షుల గూడు, ఎక్వేరియం హౌస్, నాలుగు చోట్ల రంగురంగుల వాటర్ ఫౌంటైన్లను ఏర్పాటు చేశారు. పార్కులో ఎక్కడా పచ్చదనం లేని చిన్న ప్రాంతం కూడా లేకుండా 'పచ్చని తివాచి' వలే పచ్చికబైలును పెంచారు. అక్కడక్కడా రంగురంగుల పూల చెట్లు ఏర్పాటు చేసి సందర్శకులను ఆహ్వానిస్తున్నట్లుగా చేశారు.

పిల్లలను ఆకర్షించేందుకు వివిధ రకాల జంతువులు, పక్షులను ప్రదర్శనకు తీసుకొచ్చారు. గతంలో రాత్రి అయ్యేసరికి గబ్బిగీయంగా మారి అసాంఘీక కార్యకలాపాలకు పార్కు నిలయంగా మారుతుండేది. ఈ కారణంగా చాలామంది సందర్శకులు గాంధీపార్కుకు రావడం మానేశారు. అలాంటి కలుషిత వాతావరణం తొలగించేందుకు గాను లైటింగ్‌ను గణనీయంగా మెరుగుపరిచారు. ఎక్కడికక్కడే హైమాస్ట్ లైట్లు, రోడ్డుపై నుంచి సంచరించే ప్రజలను ఆకర్షించేందుకు ముఖద్వారం వద్ద రంగు రంగులతో కళ్ళు మినుమిట్లు గొలిపే కొబ్బరి చెట్టు ఆకారంలో విద్యుత్‌దీపాలను అమర్చారు. వీటిని ఇతర రాష్ట్రాల నుంచి ప్రత్యేకంగా తెప్పించారు.

గాంధీపార్కును నగరపాలకసంస్థకు ఒక మంచి ఆస్తిగా చేసే క్రమంలో డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, ఇరువురు అసిస్టెంట్ ఇంజనీర్లు, మరో ఉద్యానవన సహాయ సంచాలకులకు పర్యవేక్షణ బాధ్యతలు అప్పగించి ఎప్పటికప్పుడు కమిషనర్ దువ్వారపు రామారావు పార్కు అభివృద్ధిని సమీక్షిస్తున్నారు.


పార్కు ఆవరణలో ఏరియల్ వ్యూ


ఇరువైపులా ఆహ్లాదమే

# దైవాలంకార ప్రవీణుడు మామిళ్ళపల్లి


గజలక్ష్మి అలంకారం

**(ఆన్‌లైన్, వేమూరు)**

కళలు అనేక రకాలు. ఆ రంగంలో "అలంకార కళ" అనేది ఓ ప్రాముఖ్యతను పొందింది. ఈ కళ కృత్రిమమైంది. అలంకారాల ద్వారా పురాణ గాధలను పది మందికీ తెలుపవచ్చు. ఈ కళ ద్వారా ఆధ్యాత్మికతను అలవరింపజేయటం సులభంకాగలదని ప్రముఖ దైవాలంకార ప్రవీణుడు బ్రహ్మశ్రీ మామిళ్ళపల్లి వెంకట సుబ్బరాయశర్మ అన్నారు. గుంటూరు జిల్లా వేమూరు మండలంలోని జంపని గ్రామానికి చెందిన సుబ్బరాయశర్మ ఇంటర్మీడియట్ వరకు చదివారు. వంశపారంపర్యంగా వస్తున్న గ్రామీణ వైద్యంలో తండ్రి మంగపతి రావు వద్ద అనుభవం గడించారు. పెదనాన్న డాక్టర్ మామిళ్ళపల్లి పూర్ణేశ్వరదీక్షితులు వద్ద ప్రతిష్టాంతం వరకు శైవాగమ విద్యను అభ్యసిస్తూ ఆయన నుంచి అలంకారాలు చేసే విద్యను కూడా సముపార్జించారు. ఆయన శిష్యులలో ఉత్తముడిగా గుర్తింపు పొందాడు. ఇరవై ఐదు ఏండ్ల వయసుకే శర్మ అలంకారాలు చేయటంలో నిష్ణాతుడయ్యాడు. దేవాలయాల్లో ఉత్సవాలు జరిగేప్పుడు, పర్వదినాలలో ఆధ్యాత్మిక సంఘాల వారు ప్రత్యేకంగా జరిపే ఉత్సవాలలో, మహిళలకు చెందిన దైవిక వ్రతాలలో దైవాలంకారాలు చేయిస్తుంటారు. ఆయా ఉత్సవాలలో వచ్చే తిధులు బట్టి ఆనాడు ఏ మూర్తికి చెందిన అలంకారం చేయాలో అలాంటి సందర్భోచిత అలంకారం చేయాల్సి వుంటుంది. ఆ అలంకార ఘట్టం చూడగానే సంబంధిత పురాణ గాధ ప్రతి వ్యక్తికి గోచరం కావాలి. అందుకు తగిన పద్ధతిలో అలంకారం చేయటం చాలా కష్టతరం. అందుకు పురాణ గాధలను కూడా చదివి వుండాలి. ఈ విషయాలలో ఎంతో సాధన చేసి కళకు గుర్తింపు తేవటంతో పాటు సమాజంలో తనకంటూ ప్రత్యేకతను సంతరింపజేసుకున్నారు శర్మ. పురాణ గాధల్లో చూపిన రీతిలో ఆయా ఘట్టాలను ఎప్పటికప్పుడు కొత్తదనంగా చూపటం కూడా ఈయనలోని ప్రత్యేకత. అలంకారాలకు చెందిన వస్తు సామాగ్రిని సమకూర్చుకోవటం చాలా కష్టతరం. కొన్ని వస్తువులు మాత్రమే కొనడానికి దొరుకుతాయి. మూడువంతుల దాకా వస్తువుల్ని సొంతంగానే తయారు చేసుకోవాల్సి వుంటుందని శర్మ తెలిపారు. ఈ వస్తువుల తయారీకి పలు రకాల రంగులు, పాల సపోటా, వెదురు చెట్లకు చెందిన కర్రలను, ప్లాస్టరాఫ్ ప్యారిస్, కాగితం పిండి, ధర్మాకోల్, రకరకాల వస్త్రాలు, కొబ్బరిపీచు, నాము, దూది, గడ్డి లాంటి వస్తువులు వాడాల్సి వుంటుంది. ఆయా మూర్తిని తయారు చేశాక అలంకార భూషితమైన ఆభరణాలు, ఆయుధాలు, వాహనాలు కూడా ఏర్పాటు చేయాలి. అలంకారం చేసిన ప్రదేశంను అలంకారంకు తగిన రీతిలో మార్చాల్సివుంది. ఈ వృత్తి ద్వారా సొమ్ము గడించటం కన్నా ఆత్మ సంతృప్తి తోపాటు సమాజంలో తగిన గుర్తింపు మాత్రం పొందలమని శర్మ అన్నారు. ఆలయాలలోని మూలవిరాట్‌లకు, ఉత్సవ మూర్తులకు అలంకారాలు చేయవచ్చు. ప్రత్యేక వేదికల వద్ద కృత్రిమ అవయవాలతో అలంకారం చే స్తావ ు న్నార ు. ప్రత్యేక రూపాలను రెండు నుంచి ఏడడుగుల ఎత్తులో తయారు చేస్తామన్నారు. కార్తీకమాసం, వినాయక, దసరా నవరాత్రులు, శ్రీరామ నవమి, ముక్కోటి ఏకాదశి, శివరాత్రి, కృష్ణాష్టమి, ఆరుద్రానక్షత్రం, ధనుర్మాసం, శ్రావణ పూర్ణిమ, ఇతరమైన వ్రతాలు, నోములు, ప్రతిష్టా కార్యక్రమాలు, బ్రహ్మోత్సవాలలో అలంకారాలు చేయిస్తారని ఆయన తెలిపారు. ఈ విద్యలో ప్రావీణ్యత పొందిన శర్మను వైఖానస సేవా సంఘం, డాక్టర్ మేడూరి బాపనాచార్య స్మారక ట్రస్టు, వైఖానస యూత్ ఫోరం, శ్రీ చెన్నకేశవ భక్త సమాజం, సీతారామ, రామేశ్వర, రామలింగేశ్వర, వాలేశ్వరస్వామి భజన సమాజాల వారు, పలు ఆలయాల ట్రస్టు బోర్డుల వారు ఘనంగా సన్మానించారు. తనలోని కళానైపుణ్యంతో చిన్న పిల్లలకు దైవగాధలను తెలియజేయుటకు ప్రత్యేక అలంకార రూపాలను తయారు చేయనున్నట్లుగా శర్మ తెలిపారు.


మామిళ్ళపల్లి వెంకట సుబ్బరాయశర్మ


అన్నపూర్ణాదేవి అవతారం


శివోపాశిని అలంకారం

**పులుపుల శివయ్య**

సీ. పుడమిన శ్రమజీవ బడలిక సడలించ
పులుపుల జన్మించె, పల్లనాట
ఆచారఖైదును, అలనాడె విడనాడె
ప్రజల సేవకు తాను పయనమాయె
చదువుల విలువైన సారాన్ని సమకూర్చి
బోధించె గురువుగా బాధలెరిగి
స్వాతంత్ర్య దీక్షలో సమర నినాదుడై
జైలువాసము జేసె జాతికొరకు.

అ.వె. కన్నెగంటి వీర హనుమంతు శౌర్యాన్ని
పుణికి పుచ్చుకున్న పులుపుల స్మృతి
మరువలేని దిగులు మమతాను బంధమై
దిగులు కిరణ మిచట వెలుగు చుండె.

–దుబ్బలదాసు

# సాహస క్రీడ రోలర్ స్కేటింగ్

(ఆన్‌లైన్, క్రీడాప్రతినిధి – గుంటూరు)

శారీరక, మానసిక పటుత్వంతో ఏకాగ్రత ప్రదర్శించి ఆడే సాహస క్రీడ రోలర్ స్కేటింగ్. క్రీడాకారులు పాదాలకు స్కేటింగ్ బూట్లు అమర్చుకొని, రింక్‌లో కాలుపెట్టగానే ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యాలు, తన్మయత్వంలో మునిగిపోతారు. రోలర్ స్కేటింగ్ శిక్షణకు కావాల్సిన శిక్షణ కేంద్రాలు గుంటూరులో వున్నాయి. జాతీయ, అంతర్జాతీయ స్థాయికి ఎదిగిన సమర్థులైన క్రీడాకారులు ఇక్కడ వున్నారు. రోలర్ స్కేటింగ్‌కు చదునుగా వుండి సులభంగా జారిపోవడానికి వీలైన ప్రదేశం కావాలి. దానిని స్కేటింగ్ రింక్ అంటారు. ఈ క్రీడ ఆంధ్రలో మొదటిసారి 1982లో విశాఖపట్నంలో ప్రారంభమైంది. రోలర్ స్కేటింగ్ రింక్ అంతర్జాతీయ ప్రమాణాల ప్రకారం 1800 చదరపు అడుగులు వుండాలి. అంతకన్నా తక్కువ సైజులో వున్న రింక్‌లు కూడా సాధన చేయడానికి ఉపకరిస్తాయి. మన ప్రాంతంలో ప్రచారంలో వున్న క్రీడ రోలర్ స్కేటింగ్. పోటీలలో ఎక్కువగా ఆడే ఆటలలో స్పీడ్ రేస్, రింక్‌రేస్–1, రింక్‌రేస్–2 వున్నాయి. ఇవి 300 మీటర్ల దూరం వుంటాయి. రోడ్ రేస్–1 స్కేటింగ్ రింక్‌కు బయట జరుగుతుంది. పోటీ ఐదు వేలు, పది వేల మీటర్ల దూరం మేర జరుగుతుంది. ఇవిగాక రోలర్ స్కేటింగ్‌లో నృత్య విన్యాసాలు వుంటాయి. వీటిలో ఆర్టిస్టిక్, ఫిగర్, ఫ్రీ స్టయిల్, పెయిర్, కూచిపూడి, భరతనాట్యం, వెస్టర్న్ స్టయిల్, క్లాసికల్ నృత్యాలు ప్రదర్శిస్తారు. మనదేశంలో ఆలిండియా రోలర్ స్కేటింగ్ ఫెడరేషన్, స్కూలు నేషనల్ గేమ్స్ వారు నిర్వహించే పోటీలు తప్ప మరి ఏ రకమైన పోటీలు లేవు. వీటిలో ప్రధమ స్థానానికి ఐదు పాయింట్లు, ద్వితీయ స్థానానికి 33 పాయింట్లు, తృతీయ స్థానానికి ఒక పాయింట్ కేటాయిస్తారు. పోటీలలో తక్కువ సమయంలో ఎక్కువ వేగంగా తిరిగిన వారికి విజయం లభిస్తుంది. రింక్–1 పోటీ (300 మీటర్లు) 14 సంవత్సరాలలోపు వారికి, రింక్–2 పోటీ (3000 మీటర్లు) 14 సంవత్సరాలపైబడిన వారికి జరుగుతాయి.

రోలర్ స్కేటింగ్‌కు ఉపయోగించే స్కేట్లను అనేక కంపెనీలు తయారు చేస్తాయి. సాధారణంగా ప్రాక్టీస్‌కు ఉపయోగించే స్కేట్లకు 4 చక్రాలుంటాయి. దీనిని 'స్క్వాడ్' అంటారు. 8 నుంచి 14 సంవత్సరాల వయసు వారు 'ఇన్ లైన్ స్కేట్స్' వాడుతారు. వీటికి ఒక్ వరుసలో ఐదు చక్రాలుంటాయి. రోడ్ వీల్స్ సింథటిక్ రబ్బరుతో తయారైవుంటాయి. వీటితో రోడ్డు మీద స్కేటింగ్ చేస్తూ వెళ్ళవచ్చు. స్కేటింగ్ నేర్చుకోవడం ప్రారంభించిన మొదటి రోజుల్లో 'జో నెక్స్' స్కేట్స్ వాడుతారు. ఇవి బెల్టులతో బిగించుకోవడానికి వీలుగా వుంటాయి. రోలర్ స్కేటింగ్‌లో అనేక మెలకువలున్నాయి. ఇవి క్రాస్ లీగ్, స్పీడ్, కర్వ్, బ్యాలెన్స్ హీల్ ల్యాండింగ్, స్పీడ్‌పికప్, లెగ్ స్ట్రెచ్చింగ్, పుషింగ్ వంటి మెలకువలలో బాగా శిక్షణ పొందాలి. దీనికి శరీరం బలంగా క్రీడాకారుని అదుపులో వుండాలి, చేస్తున్న విన్యాసంపై మనసు కేంద్రీకృతమైనపుడే మంచి నైపుణ్యాన్ని సాధించగలుగుతారు. బ్రేక్ బాగా ఉపయోగించడం అలవాటైతే స్కేటింగ్ అదుపులో వుంటుంది. పోటీలలో పాల్గొనే వారు రోలో, స్టాండ్, హైపర్ పిస్తా, క్యానిబాల్, వికెడ్ లిప్, స్నేక్ ఐస్, స్పీడ్ హెప్, స్పీడ్ హీల్స్, విచ్ డాక్టర్, స్పీడ్ షామిన్ మొదలగు రకాలు వాడుతారు. ఇవి అన్నీ విదేశీ కంపెనీలు తయారు చేసిన వస్తువులు. ఖరీదు ఎక్కువ. రోలర్ స్కేటింగ్ క్రీడ ఇప్పుడిప్పుడే గుంటూరులో మంచి ప్రచారంలోకి వస్తుంది.

ప్రప్రధమంగా గాంధీపార్కులో సాధారణ రింక్‌లో ప్రారంభమైన రోలర్ స్కేటింగ్ అనేక మంది తల్లిదండ్రులను ఆకర్షించింది. వారి పిల్లలను శిక్షణలో ప్రవేశపెట్టడంతో ఈ క్రీడకు ప్రాచుర్యం పెరిగింది. బృందావన్‌గార్డెన్స్‌లోని ఎన్టీఆర్ మున్సిపల్ క్రీడాప్రాంగణంలో అధునాతన స్కేటింగ్ రింక్ ఏర్పాటు చేశారు. అనేక మంది బాల, బాలికలు క్రమం తప్పకుండా సాధన చేయటానికి తల్లిదండ్రులు ప్రోత్సహిస్తున్నారు. భవిష్యత్తులో జాతీయ రోలర్ స్కేటింగ్ రంగంలో గుంటూరు క్రీడాకారులు ప్రముఖ స్థానం ఆక్రమిస్తారనటంలో ఆశ్చర్యం లేదు.



రోలర్ స్కేటింగ్ ఆర్టిస్టిక్ విన్యాసం



స్కేటింగ్ సాధనకు సిద్ధమైన బాలబాలికలు

# మాతృభూమి రుణం తీర్చుకుంటున్న

# డా॥ రామినేని  ఫౌండేషన్





**రామినేని అయ్యన్న చౌదరి**
ఫౌండర్, రామినేని ఫౌండేషన్

భారతీయ సంస్కృతి మరియు హిందూయిజం ఆదర్శాలకు సంబంధించి కట్టుదాల వారసత్వాన్ని పరిరక్షించి, అభివృద్ధి పరిచే లక్ష్యంతో USA లోని ఓహియో రాష్ట్రంలో సిన్ సిన్నాటిలో స్వర్గీయ డా॥ రామినేని అయ్యన్న చౌదరి పిల్లలచే 1995లో డా॥ రామినేని ఫౌండేషన్ స్థాపించబడింది. అంతేగాక కళలు, శాస్త్రం మరియు మానవ విజ్ఞాన శాస్త్రాల మిశ్రమ రంగాల నుండి తీసుకోబడిన ఉన్నత పండితులను సాహసవంతులుగా, ధృఢ నిర్భలయులుగా, పరోపకారులుగా వారి ప్రయత్నాలకు వీలు కల్పించడమే ఈ సంస్థ యొక్క ప్రాథమిక లక్ష్యం.

## డా॥ రామినేని అయ్యన్న చౌదరి (డా॥ RAC)

డా॥ RAC 1929 అక్టోబరు 12న ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లా, బ్రాహ్మణ కోడూరు గ్రామంలో రైతు కుటుంబంలో స్వర్గీయ శ్రీ వీరయ్య చౌదరి మరియు స్వర్గీయ శ్రీమతి కన్యాకుమారికి జన్మించారు. ఆయన తండ్రి సలహా మేరకు వ్యవసాయంతోపాటు లలిత కళలలో చొరవచూపారు. డా॥ RAC గుంటూరు జిల్లాలో పాఠశాల విద్య పూర్తి చేసి బనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుండి గణితంలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ డిగ్రీ పొందారు. 1955 వరకు ఆయన గుంటూరు జిల్లాలోని పాలపర్రు, కృష్ణాజిల్లాలోని మొవ్వలో ఉపాధ్యాయుడిగా పనిచేశారు. ఉన్నత విద్యాభ్యాసంకై డా॥ RAC 1955లో అమెరికా వెళ్ళారు. అక్కడ ఆయన మిన్నీపాలిస్‌లోని మిన్నెసోట విశ్వవిద్యాలయం నుండి మాస్టర్ ఆఫ్ సైన్స్ ఇన్ ఎకనామిక్స్ అండ్ ఫైనాన్స్‌తోపాటు డాక్టరేట్ కూడా పూర్తి చేశారు. విద్యాభ్యాస కాలంలో ఆయన తల్లిదండ్రులపై ఆధారపడక పార్ట్‌టైం ప్రాతిపదికన పనిచేస్తూ స్వయంగా ఆర్థిక వనరులను సమకూర్చుకునేవారు. తర్వాత 1963-1973 వరకు నార్త్ ల్యాండ్ కాలేజిలో ప్రొఫెసర్‌గా ఆశ్లాండ్ అండ్ జేవియర్ యూనివర్శిటీ, సిన్‌సెన్నాటిలో పనిచేశారు. 1973లో ఆయన తన సేవలను సామాజిక, సాంస్కృతిక రంగాలకు అంకితం చేసేందుకై చాలా ముందుగానే పదవీ విరమణ పొందినారు. డా॥ RAC పదవీ విరమణ తర్వాత రియల్ ఎస్టేట్ వ్యాపారంలోప్రవేశించి ఓహియో రాష్ట్రంలోని సిస్ సిన్నాటిలో డౌన్‌టౌన్ ప్రాపర్టీ మేనేజ్‌మెంట్ Inc., ని స్థాపించారు. నాయకుని లక్షణాలతో ముందుకు సాగారు. నేడు ఈ సంస్థ ఉన్నత స్థానంలో ఉన్నది. డా॥ RAC కి 1967లో సుగుణతో వివాహమైంది. ఆయనకు 6గురు పిల్లలు. మన సంస్కృతి నాగరికతలో అపార నమ్మకమున్నందున వారికి ధర్మప్రచారక్, శారదాదేవి, సత్యవాది, బ్రహ్మానంద, వేదాచార్య మరియు హరిచంద్ర అని సంప్రదాయక వేద పేర్లు పెట్టుకొన్నారు. ఆయన తన పిల్లలను పాశ్చాత్య సంస్కృతి నుండి తప్పించేందుకు ఇంట్లోనే విద్యాబుద్ధులు నేర్పారు. ఆయనచే ప్రారంభించిన వ్యాపారంలో శిక్షణలో పొందిన వారు జాగ్రత్తగా చూసుకుంటున్నారు. డా॥ RAC 1958లో USA లో విద్యాభాస కాలంలో హిందూ సంస్కృతి మరియు నాగరికతను వికసింపజేసేందుకు హిందూ అసోసియేషన్ ఆఫ్ మిన్నెసోటాను స్థాపించి క్రమంగా భారతీయ ఉత్సవాలు మరియు సామాజిక కార్యకలాపాలను నిర్వహించారు. ఆయన తన జన్మస్థలంలో సంగీత, సాహిత్య, సంస్కృతి, హిందూధర్మ నిలయంను స్థాపించి భారతీయ లలిత కళలకు అంకితం చేశారు. డా॥ RAC వెంపటి చినసత్యం మార్గదర్శకాల మేరకు కూచిపూడి నాట్య పాఠశాల మరియు వేద పాఠశాలను కూడా స్థాపించాలని ప్రణాళిక రూపొందించారు.





**వేదాచార్య**
కన్వీనర్, రామినేని ఫౌండేషన్





ఆంధ్ర మహిళా సభ మాజీ అధ్యక్షురాలు కె. సుగుణమణిని రామినేని ఫౌండేషన్ ఆధ్వర్యంలో సన్మానిస్తున్న కేంద్ర మంత్రి దాసరి నారాయణరావు, శాసనసభ స్పీకర్ సురేష్ రెడ్డి, పోలీసు ఉన్నతాధికారి ఖాన్ తదితరులు





రామినేని ఫౌండేషన్ కన్వీనర్ వేదాచారిని ఆశీర్వదిస్తున్న త్రిదండి రామానుజ చినజీయర్ స్వామి

## డా॥ రామినేని ఫౌండేషన్ USA

ఈ సంస్థ యొక్క లక్ష్యాలు మరియు సంక్షిప్త వివరాలు ఇప్పటికే మీ వద్ద ఉన్నాయి. దీనికి తోడు సంస్థ యొక్క గత కార్యకలాపాలు దిగువ తెలియజేస్తున్నాము.

హైదరాబాద్‌లో 12 అక్టోబరు 1999న హోటల్ గ్రాండ్ కాకతీయలో డా॥ ఆర్ఎఫ్ ప్రారంభించబడి క్రింద పేర్కొన్న వాటిని నిర్వహించింది. ఈ వేడుకలో ముఖ్య అతిథిగా డా॥ సి. నారాయణరెడ్డిగారు మరియు విశిష్ట అతిథులుగా డా॥ వెంపటి చిన్నసత్యం, ప్రొఫెసర్ ఎన్. గోపి, ప్రొఫెసర్ పి. శివారెడ్డి మరియు డా॥ గుమ్మడి వెంకటేశ్వరరావు పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** డా॥ వెంపటి చిన సత్యం బృందంచే కూచిపూడి నృత్య ప్రదర్శన.

**సన్మానం : విశిష్ట పురస్కారం :** డా॥ జిఎన్. రావు, వ్యవస్థాపకులు & డైరెక్టర్, ఎల్.వి. ప్రసాద్ ఐ ఇనిస్టిట్యూట్.

**విశేష పురస్కారం :** బాపు-రమణ , ఆదర్శ స్నేహితులు మరియు రూపకర్తలు : డా॥ నందూరి రామమోహనరావు, విశేషానుభవంగల జర్నలిస్టు & రచయిత : శ్రీ కాళీపట్నం రామారావు, తెలుగు కథాపోషకులు

భారతదేశంలో 12 అక్టోబరు, 2000 నాడు హోటల్ గ్రీన్‌పార్క్‌లో డా॥ మొది వార్షికోత్సవమును జరుపుకొని దిగువ తెలిపిన వాటిని నిర్వహించింది. ఈ ఉత్సవానికి డా॥ అక్కినేని నాగేశ్వరరావుగారు ముఖ్య అతిథిగా మరియు డా॥ ఎన్. శివప్రసాద్, ప్రొఫెసర్ కాకర్ల సుబ్బారావు, శ్రీ ఎం. మురళీమోహన్ విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు.

సాంస్కృతిక కార్యక్రమం : "అన్నమయ్య పద కోకిల" శ్రీమతి శోభరాజు మరియు బృందంచే భక్తి సంగీత కార్యక్రమం.

డా॥ RAC జన్మస్థలాన్ని మరియు తన కుటుంబ వృత్తిని మరచిపోకుండా తన 4వ కుమారుడు వేదాచార్య సహాయంతో బ్రాహ్మణకోడూరులో వ్యవసాయ కార్యరంగాన్ని అభివృద్ధి చేశారు. భారతదేశాన్ని తరచుగా సందర్శించినప్పుడు విలువైన మార్గదర్శకాలను పశుసంరక్షణకై అందించారు. హిందుస్థాన్ ధెరప్యూటిక్స్ ప్రై. లిమిటెడ్, హైగారాబాద్ పేరుతో ఫార్ములేషన్స్ తయారీ యూనిట్‌ను నెలకొల్పి, వ్యవసాయదారులకు అధిక నాణ్యత మరియు తక్కువ ఖర్చుతో కూడిన పశు సంరక్షణ మందులను అందిస్తున్నారు. డా॥ RAC గారి 70వ జన్మదినోత్సవం సందర్భంగా వారి పిల్లలు డా॥ రామినేని ఫౌండేషన్‌ను భారతదేశంలో 12-10-1999న ప్రారంభించి దాని సామాజిక మరియు సాంస్కృతిక కార్యకలాపాలను విస్తృతంచేసి ప్రాథమిక లక్ష్యాన్ని నెరవేర్చేందుకు కృషి చేస్తున్నారు.





స్కాలర్‌షిప్‌లు పొందిన ప్రతిభగల పేద విద్యార్థులతో జీయర్‌స్వామి, వేదాచారి, ఎమ్మెల్యే ధూళిపాళ్ళ నరేంద్రకుమార్, జడ్పీ ఛైర్మన్ పాతూరి తదితరులు





జడ్పీలో రామినేని ఫౌండేషన్ కన్వీనర్ వేదాచారిని సన్మానిస్తున్న కలెక్టర్ జయలక్ష్మి, ఎంపి బాలశౌరి, ఎస్పీ సజ్జనార్, జడ్పీ ఛైర్మన్ పాతూరి

దురదృష్టవశాత్తు అరోగ్యకారణాల వల్ల వ్యవస్థాపకులైన డా॥ RAC గారు 24-4-2000 నాడు సిన్‌సిన్నాటిలో మరణించారు. సన్మానాలు మరియు ఇతర సామాజిక కార్యకలాపాలు అందజేసే సంస్కృతిని కొనసాగించాలని అతని పిల్లలు నిర్ణయించారు. పురస్కారములు -99, పురస్కారములు-2000, పురస్కారములు-2001, పురస్కారములు-2002, పురస్కారములు-2003, పురస్కారములు-2004 పేరుతో సన్మాన కార్యక్రమాలను నిర్వహించి 12-10-2005న పురస్కారములు-2005 నిర్వహించాము. గతంలో జరిగిన వేడుకల వివరాలు జతరపరచబడినవి.

ఆంధ్రప్రదేశ్ ఉన్నత విద్యా మండలిచే నిర్వహించబడిన 10వ తరగతి పబ్లిక్ పరీక్షలలో అత్యున్నత మార్కులు సాధించిన బాలబాలికలను మెరిట్ అవార్డులను ఇవ్వాలని 2001 పురస్కారముల సమయంలో నిర్ణయించడమైనది. ఎంపిక చేయబడిన పాఠశాలలన్నీ గ్రామీణ ప్రాంతాల (గుంటూరు జిల్లాలోని బ్రాహ్మణకోడూరు, పాలపర్రు మరియు తెనాలి మరియు కృష్ణా జిల్లాలోని మొవ్వ)లోని జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలకు చెందినవే. ఈ ఎంపిక వెనుక దాగివున్న ఉద్దేశ్యమేమనగా గ్రామీణ ప్రాంతాల విద్యార్థులను ప్రోత్సహించి జీవితంలో ఉన్నత లక్ష్యాలను సాధింపచేయడం. ఈ ప్రదేశాలు కూడా డా॥ RAC గారి స్వస్థలమేకాక ఆయన విద్యాభ్యాసం చేసి, అక్కడే ఉపాధ్యాయుడిగా పనిచేసియున్న స్థలం.

గ్రామీణులను ప్రోత్సహిస్తున్న ఈ నేపథ్యంలో పురస్కారములు-2003 కాలంలో ఒక్కో అసెంబ్లీ నియోజకవర్గం ఉండి 19 మందికి పైగా 10వ తరగతి విద్యార్థులను మెరిట్ అవార్డులు బహుకరించడమే కాక ఈ సంవత్సరం గుంటూరు జిల్లాలో ఒక్కో మండలంలో ఒక్కొక్కరు చొప్పున 57 మంది విద్యార్థులకు అందజేయబడినవి. ఇది పైన తెలిపిన 4 విద్యార్థులకు అదనం.

**సన్మానం : విశిష్ట పురస్కారం :** డా॥ కె. వరప్రసాద్ రెడ్డి, ఎండి, శాంతా బయోటెక్నిక్స్ (ప్రై) లిమిటెడ్.

**విశేష పురస్కారం :** డా॥ లాల్జీ సింగ్, డైరెక్టర్ సిసిఎంబి, హైదరాబాద్
డా॥ కె. విశ్వనాథ్, సినీ దర్శకులు
శ్రీ కాళోజి నారాయణరావు, విశేసానుభవంగల రచయిత

హైదరాబాదులోని హోటల్ తాజ్ రెసిడెన్సీలో 12 అక్టోబర్, 2001న డా॥ ఆర్ఎఫ్ తన 2వ వార్షికోత్సవాన్ని జరుపుకుని దిగువ పేర్కొన్న వాటిని నిర్వహించింది.

ఈ వేడుకులకు కేంద్ర రక్షణ శాఖ సహాయ మంత్రి శ్రీ యు.వి. కృష్ణంరాజుగారు ముఖ్య అతిథిగా పాల్గొనగా, జస్టిస్ జాస్తి చలమేశ్వర్, ఆం.ప్ర హైకోర్టు మాజీ న్యాయమూర్తి, శ్రీ ఎ. గంగాధరరావు, శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్, ఐఎఎస్ మరియు శ్రీ ఎం.వి. భాస్కరరావుగార్లు విశిష్ట అతిథులుగా పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** శ్రీ వందేమాతరం శ్రీనివాస్ మరియు బృందంచే సంగీత కచేరి

**సన్మానం : విశిష్ట పురస్కారం :** ప్రొఫెసర్ డి.సి. రెడ్డి, వైస్ చాన్సలర్, ఉస్మానియా విశ్వవిద్యాలయం





బ్రాహ్మణ కోడూరులో రామినేని ఫౌండేషన్ నిర్మించిన ఓవర్‌హెడ్ ట్యాంక్

**విశేష పురస్కారం :** ఓల్గా, ప్రఖ్యాత రచయిత్రి
శ్రీ ఎం.ఎ. సుభాన్, వ్యవస్థాపకులు : కళాసాగర్, చెన్నై
శ్రీమతి జి. నిర్మలమ్మ, ప్రఖ్యాత సినీ ఆర్టిస్ట్

హైదరాబాదులో 12 అక్టోబరు 2002న డా॥ ఆర్ఎఫ్ హోటల్ తాజ్ కృష్ణాలో 3వ వార్షికోత్సవాన్ని జరుపుకుని దిగువ తెలిపిన వాటిని నిర్వహించింది.

ఈ వేడుకలకు శ్రీమతి కె. ప్రతిభా భారతి, ఆంధ్ర శాసనసభ స్పీకర్ ముఖ్య అతిథిగా పాల్గొనగా, శ్రీ టి. దేవేందర్‌గౌడ్, ఆంధ్ర హోంమంత్రి, డా॥ కోడెల శివప్రసాదరావు, ఆంధ్ర ఆరోగ్య శాఖామంత్రి శ్రీ ఐ. వెంకట్రావు, ఛైర్మన్ ఆంధ్ర వైస్ అకాడమీ డా॥ మాడుగుల నాగఫణిశర్మ గార్లు విశేష అతిథులుగా పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** ప్రఖ్యాత చలన చిత్ర హాస్య కళాకారులచే హాస్యవల్లరి

**సన్మానం : విశిష్ట పురస్కారం :** డా॥ చుక్కా (ఐఐటి) రామయ్య డా॥ ఎన్. కోటేశ్వరరావు, ప్రముఖ రచయిత, సయ్యద్ ఎండి. ఆరిఫ్, నేషనల్ చీఫ్ బ్యాడ్మింటన్ కోచ్

హైదరాబాదులో 12 అక్టోబరు 2004న హోటల్ వైస్రాయ్‌లోని కన్వెన్షన్ సెంటర్‌లో డా॥ ఆర్ఎఫ్ తమ 5వ వార్షికోత్సవాన్ని జరుపుకున్నది.

ఈ కార్యక్రమాన్ని శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ ప్రారంభించగా మాజీ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుగారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. కర్ణాటక, హిమాచల్ ప్రదేశ్ మాజీ గవర్నర్ రమాదేవి విశేష అతిథులుగా, గుంటూరు జడ్‌పి ఛైర్మన్ పాతూరి నాగభూషణంగారు గౌరవ అతిథిగా, సినీ నటుడు ఎ.వి.ఎస్. తదితరులు పాల్గొన్నారు.

**సాంస్కృతిక కార్యక్రమం :** సినీనటుడు టి.ఎల్.కాంతారావు, బి. సుబ్బరాయన్

**సన్మానం : విశిష్ట పురస్కారం :** హేమలత లవణం

**విశేష పురస్కారం :** డా॥ యార్లగడ్డ నాయుడమ్మ పిల్లల వైద్యనిపుణులు

హైదరాబాదులోని 12 అక్టోబర్ 2005న హోటల్ వైస్రాయ్‌లోని కన్వెన్షన్ సెంటర్‌లో డా॥ ఆర్ఎఫ్ 6వ వార్షికోత్సవాన్ని జరుపుకొంది.

ఈ కార్యక్రమాన్ని శ్రీశ్రీశ్రీ త్రిదండి రామానుజ చినజీయర్ స్వామిజీ ప్రారంభించగా, శాసనసభ స్పీకర్ కెఆర్ సురేష్ రెడ్డి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు.

కేంద్ర బొగ్గు గనుల శాఖ మంత్రి డాక్టర్ దాసరి నారాయణరావు విశేష అతిథులుగా, గుంటూరు జడ్‌పి ఛైర్మన్ పాతూరి నాగభూషణం, పొన్నూరు ఎమ్మెల్యే ధూళిపాళ్ళ నరేంద్ర కుమార్‌లు గౌరవ అతిథులుగా, సినీ నటులు తనికెళ్ళ భరణి, ఎ.వి.ఎస్ తదితరులు పాల్గొన్నారు.

**సన్మానం : విశిష్ట పురస్కారం :** ప్రముఖ గ్యాస్ట్రో ఎంటరాలజిస్టు పద్మశ్రీ డాక్టర్ నాగేశ్వరరెడ్డి, ప్రముఖ కవి, పద్మభూషణ్ డాక్టర్ బోయిభీమన్న, ఆంధ్ర మహిళసభ పూర్వ అధ్యక్షురాలు కె. సుగుణమణి, నవోదయ పబ్లికేషన్స్ ప్రచురణకర్త నవోదయ రామ్మోహనరావు.

8322, Arborcrest Drive, Cincinnati, Ohio - 45236-140, USA.    C-12, Madhuranagar, Hyderabad - 500 038. India

